# ఆకాశ భారతి


తూమాటి దోణప్ప

కులపతి

తెలుగు విశ్వవిద్యాలయం



సుధారా పబ్లికేషన్స్

జి-8, శ్రీ సాయి అపార్ట్‌మెంట్స్, ఎర్రంమంజిల్

హైదరాబాదు - 500 482

1988

'AAKAASA BHAARATI' (A Collection of Radio Talks on Folkloristics, Onomastics, Literary criticism etc )
by Professor T DONAPPA, M A ,Ph D D Litt ,

First Impression 1988

Copies 2000

pp xii + 288

**Price** 30/-



Cover design
The Printer,
3 6-584/H, Himayatnagar,
Hyderabad

For Copies
Author,
G-8, Sri Sai Apts ,
Irram Manzil, Area, Hyd-500 482

Printers
Sri Padmavati Art Printers,
H No 3-5-850, Hyderguda,
Hyderabad - 500 029




హైదరాబాదు

ఏప్రిల్ 3, 1989

**CHIEF MINISTER**
**ANDHRA PRADESH**

# అ భి నం ద నం

ఉన్నతమైన మానవతా విలువల పునరుద్ధరణే ఒక యోగంగా
ఉదాత్తమైన నైతికరాజకీయాల పరిరక్షణే ప్రయోగంగా,
ఉత్తమ సంగీతసాహిత్య కళాపోషణయే హృదయావేగంగా
ఆధ్యాత్మికరంగ ఆరాధనం-
జీర్ణాలయాల పునరుజ్జీవనం అకుంఠితత్యాగంగా
పూర్ణజీవితాన్ని జ్యోతిర్మయంగా
ప్రభాసింపజేసిన ఉదాత్తచరితులు-

ఆదర్శమూర్తులు స్వర్గీయ కళాప్రపూర్ణ పైడి లక్ష్మయ్యగారు తీయని మన తెలుగుభాష యొక్క ప్రాచీనస్వరూపాన్ని, శిష్ట సాహిత్యంలో జనజీవన జానపదముద్రనూ, సజాతీయ భాషాపదాల స్థితిగతులనూ, పాశ్చాత్య భాషాప్రభావాలనూ తెలుగులో 'గిడుగు పిడుగు' సారధ్యంలో సాగిన వ్యావహారికభాషోద్యమాన్ని, భాషలో వస్తున్న మార్పునూ, పరిశోధనాదృక్పథంతో సాహిత్యసమాలోచన చేసి అనేకఅంశాలపై ఎంతో విజ్ఞానాత్మకంగా తనదైన ప్రత్యేక శైలిలో రూపొందించారు తెలుగు విశ్వవిద్యాలయం కులపతులు- ఆచార్య తూమాటి దొణప్పగారు

అప్పుడప్పుడు ఆకాశవాణి ప్రసంగాలుగా వెలువడిన సాహిత్యాంశాలను '**ఆకాశభారతి**' అను శీర్షికన అలంకరించి పూజ్యులు శ్రీ పైడి లక్ష్మయ్యగారి పవిత్ర స్మృతిచిహ్నంగా అంకితంచేయడం ఎంతైనా ఆనందదాయకం, అభినందనీయం

యన్. టి. రామారావు

## ఆవిష్కర్త – అభినందనకర్త



కళాప్రపూర్ణ మాన్యశ్రీ నందమూరి తారకరామారావు గారు

## కృతిస్వీకర్త



కళాప్రపూర్ణ స్వర్గీయ శ్రీ పైడి లక్ష్మయ్యగారు

'ఆత్మైవేదమమృతం' (బృహదారణ్యకోపనిషత్తు)
(= ఆత్మా ఏవ ఇదం అమృతం ఈ ఆత్మ మాత్రమే అమృతమూర్తి)



శ్రీశైల భ్రమరాంబా మల్లికార్జున పాదపద్మారాధకులు
సరస సాహిత్య సత్యవ్రత సమారాధకులు
త్యాగభోగ రాగయోగ విద్యాధరులు
గీర్వాణాంధ్ర కర్ణాటాంగ్ల గిరాంధురంధరులు
అనంతపురమండల ప్రజాపరిషల్లాలనాకోవిదులు
భారతీయ లోకసభా పారిషదులు
దెవస్వ-ధర్మస్వ విభాగ పరిపాలనాదక్షులు
ఆంధ్ర కర్ణాట రంగస్థల ప్రతిపాలనా దీక్షితులు
పూర్ణపూరుషాయుష జీవనులు
పురుషార్థ భావనా సాధనా పావనులు
సతీర్థ్యులు-కావ్య పురాణ తీర్థులు
వినీతవేషులు-కథావశేషులు
దయాప్రపూర్ణులు-కళాప్రపూర్ణులు
శ్రీ పైడి లక్ష్మయ్య మహోదయుల
(1904-1987)
అమృతాత్మకు
పవిత్ర స్మృత్యంకంగా సమర్పితం
రచయిత

# ధన్యవాదాలు

ఈ ప్రసంగాలలో చాలవాటికి ప్రేరకులు, చోదకులు ఆకాశవాణి అధిపతులు వారి సౌజన్యానికి అభివాదాలు. ఆకాశవాణి ముఖంగా ధ్వనిముద్రితమైన ఈ ప్రసంగాలలో చాలపాలు అరుణ ఆంధ్రప్రదేశ్, జయశ్రీ, తెలుగు, తెలుగువిద్యార్థి, తెలుగువెలుగు, పీఠిక, సప్తగిరి, ఏలూరు - సి ఆర్. రెడ్డి కళాశాల రజతోత్సవ సంచిక, గుడివాడ - అక్కినేని నాగేశ్వరరావు కళాశాల రజతోత్సవ సంచిక మొదలైన పత్రికలలో వర్ణముద్రితాలయ్యాయి. ఆ యా పత్రికా నిర్వాహకుల సౌహార్దానికి అభివందనాలు

ఉస్తాదీ ఉద్యోగపరమైన ఊరూరు బదిలీల 'అదలాబదలా హడావుడిలో ఉంటూ, బొత్తిగా పురసత్తులేని పనుల ఒత్తడిలోపడి, పై పరామరిక చొప్పడమి, ఎక్కడెక్కడో చెల్లా చెదరుగా పడి, ఒక పట్టాన చిక్కని ఈ యీ ప్రసంగపాఠాల చిత్తుప్రతులను, అచ్చుప్రతులను పాత కవిలెకట్టల బుట్టలనుంచి వెలికితీసి, వీటికొక రూపు కల్పిద్దామని సంకల్పించినవాడు, ప్రియంకరుడు మా అబ్బాయి చిరంజీవి సుధాకరుడు, అతనికి అమోఘాశిషాలు.

సాఫుప్రతులను సిద్ధంచేయడంలోనూ, అచ్చు ప్రూఫులను సరిచూచి సరిదిద్దడంలోనూ చేదోడుగా ఉండిన వర్ధిష్ణువు, మా తెలుగు విశ్వవిద్యాలయం ఉపన్యాసకులు డా. వడ్లా సుబ్రహ్మణ్యంకు

మంగళాశాసనాలు. ముద్రాలేఖనంలో ముచ్చటగా వర్ణముద్రితం చేసి అచ్చుకూటానికి పంపిన చిరంజీవులు నెల్లి సుధాకరరెడ్డి, తాతా శంకర్‌లకు శుభాశంసనలు. అత్యల్ప వ్యవధిలో దీనిని అందంగా ముద్రించి ఇచ్చిన శ్రీ పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ ముద్రణాలయం, హైదరాబాదు - అధిపతులు శ్రీ శ్రీనివాస్‌గారికీ, వారి పరివారానికీ ఆశీఃపూర్వకాభినందనాలు.

టూకీగా అనువర్ణించాలంటే శ్రీ పైడిలక్ష్మయ్య మహోదయులు మనసున్న బాలాభోలా మనిషి; మమతయే, మానవతయే రూపెత్తిన మహామనీషి ప్రజాక్షేత్రాలలో, తీర్థ క్షేత్రాలలో, కవితాక్షేత్రాలలో ముక్కారు 'పైడి' పంటలు పండించిన కృషీవలుడు. వారి పవిత్ర స్మృత్యంకంగా ఈ ప్రసంగ సంపుటిని నివేదించడానికి మనఃప్రీణనంగా అంగీకరించిన వారి కుమారులు రాజ కార్యదీక్షాదక్షులూ, పితృభక్తి పరాయణులూ డా॥ పి. ఎల్. సంజీవరెడ్డి, పిఎచ్.డి., ఐ.ఏ.ఎస్. గారి సౌమనస్యాన్ని, బహుముఖ ముఖరిత ప్రజ్ఞానిధి స్మృత్యంకంగా రూపుదిద్దుకున్న ఈ రచనను సింహావలోకనంచేసి, సూర్యాలోకనం గావించడానికి సమాదరంగా, సాధువాద పురస్సరంగా సమ్మతించిన ఆంధ్ర ప్రదేశ్ ముఖ్యమంత్రివర్యులు, తెలుగు విశ్వవిద్యాలయం కులాధిపతులు, కళాప్రపూర్ణులు మాన్యశ్రీ నందమూరి తారక రామారాయ మహాభాగుల సంస్కృతి ప్రియంభావుకతనూ కృతజ్ఞతా పూర్వకంగా స్మరించుకుంటున్నాను.

రచయిత

విభవ-శ్రావణ పూర్ణిమా, స్థిరవాసరం
ఆగష్టు 27, 1988

**తూమాటి దోణప్ప**

# కోరినదీ, కొసరినదీ

ఆకాశవాణి ముఖంగా-విజయవాడ, విశాఖపట్నం, హైద్రాబాదు కేంద్రాలనుంచి - వివిధాంశాలపై నేను కావించిన ప్రసంగాల తొలి సంపుటి 'తెలుగులో కొత్త వెలుగులు' పేర 1972 డిసెంబరులో గ్రంథరూపాన వెలుగును చూచింది అందులో ఇరవై ప్రసంగాలు చోటు చేసుకున్నవి శ్రుత సంపన్నుల మన్ననలను పొందిన ఆ సంపుటి నాషష్ట్యబ్ది పూర్త్యుత్సవ సందర్భంగా 1987 డిసెంబరులో రెండో ముద్రణగా వెలువడింది

ఆకాశవాణి ముఖంగా చర్చాగోష్ఠులలోనూ, సమీక్షారూపం లోనూ, సంచికా కార్యక్రమాలలోనూ, ఇతరత్రానూ ప్రసారమైన మరి ఇరవై అయిదు ప్రసంగాల సంపుటీకరణం ప్రస్తుత పుస్తకం 'ఆకాశ భారతి' జానపదవిజ్ఞాన పర్యాలోచనం, నవ్య భాషా విజ్ఞాన పరామర్శనం, సాహితీ సమాలోకనం, వివిధ విశ్వవిద్యా లయాల కృషి విహంగావలోకనం ఇందులో పరామృష్టాలైన ప్రధాన విజ్ఞాన విభాగాలు వీటిలో భాషావిజ్ఞానపరమైన ప్రసంగాలే సమ్మసగం ఈ ప్రసంగాలు ఒక నాటివీ, ఒక ఏటివీ కావు, సుమారు పాతికేళ్ళనాటినుంచీ మూర్తి కటినవి [illegible] [illegible]లో కాలానుక్రమం పాటించలేదు ప్రసం[illegible] విషయాల [illegible]తాలు భూమికగా కొన్ని తావుల కుదించి, మరి కొన్ని తావుల పెంచి

వీటిని అవసరమనిపించిన మార్పులతో, చేర్పులతో పేర్చడం జరిగింది.

'అవశ్యముద్యోగవతాం శ్రీరపారా భవేత్సదా' అన్న పురాణ వాక్యం ప్రస్తుతం స్మృతికి వస్తున్నది. తినక తీపూ చేదూ తెలియవు; ఆరోగ్యవర్ధనమైన బతుకుపయనంలో ఈ రెండూ అవసరమే. దిగక లోతూ పాతూ తెలియవు; నిత్య ప్రవర్ధమానమైన సమాజంలో ఎగుడు దిగుడులు తప్పనిసరి. ఆయా అంశాలలో అభినివేశంగల సముత్థానవంతులనూ, అంతో ఇంతో ప్రవేశంగల శుశ్రూషాపరులనూ ఈ ప్రసంగాలు అలరించగలవని నమ్మిక. ఆప్తకాముల కివి ఔప చారికాలు; ఆత్మకాముల కివి అవశ్యావరనీయాలు శుభవాసనల ప్రసారం, సురుచిర కామనల ప్రచారం వీటి ప్రధాన లక్ష్యం కాబట్టి మంగళాచారపరులైన శ్రుతి శాస్త్రకృతశ్రములు సైతం వీటిని ఆదరించగలరని ఈ ఆత్మకాముని అభ్యర్థన.

—రచయిత

# విషయసూచిక

# శిష్టసాహిత్యంలో జానపద ముద్ర

జనావాసాలలో పల్లెటూళ్ళు ఒక భాగం, పట్టణాలూ, పురాలూ, నగరాలూ ఒక భాగం పల్లెటూళ్ళనే జనపదాలని అంటారు జనపదాలలో నివసించేవారిని స్థూలంగా జానపదులని వ్యవహరిస్తారు తక్కినవారిని పౌరులు, నాగరులు అని అంటారు పౌర జానపదులన్న విభాగం అతి ప్రాచీనకాలం నుంచీ ఉన్నట్లు సంస్కృతాంధ్ర సాహిత్యాద్యాధారాల వల్ల స్పష్టపడుతున్నది కాని, నాగరిక గంధం అంటనివారినీ, చదువుసంధ్యలు అబ్బనివారినీ, కృషిపాలనం, గోలాలనం, తదనుబంధి వృత్తులుముఖ్యజీవికగా మనుగడసాగించే మామూలు మనుషులను జానపదులని ప్రాయికంగా పరిభాషించడం కద్దు కాని, అది పాక్షిక సత్యం పురాలలో, నగరాలలో నివసించేవారంతా పదవ్యుత్పత్తి రీత్యా పౌరులూ, నాగరులూ కావచ్చుగాని, అట్టడుగు - బడుగు తెగలకుచెందిన అసంఖ్యాక జనులతో పాటు జానపద స్వభావులైన పై వర్గాలవారు పరిగణించదగ్గ సంఖ్యలో అట నివసిస్తుంటారు అందుచేత నివాస కారణాన్ని పక్కకు పెట్టి, వీరిని సైతం జానపదుల లెక్కకు జమకట్టడం సమంజసం

'జనపదాత్ ఆగత. అథవా జనపదే భవః జానపద'మ్మని శిష్ట శాబ్దికుల తీర్పు విశేష సంస్కారం లేనిదీ, నిసర్గ మధురమైనదీ జానపదమని స్థూలంగా చెప్పుకోవచ్చు జనపదాలకూ, జానపద స్వభావులకూ సంబంధించిన సమస్త భౌతికా భౌతిక సంస్కృతిని జానపద విజ్ఞానం అనవచ్చు అంటే వీరి అభిరుచులూ, అలవాట్లూ, ఆటపాటలూ, ఆచారాలూ, ఆలోచనలూ, కట్టూబొట్టూ, నగానట్రా, తిండీతిప్పలూ, తిట్లూఒట్లూ,

నమ్మకాలూ, తరాల తరబడిగా చెప్పుకునే కట్టుకథలూ, కాకమ్మకథలూ, పేదరాసి పెద్దమ్మ కథలూ, పరిహాస ప్రసంగాలూ, మోటు సరసాలూ, ఉత్సవాంగాలుగానో, ఉత్సాహోంకాలుగానో పాడుకునే పాటలూ, వీరగాథలు, గాథా చక్రాలూ, తేరూతిరణాళ్ళు పండగపబ్బాలూ, వంటావార్పులూ, చేతి పనులూ, పనిముట్లూ గోసాయి చిట్కాల సంచికట్టు నాటువైద్యము, చేతబడులూ, మారణ మోహన మోచనాది మంత్రతంత్రాలూ, పలుకుబళ్ళు, సామెతలూ పొడుపుకథలు మొదలైన వాటిని జానపదవిజ్ఞాన భాగాలుగా పేర్కొవచ్చు ఈ జానపద ముద్ర తెలుగులోని శిష్టసాహిత్యంపై ఎంత వరకు అచ్చొత్తిందీ అని వివేచించడం ప్రస్తుత వ్యాసంగానికి ప్రయోజనం

తెలుగు శిష్టసాహిత్యం దొరికినంతవరకూ ఇంచుమించు వెయ్యేళ్ళ చరిత్ర కలది సంస్కృతంలోని తాత్త్విక ధార్మిక గాథా చక్రమైన పురాణేతిహాస కావ్యపరంపర ప్రాయికంగా తెలుగు సాహిత్యానికి తొలి బండవాలం ఇహలోక విషయాలకంటె పరలోక విషయాలు ఆర్ష సంస్కృతి ప్రియులైన సంస్కృతీయులకు పరమార్థంగా ఉన్నట్లు కనిపిస్తుంది ఆ వాఙ్మయ సృష్టి ప్రయోజనం జగద్ధితమనీ, విశ్వశ్రేయమనీ, సకల జన కల్యాణదాయకమనీ పదేపదే ప్రతిజ్ఞా వచనలుగా ప్రకటిస్తున్నప్పటికీ అందులో సామాజికదృష్టీ సామాన్యజన జీవనసృష్టీ చాల తక్కువనడంలో తప్పులేదు తాత్త్విక చింతనల పేర, ధార్మిక బోధనల పేర సంస్కృత వాఙ్మయం చాలా భాగం సంతరించబడ్డది మరి, ఈ వాఙ్మయానికి అనుకరణంగానో, అనుసరణంగానో వెయ్యేళ్ళుగా మూర్తి నందిన తెలుగు సాహిత్యం దానికన్న భిన్నమైన మూసలో రూపు కట్టిందని గట్టిగా చెప్పలేం

ఆశ్రయదాతల అభిరుచినిబట్టీ, పండితపరిషత్తుల ప్రాపకాన్నిబట్టీ, ఆలంకారికుల అనుశాసనాన్నిబట్టీ, విద్వత్కవుల ఆదరణనుబట్టీ, ఆ యా

కవులు స్వీకరించిన కథావస్తువుల స్వభావాన్నిబట్టి తెలుగుసాహిత్యం రూపొంది పెంపొందింది కథావస్తువులందామా అధికభాగం లాక్షణికులు గెరగీసి నిర్దేశించిన నమూనా మూసలలో పోతపోసినవి స్వీయాధీరా వాసకసజ్జికాది అష్టవిధనాయికల ధీరోదాత్తాది చతుర్విధనాయకులచుట్టూ గుడుగుడుగుంచంగా అల్లబడ్డ రచనలే తెలుగులో కోకొల్లలుగా గోచరిస్తాయి ఇలాటి ఇరకాటపు చట్రాలలో బిగించబడ్డ మూసపోత సాహిత్యంలో జానపదుల అచ్చాచ్ఛమైన జీవితచ్ఛాయలెలా కనిపిస్తాయి? అవతార పురుషులకూ, అతిలోక వ్యక్తులకూ ఆవాసమైన ఐతిహాసిక ప్రపంచంలో, అందం, ఆభిజాత్యం ఐశ్వర్యం, ఔదార్యం ఔద్ధత్యం మహోదాత్త గుణాలుగా రూపెత్తిన నాయికా నాయకులు విహరించే పురాణ పురాలలో, ఉత్తమ ప్రకృతులుగల ఇతివృత్తమే కథావస్తువుగాగల కావ్య వాటికలలో, పడికట్టు సూత్రాల పరిధిలో సూత్రపట్టిన ప్రబంధవీధులలో, సంస్కృతాలైన రూపకసౌధాలలో నాటుదినుసు మోటు మనసు సగటుమానిషి ప్రవేశించలేడు సరికదా అతని రంగప్రవేశానికి అనువైన సన్నివేశాలు ఆంధ్రసాహిత్యంలో అస్తి నాస్తి విచికిత్సా హేతువులు ఆ ఉన్నచోట సైతం దృశ్యాదృశ్యంగానో రేఖామాత్రంగానో, నామమాత్రంగానో తప్ప జానపదుని స్పష్ట మూర్తి మనకు సాక్షాత్కరించదు ఇక అతని విరాణ్మూర్తి దర్శనం కల లోని వార్త అయితే స్వస్థాన వేషభాషా ప్రియులైన కొద్దిమంది తెలుగు కవుల రచనలలో చెదురు చెదురుగా కనిపించే పట్టులను రూపించి, ఆ పట్ల జానపదప్రభావం ఎంతవరకు ముద్రితమయిందో అవలోకిద్దాం

సహస్రాబ్దులుగా సాగిన తెలుగు సాహిత్యంలో కథావస్తువు, సన్నివేశాలు, పాత్రపోషణ, ఛందస్సు భాష మున్నగు వాటి దృష్టిలో జానపదముద్రను పరికించి విశ్లేషించవలసి ఉంది తెలుగు సాహిత్యంలోని కథావస్తు సంచయం చాలమట్టుకు గీర్వాణభూమినుంచి దిగుమతి చేసుకున్న

సరుకని ఇదివరకే అనుకున్నాం 'సీతారాముల పెండ్లిపేరటములున్ శ్రీకృష్ణరాధారతుల్-త్రేతాద్వాపరయజ్ఞకర్మలువినా లేవో కథావస్తువుల్ అని ఒక యుగకవి నిలదీసి సంజాయిషీ అడుగుతున్నాడు 'ఇతిహాసపు చీకటికోణం అట్టడుగునపడి కాన్పించని కథలన్నీ కావాలిప్పుడు' అని కర్తవ్యాన్ని సూచిస్తున్నాడు మరో మహాకవి

అయితే నిర్దేశించిన సంస్కృత వాఙ్మయ పరిధులను దాటిన సందర్భాలు లేనే లేవనికాదు తెలుగుసీమలో రోళ్ళారోకళ్ళా జనప్రియాలుగా విశేషప్రచారంలో ఉన్న దేశీయ కథావస్తువులను స్వీకరించి అచ్చపు దేశి సరకులు నింపిన తెలుగు కవులు వేళ్ళమీదికి చాలరు

జానపద స్వభావులైన జనులలో పసిపిల్లల మనస్తత్వం ప్రసిద్ధ గుణమేకాక, ప్రకృతిసిద్ధగుణం కూడ క్షణక్షణ పరివృత్తి చిన్న పిల్లల చిత్తవృత్తి దేనిమీదా దాని ప్రవృత్తికి నిలకడ ఉండదు పొద్దస్తమానూ ఒకే ఆట ఒకే పాట వారికి ఒక పట్టాన నచ్చవు ఆడిన ఆటే, పాడిన పాటే అయితే వారికి మొగం మొత్తుతుంది అందుకని అనుక్షణం మార్చుకోవాలి ఆకస్మిక పరిణామాలూ, హఠాత్సంభవాలూ అంటే పిల్లల కమితప్రీతి సాధ్యాసాధ్యాలను గూర్చి వారు చర్చించరు సంభవాసంభవాలను గూర్చి అసలే ఆలోచించరు భావనతప్ప, చింతన వారికి సుతారమూ సరిపడని సంగతి అదికల్పితమో జల్పితమో వారికి పట్టదు వారు కళ్ళారా చూచేదిగాని, చెవులారా వినేదిగానీ అద్భుతంగా ఉండాలి, అభినవంగా ఉండాలి అంతే! అలా అంటేనే వారికి సంతోషం, అలా ఉంటేనే వారికి సంతృప్తి పరశివుడు కావచ్చు పరమశివుడు కావచ్చు, ఆలోచనలలో, ఆచరణలో జానపదుల అంతస్తుకు దిగిరాకతప్పదు బాలచంద్రుడైనా, ఫాలచంద్రుడైనా వీరితో కూడి మాడి కోలాటం వెయ్యవలసిందే, కోతికొమ్మచ్చి ఆడవలసిందే రామభద్రుడన్నా, వీరభద్రుడన్నా

వీరికి వియ్యంకులుగానో, వేలువిడిచిన మేనమామలుగానో, మారక తీరదు చిత్రాంగికాని, సీతమ్మవారుగాని వీరికి ఇరుగమ్మా పొరుగమ్మల కిందలెక్క అచ్చంగా ఇలాటి శిష్ట మనస్తత్వంగల జానపదులను అత్యుక్తులూ, అతిశయోక్తులూ అలరించినట్లుగా సహజోక్తులూ స్వభావోక్తులూ సంబరపెట్టలేవు అతీంద్రియశక్తులను వెలార్చే పట్టులూ, అతిలోక వ్యక్తులను పరిచయంచేసే ఘట్టాలూ, అంటే జానపదులు చెవికోసుకుంటారు ఈ తరహా సగటు జనాన్ని ఊహించడానికీ హుషార్ చెయ్యడానికి తెరనాటకపు జంగాలూ, పగటివేషగాళ్ళూ పౌరాణికులూ బయలాటభాగవతులూ, బొమ్మలాటగాళ్ళూ విప్రవినోదులూ, వీరముష్టులూ, హరికథకులూ తదితర జానపద కళాప్రయోక్తలూ శతథా యత్నిస్తూనే ఉంటారు ఇలాటి జానపదచ్ఛాయలే కథావస్తు పరంగా మనకు శిష్టసాహిత్యంలో చెదురుమదురుగా ఎదురవుతాయి

తెలుగునాట మత సాంఘిక రాజకీయాదిరంగాలలో ప్రముఖపాత్ర చరితార్థుల చరితలు కొన్ని కావ్యాలకు ఆలంబనంగా కనిపిస్తాయి మల్లికార్జున పండితారాధ్యుల గాథలనూ బోధనలనూ ప్రచురపరిచే పండితారాధ్యచరిత్ర, పల్నాటి పౌరుషగాథలకు నిలువుటద్దం నిలిపిన పల్నాటి వీరచరిత్ర, పుల్లరి చెల్లింపు తగాదాలు బీజంగా మహావటరూపాన విస్తరించి దొనకొండ యాదవరాజుల వీరగాథాచక్రాన్ని విశ్రుతపరిచే కాటమరాజు కథ బుర్రకథా (తందాన కథ) రూపంలో తెలుగుగడ్డను పోతుగడ్డగా తీర్చిన బొబ్బిలి వెలమవీరుల విక్రమక్రమాలను వివరించే రంగరాయచరిత్ర-మున్నగు వాటిని కొన్నింటిని ఉదాహరణలుగా ఉద్ధరించవచ్చు స్థానికగాథలకూ, స్థలపురాణాలకూ అతిలోకతను ఆపాదించే అనేక క్షేత్రమాహాత్మ్య రచనలకు జానపదుల నమ్మకాలూ వారిచే కొలువుందిన గ్రామ దేవతల గాథావళి మూలమూర్తులు వాల్మీకేతర ఘట్టాలతో రూపుకట్టిన మైరావణ చరిత్ర, శతకంఠ సహస్రకంఠ రామాయణాలూ, రంగనాథ రామాయ

ణంలో అవాల్మీకాలైన కాలనేమికథా, సులోచనావృత్తాంతమూ, మొద లైన అద్భుతాపాది భాగాలూ, వైయాసిక విపరీతంగా రూపితమైన చిత్ర భారతమూ, జైమిని భారతఘట్టాలూ జానపద ప్రభావానికి మచ్చుతునకలు శుకసప్తతి, హంసవింశతి మున్నగు కథాకావ్యాలలోని కథలు తెలుగునాట నలుచెరగులా వినిపించే పేదరాసి పెద్దమ్మకథలకు కావ్యరూపాలు

తెలుగునాటికి దక్షిణ పడమర సీమలైన తమిళ కన్నడ మరాఠ్వాడా ప్రాంతాలలోని జనుల నాల్కలపై చిందులవిందులు చేసే అనేక కథావస్తువులనుకూడా తెలుగు కవులు కొందరు స్వీకరించారు బసవపురాణం, పండితారాధ్యచరిత్రలలోని ఉడుమూరి కన్నప్ప బెజ్జమహాదేవి, మడివేలు మాచయ్య ప్రభృతి ముగ్ధభక్తుల చరిత్రలూ, నవనాథచరిత్రలో చిత్రితాలైన నాథసంప్రదాయాను యాయుల మహిమాన్వితగధలూ, పరమయోగి విలాసంలోని వైష్ణవ భక్తుల కథలూ, ఆముక్తమాల్యదలోని గోదాదేవికథ, ధూర్జటి కాళహస్తి మాహాత్మ్యంలోని మధురాపురీ వారకాంతల ఉదంతం వంటివి ఈ కోవకు చెందినవి

ఇలా, సంపూర్ణకథా శరీరాలుగా మాత్రమేకాక కథావస్తువులలోని కొన్ని మనోహర ఘట్టాలలోనూ జానపదముద్ర స్పష్టంగా కనిపిస్తుంది 'వల్లియలు వైచి యోదముల్ పెల్లుబ్రద్విం తార్చి వేసటియురులొగ్గి తటిసి దయ్య-దోలి యోటరిపోసికి దొడ్డినాగి పొదువ నొడువను నలదెప బొంచి యోడి (పూ 6-131) అన్నపద్యం గోపాలవృత్తికి సంబంధించినదిగా ఎఱ్ఱయ హరివంశంలో మనకు కనిపిస్తుంది శ్రీనాథుని శృంగారనైషధం దమయంతి పెళ్ళిలో బువ్వంబంతి సమయపు పరిహాసోక్తులు తెలుగునాటి వియ్యాలవారి సరసాలకు అక్షరరూపాలు 'గోపడింభకులు చలిదికావడులు మూపులవహించి సజ్జంబులగు కజ్జంబులు గట్టికొని పదత్రాణ వేత్రదండ ధరులై లెక్కలకు వెక్కసంబైన తమతమ క్షేప కదుపులం జవుడించి

రొప్పుకొనుచు గాననంబు సొచ్చి కొమ్ములిమ్మగ బూరించుచు, వేణువు లూదుచు నదీజలంబుల దోగుచు దీవయుయ్యేలల నూగుచు ' బృందావనిలో విహరించినట్లు పోతన్న వర్ణనం పశుపాలన లాలనాది రీతులు పోతన భాగవతం (10-1195) లో సహజసుందరంగా రూపించబడ్డాయి 'గూనివీపులదుర గొణగితిట్టుచ నేకు గఱచినట్టి కుక్క గడ్లనంగ మూతి నరప మీసముల బోయముదుసళ్ళు (4-36) మనుచరిత్రలో స్వరోచివేట సంవర్భంలో వలలూ తాళ్ళూమోస్తూ మనకు కనిపిస్తారు 'పెన్మసురున మేకెరువుం గుంపటిమంచమెక్కి, కట్టాపికుట్టారు గోగిరముల్ మెక్కి పిసికిళ్ళం బిసికిళ్ళ ' అమితానందం పొందిన కృషిపాలకులు పల్లెటూరి రెడ్ల అనుభవాలు (4-133 134) ఆముక్తమాల్యదవల్ల మనకు తెలుస్తాయి ' ఆటవికపుట భేదనంబునం గాటితేని జాతరకుం జాటం బనుప మఱుసటి మ గళవారంబున కీచక తండులంబులం బిండికొట్టి కొట్రబోసి యుప్పిగొప్పులుగాజేసి యావించిన కుడుముల బానలు పిండికూరల చట్లును వెలిళ్ళను అటికలు గంపల గావిళ్ళనుబెట్టి ...డికిట్టుకొ ని కాట్రేనిగుడికి (కాళ 3-36) ఆటవికులు నడచిన తీరులను ధూర్జటి కిళ్ళకుగట్టినట్టు కావించిన వర్ణనం మనోజ్ఞమధురం 'మంచెల మీద నెక్కి కటిమండలి జుట్టిన పాఱుటాకు లించించుక సంచలింప పిట్టలన్ ' ఒడిసెళ్ళతో తోలే చెంచెతల చిత్రభంగిమలందలి ఆటవికుల కాపుదనం కాళహస్తిమాహాత్మ్యంలో అక్షరాకృతి నెత్తింది గాలిగంగల జాతర సందర్భంగా ఎడ్డెతనపు గైసేతల పురస్సరభ్యాగ్యంగా శక్తిగుడికి విచ్చేసిన రడ్డుల నడకల బెత్తణంలోని సొగసులు (3-75) పాండురంగ విభునిపైగల జానపదప్రభావానికి చక్కటి నిదర్శనం గోకులం నుంచి బృందావనికి తరలివెళ్ళే సమయంలోని గోపీగోపకుల సంరంభాన్ని వెన్నెలంటి సూరన తన విష్ణుపురాణం (7-134)లో చిత్రించిన వైనం గోపాలనలాలనవృత్తికి అద్దంపట్టిన అనువర్ణనం ఒకానొక కిరాతాంగన

కుదురగ జంగసాచి పాఱుటాకుపయ్యెద పొదలంగ చందనపు జోలన నేరుగు కొమ్ము రోకటన్ బ్రిదిలెడు కొప్పుతో వెదురు వియ్యము గుప్ప' (2-115) దృశ్యం వాల్మీకి చరిత్రకర్త రఘునాథరాయల ఆటవిక జీవన చిత్రణానికి ఒక తార్కాణం

తెలుగునాట ఆటపాటలు అన్నివర్గాల జనులలోను కనిపిస్తాయి కాని, నాగరుల క్రీడావినోదాలు వేరు జానపదుల ఆటపాటలు వేరు కొన్ని ఉభయులకూ చెందినవి కావచ్చు శ్రీనాథుని భీమేశ్వరపురాణంలో శివుడు బ్రహ్మవిష్ణులతో 'ఆంధ్రక్ష్మాస్థలికిం బోదమె యూసుపోకకు వినోదంబుల్ పరీక్షింపగన్' అన్నట్లు చెప్పడంవల్ల తెలుగుదేశంలో ఊసుపోకకు ఆడే వినోదక్రీడలు శ్రీనాథుని కాలంనాటికే లెక్కకు మిక్కిలిగా ఉన్నట్లు ఊహించవచ్చు నన్నయాదులు పేర్కొన్న కందుకక్రీడ జనపదాలకే పరిమితమని చెప్పలేం నన్నెచోడుడు పార్వతి శైశవ క్రీడా వినోదాలలోను పోతన్న రుక్మిణీకల్యాణ కథాభాగంలోను పేర్కొన్న బొమ్మలపెళ్ళి జానపదులలోనూ ప్రచురం పాల్కురికి సోమన, ఎర్రయ్య నాచన సోమన, అనంతామాత్యుడు మున్నగుకవులు ఉదాహరించిన ఎన్నో ఆటపాటలు పల్లెసీమలో ప్రసిద్ధమైనవి బలరామకృష్ణులు పెన్నుద్దులై ఇతర గోపబాలకులు చిరుద్దులై ఆడిన ఆటలనేకం పోతన్న కళ్ళకు గట్టినట్లు వర్ణించాడు ఉప్పనబట్టెలు కోతికొమ్మచ్చి కోడిపందాలు, చెరకుల పందాలు, దాగుడుమూతలు నాలుగుస్తంబాలాట పొట్టేళ్ళ యుద్ధాలు మొదలైనవి నాటికీ నేటికీ పల్లెటూరి వారికి కొట్టినపిండి అచ్చనగండ్లు ఓమనగుంటలు గీరనగింజలు, వెన్నెలకుప్పలు మున్నగునవి తెలుగు ఆడబిడ్డల ఆటపాటలలో ప్రచురమైనవి అయ్యలరాజు నారాయణయ్య హంసవింశతిలో నూటికిపైగా తెలుగువారి ఆటపాటలు ఒక సీసమాలిలో పట్టికారూపాన ఉట్టంకించబడ్డాయి విశ్వనాథవారి 'ఆంధ్రావళి'లో చెడుగుడు గోడీబిళ్ళ, చెట్టాట, కోతికొమ్మచ్చి మున్నగు జానపదుల క్రీడా విశేషాలు తెలుగుబిడ్డలకు వెన్నతోపెట్టిన విద్యలుగా చిత్రించబడ్డాయి

తెలుగుసాహిత్యంలో సంచికట్టు వైద్యం గూర్చిన ప్రసక్తి అడపా దడపా వచ్చింది 'మగువయొనర్చు వశ్యవిధిమందులు మాకులు నొందు చందమై మగనికి దెచ్చు రోగములు ' (అరణ్య 4-296) అని సత్యా ద్రౌపదీ సంవాదంలో సూచించబడింది క్రీడాభిరామంలో వెలివాడ వనిత అమ్మిన నాటుమందును గూర్చి గోవిందమంచనశర్మ అభివర్ణించిన వైనం ప్రసిద్ధం ముక్కంటి కంటికి జుబ్బవేసి<పుడు తిన్నడు జానపదులు చేసే చికిత్సారీతులు ధూర్జటి కాళహస్తి మాహాత్మ్యంలో నిరూపించబడ్డాయి 'కోకపొట్లం బావిగొననూది ఒత్తడం తంగేడాకు మెత్తడం, పేరిననేయి పెట్టడం పెరుగువత్తుఉ వెయ్యడం, ఇంకా విన్న మందులు, కన్న మందుఉ అడవిమందులు, అడిగి తెచ్చిన మందులు వాడడం' శివుని కంటికి తిన్నడుచేసిన చికిత్సలుగా పేర్కొబడ్డాయి చిత్రాంగి మందులు నీకుం దలకెక్కె' (3-63) నని రత్నాంగి తన భర్తను దెప్పిపొడుస్తుంది

ఏలఉ, గౌడుగీతాఉ గౌరీ కల్యాణాలు, చందమామ పదాలు, తుమ్మెదపాటలు ధవళాలు వెన్నెలపాటలు, సువ్వాలలు, సోబనాలు మొదలుగా శిష్టసాహితిలో ఉట్టంకించబడ్డ గీతికాతతి జానపద కళాభారతి కెత్తిన మంగళహారతి పండితారాధ్య చరిత్రలో అనేం జానపద కళాప్రదర్శనల తీరతీయాలు వివరించబడ్డాయి

'సకల పురాతన చారుగీతములు
ప్రకటించి ప్రకటించి పాడెడువారు
వేడుకతో చిందులాడంగ నుబ్బి
కోడంగి యాటల గునిసెడు వారు
భారతాదికధల జీరమఱుంగుల
నారంగ బొమ్మల నాడించువారు
కడునద్భుతంబుగ గంబ సూత్రంబు
లడరంగ బొమ్మలనాడించువారు పర్వత ప్రకరణంలో మనకు దర్శనమిస్తారు

భావవాహకాలుగా, కావ్యబహిఃస్వరూప నిరూపకాలుగా శాసన కవులతోపాటు నన్నయ మొదలుగా తెలుగు కవులు వాడిన ఛందస్సులలో జానపదముద్రకల ద్విపద, తరువోజ, మధ్యాక్కర, రగడ మున్నగు దేశీయచ్ఛందాలు ప్రసిద్ధమైనవి

మడిగట్టుకున్న లాక్షణికులు ఎంతనెత్తిన నోరు పెట్టుకుని గోల చేసినప్పటికీ జన పదాలలో పుట్టిపెరిగిన కవులూ, జానపదుల మధురమయ భణితిపై మోజుపెంచుకుని ఆ బాణీలో తమ వాణిని కైసేసిన కవులూ అనేక మాండలిక పదాలకూ, ప్రయోగపక్కికలకూ తమ రచనలలో స్థానం కల్పించారు సంస్కృత భూయిష్ఠ రచనారీతిని తిరస్కరించి జానపదంవైపు మొగ్గుచూపే జానుతెనుగు కూర్పు తీర్పులు పురస్కరించిన సోమనాధుడు మనకు ప్రాతఃస్మరణీయుడు పాతవడ్డ మాటలను కాదని నెల్లూరుమండల జానపదుల నెరజాణతనం నిలువెల్లా నింపుకున్న మాండ లిక పదాలను ప్రయోగించిన తిక్కన్న ముందుగా మనకు అభినంద నీయుడు సూరన, వేమన కందుకూరి రుద్రయ చేమకూర వెంకన్న, శేషం వెంకటపతి వెలిదిండ్ల వెంకటపతి, సముఖము వెంకటకృష్ణప్ప యడవల్లి వెంకటకవి మున్నగు కవుల రచనలలో తెలుగుదేశితనం పుక్కి లించే నూరారు నుడికారాలు సామెతలు మనకు కనిపిస్తాయి అడిగేవారు ఏడుంటివీసరి పొద్దుదనుక ఏమి సూచేవని, ఒడయడేలేటి సీమాటి గుడి మ్రింగే వానికిన్, చర్చ సేయగబోతే చేసిందేటిది, నుయిదాటేవానికిన్ నే నిద్రబోవుదాకా న్రిదబోవదు, పోతువెడలి పొయ్యాని, మొక్కేము సామి వచ్చేనన్నాడా - వంటి కావ్యప్రయోగాలు భాషాపరంగా జానపద ప్రభా వానికి మంచి ఉద్ధరణలు జానపదుల భాషా భావాలూ ఒకదానితో ఒకటి పోటాపోటీయి పడగా అచ్చమైన పామరుల మాండలిక పదాల కూర్పుతో రూపెత్తిన చంద్రశేఖర శతకం తెలుగు శతక వాఙ్మయ సర్వస్వంలో నూతనశకాన్ని సృష్టించిన అపూర్వసృష్టి ఇదే బాణీలో అచ్చమైన

గుంటూరుసీమ యాసలో కొమిరెపూడి కరణం తుమ్మూరి ఏకామ్రరాయకవి రచించిన రాజశేఖర శతకంలోని ఒక పద్యం మచ్చుకు అవధరించండి

లేరు యవారమందున కలిగ్గములో మన మున్సుబంటి ఔ
నారము గల్లవోరు మొలతాడుకు గోసెబిగించి లేసెనా
వోరిని లచ్చెపెట్టడు మనూరికి దగ్గమొగోడు ఆడితో
పోరగలేడు కర్ణమని పొంగును మూఢుడు రాజశేఖరా!

దీనికి ప్రతిస్పర్థిగా అవతరించిన కొసరాజు రాఘవయ్యగారి వీరశేఖర శతక రచన సైతం ఇదే పద్ధతిలో నడచింది

తెలుగునాట లక్షకుపైగా సామెతలున్నాయని చిలుకూరివారి నిష్కర్ష ఏదో ఒక సామెత తోడులేనిదే అచ్చమయిన తెలుగువారి సంభాషణ సాగదు కొన్ని సామెతలు ఉన్నవి ఉన్నట్లుగా కవుల రచనలకెక్కాయి కొన్ని సంస్కారం పొంది కావ్యాలలో కనిపిస్తాయి కావ్య భాషలో ప్రయుక్తమైన కొన్ని నుడికారాలు, సామెతలు మాదిరికి చూడవచ్చు ఎడమా కుడి యెఱుగక, ఎండకన్ను నీడకన్ను, పిలువని పేరంటం మెత్తని పులి, మేకవన్నెపులి రెంటికి జెడ్డ రేవడ వెఱ్ఱివాని చేతిరాయి అత్తనెత్తి జేతు లంగడిలో కన్నులు ఎద్దు బెదరిన గానుగ బెదరునా, కిలివోసిన వెనుకి నట్టి గనుగొను మాడ్కిన్, కాలం దొడుగు పాదుకలు తలకెక్కె, కుంచెన్న కూడబెట్టగ మంచన మాయఁబు చేసె, కుట్టదేలు కుట్టకున్న కుమ్మరబూచి గోర్చుట్టు పయిన్ రోకటిపోటు చింతకాయలకుగాక గ్రుక్కిళ్ళు కాజ్ఞగలదె!, పిచ్చుకగుంటుమీద భాగీరథి వచ్చినట్లు, వెన్నకు బడ్లువచ్చు వెఱ్ఱి దీరెను రోకలి తలజుట్టు - మొదలైనవి కొన్ని ఉదాహరణలు

పాదపునరుక్తి పాదాది పదపునరుక్తి, పాదాంతపదపునరుక్తి జానపద వాఙ్మయంలోని ఒక ముఖ్య లక్షణం పండితారాధ్య చరిత్ర పర్వతారోహణ ప్రకరణంలో

'చేదుకో చేదుకో శ్రీగిరినాథ
చేదుకో మల్లయ్య చేదుకొమ్మనుచు
చేదుకో చేదుకో శ్రీశైల నిలయ
చేదుకో మల్లయ్య చేదు కొమ్మనుచు' పాటలు గట్టి పాడే భక్తగణం మనకు కనిపిస్తుంది

అనేకాంశాలలో దేశీయతాముద్రను భద్రపరచిన బసవ పురాణంలో పాదపునరుక్తులు కొన్ని చూడండి

'బసవని శరణన్న పాపక్షయమ్ము
బసవని శరణన్న పరమపావనము
బసవని శరణన్న ప్రత్యక్ష సుఖము
బసవని శరణన్న భవరోగహరము' ఇలా 'బసవని శరణన్న'అన్న భాగం మరో పది ఆవృత్తులు ప్రవర్తిస్తాయి ఇట్లే రెండు రెండు పాదాల కొకసారి పాదాది భాగాలు అందే పునరుక్తమవడంలోని సొగసును చిత్తగించండి

'బాపురే కన్నప్ప ! పరమలింగంబ
బాపురే కన్నప్ప ! ప్రమథ విలాస
నల్లవో కన్నప్ప ! నాలి గముగ్ధ
నలవో కన్నప్ప ! నల్లనైనార'

బసవ పురాణంలోని —

'శివరాత్రి నిత్యంబు చెల్లించు బాస
శివభక్తులెల్లను శివుడను బాస ' ఇలా 'బాస'అన్న పాదాంతపదం సుమారు నలభైమాఱు ప్రయోగించబడింది ఇలాటి పునరుక్తి పద్ధతి పోతన రచనలో పలుతావుల ప్రయోగించబడింది, ఘూమ పిలుపుపై ధనుర్యాగం

నిమిత్తం బృందావనం నుంచి మధురకు వచ్చి అన్నతోపాటు నగరవీధులలో నడుస్తున్న కృష్ణుని చూచి మధురానగరంలోని పురంధ్రీమణులు —

'పీ డ చే రక్క సీ విగతజీవగ జన్ను
బాలు ద్రావిన మేటి బాలకుండు
పీ డ చే నందుని వెలదికి జగమెల్ల
ముఖమందు జూపిన ముద్దులాడు ' అని తమలో తాము చెప్పుకొన్న మాటలలో 'పీ డ చే' అన్న పదం ప్రతి పాదాదిని పునరావృత్తమయింది

'కొనసాగు దురితము లెక్కడైన సుఖము
తను విచారములలో దాకొన్న సుఖము '

అన్న అన్నమాచార్య కీర్తనలోని 'సుఖము' అన్ని చరణాలలో పునరావృత్తం కావడం జానపద ముద్రకు మరొక తార్కాణ

తాళ్ళపాక తిరువెంగళనాథుడు తీర్చిన పరమయోగి విలాసకృతిలో శ్రీరంగనాథపరమైన ప్రాబోధకి స్తుతిలో 'పాలించి కరుణ చొప్పడ యోగనిద్రం జాలించి, శ్రీరంగశాయి మేల్కొనవె' - అన్న ద్విపద పంక్తులు పదితూర్లు ఆవృత్తం కావడం కూడ ఈ ముద్రకు నిదర్శనం

ఇలా ఎంతని తవ్విపోయగలం, ఇది ఇసుక పాతర

'దిగిరాము దిగిరాము దివినుండి భువికి' అని కవులెంత బెట్టుసరిచేసి విహాయస వీధులలో భీష్మించుకు కూర్చుంటామన్నా, చిట్టచివరకు తమ మనుగడకు మూల భూమిక అయిన ఈ జానపద భూమికి దిగిరాక తప్పదు ఇది సహజమూ, అనివార్యమూ అయిన మానవ నైజం

# పురాణ ప్రవచనం

'శివాద్యా ఋషిపర్యంతాః స్మర్తారోస్య న కారకాః' అన్న వాక్యం మేరకు శివుడు మొదలు ఋషుల పర్యంతం వెలసిన ఖద్రాశయుఁంతా వేదాలకు స్రష్టలు కారనీ, మహా అయితే వీరిని ప్రవచనకారులుగా పరిగణించవచ్చునీ మీమాంసా శాస్త్రపారగుల నిరూపణం తత్త్వసందర్శకులూ, సత్యప్రదర్శకులూ ఐన మహా మహులు నిగూఢమైన వేదతత్త్వాన్ని సుపరీక్షితంచేసి తద్విహితమైన సత్కర్మానుష్ఠానముఖంగా సముపార్జించినసమ్యక్ జ్ఞానాన్ని వివిధవిద్యారూపాలుగా లోకంలోసువివృతమొనర్చినట్లు ఆర్షమతానుయాయుల నిర్ధారణం 'పురాణం శ్రుతి సమ్మిత'మ్మన్న పురాణ వచనం దీని కుపబలకం వేదచోదితమైన మహార్థాన్ని ప్రచురపరచేవి శాస్త్ర పురాణేతిహాసాదికాలూ, సుధీజనోపాస్యాలైన వాటి వివరణ గ్రంథాలూ అని వ్యాఖ్యానించవచ్చు అందుకే 'ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్' అన్న వాసిష్ఠ ధర్మశాస్త్రసూక్తి అక్షరాలా అన్వర్థమైందని పురావిదుల నిష్కర్ష

సమస్త వాఙ్మయ మూలతత్త్వం ఒక టేకాని అంతరువునుబట్టీ, ఆచరణనుబట్టీ, ఆవశ్యకాన్ని ఒట్టీ అది వేర్వేరు మూర్తులుగాభాసిస్తుందని విమర్శకుల అభిప్రాయం వేదాలు అనాదికాలికాలనీ, అపౌరుషేయాలనీ చాలమంది చెప్పే మాట ఏ కొందరో తప్ప చాలమంది వాటిని చదవడానికి కాదుగదా వినడానికికూడ హక్కూ అధికారమూ లేనివారు, ఆవృత్తి సమయాలలో పెదవుల కదలికలను సైతం చూడకూడదని నిషేధించబడ్డ దిక్కులేనివారు, అల్పబోధనులు కాబట్టి చదువుదా మనుకున్నా శక్తి చాలనివారు మూల

తత్త్వాన్ని మౌఖికంగా దేశభాషలలో వ్యాఖ్యానిస్తే తప్ప అర్థంచేసుకోలేని అల్పాధికారులువారు అందులోనూ కథారూపంగా, ఉదాహరణపురస్సరంగా విడమర్చి వివరిస్తే సామాన్యజనులు ఆసక్తితో ఆలకిస్తారు ఆలకించి అర్థం చేసుకుంటారు ఆస్వాదించిఆమోదించంలిగితే,ఆచరణలో అనువదించడానికి యథాశక్తిగా యత్నిస్తారు అందువల్ల అప్రజ్ఞులైన జగజ్జనుల అంతస్తుకీ, అభిరుచికీ అనురూపమైన కళారూపాలసృష్టి ఆవశ్యకమైంది ఈ ఆవశ్యకాన్ని పూరించే నిమిత్తం స్వభావమధురాలు, ముగ్ధమనోహరాలు ఐన జానపద కళా మాధ్యమాలు (folk media) ఎన్నెన్నో ఏర్పడ్డాయి ఇలా రూపొందిన వాటిలో 'పురాణ ప్రవచనం మిక్కిలి ప్రధానమైన సాధనం

ప్రపంచ భాషలన్నింటిలోనూ మౌఖిక సాహిత్యం (oral literature) అనాదియేకాక అవిచ్ఛిన్నమైనదికూడ అది అవిజ్ఞాతకర్తృకం, అకృతంశైలీనిరూపకం సామూహికరచనారాశి విశిష్య, పరంపరీణం, పరిణామశీలం 'అపిచృశ్ఛపురాణవద్ ప్రకతేరివ గుష్టితమ్ (7-8-90-1) అని అథర్వవేద సంహితా కథనం అంగాని వేదాశ్చత్వారో మీమాంసా న్యాయవిస్తరః - పురాణం ధర్మశాస్త్రంచ విద్యా హ్యేతే చతుర్దశః' (విష్ణు ధర్మోత్తరం 1-74-32) ఇట్లని చతుర్దశ విద్యలలో పురాణమొకటిగా పేర్కొనబడింది 'పురాణం సర్వశాస్త్రాణాం యదేతన్మూర్ధ్ని సంస్థితమ్' పురాణం సర్వశాస్త్రాలకు శిరః స్థానమని మత్స్య పురాణ వచనం వేదాలు నాలుగూ, వేదాంగాలు ఆరూ, ఉపాంగాలు నాలుగూ వెరసివిద్యలు పదు నాలుగని అభియుక్తుల లెక్క, జ్ఞాన సముపార్జన సాధనాలైన న్యాయ పురాణ ధర్మమీమాంసా శాస్త్రాలు ఉపాంగ చతుష్టయంగా పరిగణనం ప్రకృతచర్చలో పురాణమంటే పారిభాషికార్థంలో రూఢమైన సర్గ ప్రతిసర్గాది పంచలక్షణ సమన్వితమైన సాహితీభేదంగా పరిమితార్థంలో స్వీకరించ వీలుకాదు 'పురాణ మిత్యేవ న సాధు సర్వం - న చాపి కావ్యం నవ మిత్యవద్యమ్' అన్న కవికుల గురువచనాన్నిబట్టి పురాగాథ

లన్నింటికీ విపులార్థంలో పురాణ శబ్దం అన్వయిస్తుంది 'పరమ పౌరాణికుల్ బహుపురాణ సముచ్చయంబని మహి గొనియాడుచుండ (ఆది 1-32) మహాభారతం విశ్వజనీనమై వెలసిందని నన్నయ పేర్కొన్నాడు 'వేదములకు నఖిలస్మృతివాదములకు బహుపురాణ వర్గంబులకున్ వాదైన చోటులను దాము దల ' (విరాట 1-4) సాత్యవతేయమైన మహాభారత మని తిక్కన్న తీర్పునిచ్చాడు ' హరివంశనామమున విశ్రుతమైన పురాణమగ్రిమం బనుపమ వాగ్విశేష విభవాఢ్యుడు సత్యవతీ సుతుండు సెప్పిన యది ' (అవతారిక) అని హరివంశమే ఘోషిస్తున్నది 'ఒనరన్ నన్నయ తిక్కనాది కవులీయుర్విన్ బురాణావళిన్ దెనుగున్ సేయుచు మత్పురాకృత శుభాధిక్యంబు దానెట్టిదొ తెనుగున్ జేయరు దీని భాగవతమున్ ' (ఆంధ్ర భాగవత ) అని భారతేతిహాసాన్ని పోతన్న పురాణనామంతో వ్యవహరించడం గమనించదగ్గ అంశం రామాయణ భారతాలవంటి ఇతిహాసాలను సైతం ప్రాచీన రచనా పద్ధతిననుశీలించికాక ప్రవచన వైశిష్ట్యాన్ని అనుసరించి పురాణ శబ్ద పరిధిలో పరిగణించవలసి ఉంటుంది సంస్కృతంలోగాని లేక దేశభాషలలోగాని నిర్మించబడ్డ రచనలను మందాధికారులైన సగటుజనులను దృష్టిలో పెట్టుకుని మౌఖికంగా వ్యాఖ్యానించే ఒక విశిష్టకథన విధానమే పురాణ ప్రవచనమని నిర్దిష్టార్థంలో ప్రకృతచర్చలో ప్రయుక్తమైంది ఇందులో రచనం పురాణ కవిదీ, ప్రవచనం పౌరాణికుడిదీ

జానపద మాధ్యమంగా ఇతర కళారూపాలతోపాటు ప్రాచీనకాలం నుంచీ ప్రవర్తిల్లినది పురాణ ప్రవచన సంస్థ దీనిని సూతపీఠం అనికూడా పరిభాషించవచ్చు ఇది వాగ్దేవతారాధనకు ప్రకారాంతరం సంస్కృత భాషా గత విజ్ఞానంతో ప్రత్యక్ష పరిచయంలేక 'గాసట బీసటే చదివి గాథలు త్రవ్వు' పౌరులకూ, చదువు సంధ్యలన్నవి ఏమాత్రమూ తెలియని జానపదులకూ జ్ఞానభిక్షను పెట్టి భారతీయ సాహితీ సంస్కృతి సంప్రదాయా

అను అవిచ్ఛిన్నంగా, అనుస్యూతంగా ఆవిష్కరిస్తూ వచ్చిన ఉత్తమ విద్యాప్రసారక సంస్థ సూతపీఠం అనంతరకాలంలో అత్యంత ప్రాముఖ్యాన్ని పొందిన సూత మాగధులకు, చారణ వైతాళికులకు, సకల మౌఖిక ప్రచారక వర్గాలకు, సమస్త స్తోత్ర పాఠక జనసంతతికి పూర్వపితామహులీ పౌరాణిక వ్యవస్థకు చెందినవారు పూర్వక్రమానుగతంగా ఈ వ్యవస్థాపాలనాన్ని ఉత్తరోత్తర యుగాలలో వీరి ఔరసులు అందిపుచ్చుకుని ధర్మప్రవచన సమర్థులుగా, అతిపితామహులుగా వినుతికెక్కారు పురాణ ప్రవచనంలో పురాణించిన ప్రవచనకారుల విద్యాపరంపర అది

వేదవ్యాసుని జనకుడైన పరాశర మహర్షియే ప్రథమ పౌరాణికుడని 'పురాణవక్తా భవిష్యసి (1-1-12) అన్న విష్ణుపురాణవచనం మనకు ప్రత్యక్ష సాక్ష్యం పరాశరుడు విష్ణుపురాణాన్ని తన ప్రియ శిష్యుడైన మైత్రేయునికి వినిపించినట్లు విష్ణుపురాణావతారిక పేర్కొంటున్నది లభ్యమవుతున్న అష్టాదశపురాణాలు, అష్టాదశోపపురాణాలు, భారత హరివంశాదులు వ్యాసప్రోక్తాలని పండితపరంపరాయాత ప్రతీతి 'జగద్ధితార్థం తత్సర్వం పురాణేషూక్తవాన్ మునిః' అని ప్రాక్తనోక్తి పురాణ ప్రవచన వ్యవస్థ వ్యాసముని కాలంనాటికే సుస్థిరరూపాన్ని పొందినట్లు భావించవచ్చు జైమిని పైల వైశంపాయన సుమంత రోమహర్షణులు అయిదుగురూ వ్యాసర్షి ముఖ్యశిష్యులు వ్యాసపుత్రుడైన శుకయోగికూడా పురాణ ప్రవచన ప్రవీణుడు ఇందులో రోమహర్షణుడు ఉత్తమ యోగ తతుడు, మహాపౌరాణికుడు పురాణప్రవచన వ్యవస్థకు ఆయన ఆద్యుడుగా పురాణించిన వ్యక్తియని సంప్రదాయవిదుల సంభావన అకృతవ్రణ కాశ్యప త్రయ్యారుణ శింశుపాయన సావర్ణిహారీతులన్న ఆరుగురు పౌరాణికులు రోమహర్షణుని అంతేవాసులు (శ్రీమద్భాగవత 12-8-42వ) రౌమహర్షణిఅయిన ఉగ్రశ్రవసుడు నిఖిలపురాణవ్యాఖ్యాన వైఖరీసమేతుడ

కూడ ఈ కుదురులోని వాడే గురువిరచితాలైన సకల పురాణేతిహాసాలను భారతీయ ప్రజాప్రపంచంలో ప్రవచించి ప్రపంచించిన పౌరాణికాగ్ర గణ్యులు వీరూ వీరి శిష్య పరంపరకు చేరిన వారు ఎందరో మహానుభావులూ

పౌరాణికసూతులు వందిమాగధ చారణ వైతాళికులు మున్నగు వారు మొదట మొదట ఉత్తమపదస్థులుగా కార్తాంతిక మౌహూర్తికులతో పాటు ప్రభుపాలనంలో బహుసమ్మానాలందినవారు (కౌటిల్యుని అర్థశాస్త్ర V-3, XIII-1) కాలక్రమాన ప్రవర్తిలిన సామాజిక పరిణామంలో ప్రభునాశ్రయం క్షీణించి పరిషత్తుల ప్రాభవం సన్నగిల్లి సంఘజీవనంలో కట్టుపాటులు సడలి, వీంకి చెల్లవలసిన మర్యాదలు, చెందవలసిన గౌరవాదరణలు యథాపూర్వంగా ప్రవర్తితం కాలేదు క్రమక్రమంగా జరుగుబాటుకు ఇక్కట్లేర్పడి దేశాలుపట్టుకు తిరుగుతూ, పురాణాలు చెప్పుతూ పొటపోసుకునే సంచారజీవనులుగా పరిణతి చెందారు

వీరి కోవలో స్తోత్రపాఠాలను వల్లించడంలోనూ, తమ కాశ్రయమిచ్చిన రాజవంశాల పూర్వగాథలను ఏకరువుపెట్టడంలోనూ పేరుమోసిన తెగలవారు చారణులు వీరి ప్రసక్తి ఆపస్తంబ ధర్మసూత్రాలలోనూ, గౌతమ ధర్మసూత్రాలలోనూ కన్పిస్తుంది చారణ సంతతికిచెంది సంచారజానుజీవనులైన నటగాయక పౌరాణికులు మనుస్మృతి (XIII-44)లోను మహాభారతం (ఉద్యోగ 1039 - 1442) లోను, వరాహమిహిరుని బృహత్సంహితలోను, పంచతంత్రంలోను పేర్కొబడ్డారు కథా సరిత్సాగరం వంటి కథానక కావ్యాలలోను, రాజ తరంగిణి వంటి చారిత్రక కావ్యాలలోను వీరి ప్రసంగం బహుపర్యాయాలు వచ్చింది చారచక్షువులైన ప్రభువుల సమాదరణంలో చారణులు నటులుగా, గాయకులుగా, గూఢచారులుగా స్తోత్రపాఠకులుగా ప్రవర్తిల్లినవారు 'విశ్రాంత చారణాని

చత్వరస్థానా౦' అన్న ఉత్తరరామచరిత ప్రస్తావనలోని వా౦్యం చారణు లను నటులుగానూ సూచిస్తున్నది

గూఢచారులుగా దేశపాలకులకూ, ధర్మప్రచారకులుగా సామాన్య ప్రజలకూ సహకారులుగా మెలగిన కళాకారులు చారణులు ఈరకంగా వీరు పాలకులకూ, ప్రజలకూ 'జ్ఞాననేత్రం గా ప్రవర్తిల్లారు నానా సీమలను దర్శించి, నానా ప్రజా సమాజాల వేషభాషాదులను నిశితంగా అనుశీలించి, ప్రయోగసమయాలలో వ టిని యథోచితంగా అనుకరించి, అతి నిపుణంగా ప్రకటించగల ప్రజా ప్రాభవాలు వీరికి కుల క్రమానుగత విద్యలుగా అల వడ్డాయి వీరే పురా భారతగాథలకు అసలైన సిసలైన వ్యాఖ్యాతలు ప్రాచీన భారతీయ ధర్మమర్మావిష్కరణంలో సాటిపోటిలేని భాష్యకారులు బహుశ్రుతులగు వీరి ప్రదర్శనలూ ప్రవచనాలూ సామాన్యప్రజల విజ్ఞానానికీ వినోదానికీ, ఉపదేశానికీ ఉల్లాసానికీ ఏకైకాధారాలుగా ఉంటూ వచ్చాయి ప్రాచీన సంస్కృతిని ఇన్ని యుగాలుగా జనసామాన్యంలో ప్రస్తావించిన నిస్తుల కీర్తి వీరిది

క్రీస్తుశకం పదో శతాబ్దినాటికే చారణులొక ప్రత్యేకకులంగా రూపొందినట్లు చరిత్రకారుల కథనం వీరు ఒక రకంగా భారతీయ రూపక వ్యవస్థకు మూలస్తంభాలవంటి వారని రంగస్థల సంప్రదాయ విదుల నిరూపణం తేరు తిరుణాళ్ళలోను, పండగ పబ్బాలలోను, పట్టాభిషేకాది ప్రత్యేకోత్సవాలలోను, రాజసన్నిధిని ప్రదర్శనలివ్వడం ప్రాగ్భారతీయ గాథా ప్రవచనం చెయ్యడం ఆనాటి వీరి వృత్తి తక్కిన తీరిక సమయాలలో చారణులు తమ జీవనోపాధి నిమిత్తం ఊరూరూ, వాడవాడా తిరిగి స్థానికులు, కళారాధకులు ఐన సామంతులను, శ్రీమంతులను ఆశ్రయించి వారి భవంతి ఆవరణలలోనో, దేవాలయాలమండపాలలోనో తక్కిన కూడలి తమ ప్రదర్శనల నిచ్చేవారు రాచదర్బారులలో ఇలాటి కళాప్రదర్శనలను తిలకించడానికి అలవాటుపడ్డ కళాభిమానుల ఆహ్వానంమీద కూడ వీరు

తరచుగా రాజధానిని వదిలి పట్టణాలకు, పల్లెపట్టులకు వెళ్ళి ప్రదర్శనల నేర్పరిచేవారు సాధారణంగా వీరి కథావస్తువులు సంస్కృత వాఙ్మయం నుంచి ఏరుకున్నవే ఆశ్రయదాతల సూచనల ననుసరించిగాని, పరిషదాజ్ఞ ననుసరించిగానీ, తమకు తోచినట్లుగాగానీ ఏదో ఒక పురాగాథను స్వీకరించి తదాకర గ్రంథాలలోని శ్లోకాలను, తదితర సంవాది గ్రంథ సంచయంలోని శ్లోకాలనూ వల్లిస్తూ వాటిని దేశభాషలలో, ప్రజాశైలిలో వ్యాఖ్యానిస్తూ సమయోచితంగా చాటు శ్లోకాలనూ, ప్రాస్తావిక పద్యాలనూ ఉట్టంకించి వివరిస్తూ మధ్య మధ్య కథాంతరా (పిట్టకథ-ఉపకథ)లను జోడిస్తూ అన్ని అంతస్తులకు చెందిన సామాజికులను అలరించేవారు

పాలకుల జైత్రయాత్రలలో సేనావాహినులవెంట తరలివెళ్తూ సైనికులను ఉత్తేజపరిచే వీరగీతాల నాలపించడం, సాహసాంక చరితులగు తమ ఏలికల విక్రమక్రమాలను, విజయపరంపరలను, వారి పూర్వుల వీర కృత్యాలను, దయాధర్మకార్యాలను కీర్తించడం, వేళలను తెలిపే గేయాలను పఠించడం వృత్తిగాగల వందుల తెగకూడ మనుస్మృతి కాలంనాటికే ఏర్పడి ఉంది 'వంది బృంద పఠ్యమాన బిరుదావళి ప్రబంధబంధుర శబ్దార్థ చమత్కారంబులు' (కళా 1-11) ఆనాటి పాలకులకు చిరపరిచితాలు స్తోత్ర పాఠక వర్గీయులైన మాగధులుకూడ ఈ కుదురునకు చెందినవారే వైతాళికులుగా, సందేశహారులుగా వీరు ప్రసిద్ధులు అంతేకాదు, పౌరాణికులుగా ప్రాచీన వాఙ్మయ వ్యాఖ్యాతలుగా వీరు చేసిన సేవ బహుముఖమైనది

పరిపాలకుల బాహత్తరి (డెబ్భైరెండు) నియోగాలలోను దేవాలయ రంగభోగాల నిర్వహణంలోను పౌరాణికులకు ప్రాచీనకాలంనుంచీ విశిష్ట స్థానం ఉంది దేశభాషలలో ప్రామాణిక సాహిత్యం పెంపొందించడానికి చాలముందే ఈ పురాణ ప్రవచన విధానం తెలుగుదేశంలో నెలకొని ఉన్నట్లు ఊహించడం సత్యదూరం కాదు ఆ తర్వాతకూడ దీని ప్రచార

ప్రశస్తులు మూడుపువ్వులారుకాయలుగా ప్రవర్ధిల్లుతూ వచ్చాయి చదువుల, పురాణం, పురాణపండా, భారతం రామాయణం - మున్నగు తెలుగువారి ఇంటిపేర్లు పురాణ ప్రవచన వైశిష్ట్యం మూలంగానే సిద్ధించినట్లు శాస్త్ర విదులు నిరూపిస్తున్నారు

పురాణ ప్రవచనసంస్థ జానపద మాధ్యమాలైన అనేక కళారూపా లకు జన్మభూమి దీనికి పక్కవాద్యాలు తోడైతే హరికథగా అవతరిస్తుంది పక్కవాద్యాలవారు ప్రవచనంలో పాలుపంచుకుంటే హరికథ బుర్రకథ గాను, జంగంకథగాను మారుతుంది ప్రయోగంలో నటులనేకులు పాల్గొంటే హరికథ యక్షగానంగా, కూచిపూడి నాట్యమేళంగా రూపెత్తుతుంది అదే కొద్దిమార్పులతో బయలాట - వీథినాటకం - గా పరిణమిస్తుంది అంటే భారతీయ రూపకసృష్టికి పురాణ ప్రవచనం భూమిక అని ఊహించడం యుక్తియుక్తం

అక్షరాభ్యాసం చేయించినవాడు, గాయత్రీమంత్రోపదేశం కావించిన వాడు, మత సంప్రదాయాలను తెలిపినవాడు, శాస్త్రరహస్యాలను బోధించిన వాడు ఇంద్రజాలాది విద్యలను నేర్పినవాడు వేదం చెప్పినవాడు, బ్రహ్మ విద్యోపదేశం చేసినవాడు - ఈ ఏడుగురితోపాటు ఆర్షమత సంప్రదా యంలో అష్టవిధ మహోపదేశకులలో పౌరాణికుడికి సైతం సమర్హస్థానం ఉంది చక్రవర్తుల సభాసప్తాంగాలలో విద్వాంసులు, కవీశ్వరులు, ఐతిహా సికులు, గాయకులు, స్తోత్రపాఠకులు, పరిహాసకులతోపాటు పౌరాణికుడు కూడ ముఖ్యుడు పురాణప్రవచనం ఏకపాత్రాశ్రయం కాబట్టి పౌరాణికుణ్ణి ఏకనటుడని సైతం వ్యవహరించడం కద్దు 'పాండిత్యహీనాః కవయో భవంతి - కవిత్వ హీనాశ్చ పురాణభట్టాః అన్న చాటుశ్లోక విషయం సామాన్యులైన పౌరాణికులకు వర్తిస్తుంది శాస్త్రాలను ఆపోశనంపట్టి, సాహితీసాగరపారం ముట్టి ప్రతిభా పరిపూర్ణులైన పౌరాణికులపట్ల ఈ నిర్వచనం ప్రవర్తించదు

దేశపాలకుల ఇష్టకథా వినోదాలలో పౌరాణికులు కూడా సముచిత పాత్రను నిర్వహిస్తూ వచ్చినట్లు సాహిత్యమే మనకు సాక్షి మహాభారత కథలు 'బహుభాషల బహువిధముల బహుజనముల ' వల్ల విన్నటువంటి రాజ రాజనరేంద్రుని పేరోలగంలో భారత రామాయణాద్యనేక పురాణ ప్రవీణులును ' (ఆది 1-8) ఉన్నట్లు తెలుస్తున్నది నన్నయ సైతం ' బ్రహ్మాండాది నాన పురాణ విజ్ఞాన నిరతు(ఆది 1-9)డు శ్రీమహా భారత రామాయణాది పురాణ పారీణ పౌరాణికులును ' (జక్కన విక్ర మార్క చరిత్ర 1-19) ఆనాడు ప్రసిద్ధులు ' నిఖిల పురాణేతిహాస సంహితా తాత్పర్య పర్యాలోచనా ధురంధర ధిషణా సముత్సాహంబగు పౌరాణిక సమూహంబు ' (శృం నై 1-11) పరివేష్టింప శృంగార నైషధ కృతి భర్త మామిడి సింగనామాత్యుడు కొలువు దీరి ఉన్నాడట ! 'పౌరాణికుండు మహా భారతంబు వక్కాణింపుచు' (శివరాత్రి 2-30) 'పురాణేతిహాస ప్రసంగంబు వినోదించు ' (శృం శా 1-15) ట ఆనాటి కలవారి అలవాటు సాహితీ గోష్ఠి గరిష్ఠుడైన నంద్యాల కృష్ణంరాజు హజారంలో ' సకలచాది నిఖిల పురాణ విధానిధన పాండిత్య పరితోషి తాంతర్వాణికులగు పౌరాణికులు ' (కళా 1-11) ఉండే వారని విదిత మవుతున్నది ఈ పౌరాణికులు గోష్ఠియందు బద్యంబు గీతికార్భటి నొగి జదువంగ ' (విక్రమార్క 1-20) సమర్థులు 'చదివినే బురాణాలు సారెకు వినేటి వేళ' (అధ్యాత్మ సంకీర్తన IX పుట 73) అన్నదాన్నిబట్టి పురాణ శ్రవణం నాటి నుంచి నేటిదాకా అవిచ్ఛిన్నంగా కొనసాగుతూ వచ్చి నట్లు సుస్పష్టపరచవచ్చు

పాలకుల ఆజస్రిక చర్యలలో ఇతిహాస శ్రవణం సైతం ఒకటని 'తత్రేతిహాస శ్రవణం కుర్యాత్కించి దతంద్రితః' (2-151) అని విష్ణు ధర్మోత్తర వచనం 'విమలమతిం బురాణములు వింటి ననేకములు ' (ఆది 1-10) అంటాడు మహాభారత శ్రవణాసక్తుడు రాజ రాజ

నరేంద్రుడు 'ప్రస్తుతోక్తుల గద్యపద్యకావ్యముల విస్తారముగ జేసి వినుతించువారు' (బసవ పు పు 124), 'ధర్మశాస్త్రంబులు పఠించి పురాణంబు లధిగమించి యోగంబులభ్యసించి తర్కంబులాలోచించి నాట్యవేదంబు గ్రహించి మంత్రశాస్త్రంబులు తెలిసి భాషలు గఱచి ' (కాశీ 3-29) పేరుకెక్కినవారు ఆ రోజులలో ద డిగా ఉండేవారు 'వింటి పురాణములు పెక్కు ' (పీఠి-9) అంటాడు హరవిలాసకృతి స్వీకర్త అవచితిప్పయ సెట్టి 'విబుధ విప్రుల బిల్వగ బంచి భాగవతంబు విజ్ఞాన మొదవ భారతరణకిథ పాటించి (పల్నాటి ) వినేవ రానాడు ఆ యా యుగాలలో' పార్థివులెల్ల లక్ష్మి యుత్సవములు మున్నుగా గడు బ్రశస్తములౌ సమయంబులందు సత్కవులను పారకోత్తముల గాయకులన్ నటులన్ వితీర్ణవైభవముల దన్ప జొచ్చిరి ప్రభావ సమృద్ధుల నింపుపుట్టగన్' (సింహా ద్వా ద్వి భాగ పు 27) రామభారత కథాధీన ప్రబంధావళు లన్న మిక్కిలి మక్కువగల చిల్లర వెన్నమంత్రి - శృంగార శాకుంతల కృతిపతి - 'పురాణేతిహాస ప్రసంగంబుల ' (శృం శా 1-15) వినో దించేవాడు 'కవులున్ బాఠకులన్ ప్రధానులు నలంకారజ్ఞులున్ భజి యింపనిండుకొలువై వివిధామ్నాయ పురాణ గుంఫనకిథల్ '(పాండు 1-21) ప్రమోదంతో వినే వా రానాటి పరిపాలకులు

వాల్మీకి రామాయణం, వ్యాస భారత భాగవతాలు, దేవీ భాగవతం మున్నగు సంస్కృత పురాణేతిహసాలేకాక కవిత్రయ భారతం భాస్కర రామాయణం, రంగనాథరామాయణం పోతన భాగవతం పినవీరభద్రుని జైమినీ భారతం కంకంటి పాపరాజు ఉత్తర రామాయణం, ములుగు పాపయారాధ్యుల దేవీ భాగవతం గోపనాథం వేంకటకవి గోపీనాథ రామా యణం, వాసుదాసుల వాల్మీకి రామాయణం జనమంచి శేషాద్రిశర్మగారి శ్రీమద్రామాయణ బ్రహ్మాండ పురాణాలు గడియారం వేంకటశేషశాస్త్రిగారి శివభారతం, పుట్టపర్తి నారాయణాచార్యుల పండరి భాగవతం ప న్న గ చి

తెలుగుసీమలో పురాణ ప్రవచన సందర్భంగా ప్రచుర ప్రచారంలో ఉన్న రుచిరరచనలు భగవద్గీత, సీతారామాంజనేయ సంవాదంవంటి బ్రహ్మ విద్యోపదేశక గ్రంథాలు సైతం చెదురు మదురుగా పురాణ ప్రవచనంలో ఉపయుక్తమవడం లేకపోలేదు తెలుగు వచన భారతాన్ని, వచనంలో తిరుపతి వెంకటకవుల వారి దేవీభాగవతాన్ని, పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వాములవారి చరిత్రమూ పురాణ ధోరణిలో ప్రవచించడంకూడ కొత్తకాదు కొన్ని సీమలలో కొన్ని వర్గా లలో, అపరకర్మల సందర్భంగా గరుడపురాణ శ్రవణ మొకభాగం. ప్రాంతీయాభిరుచులనుబట్టి మరికొన్ని ఈ జాబితాలో చేరవచ్చు

ఉగాది, దసరా, శివరాత్రి, శ్రీరామనవమి, కార్తికోత్సవాలు, స్థానిక దేవతల పరసలు మొదలైన పర్వసమయాలలో ఊరు ఉమ్మడి లెక్కలో పురాణప్రవచనం జరిపించడం జనపదాలలో సర్వసాధారణం! పనిపాటుల ఒత్తిడి అంతగాలేని రోజులలోను వానలు వెనకపట్టి వరపువస్తే వర్షం వచ్చేదాకాను పురాణ ప్రవచనాలు పల్లెపట్టులలో ప్రసిద్ధం విరాటపర్వం చెప్పిస్తే అర్జునుడు గోవులను మళ్ళించేసరికి వానకురుస్తుందని జానపదుల నమ్మకం అనుకున్న మేరకు పెళ్ళీడు పిల్లలకు మంచి సంబంధాలు కుదర నప్పుడు పోతన్న భాగవతంలోని రుక్మిణీ కల్యాణ గాథను ప్రవచనానికి ఎన్నుకోవడం కూడ మామూలే రోగగ్రస్తుల బాధోపశమనానికి వారి కాలక్షేపానికి సిరిగలవారు నలచరిత్రను, గజేంద్రమోక్షంను పురాణంగా చెప్పించడం కద్దు స్థానికులైన పౌరాణికులచేగాని, ప్రత్యేకాహ్వానితులైన పొరుగూరు పౌరాణికులచేగాని పురాణప్రవచనం సాగించడం మామూలు ఈ ప్రవచనం ప్రాయికంగా రాత్రి సుమారు రెండో జామునుంచి ప్రారంభమై మూడు నాలుగు గంటలపాటు సాగుతుంటుంది నాగరక లక్షణాలు బలిసిన పట్టణ ప్రాంతాలలో రాత్రి మొదటి జాములోనే ప్రవచనం ముగుస్తుంది

ఈ పురాణ ప్రవచనం భారతదేశంలోని అన్ని రాష్ట్రాలలోను ప్రచలితమైన కళారూపం ప్రవచన విధానం ఇంచుమించుగా ఈ రాష్ట్రాలన్నింటిలోనూ ఒకే మోస్తరుగా సాగుతుంది విశాలమైన గుడి ఆవరణలో గాని, ఊరిచావడిలోగాని, గ్రామాధికారుల భవన ప్రాంగణంలోగాని పౌరాణికుడు ఎత్తైన బల్లమీదగాని లేక ఏదైన ఒక ఆస్తరణం మీదగాని సుఖాసీనుడై తనముందు వ్యాసపీఠంపై ఉంచిన గ్రంథాన్ని పరిశీలిస్తూ ప్రవచనం సాగిస్తాడు శ్రోతలు పౌరాణికుడికి అభిముఖులై కూర్చుంటారు ఏదో ఒక పురాణం - తెలుగుగాని, సంస్కృతంగాని-ఎన్నికచేసి పద్యం తర్వాత పద్యం వరసగా చదివిగాని లేక పఠనానికి ప్రత్యేకంగా నియోజితుడైన వాచకుని - పురాణపాఠకుని - చే చదివించిగాని పౌరాణికుడు ప్రాంతీయ భాషలో వ్యాఖ్యానిస్తుంటాడు పద్యాలను, శ్లోకాలను రాగయుక్తంగా చదవడం, అదొక వింతైన రాగచ్ఛాయలో వచనరూపాన వాటిని వ్యాఖ్యానించడం పురాణప్రవచనంలోని ప్రత్యేకత ఇతర గ్రంథాలనుంచి ఉద్ధరణలను ఉదాహరిస్తూ, సమకాలిక సామాజికాది స్థితిగతులను నేర్పుగా జోడించి ప్రవచనం సాగిస్తాడు ప్రవచనం బాగా రాణించాలంటే పౌరాణికుడికి ప్రతిభా వ్యుత్పత్తులే చాలవు ప్రసంగకౌశలం పరేంగితజ్ఞానం, సద్యః స్ఫూర్తి, సంగీత పరిచయం తప్పనిసరి అర్హతలు వీటికితోడు శ్రావ్యమైన గొంతు ఉంటే పౌరాణికుడి పని నల్లేరుపై బండి నడక ఐతే, శ్రోతలను బట్టి, ఇతివృత్తాన్నిబట్టి ప్రవచనరీతి మారుతుంటుంది రోజుకు మూడు నాలుగు గంటల చొప్పున ఒక వారమో, పక్షం రోజులో పురాణ ప్రవచనం సాగించడం సర్వసాధారణం కొన్ని కొన్ని సమయాలలో నెలలతరబడి కూడ ఇది కొనసాగవచ్చు

గద్వాల, చల్లపల్లి, పిఠాపురం, పుంగనూరు, పెద్దాపురం, బొబ్బిలి, విజయనగరం వెంకటగిరి మున్నగు సంస్థానాలలో 'ప్రత్యక్ష బాహాట పాంచాల శయ్యల జదివింపనేర్తు, నే చదువనేర్తు' అని ప్రతిజ్ఞచేసి చెల్లించు

కున్న మహాపౌరాణికులుండినట్లు సంప్రదాయజ్ఞుల కథనం త్యాగరాజ స్వామివారి తండ్రి కాకర్ల రామబ్రహ్మం (క్రీ శ 18వ శతాబ్ది) తంజా వూరు మహారాష్ట్రరాజుల ఆస్థానంలో రామాయణ ప్రవచనం చేసేవారట శిష్టు కృష్ణమూర్తి శాస్త్రిగారు పురాణ ప్రవచనంలో కాకలు తీరిన వ్యక్తి అని చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు పేర్కొన్నారు

'పురాణకథన వ్యాసంగ నిత్యోత్సవధ్యానైకైక రిరంసువులు' అయిన పౌరాణికులనేకులు తెలుగునాట ఆధునికయుగంలోను ప్రశస్తి వహించారు

భారత రామాయణాదులను పురాణ ప్రవచనరీతిలో చెప్పి పరి షత్తును ఒప్పించగల ముస్లిం పౌరాణికులు సూరేపల్లి బాబాసాబు వంటివారు రాయలసీమలో నేటికి ఉండడమొక విశేషం ఈ రంగంలో స్త్రీలుకూడ పరిగణించదగ్గ పాత్రను నిర్వహించడం గమనించవచ్చు

# తెలుగు హరికథా వాఙ్మయం

మనదేశంలో ధార్మికప్రచారానికీ సాంస్కృతిక ప్రసారానికి, సామాన్యజనుల మానసికోల్లాసానికీ ప్రబోధసాధనంగా ఉపకరిస్తూ వచ్చిన దేశీయప్రచార కళలలో హరికథ ఒకటి ఆశుకథన ప్రాధాన్యం వల్లనూ, సాధారణ జనులకు ఉద్దిష్టం కావడంవల్లనూ, దీనిని ఒక రకంగా జానపద కళారూపంగా చెప్పుకోవచ్చు అష్టవిధ భగవత్సేవలలోనూ, నవవిధ భక్తి విధానాలలోనూ ఒకటి అయిన కీర్తనం ప్రముఖ లక్షణంగాగల కళావిశేషం కాబట్టి కీర్తన అనీ, భగవత్కథాగానం ఇందులో ప్రధానసాధనం కాబట్టి కథాగానమనీ, సత్కథాగానమనీ భగవల్లీలా విలాసకథనంలో పొద్దుబుచ్చడ మన్నది విశిష్టధర్మంగా కలది కావున కాలక్షేపమని, కథా కాలక్షేపమని, పుణ్య పురుషుల, పురాణవ్యక్తుల గాథలూ బోధలూ ప్రసంగరూపాన ప్రవచించే ప్రయోగకళ కాబట్టి కథాప్రసంగమనీ, పుణ్యకథాప్రవచనమనీ, మొదట్లో హరి (విష్ణు) పారమ్య నిరూపకమైన రూపక విశేషం కావున హరికథ అనీ, హరికీర్తనమనీ ఈ కళాఖండం దాక్షిణాత్యసీమలన్నింటా ప్రచురంగా వ్యవహరించబడుతున్నది 'కథాం వా గీతికాం విష్ణోర్గాయన్విష్ణు పరాయణః' అని బ్రహ్మ పురాణం

హరి (విష్ణు) లీలా విలాసాదులు కథావస్తువుగా రూపెత్తిన ఏ రచనా విశేషమైనా హరికథ కావచ్చు 'వేదములు చదివియును విముఖుడై హరి కథల నాదరించని సోమయాజి కంటె ' అన్న అన్నమయ్య పలుకులోని హరికథ ఇలాటిదే 'హరి అనంత హరికథా అనంతా' అని గోస్వామి తులసీదాసు ఒకానొక సాహిత్యశాఖకూ, ప్రయోగసుందరమైన ఒకానొక

కళారూపానికి హరికథ అన్నది నిర్దిష్టమైన పారిభాషిక పదం ఇది ఏక పాత్రాశ్రయమైన పురాణ ప్రవచనానికి పరిణతరూపమనీ, బహుపాత్రాశ్రయ మైన యక్షగాన ప్రయోగానికి పూర్వరూపమనీ చెప్పవచ్చు పురాణ ప్రవచనంలో కనిపించని సంగీత నాట్య ఆహార్యాదులు హరికథలో అదనం హరికథా కథకుడొక్కడే కథాగత పాత్రలన్నింటినీ ప్రకరణానుసారంగా పోషించడం యక్షగాన ప్రయోగం కంటే హరికథలలో వ్యావర్తకమైన విశిష్టలక్షణం అయితే, రచనా విషయంగా చూస్తే యక్షగానానికీ హరికథకూ భేదంలేదు ప్రయోగపరంగా మాత్రమే ఈ రెండింటికీ భేదం కన్పిస్తుంది

తెలుగులో గురుపద్య విద్యకు వాస్తవంగా నన్నయభట్టుది ఆదిగురు స్థానం కాకపోయినప్పటికీ ఆయనకు పూర్వరచనలు ప్రామాణికమైనవి లభించినందువల్లనూ తత్పూర్వులైన కవుల జీవిత విశేషాలను, ఇతరత్రా నిర్ద్వంద్వంగా నిష్కర్షించడం సాధ్యం కానందువల్లను నన్నయను ఆదికవి అనీ, వాగనుశాసనుడనీ ప్రాచీనాంధ్రలాక్షణికులు పరిగణించడమూ జరిగింది, ప్రసిద్ధాంధ్ర సాహితీ విమర్శకులు చాలమంది ఔనని అంగీక రించడమూ జరిగింది

ఇలాటి చ పుతోనే హృద్యమైన హరికథా విద్యకు ఆదిభట్ల నారాయణదాసు పితామహుడని అంటున్నాం ఆదిభట్లవారికి పూర్వం హరి కథా రచనము ఉంది, తత్ ప్రవచనమూ ఉంది దాసుగారికి పూర్వం హరికథలు రచించినవారు పాతికమందికిపైగా ఉన్నట్లు నిర్ధారించడం జరి గింది అందువల్ల హరికథా రచనానికీ, తత్ప్రవచనానికీ ఆదిభట్లవారు ఆద్యులుకారన్నది సుస్పష్టం ఆదిభట్లవారే దీనికి ప్రధానప్రవక్త అనీ, ప్రథమ ప్రయోక్త అనీ కొందరు అనడం కేవలం ఔపచారికం ఆంధ్ర కవితా పితామహుడని అల్లసానిపెద్దన్నను అభివర్ణించిన పద్ధతిలో హరికథా

క్షేత్రానికి రచనలముఖంగానూ, ప్రవచనముఖంగానూ ఆదిభట్లవారు కావించిన దోహదాన్ని దృష్టిలో పెట్టుకుని వారిని హరికథా పితామహుడుగా ఉపశ్లోకించడంలో తప్పులేదు నారాయణదాసుగారి జీవితకాలం క్రీ శ 1864-1945 మధ్య వారు హరికథకులుగా గజ్జెకట్టింది 1883 తో హరికథకులుగా వీరి జీవితకాలం సుమారు అరవైయేళ్ళు హరికథకు సుస్థిర స్థానాన్ని సమకూర్చి, సభాగౌరవాన్ని సంపాదించి తెలుగుసీమకు చెందిన నూరారుమంది హరికథాగాయనులకు ఒజ్జబంతిగా నిలిచిన నారాయణదాసు గారి పేర ఈ అరవైయేళ్ళ కాలపరిమితినీ తెలుగు హరికథా వాఙ్మయ చరిత్రలో నారాయణదాసు యుగమని పరిగణించడం సమంజసం ఈ పరిగణన మాధారంగా 1883 కు పూర్వకాలాన్ని ప్రాఙ్నారాయణదాస యుగమనీ, 1945 కు తర్వాతి కాలాన్ని అనంతర నారాయణదాస యుగమనీ పరిభాషించవచ్చు

ప్రాఙ్నారాయణదాస యుగాన్ని పూర్వోత్తర దశల కింద మరి రెండుగా విభాగించవచ్చు మన చరిత్రలో అనాదినుంచీ సుమారు 1750 దాకా పూర్వదశగానూ, 1750 నుంచి 1883 వరకూ ఉత్తర దశగానూ నిర్ణయించవచ్చు పూర్వదశకు చెందిన హరికథాపథుల కృషి చరితం అవిజ్ఞాతం అందుచేత దీనిని అవిజ్ఞాత దశ అనికూడా అనవచ్చు ఈ దశ యందలి హరికథాకరణం గూర్చి అనుమాన ప్రమాణాలవల్ల ఊహించవలసిందే నోటిమాటయే ఊపిరిగా బతికి బట్టకట్టిన అనాదృతసాహిత్యంలో ఒక భాగమైన హరికథా వాఙ్మయం పూర్వచరిత్రను పునర్నిర్మించడం చాల చిక్కులతో, చీకాకులతో కూడినపని హరికథా రచనతో భిన్నంకాదని భావించబడ్డ యక్షగానాల ఉనికి క్రీ శ పన్నెండో శతాబ్దినాటికే ఉండడం వల్ల, అప్పటికే హరికథాప్రవచనం ఉండవచ్చని ఊహించడం సత్యదూరం కాదు రామానుజీయమైన వైష్ణవం విజృంభించిన కాలంనుంచి హరి (విష్ణు) పారమ్య ప్రభావం వల్ల దీనికి హరికథ అన్న పేరు సంక్రమించినా అంతకు పూర్వమే ప్రవచనం ఉన్నట్లు భావించడంలో సైతం దోషం లేదు

ఇక ఉత్తరదశకు చెందిన హరికథా కరణం గూర్చి సుస్పష్టమైన నిదర్శనాలు లభ్యమవుతున్నాయి ఆదిభట్లవారు కళింగాంధ్రంలో హరికథా రంగాధిరోహణం చేసిన కాలానికి చాలముందే సాగరాంధ్రంలో, పశ్చిమాంధ్రంలోనూ, తెలంగాణా ప్రాంతంలోనూ, చెన్నపురి పరిసరాలలోనూ ప్రసిద్ధులైన తెలుగు హరికథకులు ఉన్నట్లు తెలుస్తున్నది ప్రాఙ్నారాయణ దాసయుగంలో పాతికమంది నారాయణదాస యుగంలో నూరుమంది, అనంతర నారాయణదాసు యుగంలో డెబ్బైయైదు మంది హరికథా రచయితలు మొత్తం ఇన్నూరుమంది ఉన్నట్లు లెక్కతేలింది పదీ పరకా అటూ ఇటూగా ఇది ఒక ఉజ్జాయింపు లెక్క ప్రాఙ్నారాయణదాస యుగంలోని ఉత్తరభాగం హరికథ గ్రంథరూపంగా రూపుదిద్దుకుంటున్న దశ పురాణ ప్రవచన ధోరణులనుంచి, తరంగాష్టపదుల భంగిమలనుంచి, వీథిభాగవతాల వలయంనుంచి బయటపడి ఒక స్పష్టమైన ఆకృతిని ధరిస్తున్న దశ ఆక్రి పద్దెనిమిదో శతాబ్ది ఉత్తరార్ధానికి చెందిన గోగులపాటి కూర్మనాథ కవి మృత్యుంజయ విలాసం హరికథా రూపంగా ప్రచారంలో ఉన్నట్లు తెలుస్తున్నది తూర్పుగోదావరిజిల్లా రాజోలు తాలూకా గుడిమెళ్ళంక వాస్తవ్యులు ఐన ప్రయాగ రంగశర్మ ఈ మృత్యుంజయ విలాసాన్ని హరికథగా చెప్పేవారట కాళహస్తి సంస్థానాశ్రితులు మునిపల్లె సుబ్రహ్మణ్యకవి రచించిన అధ్యాత్మరామాయణ కీర్తనలు మన హరికథలకు తొలిరేఖలని శ్రీనివాస చక్రవర్తి, రంగాచార్యులు ప్రభృతి పరిశోధకుల అభిప్రాయం ప్రయాగ రంగశర్మ అధ్యాత్మ రామాయణాన్ని కూడ హరికథగా ప్రవచనం చేసినట్లు తెలుస్తున్నది త్యాగరాజస్వామి రచించిన నౌకాచరిత్ర, ప్రహ్లాద విజయం హరికథా ప్రవచనంలో నాటికీ నేటికీ ఉత్తమనిరూపణలుగా స్వీకరించబడుతున్నవి

మధుర సౌరాష్ట్రసభా నిర్వాహకులు సేకరించిన లిఖితప్రతులలో కొన్ని తెలుగు హరికథలు లభిస్తున్నవి హరిభజన సింగరిదాస కృత

మైన భద్రాచల రామదాసు చరిత్ర ఆధారంగా కంచె వరదరామదాసు హరికథా కాలక్షేప పద్ధతిలో కూర్చిన సంథానగ్రంథం బహుకాలం హరి కథాపరులకు ఆధారగ్రంథం శేషాచలకవి రచించిన ధర్మపురి రామాయణం, తెలంగాణా నివాసులు ముద్దయ్యకవి నిర్మించిన మంథెన రామాయణం, అనంతపురం మండలానికి చెందిన వెంకటరాయకవి కూర్చిన లేపాక్షి రామాయణం కర్నూలు మండల వాస్తవ్యులు తాళ్ళూరి నారాయణ కవి రచించిన మోక్షగుండ రామాయణం మున్నగునవి పద్దెనిమిది, పందొమ్మిది శతాబ్దాలలో హరికథా ప్రవచన రూపంగా ప్రజాదరణ పొందిన రచనలు రామాయణం సీతాపతిదాసు, కడపమండలానికి చెందిన రామావజ్ఝుల కొండయ్య, కాశీకృష్ణాచార్యులు మోక్షగుండ రామాయణాన్ని హరి కథగా ప్రవచించిన కొందరు కథకులు పందొమ్మిదో శతాబ్ది పూర్వార్ధానికి చెందిన రామాయణం వెంకటనరసింహయ్య ప్రసిద్ధ హరికథకులు, కథ రచయితలు గోపాల విలాసమనే హరికథ వీరి ముఖ్యరచన నారాయణదాసునకు గురుస్థానమని కొందరు భావిస్తున్న ధూళిపాళ కృష్ణకవి ప్రాజ్ఞ నారాయణదాస యుగంలో పెద్ద పేరుగల హరికథా రచయిత, హరికథా ప్రయోక్త ధ్రువచరిత్ర, మార్కండేయ చరిత్ర, వామనచరిత్ర మున్నగునవి వీరి ముద్రిత హరికథలు హరికథా పితామహులైన ఆదిభట్లవారికి ఓనమాలు నేర్పిన హరికథారచన ధ్రువచరిత్ర తిరుపతి చేరువలోగల అప్పళాయగుంట వాస్తవ్యులు కొప్పెర బాబూరావు రచించిన జయదేవ, తుకారాం, నామదేవ్, సక్కుబాయి మొదలైన హరికథలు, రాఘవ యాదవీయ ద్వ్యర్థికావ్యకర్త మైనంపాటి రాఘవయ్యగారి కుచేలోపాఖ్యానం హిందూపురం పట్టణ వాస్తవ్యులు బాగేపల్లి అనంతరామాచార్యుల అనసూయ, కుచేల, చంద్రహాస, గద్వాల సంస్థాన సమ్మానితులు నారాయణపేట అనంతశాస్త్రి రచించిన భాగవత హరికథలు, సందడి నాగదాసు నిర్మించిన వాసుదేవ, వైరాగ్య దీపిక, చెన్నపట్టణం వాస్తవ్యులు బోడి సుదర్శనదాసు

కూర్చిన కణ్ణన్ చరిత్ర, కుచేల, చోకామీళ, ప్రాజ్ఞ్యరామాయణదాసు యుగానికి చెందిన ప్రసిద్ధ హరికథలు ఆదిభట్లవారు బాల హరికథకులుగా రూపొందడానికి పూర్వమే సుదర్శనదాసు హరికథలు చెన్నపురిలో ఆచ్ఛాదించబడడం గమనించదగింది

నారాయణదాసయుగంలో శతాధిక హరికథారచయితలు, సహస్రాధిక హరికథకులు విలసిల్లారు నారాయణదాసు అంబరీష గజేంద్ర మోక్షం, మార్కండేయ, యథార్థ రామాయణం మొదలైన హరికథలను రచించి ప్రవచించినవారు రచనంలో, ప్రవచనంలో దాసుగారిదొక ప్రత్యేక మైన బాణిగా ప్రసిద్ధి అనకాపల్లి వాస్తవ్యులు బాలాజీదాసు కుచేల, కుశలవ, జయప్రద, నలచరిత్ర ప్రియంవద, రుక్మాంగద, హరిశ్చంద్ర మొదలైన హరికథలు రచించారు నిజామాబాద్ మండలానికి చెందిన పరిమి సుబ్రహ్మణ్యం, చీరాల కిట్టా అచ్చయ్య బొబ్బిలి నివాసులు చేపూరి ఎరుకయ్యదాసు, శ్రీకాకుళం మండలానికి చెందిన గన్నవరపు నరసింహ దాసు, రాయవరం వాస్తవ్యులు నల్లమిల్లి బసివిరెడ్డి, రాజమండ్రి కొమ్మూరి బాలబ్రహ్మానందదాసు, గుంటూరు బాబూ నౌషర్వాన్‌జీ, తెలంగాణా ప్రాంతీయులు చెర్విరాల భాగయ్య, పశ్చిమగోదావరి మండలానికి చెందిన కోసూరి భోగలింగదాసు, హోసూరు ప్రాంతీయులు కారుపల్లి శివరామదాసు ఈ యుగంలో పేర్కొందగ్గ హరికథా రచయితలు

అచ్చంగా హరికథా రచన కంకితం కాకపోయినా సరదాకోసమో, హరికథాపరుల అభ్యర్థనమేరకో అడపా దడపా హరికథలు రచించిన వారిలో నాదెండ్ల పురుషోత్తమ కవి, కాశీ కృష్ణాచార్యులు, తుమ్మల సీతా రామమూర్తి ఈ యుగ రచయితలలో ముఖ్యులు పురుషోత్తమ కవి స్త్రీల మీటింగునాటి హరికథ, కృష్ణాచార్యుల గునిగోవిందుని కథ, ప్రహ్లాద, సుభద్ర, తుమ్మలవారి వామదేవుచరిత్ర ప్రసిద్ధమైనవి వీరుకాక విద్వత్కవులు

మరికొందరు సైతం హరికథారచన చేసినవారు ఉన్నారు దుర్భా రాజశేఖర శతావధానిగారి రాణీ సంయుక్త ఆదిపూడి సోమనాథరావుగారి దయాకర విజయం, మారేపల్లి రామచంద్ర కవి కన్యకాంబికా విజయం, గార్లదిన్నె సుబ్బారాయకవి రుక్మిణీ కల్యాణం, కస్తూరి శివశంకర కవి శంకర రామాయణం, వానమామలై వరదాచార్యుల గాంధీ జీవిత చరిత్ర, ఏటుకూరి వెంకటనరసయ్యగారి రైతు, కదిరి వాస్తవ్యులు సోంపల్లి కృష్ణమూర్తిగారి శంకరవిజయం మొదలైనవి విద్వత్కవులు రచించిన హరికథలు

అనంతర నారాయణదాస యుగంలో హరికథా వాఙ్మయ సృష్టిలో పరిగణించదగ్గవారు పలువురున్నారు పెదపాటి కృష్ణమూర్తి, కేశవ తీర్థ స్వామి బొమ్మరాజు జానకిరామయ్య, యాళ్ళబండి తాతారావు, ప్రయాగ నరసింహశాస్త్రి, ములుకుట్ల పున్నయ్యశాస్త్రి పాతూరి మధుసూదనరావు జవంగుల యెల్లమందదాసు చేపూరి ఆచార్య రాజశేఖరుని లక్ష్మీపతిరావు, కడలి వీరదాసు తెన్నాకుల వేంకటేశ్వరగుప్త, పెంటపాటి సర్వేశ్వరరావు బొమ్మరాజు సీతారామయ్య, పైడిపాటి సుబ్బారావు, పెద్దింటి సూర్య నారాయణ దీక్షితదాసు, రావి హరిచౌదరి - పేరు ప్రతిష్ఠల నార్జించిన హరికథా రచయితలలో కొందరు కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు రచించిన త్యాగరాజు, పోతన, బుద్ధచరిత్ర మొదలైన అనేక హరికథలు గొప్ప ప్రచారాన్ని పొందాయి

హరికథా రచనలో పాల్గొన్న రచయిత్తుల సంఖ్య చాల స్వల్పం ముష్టిరాజ్య లక్ష్మమ్మగారి ఉత్తర రామాయణము, ఏనుగుల చూడమ్మగారి రుక్మిణీ కల్యాణము, లక్ష్మీనరసింహ యోగినిగారి దక్షిణామూర్తి హరికథ, మోదవరపు లక్ష్మీనరసమ్మగారి సుశీల, కోటా ధన లక్ష్మమ్మగారి కుచేల, రుక్మిణీ కల్యాణము శ్రీనివాస చరిత్ర, సీతా కల్యాణము రచయిత్రుల రచనలలో ముఖ్యమైనవి

ఇంచుమించు ఇందాక చర్చించిన హరికథా వాఙ్మయంలోని ఇతి వృత్తాలన్నీ ప్రధానంగా పురాణేతిహాసాదిక గాథలకు పరిమితాలు ఈ హరికథాచక్రంలోని కథలు కొన్ని రామకథాశ్రయాలు, కొన్ని మహాభారత సంబంధులు, మరికొన్ని భాగవత కథా నిధానాలు ఇంకా కొన్నింటికి ఇతర పురాణకథలు ఇతివృత్తాలు తక్కినవాటిలో చారిత్రకేతివృత్తాలు కొన్ని మతబోధకుల, మహాభక్తులగాథలు కొన్ని రాజకీయనాయకుల జీవిత చరిత్రలు కొన్ని మొన్న మొన్నటిదాకా హరికథావస్తు స్వీకారంలో పెద్ద మార్పు కనిపించదు జాతీయోద్యమ ప్రభావం వల్లనూ, ఇతర సంస్కృతుల ప్రభావం వల్లనూ కథా వస్తుస్వీకారంలో కొంతమార్పు ఆధునిక కాలంలో కనిపిస్తున్నది సామాన్య ప్రజాజీవిత రేఖలు అరుదుగా గోచరిస్తున్నా ప్రకృతం హరికథా వాఙ్మయశాఖ స్పృశించని అంశమంటూ కన్పించదు

మత ప్రబోధం నిమిత్తం క్రైస్తవ కవులూ, క్రైస్తవాభిమానులైన ఇతర కవులూ రచించిన కథా గానాలు పాతిక పై చిలుకు ఉన్నట్లు తెలు స్తున్నది క్రైస్తవ కవులలో నెల్లూరు వాస్తవ్యులు పిడతల జాన్ కవి (1876-1971) మొదటివారుగా కన్పిస్తున్నారు క్రైస్తవ కథాగానాలలో ఆచ్చుపడి దొరకుతున్న రచనలు వేళ్ళమీదికి చాలవు మందపాటి అబ్రహాం భాగవతార్ రచించిన యేసుని చరితము, మనోహర కవి తీర్చిన అవతార విలాసము (క్రీస్తు జన్మరహస్యము) ఆత్తోట రత్నకవి రచించిన సంసోను దెలీలా మొదలైనవి మాత్రం లభ్యమవుతున్నవి విజయవాడ సువార్తవాణి ముఖంగా అబ్రహాంగారి రచనలు ప్రసారం చేయబడ్డవి

బాపట్ల పట్టణంలోని ఇండియా బైబిల్ మిషనుకు చెందిన షారోన ఆశ్రమ నిర్వాహకులు రెవరెండ్ మనోహర కవి రచించిన 'అవతార విలాసం'లో క్రీస్తు జన్మరహస్యం అనువర్ణితం ఇది బాపట్లలోని షారోన గ్రంథమాలలో 1959 లో ప్రచురితం దీనిని 'హరికథ' అనియే రచయిత పేర్కొన్నారు

అత్తోట రత్నకవి తమ రచనలను సత్కథాగానాలని పేర్కొన్నారు అబ్రహాము, ఇస్సాకు, క్రీస్తు జననం, క్రీస్తు మరణ పునరుత్థానము, పూల గంప, మోషే, సంసోను-దెలీలా మున్నగునవి హరికథా రూపంగా వీరు నిర్మించిన రచనలు వీటిలో చివరిది మాత్రమే క్రైస్తవ వాఙ్మయ సమాజం (The Christian Literature Society) మద్రాసు వారిచే 1967 లో ప్రచురితం సత్యశీలురైన సువార్తికులకు, రచయితలకు ఈ రచనమంకితం ఇశ్రాయేలు జాతీయుడయిన సంసోను కారణజన్ముడైనను తన కర్తవ్యాన్ని మరచి దెలీలా యన్న వేశ్య వలలో చిక్కి ఫిలిష్తీయ జాతీయుల వల్ల దుర్మరణం చెందిన కథ ఈ రచనలోని ఇతివృత్తం

ఆంధ్ర విశారద కీ శే బీర్నీడి మోషేకవి రచనలలో ఇస్సాకువధ పువ్వుల గంప, యోహాను జన్మ వృత్తాంతం, యోసేపు చరిత్ర పేర్కొదగ్గవి

జొన్నకూటి దేనియల్, పినపాటి జెర్మియా, పాటిబండ్ల జాకబ్ మున్నగువారి రచనలు భక్త సాధు సుందర్ సింగ్, అనాథ, ఆదాము యోసేపు చరిత్ర మొదలగునవి అముద్రితాలు విజయవాడ వాస్తవ్యులు 'కథా కాలక్షేప ప్రవీణ' బిరుదాంచితులు గుంటి యోహాను భాగవతార్ జాషువాకవి రచనలు ఆధారంగా అనాథ రక్షణ, చిదానంద ప్రభాతం అన్న కథాగానాలనూ, లక్కవరం జమీందారు మంత్రి ప్రెగడ భుజంగ రావుగారి 'నవ నిబంధన' పద్య కావ్యం ఆధారంగా క్రీస్తు జీవితం అన్న కథాగానాన్ని రూపొందించి ప్రవచనం చేసేవారు యోహాను భాగవతార్ రచించిన 'క్రీస్తు సంపూర్ణ జీవితం' అన్న రచన అముద్రితంగానే ఉండి పోయింది

ప్రసిద్ధ హరికథా రచయితలు , కథా గాయకులూ, కథా గాన కళా ప్రపూర్ణ బిరుద విరాజితులైన పెద్దింటి సూర్యనారాయణ దీక్షిత దాసుగారి

'పూఁగంప' (మేరియా చరిత్ర) కు మూలం బత్తుం డేవిడ్ అన్న క్రైస్తవ బోధకుడు తమిళ భాషనుంచి తెనిగించిన 'పూలగంప' అన్న వచన రచన తమిళమూలం 1877 లో ముద్రితం **Basket of Flowers** అన్న ఆంగ్ల రచన తమిళ కృతికి ఆధారం నరసాపురం మిషన్ హైస్కూలులో ప్రధానోపాధ్యాయులుగా పని చేసిన ఆనందరాజుగారు దీక్షిత దాసుగారి రచనకు ప్రేరకులని తెలుస్తున్నది బొబ్బిలి నివాసులు చేవూరి లక్ష్మీ నారాయణాచార్యులు 'యేసు' కథ 'సువార్తా సారైక్య దీపిక' అన్న గ్రంథం ఆధారంగా రూపెత్తినట్లు సూచించబడ్డది దామెర్ల నాగేంద్రం గారి క్రీస్తు జననం, రావి హరిచౌదరిగారి యేసు చరిత్ర', పులిచెర్ల సుబ్బారావుగారి 'రక్తబలి' మొన్నగునవి క్రైస్తవేతరులు రచించిన క్రైస్తవ మతసంబంధి కథాగానాలలో ప్రధానమైనవి

ఈ రీతి హరికథా కాలక్షేప పద్ధతిని గమనించిన ముస్లిం కవులు కొందరు తెలుగులో హరికథా రూపంగా ఇస్లాం మత సంబంధి గాథలను రచించారు ఖాదర్‌ఖాన్ సాహేబ్ రచించిన 'మహమ్మదు విలాసము' (1912), తుమ్మకోట వాస్తవ్యులు షేక్ బడేసాహేబ్ రచించిన 'ప్రవక్త హజరత్ మహమ్మద్', 'కర్బలా వీరగాథ అముద్రితాలైన హరికథా రూపాలు

ఆకాశవాణి ముఖంగాను ప్రభుత్వ ప్రచారక సంస్థల ద్వారానూ, హరికథా వాఙ్మయానికి ఆదరణ లభిస్తున్నది తిరుమల తిరుపతి దేవస్థానం వంటి దేవాలయ సంస్థల ప్రోత్సాహం కూడ దీనికి లేకపోలేదు కపిలేశ్వర పురం వారి హరికథా గురుకులం ఈ సందర్భంలో పేర్కొనదగ్గ ప్రోత్సాహక సంస్థ తెనాలి, హైదరాబాదు, బ్రహ్మసముద్రం (అనంతపురం జిల్లా) లలో తెలుగు విశ్వవిద్యాలయం పక్షాన ఈ గురుకులాలు నిర్వహించబడ్డాయి మన సంస్కృతిలో ఒక ముఖ్యభాగమైన కథాగానకళను నూతన ప్రచార రీతిలో మలచుకోవడం మన చేతిలో పని

# మరాట్వాడాలో హరికథా వికాసం

క్రీ.శ. పదో శతాబ్దినాటికే మహారాష్ట్ర భూములపై పరదేశీయుల దాడులు ప్రారంభమైనట్లు చరిత్ర. మరాట్వాడాలో ఈ యుగం అతిక్లిష్టమైనది. పరధర్మమేకాక, దురాచార దూషితమైన స్వధర్మం కూడా సామాన్య ప్రజలకు భయావహంగా పరిణమించిన గడ్డురోజులవి. ధర్మకంచుకాలు తొడిగిన స్వార్థపరుల గుప్పిట్లో, పదవీలాభలోభరతుల పద ఘట్టనలలో సగటు మనుషులు నలగి కలగిపోయిన గడియలవి. అందుచేత పరధర్మపు తాకిడిని తట్టుకోడానికీ, సమాజాభ్యుదయానికి గుదిబండగా తయారైన స్వధర్మాన్ని నూతన స్థితిగతుల కనుగుణంగా పునర్వ్యవస్థీకరించి, పునర్వ్యాఖ్యానించి సంస్కరించడానికి - నాథ సంప్రదాయం, మహానుభావ పంథ - పండరిపుర పాండురంగవిఠల భజనపద్ధతి - మొదలగు మత సంస్కరణ పరమైన పునరుజ్జీవనోద్యమాలెన్నో మరాట్వాడాలో పొడసూపాయి.

ఇంచుమించుగా ఇదేకాలంలో మరాట్వాడాకు పరిసర సీమయైన కన్నడనాడులో బసవేశ్వరు డవతరించి వర్ణవ్యవస్థకు వ్యతిరేకంగా ప్రబోధం సాగించి సామాన్యజనానీకానికి ధీరతాప్రవృత్తినీ బోధసంపత్తినీ ప్రసాదించిన విషయం గమనించదగ్గది. మత్స్యేంద్రాది నవనాధులు, చక్రధర్, జ్ఞానేశ్వర్, నామదేవు, తుకారాం, సమర్థరామదాసు, ఏకనాథ్‌జీ, మోరోపంత్ - వంటి భక్తులూ, శివాజీలాంటి రాజ్యపాలకులూ, మహాదజీ శిందే వంటి సేనాపతులు, పేష్వాలవంటి సచివోత్తంసులూ, అర్వాచీన యుగాలలోని అనేక సంస్థానాధిపతులూ అభ్యుదయావహాలైన ఈ ఉద్యమాలపట్ల ప్రపోషకులుగా పరిక్రమించారు, ప్రచారకులుగా పరిశ్రమించారు

వీరి కృషికి ఫలంగా లోకరక్షణం, లోకరంజనం ముఖ్య ప్రయోజనాలుగా రూపొంది పెంపొందిన అనేక దేశీయ ప్రచారకళలలో 'ఏకపాత్ర నాటక'మని ప్రశస్తిని బడసిన హరికీర్తనం గణనార్హమైనది పురాణేతిహాసాలలోని కథలను కథాగత పాత్రలనూ వాటి ఆలోచనా ధోరణులనూ చదువురాని-చదువు వచ్చినా పురాణాదులను స్వయంగా చదువుకోవడానికి శక్తి ఆసక్తిలేని మందప్రజ్ఞుల కందించడానికి ఈ కళారూపం దోహదం చేసింది

నాటినుంచి నేటివరకూ మరాట్వాడాలో కీర్తన సంప్రదాయం ప్రవర్ధిల్లుతూ వచ్చినట్లు విమర్శకుల నిశ్చితాభిప్రాయం నడుమనడుమ విరచుకుపడే ప్రతికూలశక్తుల ఒత్తిడికి ఎదురొడ్డి నిలదొక్కుకుంటూ వివేకవిభూషణులైన సంస్కర్తలగాథలతో, శ్రుతవంతుల బోధలతో ఎప్పటికప్పుడు కొత్త ఊపిరి నింపుకుంటూ ఇది నేటిదాకా సాగివచ్చింది పందొమ్మిదో శతాబ్ది చివరిపాదంలో భారతదేశంలో రేకెత్తిన జాతీయోద్యమ భాగాలైన పునర్వికసన కార్యక్రమాలలోని అంశాలుగా నామసంకీర్తనం, పురాణప్రవచనం, గణేశపూజలు, రా...్సవాలు ఇత్యాది భక్తిప్రబోధకరూపాలు నూతనోత్సాహం పుంజుకుని రంగాధిరోహణం చేశాయి

ఈ అనుకూల వాతావరణంలో మరాట్వాడాలోని కీర్తనకార పౌరాణిక ప్రవచనకార ప్రభృతి మంగళ ప్రాసంగికులను విస్తృత ప్రాతిపదికపై ఒకే వేదికమీద సంఘటితపరిచే ప్రయత్నాలు జరిగాయి ఈ సన్నాహం కొకరూపమేర్పడి వామన ఏకనాథశాస్త్రి కేంకర్ సంస్థాపక సంయోజకులుగా పూనా నగరం శనివార పేటలోని గోశెరామమందిరం కార్యస్థానంగా ఒక సాంస్కృతిక సమితి అవతరించింది ఇదే పూనాలోని నేటి హరికీర్తనోత్తేజక సభకు మూలస్థానమైన పవిత్ర మానసగంగోత్రి రమారమి ము డు పుష్కరాలపాటు కథాగానం, పురాణప్రవచనం, మంత్ర

జాగరం, శాస్త్ర చర్చలు సాముదాయిక భజనలు, సామూహిక పూజలు, సాంస్కృతిక గోష్ఠులు మున్నగునవి ఈ సంస్థ పక్షాన నిర్వహించబడుతూ వచ్చాయి

క్రమక్రమంగా సదస్సులలో కథాశ్రవణ కుతూహలం పెరగడం వల్ల కథా గాన తత్పరులైన హరిదాసులకొక ప్రత్యేక సంస్థ ఏర్పరిస్తే ఉచితంగా ఉంటుందని సంస్కృతి సంపన్నులైన కొందరాప్తకాములకు తట్టింది వారు సిద్ధసంకల్పులు తలచినదే తడవుగా పూర్వోక్తసమితిలో ఒక శాఖగా ప్రాచీన ధర్మ ప్రసారమే ప్రధానాశయంగా వామన ఏకనాథ శాస్త్రి కేంకర్ ప్రథమ ప్రవక్తులుగా 1888 లో హరికీర్తనోత్తేజినీ సంస్థ వెలసింది ఆ పిమ్మట ఇదే 1898 లో హరికథాగాన సంప్రదాయానికి పట్టుగొమ్మగా 'హరికీర్త నోత్తేజక సభా' అన్న కొత్త పేరుతో శాసనబద్ధ మైన సంస్థగా రిజిష్టరైంది

మరాట్వాడాలో ముఖ్య హరికథాగాన రీతులైన వార్కరీ-నారదీయ సంప్రదాయాలకు చెందిన కీర్తన కళాకారుల నందరిని ఒక సంస్థ కింద సమీకరించడం, కీర్తనముఖంగా దేశంలో సద్విచారాన్నీ, సముచాచారాన్నీ సుస్థాపితం చెయ్యడం, సాధుసత్పురుషుల - ప్రసిద్ధకీర్తనకారుల జన్మదిన-మరణస్మరణ పుణ్యతిథులలో స్మృత్యంకాలుగా కథాగానాలను నిర్వహించడం, కథాగాన శిక్షణ నిమిత్తం విద్యాలయాన్ని స్థాపించి సముచిత శిక్షణ నిచ్చి, పరీక్షలను నిర్వహించి ఉత్తీర్ణులైన అభ్యర్థులకు కీర్తనాకార పదవీ పట్టాలను ప్రసాదించడం, తరచుగా గోష్ఠులు సదస్సులు సమ్మేళనాలు ఏర్పరిచి కళాకారుల వ్యుత్పత్తినీ, నైపుణ్యాన్నీ మెరుగుపరిచి, వారిలో క్రమశిక్షణను, సదవగాహనను, సమైక్యభావనను పెంపొందించడం, పరస్థలాలనుంచి వచ్చే హరిదాసులకు వసతులు సమకూర్చడం, ప్రముఖ హరిదాసులను సత్కరించడం 'శ్రీనారద' అన్న త్రైమాసిక పత్రికను నిర్వహించడం - ఇత్యాదులీ సభాలక్ష్యాలలో కొన్ని

ఈ లక్ష్యాంలో చాం భాగం నేడు నెరవేరాయి పూనా నగరం సదాశివ్పేటలో సకల సౌందర్యాలు అమర్చిన ఒక సొంతభవనాన్ని ఈ సంస్థ నిర్మించుకోగలిగింది దీని ఆవరణలో నెలకొల్పబడ్డ నారద బాంక మందర్, వ్యాసగురుకులం, శ్రీహరి వచనాలయం హరికీర్తన పాఠశాల-మున్నగు అంతర్విభాగా లీ సభాకార్యక్రమ నిర్వహణలో ప్రధానాంగాలు హరికథా పాఠశాలలో శిక్షణపొందిన అభ్యర్థులకు శిక్షణకాలం, స్థాయి మున్నగు అర్హతల ననుసరించి కీర్తన కళానిధి, కీర్తనకార, కీర్తనకేసరి, కీర్తనచతుర, కీర్తనభూషణ, కీర్తనరత్న, కీర్తన వాచస్పతి కీర్తనాగ్రేసర, కీర్తనాచార్య - మొదలైన పట్టాలు ప్రదానం చెయ్యబడుతున్నవి ఇందూర్‌లోనూ, పూనానగరం శనివారపేటలోనూ ఈ సంస్థ అనుబంధ సంస్థలు రెండు పనిచేస్తున్నవి హరికీర్తన సార్వభౌమ శ్రీ ధుండా మహరాజ్ దేగ్లూర్కర్‌గారి అధ్యక్ష్యంలో 1969 లో పూనా నగరంలో అమృతమహోత్సవం జరుపుకున్న ఈ సంస్థ పష్ఠాన ఉత్సవ చిహ్నంగా 'అమృతకలశ' అన్న ప్రత్యేకసంచిక మరాఠీభాషలో వెలువడింది

మహారాష్ట్రప్రాంతంలోని వెనుకటి స్వదేశ సంస్థానాలు భారత దేశంలో సంలీనమయ్యే దాకా ఆయా సంస్థానాధిపతులు హరికథా గాయకులను పోషించేవారు ఔంధ్ సంస్థానాధీశులు శ్రీమంత్ బాళాసాహెబ్‌పంత్ ప్రతినిధి కీర్తన కళాపోషకులేగాక స్వయంగా కీర్తనకారులుకూడ

గోవా, పూనా, బొంబాయి ఆకాశవాణి కేంద్రాలనుంచి మరాఠీభాషలో హరికథాగానాలు తరచుగా ప్రసారమవుతున్నవి బొంబాయి ఆకాశవాణి-బి విభాగం నుంచి రాత్రి ఏడూ ఏడున్నర గంటల నడుమ అరగంటసేపు ఈ కార్యక్రమ ముంటుంది ఘాయాసాస్ పరంజపే, మనోరమాబాయి సబ్నీస్, ప్రేమాలాఖరే ప్రభృతులు ఆకాశవాణి ముఖంగా హరికథాగానం చేసిన వారిలో కొందరు

బొంబాయి (దాదర్)లో అఖిలభారతీయ కీర్తనసంస్థ నెలకొని ఉంది దీని పక్షాన కథాగాన సమాచార వాహకంగా 'కీర్తన' అన్న ఒక పత్రిక సైతం వెలువడుతున్నది మహా విద్వాంసులు పులుస్కర్ పర్యవేక్షణలో నాసిక్ పట్టణంలోని రామమందిరంలో శ్రీరామనవమీత్యాది పర్వ సందర్భాలలో హరికథాగానాలు కనులపండువుగా, వీనులవిందుగా నిర్వహించబడుతున్నాయి ఇట్లే జహీరాబాద్ పట్టణంలోని మాణిక్యప్రభు మందిరంలో మరాఠీభాషా ముఖంగా హరికథా ప్రసంగాలు భక్తి జగన్మోహనంగా జరగటం గమనించదగ్గ విషయం

లోకమాన్య బాలగంగాధర తిలక్ భారతజాతీయ స్వాతంత్ర్య సమరసమయంలో జాతీయోద్యమ లక్ష్యాలప్రచారం కోసం హరికథాగాన రీతిని ప్రోత్సహించారు పత్రికా రచయితగా కుదురుకోకుండా ఉంటే తాను హరికథా గాయకుడిగా రూపొంది ఉండేవాడినని ఆయన ఎన్నోసార్లు ముచ్చటించినట్లు పరిశీలకులంటున్నారు తిలక్ మహాశయుని అండదండలతో, ఆశీఃపరంపరలతో రాష్ట్రీయ జనుల ప్రయోజనం దృష్ట్యాను సంప్రదాయసిద్ధమైన ఇతర కథాగాన రీతులకు వ్యావర్తకంగాను హరికథా శిల్పంలో రాష్ట్రీయ హరికథ రూపు ధరించింది భగవల్లీలా విలాసాలకో, భగవద్భక్తుల గాథావిన్యాసాలకోకాక ఆధునిక యుగంలోని సామాజిక సమస్యలను స్వదేశభక్తుల, స్వధర్మనిష్ఠుల చరితలను అభివర్ణించే ఇతివృత్తాలుగల కథాకథనరీతిని రాష్ట్రీయకీర్తన లేక రాష్ట్రీయ హరికథ అన్నారు 'యన్యాస్మాకం సుచరితాని త్వయా సేవితవ్యాని నో ఇతరాణి' అన్న ఉపనిషదాజ్ఞ ఈ రీతి వినియోజనానికి అడ్డురాదు తిలక్ మరణానంతరం సుమారు 1926-27 ల మధ్య రాష్ట్రీయ కీర్తనలను ప్రవచించే కథాగాయకులకు 'రాష్ట్రీయకీర్తనకార' అన్న నూతన వ్యవహారం సంక్రమించింది ఈ రీతి కథాగానంలో దత్తోపంత్ పట్వర్ధన్ ప్రభృతి కళాకారులు ముఖ్యులు మరాట్వాడా అసెంబ్లీ మాజీ అధ్యక్షులు మాన్యశ్రీ టి సి భారదే గారు ప్రసిద్ధ కీర్తనకారులు

మరాఠీభాషలో హరికథను 'కీర్తన' 'హరికీర్తన' అని సాధారణంగా వ్యవహరిస్తారు. 'కీర్తన' అంటే ఈశ్వరభజనం, నామోచ్చారణం అని అర్థాలు. కథాగాయకుణ్ణి 'కీర్తనకార్' అనీ, 'కథాకార్' అనీ, "హరిదాస్" అనీ పిలుస్తారు. తుకారాం మొదలైన మరాఠీ భక్తకవులు రచించిన అభంగాలను గానంచేసే రీతిని 'హరిపాఠ'మని వ్యవహరిస్తారు ఆధునికకాలంలో 'హరికథ' అన్న పరిభాష ప్రచుర ప్రచారంలో ఉంది.

మారాట్వాడాలోని కథాగాన సంప్రదాయంలో హరిదాస పద్ధతి, వార్కరీ పద్ధతి, రాష్ట్రీయ కీర్తన (జాతీయ హరికథ) అను మూడు భేదాలున్నట్లు పరిశీలకులు భావిస్తున్నారు. మొదటిదానిని నారదీయ సంప్రదాయం అనికూడ వ్యవహరిస్తారు. దీనిని షిర్డిసాయిబాబా మున్నగువారు సైతం ఆమోదించి ప్రోత్సహించారు. రెండవదైన 'వార్కరి' పాండురంగవిఠల పూజానియమానుసారి; భజన సంప్రదాయ పరిపోషక భక్తజన మనోహారి. సామాజిక వికాస కార్యక్రమాలలో ప్రచారసాధనంగా జానపద మాధ్యమం (Folk Medium) గా మహారాష్ట్ర ప్రభుత్వం ఆమోదించిన హరికథనే రాష్ట్రీయ కీర్తనగా పరిభాషించడం జరిగింది. మొదటి రెండూ పరంపరాగత రీతులు; చివరిది నూతనరీతి. ప్రాచీన సంప్రదాయ రీతికి జాతీయ దృక్పథం ప్రేరకం పురాణాదికాలలోని గాథలు, మహాభక్తుల జీవితచరిత్రలు సంప్రదాయరీతికి కథావస్తువులు. గాంధీజీ, శివాజీ వంటి జాతీయ నాయకుల కథలు సాంఘికసంక్షేమ ప్రణాళికా ప్రచారక విషయాలు నూతనరీతిలోని ఇతివృత్తాలు.

వార్కరీ-నారదీయ పద్ధతులు రెండింటి లక్ష్యమూ ఒకటే ఐనప్పటికీ వీటి నిర్మాణ విధానాలు వేరు; నిర్వహణ సాధనాలువేరు. నారదీయ (హరిదాస) పద్ధతిలో పూర్వరంగమనీ, ఉత్తర రంగమనీ నిర్మాణపరంగా రెండు విభాగాలు. వార్కరీ సంప్రదాయంలో ఇట్టి రంగవిభాగం కనపట్టదు.

నారదీయపద్ధతిలో సంగీతం పాలెక్కువ, సహకార వాద్యాల సందడికూడ మిక్కుటం వార్కరీ సంప్రదాయంలో భజనపాలు జాస్తి సంగీతానికి ప్రాధాన్యం నాస్తి నారదీయరీతిలోని పూర్వరంగంలో బ్రహ్మనిరూపణం ప్రధానస్థానమాక్రమిస్తుంది కథాగానానికి వస్తువుగా స్వీకరించిన కథను బట్టి ఈ నిరూపణ తత్త్వం ఆధారపడి ఉంటుంది ఉత్తరరంగంలో అనువదోదాహృతిగా ఏదో ఒక భగవత్కథ లేక భాగవతకథ చోటుచేసుకుంటుంది పూర్వరంగం ఆదర్శవాదానికీ, ఉత్తరరంగం వ్యావహారిక వాదానికీ పరిపోషకాలని చెప్పవచ్చు వేదాలుకూడ కాండద్వయాత్మకాలు, పూర్వకాండను కర్మకాండ అనీ, ఉత్తరకాండను జ్ఞానకాండ అనీ అంటారు

కథాగాన వేళలో అప్పుడప్పుడు కథాగాయకులు, సదస్యులు ఈ ఉభయులూ కలిసి కొనసాగించే నామసంకీర్తన రీతి వార్కరీ పద్ధతిలోని ఒక విశిష్టత 'రామకృష్ణ హరి - రామకృష్ణ హరి', మహారాజ్ జ్ఞానేశ్వర్ మావులీ' అన్న నామ సంకీర్తన పరమైన జయఘోషలు, 'శ్రీ పుండరీక వరదో హరివిఠల', 'శ్రీ జ్ఞానేశ్వర్ మహారాజ్‌కి జయ' 'శ్రీ తుకారాం మహారాజ్‌కి జయ', 'శ్రీ రామదాస్ మహారాజ్‌కి జయ', 'శ్రీగోపాలకృష్ణ మహారాజ్‌కి జయ' వంటి జయధ్వానాలు వార్కరీ పద్ధతిలోని విలక్షణ గుణాలు

నారదీయ పంథకు చెందిన కీర్తనకారులు వేషధారణలో పటాటోపాలకు ప్రాముఖ్య మీరు మన తెలుగు హరికథకులవలె తెల్లటి ధోవతి మాత్రం ధరించి, జరీ ఉత్తరీయాన్ని నడుముకు బిగిస్తారు చేతిలో చిరతలో, తాళం చిప్పలో ధరిస్తారు కాళ్ళకు గజ్జెలుంటాయి వార్కరీ పద్ధతికి చెందిన హరికథా గాయకులు వేషధారణలో ఒక ప్రత్యేకతను ప్రదర్శిస్తారు జరీపగిడీ, మోకాళ్ళదాకా వేలాడే పొడుగుచేతుల బారాబందీ నిలువుటంగీ, జరీకండువా, పెద్ద జరీ అంచుధోవతీ, నొసటిపై నల్లటి తిలకం లేక నామం వీరి వేషంలోని ముఖ్యలక్షణాలు

మహారాష్ట్ర భాషలో రచించబడ్డ హరికథా రచనలు కీర్తన తరంగిణి, కీర్తన సుమనహార్ అన్న పేర్లతో అనేక సంపుటాలుగా వెలువడ్డాయి. రావూజీ శ్రీధర్ గోందశేకర్, ఔంధ్ సంస్థానాధిపతి శ్రీమంత్ బాళాసాహేబ్ పంత్ ప్రతినిధి మొదలైన వారు ఈ సంకలయితలలో ప్రధానులు.

ఈ సంకలనంలోని కీర్తనతరంగిణి ప్రథమ సంపుటిలో ముఖ్యంగా గరుడగర్వహరణ, చంద్రహాస, బభ్రువాహనాఖ్యాన, భద్రాయుచరిత్ర, భీమభక్తి చరిత్ర, మయూరధ్వజ మొదలైన జైమిని భారత కథలు సంకలనం చేయబడ్డాయి. రెండో సంపుటంలో కృష్ణ జన్మ, గణపతిజన్మ దత్తాత్రేయ జన్మ, నృసింహ జన్మ, పరశురామ జన్మ, రామ జన్మ, హనుమజ్జన్మ మొదలైన జన్మ చరిత్రలు కనిపిస్తాయి. మూడో సంపుటంలో ద్రౌపదీ స్వయంవర, దూర్వాసోపాఖ్యాన, యక్షప్రశ్న, సుభద్రాహరణ మున్నగు భారత కథలూ, శబరీ ఆఖ్యాన, శతముఖ రావణ లక్ష్మణశక్తి, రామరాజ్యాభిషేక మున్నగు రామాయణ కథలూ సంగ్రహణం చేయబడ్డాయి. నాల్గో సంపుటంలో యక్ష క్రీడ, ద్రౌపదీ వస్త్రాపహరణ, పాశుపతాస్త్ర మొదలైన భారత కథలూ, కాళియమర్దన, ధ్రువచరిత్ర, రుక్మిణీ స్వయంవర ప్రభృతి భాగవత కథలూ, కబీర్‌మాల్, గోరాకుంభార్ వంటి మహాభక్తుల జీవిత చరిత్రలూ సంకలనం చేయబడ్డాయి. ధేనుదాస జోశీ రచించిన కీర్తన రామాయణం కూడ ప్రచుర ప్రచారాన్ని పొందిన రచన.

మరాఠీకథకు ప్రాణంపోసిన ముఖ్య కవితాసంప్రదాయాలు నాలుగు: తుకారాం అభంగాలు, జ్ఞానేశ్వర్ ఓవీలు, మోరోపంత్ ఆర్యలు, వామన పండితుని శ్లోకాలు. తుకారాం అభంగాలు అతి ప్రసిద్ధాలు. భగవద్గీతకు జ్ఞానేశ్వరకవి మరాఠీభాషలో 'ఓవీ' అనే ఛందంలో సంతరించిన విపుల

వ్యాఖ్యానమే 'భావార్థగీతి.' అనే పేరుతో వెలసింది కర్తృనామాన్ని పురస్కరించుకుని ఈ వ్యాఖ్యానానికి జ్ఞానేశ్వరి' అన్నది వాడుక పేరు ఇది ఇంచుమించుగా పదివేల ఓవీల గ్రంథం మహారాష్ట్రీయ భాగవత ధర్మపంథకు 'జ్ఞానేశ్వరి' పరమ ప్రమాణం, మరాఠీ సంస్కృతికి ఆరోప్రాణం అతి జటిలమైన తత్త్వరహస్యాలను తేటయైన మరాఠీ వాడుక శైలిలో సూటియైన తీరులో జ్ఞానేశ్వరి సమాఖ్యానం చేస్తుంది మెరో (మయూర) పంత్ 'రామాయణ కేకావళి ఆర్యావృత్తాలలో మరాఠీభాషలో తీర్చబడిన రుచిర రచన వామన పండితుని ప్రాస్తావిక శ్లోకాలు ఆర్యా వృత్తాలలో మరాఠీభాషలో రచించబడ్డవి ఇవి ప్రధానంగా భారతకథా సంబంధులు, భక్తి జ్ఞాన వైరాగ్య బోధకాలు ఈ నాలుగు రచనలతోపాటు సమర్థ రామదాసస్వామి రచనలనుకూడా మరాఠీ హరికథకులు తమ కథాగాన సందర్భంలో జోడిస్తుంటారు 'జయజయ రఘునాథసమర్థ' అన్న అంత్య మకుటంగల సమర్థ రామదాసస్వామి రచనలు మరాఠీ కథా గాయకులకు శిరోధార్యాలు

షిర్డీ సాయిబాబా సంస్థాన్‌లో దాసగణూ మహారాజ్, కృష్ణారావు జగేశ్వర్ (భీష్మ) ముఖ్య హరికథకులుగా ఉండినట్లు తెలుస్తున్నది వీరు రామాయణ కథలనేగాక తుకారాం, సాయిబాబా మున్నగు భక్తుల చరిత్ర లను కూడా గానం చేసేవారు గ్వాలియర్ సంస్థానంలో గొప్ప హరికథా గాయకుడుగా ప్రతిష్ఠగాంచిన మోరత్తూర్‌బువా దక్షిణదేశంలో సైతం హరికథలు చెప్పి తమిళ కాలక్షేపరంగాన్ని ఉత్తేజపరిచారు

గ్వాలియర్ బొంబాయి మొదలైన చోట్లకూడ 'కీర్తన' కళను బోధించడాని కనువైన సంస్థలు వెలసి ఉన్నాయి నిర్ణీత కాలంపాటు ఈ సంస్థలలో శిక్షితులై తమ తమ సామర్థ్యాని కనుగుణమైన కీర్తన కళానిధి, కీర్తనకేసరి, కీర్తనపటు కీర్తనభూషణ, కీర్తనరత్న, కీర్తనరత్నాకర,

కీర్తనవిశారద, కీర్తనాచార్య - ఇత్యాది కథాకార పదవీ సూచక బిరుదాలను పొందడానికి వీలుకల్పించబడింది

మధ్యప్రదేశ్ 'ఛత్తీస్‌ఘడ్' ప్రాంతానికి చెందిన 'పుణరామ్' అన్న కళాకారుడు అవలంబించిన రీతి తెలుగు కథాగానానికి చాల దగ్గర పురాణేతిహాసాలలోని ఇతివృత్తాలను ఆయన స్థానికమైన మాండలిక భాషలో ప్రవచనం చేస్తాడు వివిధ పాత్రలను ఒక్కడే పోషిస్తూ కథనం సాగిస్తాడు గోండ్ కథాకారులు మహాభారత కథను గానం చేసే రీతులను గూర్చి ప్రసిద్ధ కళావిమర్శకులు మోహన్‌కృష్ణగారు నిరూపించిన తీరును గమనిస్తే అది దక్షిణదేశపు కథాగానానికి ఎత్తుబిడ్డ అని స్పష్టం కాకపోదు

# వీర గాథలు

సాహిత్యశాస్త్రపరంగా వీరగాథ అన్న పరిభాషా, సాహిత్యశాఖలలో వీరగాథలన్న విభాగమూ పాశ్చాత్య సాహిత్య సంస్కారంవల్ల ఆధునికాంధ్ర సాహితీ శిల్ప సమీక్షకులు కల్పించినవిగా సంభావించడం సత్యదూరం కాదు కథనాత్మకాలూ, గానప్రధానాలూ, జనరంజకాలూ, దేశికథా వస్తుకాలూ అయిన లఘుకృతులకు ఆంగ్ల సాహిత్యంలో 'బాలడ్'(ballad) అని వాడుక ఇంచుమించుగా ఇలాంటి విశిష్ట లక్షణాలు గల వాఙ్మయ మూర్తులను తెలుగులో వీరగాథలని పరిభాషిస్తున్నాం శాస్త్ర ప్రమాణం లేని చోట, సంప్రదాయసిద్ధమైన విశ్వాసాన్ని ప్రమాణంగా అనుమతించడం అనుభవైకవేద్యం

వీరగాథలు జానపద విజ్ఞానంలోనే శబ్దరూప విభాగంలో కథాసహిత కవితలో అంతర్భాగమైన అనిబద్ధ దేశి పద్ధతికి చెందినవి వీటిని సాహిత్య వీరగాథలనీ, సాంప్రదాయిక వీరగాథలనీ రెండు భాగాలు చేయవచ్చు కేవలం వాగ్రూప వ్యవహారం కలిగి మౌఖికంగా వీరగాథా గాయనుల వాడుకలో పరంపరగా తరలివస్తున్న వాటిని సంప్రదాయ వీరగాథలని చెప్పవచ్చు మౌఖిక సంప్రదాయంలో వాడుకపడ్డ వీరగాథల అందచందాలకు మురిసి ముచ్చటపడ్డ అనంతరకివులు దేశికళాప్రియులు తీర్చిన అక్షర రూపావతారాలను సాహిత్య వీరగాథలని పేర్కొనవచ్చు

పరిచితమైన దేశికథా వస్తుకత వీరగాథల ఒక లక్షణం ఉచ్చారణ భాగాల పునరుక్తి మరొక లక్షణం వీరగాధ అవిజ్ఞాత కర్తృకం కానీ, సామూహిక కర్తృకం కానీ అయి ఉండవచ్చు ఒక్కొకసారి అప్రధాన కర్తృకమున్నూ కావచ్చు కథన రూపతా, కథాఘటకాల విశిష్టతా, కల్పనా

చమత్కృతీ, గానయోగ్యతా జనరంజక శైలీ, మౌఖిక ప్రచారము, విశ్వజనీనతా, విషాదాంతతా, వీర రస ప్రాధాన్యమూ జానపద మాధ్యమికాలైన వీరగాథల ప్రధాన లక్షణాలు

వ్యక్తిపరమైన విక్రాంతియె వీరం శృంగారాది నవరసాలలో వీర రసం ప్రచురస్థానీయం ఇంద్రుడు దీనికి అధిదేవత అనీ, ఉత్సాహం దీనికి స్థాయీ భావమనీ ఆలంకారికుల నిరూపణం ఉత్సాహవర్ధనమె వీరరసానికి భూమిక లోకోత్తర కార్యసాధన ప్రవణమైన ఉత్కటావేశపు చిత్తవృత్తి విశేషమే ఉత్సాహం దాన దయా ధర్మ యుద్ధాలు లోకోత్తర కార్యాలు ఉత్సాహ స్థాయి యొక్క భావోపాధిని బట్టి దానవీరం, దయావీరం ధర్మవీరం, యుద్ధవీరం, విద్యావీరం మున్నగునవి వీరరసాంతర్గత విభాగాలని సాహిత్య కోవిదుల నిర్ధారణం దాన వీరం, దయ వీరం, ధర్మవీరంలోని భాగాలుగా రూపించవచ్చని కొందరి మతం స్వార్థత్యాగానికి ప్రతీక దాన వీరం దాన వీరమో యుద్ధ వీరమో పరాంకోటికెక్కిన వీర రసం అంగి రసంగానూ, కరుణాదులు అంగరసాలుగానూ రూపెత్తిన జానపద గాథలను వీరగాథలని స్థూలంగా నిర్వచించవచ్చు

వైదిక వాఙ్మయంలో 'గాథ' అంటే కథనరూపక గేయమనీ, గాథిక అంటే ఐతిహాసిక గీతమనీ అర్థం పాడు, ఆలాపించు అనే అర్థాలుగల 'గై' ధాతుజన్యాలు గాథ, గాథిక అన్నవి 'గాథకం గాతవ్యం స్తోత్ర'మ్మని నిర్వచనం 'గై ధాతోః ఉషికృషి గర్తిభ్యస్థన్ ఇతిథన్ ప్రత్యయః గాథా' అని పాణినీయ నిష్పత్తి గాథలను ఆలాపించే వ్యక్తికి గాథకుడనీ, గాథా కారుడనీ పాణినీయ వ్యవహారం గాథ అంటే ప్రాకృతభాషలో గాన ప్రధానమైన ఛందోభేదమని తాత్పర్యం వేదభాషలో గాథాపతి అనీ, గాథా శ్రవుడనీ అన్వర్థంగా బహువారాలు పరికీర్తించబడ్డ ఇంద్రుడు వేదకాలం నాటి మహావీరులలో ఒకడనీ, అగ్ని వరుణాదులను ఇంద్రునితోపాటు ఆనాటి

వీరవరులుగా పేర్కొవచ్చునీ వైదికవాఙ్మయ పరిశీలకుల భావన తిమి రంతో సమరంసల్పి వెలుగును తెచ్చినవాడనీ, మబ్బులతో పోరాడి వానలు కురిపించి ధనధాన్య సమృద్ధికి తోడ్పడ్డవాడనీ వృద్ధశ్రవసుడైన ఇంద్రు నకు పెద్ద ప్రశస్తి

గథలు ప్రాచీనకాలం నుంచీ ఉన్నట్లు వేదవాఙ్మయం మనకు ప్రమాణం వైదిక వాఙ్మయంలో అక్కడక్కడ పేర్కొఒడ్డ ఆరణ్యక గేయాలు, ఆర్చికాగాన సంప్రదాయాలూ, కారవ్యగాథలూ గానప్రధానా లైన ఒక రీతి కథాప్రసంగాలు కావచ్చని సంప్రదాయ విదుల అభిప్రాయం అశ్వమేధయాగానికి ఉపాంగాలుగా నిరూపించబడ్డ పారిప్లవాలన్న ఆఖ్యాన కాలలోనూ, ఉపనిషత్తులలోనూ బ్రహ్మసూత్రాలలోనూ ఉట్టంకించబడ్డ గానరూపకి కథనాలూ ఒక మోస్తరు కథాప్రసంగాలే సత్ర యాగాది యజ్ఞకర్మలలో పరిషత్సన్నిధిని ప్రవర్తితమయ్యే ఉద్గాతృగానం ఉపనిషత్తు లలో అనువర్ణితమైంది 'తస్యయజ్ఞే జగౌగాథా నారద స్సుమహాతపాః' (1-23-26) మహాతపస్వియైన నారదుడు కార్తవీర్యుని యజ్ఞంలో గాథ లను గానం చేశాడు' అని విష్ణు ధర్మోత్తరం రూపిస్తున్నది యజ్ఞక్రియోత్స వాలలో వైతాళికులు భగవద్యశోగానం చేసినట్లు శ్రీమద్భాగవతం సాక్ష్య మిస్తున్నది

వీరగాథాలాపకులు రామాయణకాలం నాటికే ఉన్నారనడానికి ఆదికవి ఆచార్యకంలో సుశిక్షితులైన రామాయణ గాథకులు కుశీలవుల ఉనికి ఒక ఆధారం అవంతీ, ఉజ్జయినీ, శ్రీవిశాలపురీ పరిసరాలలో ఉదయన కథాకోవిదులైన గ్రామవృద్ధులు ఉన్నట్లు కాళిదాసుని మేఘదూత కథనం ముగ్ధభక్తుల గాధావళిని 'రోళ్ళ రోకళ్ళ పాటలుగాగట్టి పాడెడివారు, ప్రస్తు తోక్తుల గద్యపద్యకావ ములు - విస్తారముగజేసి వినుతించువారు' ఉన్నట్లు

బసవపురాణ చిత్రణం ప్రేమాభిరామ - క్రీడాభిరామాల కాలంనాటికే వీకవీరా మహాదేవి ఎదుటనిల్చి పరశురాముని కథలెల్ల వాద్యవైఖరీ ప్రౌఢి పాడిన జమిలిక పాటల బవనీలు, పల్లెనాటి ఏకాంగవీరుల పౌరుష చరితలను ద్విపద ప్రబంధమున వీరగుంఫిత రీతి వినిపించిన వీరగాథాగాయనులు వెలసినట్లు ఈ గ్రంథాల అనువర్ణనమే మనకు పరమప్రమాణం అనంతర కాలంలోనూ వీరగాథాశ్రవణం తెలుగునాట ప్రచురంగా ఉన్నట్లు 'ఇంటిని తిమ్మరాజుకత, ఇంటి యీర్లకతా వెసంగముల్, యింటిని పాదుసా యిబవ, మింటిని నాయకురాలి శౌర్యమెట్టుంటదా , మాలకొండడి కతొక్కటి యిన్గల బాగ్గెమింక యెప్పటికి గల్గునో యనుచు బల్కును మూర్ఖుడు ' అన్న చంద్రశేఖర శతకపద్యం సాక్ష్యమిస్తున్నది గొల్ల పౌరాణికులు ప్రబలులైనట్లూ, 'గద్య పద్య విచిత్ర కవితలు కొఱగావు - గొలసుద్దుల కతల్ పెల్లుమీరి'నట్లూ కూచిమంచి తిమ్మకవి కుక్కుటేశ శతకంలో వాపోయాడు కాటమరాజు కథానులాపాలలో పేరువహించిన సుద్దులగుడారం వారిని గూర్చి-

' కొమ్ములు వీరణాలు జగి గుల్కెడు వ్రాతల కృష్ణలీలలం
గ్రుమ్మ గుడార్లు వీరుడగు కాటమరాజు కథానులాపముల్
ఒమ్మన పుస్తకాలు ముఖపట్టిక కట్టురుమాలులున్ నెఱా
సొమ్ములు నామముల్ వెలయు సుద్దుల గొల్లలు వచ్చిరెంతయున్
(2-87)

అని హంసవింశతి పేర్కొంది ఇక, ఊరూరా తిరిగి వీరగాథలను పాడి పొట్టపోసుకునే సంచారగాథకులు, వీర విద్యావంతులు తెలుగునాట నేడు కూడ కోకొల్లలు

వృద్ధాచార వినోదులైన మానవులకు గత స్మృతులు ఆనంద వీచికలు, భవిష్యద్యుగాల జనులకు మార్గసూచికలు పూర్వతరాలనాటి

స్మృతులనూ, తమ తాత ముత్తాల వీరోచిత వృత్తులనూ కథాకథన రూపంగా ఉత్తరోత్తర యుగాలనాటి జనులకు ఉత్తేజకారకంగా అందించడమన్నది అన్ని దేశాలలోనూ, అన్ని కాలాలలోనూ కనిపించే విశ్వజనీన లక్షణం ఆయా మానవ సమాజాల బలవద్విరోధులతో పోరాడి విజయమో, వీరశయనమో పొందినవారూ, క్రూరమృగాల బారినుంచీ, ప్రకృతి భీభత్సాలనుంచీ ఆర్తులను రక్షించినవారూ, వీరవ్రతాచారులుగా లోకసంగ్రహార్థం వీరమండపాలలో గండకత్తెరలిచ్చిన వారూ అగ్నిగుండాలలో దూకి ఆత్మాహుతి సలిపినవారూ జాతికి ప్రాతః స్మరణీయులుగా సంభావితులు పలుగాకి ముకలు దేశాన్ని ఊచముట్టుగా దోచినప్పుడూ దేవకులాలను నిట్టనిలువునా కొల్లగొట్టినప్పుడూ ఆలించే పాలించే నాథులు లేక, ఆర్చే తీర్చే అయ్యలులేక ఆబాల గోపాలం ఆలగోడు బాలగోడుగా అలమటించిన గడ్డుగడియలలో కరుణించి కాపాడుమని కనిపించని దేవుడికీ, ఆపదమొక్కుల ఆసామికీ పెట్టిన మొర్ర సింహాద్రి నారసింహ - శత్రు సంహారాది శతకాలలో మనకు వినిపిస్తుంది కట్టెదుట అక్రమాలు, అన్యాయాలు, దోపిడీలు దురాగతాలు సాగుతున్నప్పుడు మనసుగల త్యాగధనులూ, మగసిరిగల మానధనులూ చూస్తూ చూస్తూ ఊరుకోలేదు తిరగబడి విరగబొడిచి విజయలక్ష్మినో వీరలోకాలనో వరించి ఒడాకితాబులందిన ఘట్టాలూ లేకపోలేదు

వీరతాంబూలా లందుకుని, వీరగంధా లలదుకుని, వీరతిలకాలు దిద్దుకుని, రక్షాదీక్షితాలైన వీరతాయెత్తులూ, పరవీరముద్రాంకితాలైన వీరమద్దియలూ ధరించి వీరపారణచేసి, ఉత్తేజకారకంగా పురావీర గాథాస్మారక నృత్యవిశేషాలైన వీరజయంతికలను తిలకిస్తూ, వీరభేరీ కాహళనాదాలను ఆలకిస్తూ, ముందూవెనకా సత్యసంగరులైన అంగరక్షకులూ, ఉభయపార్శ్వాల శ్రేణీమహత్తరులూ బలని కొలువగా ఉద్దీపన కారకంగా వీరగీతా లాలపించే చారణ వైతాళికగణం వెంటరాగా సాంగ్రా

మిక విధి నిషేధా లెరిగిన వృద్ధుల సమయోచిత సూచనలు స్వీకరిస్తూ కదం తొక్కుతూ 'రణ పెండ్లికొడుకు'లై రణరంగానికి కదలివెళ్ళి ప్రత్యర్థి దళాలను ప్రతిఘటించినవారూ, ప్రతిస్పర్ధివర్గాలతో ప్రతిఘటించినవారూ చరిత్రలో వేలాదిమంది మనకు కనిపిస్తారు మడమదిప్పని సమరరతులకూ, మాటతప్పని సత్యవ్రతులకూ చావూ, జయము సరికి సరి ఇలా వీర మరణం పొందిన వీర వ్రతస్థుల విక్రమ కార్యప్రస్థానాలకు స్మృతి చిహ్నాలుగా వెలసిన శిలాప్రతిమలు 'వీరగల్లు'ల పేర తెలుగునాట నేటికీ వెదురుమదురుగా దర్శనమిస్తాయి 'రణరంగం కానిచోటు భూస్థలమంతా వెదికిన దొరకదు గతమంతా తడిసె రక్తమున కాకుంటే కన్నీళ్ళలతో' అన్న కవి వాక్కు అక్షరాలా వేదవాక్కు

వీరాచారాలూ, వీరోత్సవాలూ, వీరుల తిరుణాళ్ళూ తెలుగువారికి కొత్తలు కావు వీర పత్నులకూ, వీరప్రసూతలకు కొదవలేని కాణాచి తెలుగుమాగాణం వీరారాధనం ఈ జాతికి ఉగ్గుబాలతో రంగరించిపోసిన విద్య జోలపాట రూపంలో అమ్మ యశోదమ్మ సీతాపహరణ కథను ఆలాపించగా ఉయ్యాలలోని బాలగోపాలుడు 'ఏదిరా లక్ష్మణా! విల్లు?' అని కలవరించాడని కథలలోని కథ అరివీర భయంకరులూ, లోకకల్యాణ కాములూ అయిన వీరాగ్రేసరుల సమరాంగణ విహరణలను అభినందించని జాతీ, వారి వీరమరణాలకు ఆక్రోశించని జాతీ ఉండదు ఈ అభినందనకూ, ఈ ఆక్రోశానికీ, వాగ్రూపమే వీరగాథ

అధర్మాన్నీ, అన్యాయాన్నీ అందరూ అడ్డుకోలేకపోవచ్చు, అన్నివేళలా అదుపులో పెట్టలేకపోవచ్చు అనాథలనూ, అభాగ్యులనూ ఆదుకోలేకపోవచ్చు అక్రమాలనూ, కువిక్రమాలనూ పరికించి ఇదేమని నిగ్గదీసి అడిగే గుండెబలం కండబలం అందరికీ లేకపోవచ్చు ఇట్టి నిస్సహాయ స్థితిలో కవితాస్పర్శగల కళా హృదయాలు గళమెత్తి కావించిన ఆలాపనా,

కలమెత్తి కై సేసిన అక్షరార్చనా వీరగాథల సృష్టికి శ్రీకార రచన తుదకు దుర్మరణం పాలైన దుస్సాహసులను సైతం సాహసాంకచరితులుగా కైగట్టి కైవారాలు చేయడం కూడా కద్దు సామాన్య పరిశీలకులకి ఉల్లాస శాలితా, ఉత్సాహశీలతా విడ్డూరంగా భాసించవచ్చుగాని, జానపద స్వభావంలోని విపరీత లక్షణాలలో ఇదొకటి! దుర్మరణం మాటున ఆ యా వ్యక్తుల ఆకతాయి చేతలు, దుందుడుకు చేష్టలు మరపునబడతాయి కాబోలు!

పరిమాణాలనుబట్టి వీరగాథలను లఘు వీరగాథ (balladlıng) లేక వీర కథానిక అనీ, వీరగాథ (ballad) అనీ, వీరగాథాచక్రం (ballad cycle) అనీ మూడు విధాలుగా పరిభాషిస్తున్నారు యుక్తిప్రమాణ కుశలులైన పరిశోధకులు ఒకే వ్యక్తి విక్రమక్రమానికి సంబంధించిన ఒకానొక ఘట్టాన్ని పట్టిచూపే అల్పపరిమితిగల పాటను లఘువీరగాథ లేక వీరగాథానిక అనవచ్చు ఉయ్యాలవాడ దొరవారి నరసింహారెడ్డి పాట, కోటప్పకొండ చిన్నపరెడ్డి పాట, గడేకల్లు బొబ్బిళ్ళ నాగిరెడ్డి పాట, గాండ్లోళ్ళ కోరుమన్నపాట, గుర్రాల గోపిరెడ్డి పాట జూటూరి చిన్నాగిరెడ్డి పాట, రాచోటి రామయ్యపాట, రేనాటి సీమ మానందిరెడ్డి పాట మొదలైనవి లఘు వీరగాథల కుదురునకు చెందినవి ఇవి కపిలె పాటలుగా, కలుపు తీత పాటలుగా కోలాటం పాటలుగా ఉత్సవాంకాలుగానీ ఉత్సాహాంకాలు గానీ జానపదులు నోరారా పాడుకునే వీరగాథానికలు వీటి ఆలాపనకు పట్టే కాలం ఒకటి రెండు నిమిషాలనుంచీ అరగడియకు లోపు మచ్చుకొక పాటలో కొంత

'కొడుకా మానందిరెడ్డి యీ యిలలో బత్తెము దీరెనో
రాజా మా నందిరెడ్డి

సీలికోటు దొడుక్కొని నిల్వుచెత్రీ బట్టుకోని
కట్టమీదా బోతువుంటే కదిరి తేరనుకొంటిర కొడుక
బంగారి కొడుక వయ్యారి కొడుకి
రాజా మా నందిరెడ్డి

ఊరూరా, ఇల్లిల్లూ తిరిగి బిచ్చమెత్తుకునే సంచారగాథకులు ఎర్ర గొల్లలూ, కొమ్ములవారూ, బవనీంద్రూ, బీరన్నలూ, శారదకాండ్రూ మున్నగు వీరవిద్యావంతుల నోళ్ళలో ఊపిరిపోసుకుంటున్న వీర గాథలు అనేకం బతికి బట్టగట్టాయి వీటిలో చాల పాలు అక్షర రూపమెత్తాయి, కొన్ని అచ్చుపడ్డవికూడ ఆరె మరాఠీల కథ, కాంభోజరాజు కథ, కుమార రాముని కథ, దేసింగురాజు కథ, బంగారు తిమ్మరాజు కథ, బుడ్డా వెంగళ రెడ్డి కథ, సదాశివరెడ్డి కథ, సర్వాయి పాపని కథ మొదలైనవి వీరగాథలుగా పేర్కొన దగ్గవి పెద్దాడ నాగేశం కొడుకు మల్లేశం రాసిందే ఒకటీ, పార్లపల్లి నరసింహాచార్యులు చెప్పింది ఒకటీ - ఈ రెండు బొబ్బిలి కథలూ వీరకథలలో మొదటి వరుసకు చెందినవి

పేరంటాళ్ళ ధర్మవీరానికి సంబంధించిన వీరగాథలు కూడా ఎన్నో ఉన్నవి అకాలమరణమో హఠాన్మరణమో చెందిన పతితోపాటు చితి నెక్కి (ఈ నాడిది దురాచారంగా పరిగణన) సౌమంగల్య వివర్ధనం పేర సాగుమానం - సహగమనం - చేసిన ధర్మాచార ధీరలగాథలలో సామర్ల కోట కామమ్మ కథ, కొక్కంటి పాళయం గూటిబయలు తిమ్మక్క కథ జూటూరి చిన్నాగమ్మ కథ మండపేట పాపమ్మ కథ, కళింగసీమ సన్యాసమ్మ కథ ప్రసిద్ధమైనవి ఆడబిడ్డల ఆరళ్ళకో అత్తమామల పెత్తనాలకో, కట్టుకున్నవాడి కసాయి వర్తనకో ఏలికల మాలికుల కామ దాహానికో పలుగాకి లోకుల నిందాపనిందలకో 'హావతి'-ఆహుతియైన సతీమ తల్లుల కన్నీటి గాథలలో తిరుపతమ్మ కథ, లక్ష్మమ్మ కథ, నిదానంపాడు

అమ్మోరమ్మ కథ ముఖ్యమైనవి మాయల మరారీ మాయలకు చిక్కిన కన్న కొడుకు శక్తి యుక్తుల వల్ల గండం గడచి గట్టెక్కిన బాలనాగమ్మ కథ కూడా ఇప్పట్టున పేర్కొదగ్గది

వీర గాథా చక్రంలో కాటమరాజు కథ పల్నాటి వీర చరిత్ర ముఖ్యమైనవి ఇవి ఆ యా వీరుల - వారి పరంపరా సంబంధుల తరతరాలకు సంబంధించిన కథాంతరాల సంపుటాలు అగుమంచి కథ, ఆవుల వలరాజు కథ, ఎర్రగడ్డపాటి పోట్లాట, కరియావుల కథ, పాపనూకి కథ, భట్టు రాయబారం, భక్తిరన్న కథ మున్నగు గాథల సంపుటీకరణమైన కాటమరాజు వీరగాథా చక్రానికి 'యాదవ భారత'మని మరో పేరు కోడి పోరు, గురజాల యుద్ధం, మండాది వలస, మందపోటు, కల్లు ప్రతిష్ఠ, బాలుని యుద్ధం మొదలైన వీరగాథల క్రోడీకరణమైన పల్నాటి వీర చరిత్రకు 'పల్నాటి భారత'మనీ,'పల్నాటి భాగవత'మనీ వాడుకపడ్డ మారు పేర్లు గంగుల పినవెల్లయాదులు కాటమరాజు కథల కర్తలు కొండయ మల్లయలు పల్నాటి వీరచరిత్రకారులు కవిసార్వభౌముడు శ్రీనాథుని చేయి కూడ ఇందులో ఉందని కొందరి అభిప్రాయం 'శౌర్యంబు పుణ్యంబు సమకూరినట్టి పలనాటి వీరుల భాగవతంబు' తన కంకిత మీ వలసిందని శ్రీనాథకవి రాజును అర్థించాడట మాచెర్ల చెన్నకేశవస్వామి ఇందలి భోగాములు నిర్ధరించడానికి బలమైన ప్రమాణాలు చాలినన్ని లవు ఈ గాథా చక్రాలలో కనిపించే వీరులు అవతారమూర్తులుగా ఆరాధ్యదేవతలుగా ఏటేటా నిర్ణీత దినాలలో నేటికీ స్థానికుల కొలుపులలో కొలుపు తీరుతున్నారు

వీరగాథలలో కథ ఒక వంతు, కల్పన పది వంతులు ఇందలి వాస్తవ ఘటనలు మచ్చరివిత్తనమంత, వాటిచుట్టూ అల్లిబిల్లిగా అలుకపోయిన అతిలోక వ్యక్తులూ, అతీంద్రియ శక్తులూ, అద్భుత కథనాలూ అభూత కల్పనలూ ఆకస్మిక పరిణామాలూ, హఠాత్సంభవాలూ మహావృక్షమంత!

జానపదులను అమితంగా ఆకర్షించి అలరించే వీరగాథా పరికల్పనా ప్రక్రియలోని విచిత్ర శిల్పమిదే యథార్థ ఘటనలూ, సహజసన్నివేశాలూ జానపదులకు ససేమిరా ఇంపు నింపవు గోరంతలు కొండంతలుగా చేసి చూపిస్తే తప్ప వారి గుండెలకు తృప్తి లేదు అదృష్ట పూర్వాలు, ఆకాశ గమనాలు, గండ భేరుండాలూ, గజకర్ణ గోకర్ణ విద్యలూ, పరకాయ ప్రవేశాలూ, పాతాళ హోమాలూ, భేతాళ మహిమలూ, మంత్ర దండాలూ, మాయల మాంత్రికులూ కథాకథనంలో కనిపించకపోతే జానపదుల దృష్టిలో అది కథే కాదు, అది కథనమే కాదు

శిష్ట సాహిత్యంలోని చారిత్రక రచనలకు మూల మూర్తులైన వీర గాథలలో చాలాపాలు విషాదాంతాలు విధివంచితుడైన మానవుని నిస్సహాయతను పరికించి 'నరుడి దేముంది, అంతా నారాయణమూర్తి లీల' అనుకుంటారు జానపదులు 'బలీయసీ కేవల మీశ్వరాజ్ఞా' అన్నట్లు విషాద యోగంలోకి వెళ్ళిపోతారు చివరికి వారికి మిగిలేది విషాద సమ్మిశ్రితమైన భావశబలత ఐనప్పటికీ పురావీరగాథా సంస్మరణం వల్ల జానపదులు ఉత్తేజం పొందుతూనే ఉంటారు

# తెలుగు ప్రాచీన స్థితి

ప్రకృతికీ, మానవ ప్రకృతికీ మార్పు సహజలక్షణం మానవుల భావ ప్రకటన సాధనాలలో ప్రధానమూ, ప్రగతిశీలమూ ఐన భాషపట్ల ఈ మార్పు అన్నది మరింత సహజం మంచి మార్పు వికాసానికి మారు పేరు భారతీయ రాజ్యాంగం గుర్తించిన మొత్తం పదిహేను భారతీయ భాషలలోనూ, నాలుగు దక్షిణాది భాషలలోనూ తెలుగు ఒకటి దీనికి తెనుగు, ఆంధ్రం అనికూడ ప్రచురవ్యవహారంలో ఉన్న పర్యాయ వాచకాలు తెలుగు నాటనూ, భారతదేశంలోని ఇతర రాష్ట్రాలలోనూ, ఫిజి, బర్మా, మలేషియా, మారిషస్ మున్నగు పరాయి దేశాలలోనూ సుమారు ఆరుకోట్ల మంది దీనిని మాతృభాషగా వ్యవహరిస్తున్నారు భారతీయ భాషలలో హిందీ తరువాత అధిక సంఖ్యాకులైన వ్యవహర్తలు కలిగిన భాషకూడ తెలుగే! దేశ భాషలందు తెలుగు లెస్స అనీ, ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్ అనీ ఇంటా బయటా నిస్తుల ప్రశస్తిని పొందిన ఈ భాషకు వెయ్యేళ్ళ ప్రామాణిక సాహిత్య చరిత్ర ఉంది

అయితే దీని పుట్టు పూర్వోత్తరాలను గురించి వివాదాలు కొన్ని లేకపోలేదు ఆర్య భాషలని వ్యవహరించబడుతున్న సంస్కృత ప్రాకృత భాషలనుంచి తెలుగు పుట్టిందని పరంపరగా తరలివస్తున్న అభిప్రాయం 'జనని సంస్కృతంబు సకల భాషలకు', 'తల్లి సమస్త భాషలకు దైవత భాషయ', తల్లి సంస్కృతంబె యెల్ల భాషలకును' - మొదలైన ఉద్ధరణలు మనకు కొత్తలుకావు తెలుగు ఆర్య భాషాజన్యం కాదనీ, ద్రావిడ భాషలని వాడుక పడిన తమిళం, కన్నడం, మలయాళం మున్నగు దక్షిణ భారత దేశీయ భాషలకిది జ్ఞాతి భాష (cognate language) అని రాబర్ట్

కాల్డ్వెల్, హెచ్ గుండర్ట్, యూల్ బ్లాక్, యం బి యెమెనో, థామస్ బరో మొదలైన పాశ్చాత్య విద్వాంసులూ, యల్ వి రామస్వామి అయ్యర్, కె వి సుబ్బయ్య, కోరాడ రామకృష్ణయ్య, గంటి జోగి సోమయాజి తీనం శ్రీకంఠయ్య వజ్ఝల చిన సీతారామస్వామిశాస్త్రి, భద్రిరాజు కృష్ణమూర్తి ప్రభృతి దేశీయ పరిశోధక పండితులు ప్రమాణోప పత్తిసంకలితంగా చేసిన నిర్ధారణం ఆర్యభాషా ప్రతిపాదనను సమ ర్థించిన జి యు పోప్, చిలుకూరి నారాయణరావు ప్రభృతుల వాదాలు నిర్యుక్తికాలై నందున తిరస్కరించబడ్డాయి

తెలుగు లాక్షణికులలో ప్రసిద్ధుడైన కేతన తన ఆంధ్ర భాషా భూషణంలో 'తల్లి సంస్కృతంబె యల్ల భాషలకును' అని ఒకవైపు సంస్కృతభాషా ప్రాధమ్యాన్ని ప్రచురపరిచే సామాన్య సూత్రాన్ని ప్రతి పాదిస్తూ 'దానివలన కొంత కానబడియె - కొంత తానకలిగె, అంతయు నేకమై - తెనుగు బాస నాగ వినుతికెక్కె' అని మరోవైపు తెలుగు పృథ గస్తిత్వాన్ని సమర్థిస్తూ వివరణరూపమైన విశేష విధిని అనుబంధించడం మనం విస్మరించకూడని విషయం సంస్కృతం ఆద్యప్రకృతి అనీ, ప్రాకృతం ద్వితీయ ప్రకృతి అనీ శాబ్దికుల పరిగణన ప్రకృతి ద్వయ నిరపేక్షంగా తెలుగు తనంత తానుగా కొంత ఏర్పడింది, సంస్కృతం ప్రాకృత భాషలతోడి సంసర్గ సంబంధంవల్ల తత్సమ తద్భవ రూపమైన శబ్దసిద్ధి తెలుగున కొంత కలిగింది ఆ కొంతా ఈ కొంతా, అంతాకలిసి ప్రవృత్తిరూపంగా ఏకమై తెనుగుబాసగా రూపుదాల్చిందని శాస్త్రీయరీతిలో కేతన ప్రతిపాదనను వ్యాఖ్యానించడం యథార్థ కథనమవుతుంది తనంతతానుగా ఏర్పడిందన్న తెలుగు నందలి ఈ దేశ్యభాగం సంస్కృత ప్రాకృత భాషలతో జన్యజనక సంబంధం లేనిది, తమిళం కన్నడం మున్నగు సోదర ద్రావిడ భాషలతో సజాతీయ సంబంధం కలది

ఇటీవల దేశ విదేశాలలో ద్రావిడభాషలపరంగా జరుగుతున్న కృషిసైతం కాల్డ్వెల్ ప్రతిపాదనకు అదనపు బలాన్ని చేకూర్చింది అందుచేత, తెలుగు ద్రావిడభాషా కుటుంబానికి చెందిందన్న ప్రతిపాదన నేటికీ చివరిమాటగా - సిద్ధాంతంగా - చెలామణీ అవుతూ స్థిరీకరించ బడింది ద్రావిడవిజ్ఞానం (**Dravidology**) గూర్చి విశ్వవ్యాప్తంగా కొనసాగుతున్న విస్తృత పరిశోధనారీతి ఈ ప్రాతిపదికమీదనే ఆధారపడి ఉంది పుట్టుకననుసరించి యోజిస్తే నేటి ద్రావిడభాషలన్నింటికీ మాతృకగా సంభావితము, ఊహాసిద్ధము ఐన మూలద్రావిడభాష (**Proto-Dravidian**) తెలుగునకు కన్నతల్లి ఇది నిసర్గ సంబంధం అంటే ఈ రెండు సంబంధాలవల్లా ఇద్దరు తల్లుల ముద్దుబిడ్డగా తెలుగు ప్రవర్తిల్లుతూ వచ్చిందని తాత్పర్యం భౌగోళికంగా చూస్తే తెలుగుమాటాడే ప్రధాన ప్రాంతం ఆర్య - ద్రావిడభాషా వ్యవహార ప్రాంతాలకు నట్టనడుమ నెలకొని ఉంది పుట్టుక పెంపకాలననుసరించి ద్రావిడభాషాగతమైన మాధుర్యమూ, ఆర్యభాషా సహజమైన గాంభీర్యము చక్కగా సగంపాళ్ళతో మేళవించిన విశిష్టగుణం తెలుగునకు సంక్రమించిందని కొందరు భావించడం కద్దు

తెలుగుభాషా ప్రాచీనస్థితినీ వికాసాన్నీ నిరూపించడానికి ఆ యా యుగాలకు చెందిన శాసనాలలోని భాషా సామగ్రి ముఖ్యమైన ఆధారం ఒకొక్క యుగంలోని భాషాధ్వనులూ వర్ణాలూ, సంధి నియమాలూ, ధాతు ప్రత్యయ నిర్మాణం, పదరచన సమాస పరికల్పన వాక్యవిన్యాసం మొదలైన వేర్వేరు అంతరువులలో వ్యాకరిస్తే తెలుగుభాషా స్వరూపం తేటతెల్లం అవుతుంది ఈ శాస్త్రీయ పరిశీలనారీతిని ఒక నిర్దిష్ట యుగానికి పరిమితంచేస్తే దానిని వర్ణనాత్మక పద్ధతి లేక సమకాలిక/ఏకకాలిక పద్ధతి (**Descriptive or Synchronic method**) అని అంటారు పూర్వ పూర్వయుగాలలోని భాషాస్వరూపం ఉత్తరోత్తర యుగాలలో ఎలా

మార్పుచెందిందీ, ఈ మార్పు ఒక నియమబద్ధమైన పద్ధతిలో ఎలా ప్రవర్తిల్లిందీ నిరూపిస్తే అది చారిత్రక లేక ద్వైకాలిక/భిన్నకాలిక (Historical or Diachronic) పరిశీలనమవుతుంది ఆ యా యుగాలలో ప్రవర్తితమైన పరిణామాలకు కారణాలు ఆ భాషాపరమైన అంతర్నిహిత శక్తులా ? సంసర్గంలోని పరిభాషల ప్రభావమా? అనీకూడ సమీక్షించవలసి ఉంటుంది అనుదినం మారుతున్న అవసరాలనుబట్టి భాషలలో మార్పు రావడం తప్పనిసరి ఈ కోణాలనుంచి పరిశోధనను నిర్వహిస్తే తెలుగుభాష స్థితిగతులు కొంతవరకు బోధపడతాయి

తెలుగుభాష తనకు మాతృక ఐన మూలద్రావిడభాషకు ఎంతకాలం దాకా మాండలికంగా ఉండిపోయిందీ ప్రత్యేక భాషగా స్వతంత్ర ప్రతిపత్తిని ఎప్పుడు సంతరించుకుందీ స్పష్టంగా నిర్ధారించడానికి ప్రత్యక్ష ప్రమాణాలు లేవనే చెప్పాలి క్రీ శ 200 నాటికే తెలుగుభాష వాడుకలో ఉన్నట్లు లిఖితరూప సాక్ష్యాలు కోకొల్లలుగా లభ్యమవుతున్నాయి పైన పేర్కొన్న కాలానికి పూర్వం తెలుగుభాష ఉందా? ఉంటే ఎప్పటినుంచి ఉంది ? ఏ రూపంలో ఉంది ? మున్నగు సవాలక్ష సందేహాలకు సరియైన సమాధానాలు చెప్పడం అంతసులువైన పనికాదు ఇలాంటిస్థితిలో విషయ నిర్ధారణకు ప్రత్యక్ష ప్రమాణాలమీదకాక, అనుమాన ప్రమాణాలమీద ఆధారపడక తప్పదు తెలిసినవి ఆధారంగా తెలీని విషయాలను ఊహించి ఒక క్రమపద్ధతిలో రూపించి ధ్రువపరచడమన్నది చరిత్రమూ శాస్త్రము సమ్మతించిన పద్ధతి

క్రీ శ 200 సం లకు పూర్వదశకు చెందిన తెలుగు అస్తిత్వాన్ని స్థాపించడానికి ఉపకరించే అనుమాన ప్రమాణాలను ముఖ్యంగా మూడింటిని పేర్కొనవచ్చు క్రీ పూ పదో శతాబ్దినాటిదిగా పరిగణించబడుతున్న ఐతరేయ బ్రాహ్మణంలోని 'ఏతే ఆంధ్రాః పుండ్రా శబరాః పుళిందామూ

తిబా ఇత్యృదంత్యా బహవో భవంతి' అన్న ఉద్ధరణ యందలి 'ఆంధ్ర' శబ్దం జాతిపరంగా ప్రయోగించబడడం వల్ల ఆ జాతి వాగ్రూప వ్యవహార మొకటి - దానిని తెలుగు అనండి ఆంధ్రమ ండి ఆ నాటికే ఉండి ఉండా లని ఊహించడం సత్యదూరం కాదు ఒకవేళ ఐతరేయ బ్రాహ్మణం ఇంకా ప్రాచీనతమమని ఎవరైనా వాదుకు వస్తారా మరీ మంచిది ఆ పక్షంలోనూ తెలుగు ప్రాచీనతను నిర్ణయించే ప్రయత్నంలో ఇది మొదటి అనుమానుప్రమాణం

తెలుగునకు సజాతీయభాష అని నిర్ద్వంద్వంగా నిశ్చితమైన తమిళ భాషలో క్రీ పూ ఒకటి రెండు శతాబ్దాలకాలం నాటికే ప్రామాణిక సాహిత్యము ప్రసిద్ధలక్షణ గ్రంథ సంచయమూ వెలసి ఉందన్న విషయం స్థితిస్థాపకాంశం రుచిర సాహితీసృష్టికిగాని ప్రచుర లాక్షణిక గ్రంథసంపత్తికిగాని వాహకమైనభాష ఎంత ప్రాచీనమో ఎంత ప్రామాణి కమో సుష్ఠూపపత్తులతో అంచనావేయగలిగితే తమిళభాషా ప్రాచీనత అవగతమవుతుంది ఇంత ప్రాచీనమైన తమిళభాషకు సద్దె తోబుట్టువైన తెలుగుకూడ దానితోపాటు పరిఢవిల్లి ఉండవచ్చని ఖరారుచేయడం ఉత్తమ పరిశోధనా పద్ధతికి విరుద్ధంకాదు తెలుగు ప్రాచీనతను నిర్ధారించడాని కిది రెండో అనుమానప్రమాణం

ఇక, మూడో ప్రమాణం క్రీ శ 200 నాటికే తెలుగు వాడు కలో ఉన్నట్లు శాసనాదిక ప్రత్యక్షసాక్ష్యాలు ప్రకటిస్తున్నవి గనుకా, ఏ భాషకూడా ఉన్నట్టుండి ఒకానొక శుభోదయాన ఆకాశంనుంచి రెడీమేడ్ దినుసుగా ఊడిపడదుగనుకా అంతకుపూర్వం సైతం తెలుగుభాష వాడుకలో ఉందని నిష్కర్షించడంలో తప్పులేదు శాతవాహన చక్రవర్తి హాలుడు సంకలయితగా రూపెత్తిన గాథాసప్తశతిలో కనిపిస్తున్నవన్న దేశి పలుకు బళ్ళలో అన్నీ కాకపోయినా, కొన్ని ఐనా తెలుగు మాటలు కావచ్చని

కొందరి భావన పైన ఉట్టంకించిన మూడు అనుమాన ప్రమాణాలు ఆధారంగా తెలుగు భాష క్రీస్తునకు పూర్వం వేయారు సంవత్సరాల నుంచీ వెలుగొందుతూ వచ్చిందని చెప్పవచ్చు

తెలుగుభాషా ప్రాచీనతను ఇలాగా మనం నిర్ధారించగలిగినప్పటికీ అవిజ్ఞాతమైన ఆ ప్రాథమిక యుగాలలో దాని స్వరూప స్వభావాలేమిటన్న ప్రశ్నకు సరియైన జవాబును పొసగించడం దుస్సాధం ప్రత్యక్ష నిదర్శనాలు దొరకనందున తొలినాళ్ళలోని తెలుగు రూపురేఖలు మనకు బొత్తిగా తెలీవని ఒప్పుకోక తప్పదు అందుకే, తెలుగు భాషా చరిత్రలోని తొలిదశను అజ్ఞాతయుగమనీ అంధకారయుగమనీ చరిత్రకారులు పేర్కొనడం సంభవించింది ఈ యుగంలో సామాన్య జన వ్యవహారంలో తెలుగు భాష ఉందని చెప్పగలమేకాని, ఏరూపాన ఉందో ఇదమిత్థమని నిరూపించలేము

సుమారు క్రీ శ 200 నుంచీ క్రీ శ 575 దాకా విస్తరించిన కాలాన్ని తెలుగు భాషా చరిత్రలో సంస్కృత ప్రాకృత శాసన భాషా యుగమని పరిభాషించడం మాములు ఈ నిర్దిష్టకాలంలో తెలుగునాటిని పాలించిన శాతవాహనానంతరీకులు-ఇక్ష్వాకులు, బృహత్పలాయనులు, శాలంకాయనులు-విష్ణుకుండినులు-తమ దానాదికాలను ప్రకటించే రాజాజ్ఞప్రలను శాసనరూపాన సంస్కృతంలోనో వెలయించడంమీది పరిభాషా పరికల్పనకు మూలం క్రీ శ 575 నాటిదిగా శాసన నిర్ణయించిన ఎర్రగుడిపాడు శాసనం ఇప్పటికి దొరికిన తెలుగు శాసనాలలో మొట్టమొదటిదని అంటున్నారు ఈ శిలాశాసనం కడపమండలం కమలాపురం తాలూకా ఎర్రగుడిపాడు గ్రామంలోని చన్నకేశవస్వామి దేవాలయం ప్రహరీగోడ మీద కనుగొనబడింది రేనాటి చోడవంశానికి చెంది, ఎరికల్ ముత్తురాజు అన్న వాడుక పేరుగల ధనంజయుడు వేయించిన దాన శాసనమిది

ఎర్రగుడిపాడు శాసనకాలాన్ని (క్రీ శ 575) ఒక హద్దుగా గుర్తించి ఆనాటి నుంచీ తూర్పు చాళుక్య వంశీయుడైన రాజరాజనరేంద్రుని పట్టాభిషేక విజయ సంవత్సరం-అంటే క్రీ శ 1022 వరకూ వ్యాపించిన కాలాన్ని తెలుగు భాషా చరిత్రలో మరొక యుగంగా పరిగణిస్తున్నారు రాజరాజనరేంద్రుని ఆస్థాన కవియై పోషకుని అభ్యర్థనమేరకు వ్యాస భారతంలోని కొంత భాగాన్ని తెనిగించి, తెలుగున ఆదికవి అనీ వాగను శాసనుడనీ పేరుపొందిన నన్నయభట్టారకుని కృషిని దృష్టిలో పెట్టుకుని క్రీ శ 575 క్రీ శ 1022 సంవత్సరాల మధ్యగల కాలాన్ని ప్రాఙ్నన్నయ యుగమని నిర్దేశించడం జరిగింది ఈ యుగానికి చెందిన తెలుగు శాసనాలు నూటాయాభైకి పైగా దొరికాయి వీటికితోడు ఈ యుగం నాటి సంస్కృత శాసనాలలోని దేశీయమైన తెలుగు భాగం కూడ పరిశోధనకు మూలసామగ్రిగా ఉపకరిస్తుంది

క్రీ శ 1022 నుంచి క్రీ శ 1100 వరకు గల కాలాన్ని నన్నయ యుగమనీ, క్రీ శ 1100 నుంచీ క్రీ శ 1850 దాకా గల కాలాన్ని మధ్యయుగమనీ నాటినుంచి నేటివరకూ ఆధునిక యుగమనీ తెలుగుభాషా చరిత్ర స్థూలంగా విభజించబడింది

తెలుగునకు తోఁబుట్టువులైన తమిళ కన్నడ భాషలలో తెలుగులో కంటే ఎంతోముందు ప్రామాణిక సాహిత్యసృష్టి వెలసిల్లింది అంతేకాదు, ఆ దేశభాషలలో రాజాజ్ఞప్తి వాహకాలైన శాసనాలను నిలపడం కూడ తెలుగులో కంటే చాల పూర్వమనే చెప్పాలి ఆ యా భాషావ్యవహార ప్రాంతాలకు చెందిన రాజ్యపాలకులు దేశభాషా ప్రియులైనందువల్ల ఇది సాధ్య పడింది ధర్మం రాజానుమతం కాబట్టి ఆనాటి పాలకుల ఆశ్రయంలోని కవిపండితులు దేశభాషలకు పట్టంగట్టారు శాస్త్రచర్చలూ, సాహితీగోష్ఠులూ దేశభాషల ముఖంగా ప్రవర్తిల్లాయి రసవత్తరాలైన మౌలిక కావ్యాలనేకం

రచించబడ్డాయి గీర్వాణవాణీ రచనల స్థాయికి దీటురాగల లాక్షణిక వాఙ్మయం ఎంతో వర్ధిల్లింది ఆ పూర్వయుగాలలో జైనబౌద్ధమత ప్రచార కులైన విద్వత్కవులు తెలుగులో సృష్టించిన సాహిత్యం కొన్ని కారణాల వల్ల నష్టమైపోయి ఉండవచ్చునన్న కొందరి అభిప్రాయం తోసరాజన రానిది ఏది ఏమైనా ఆనాటి తెలుగునాటి సాహిత్యసంపద మనదాకా సాగిరాలేదు అందుచేత ఆనాటి భాషా స్వరూప నిరూపణం అరకొరగా, అసమగ్రంగా ఉండకతప్పదు

సంస్కృత ప్రాకృత శాసన భాషా యుగానికి చెందిన సంస్కృత ప్రాకృత భాషామయాలైన శాసనాలలో అనేక సంజ్ఞావాచకాలు - వ్యక్తి నామాలూ స్థలనామాలూ కనిపిస్తున్నాయి గోలశర్మ, దొడ్డిస్వామి, దొణ శర్మ మంచణ్ణమొదలైన వ్యక్తినామాలూ, అంతుక్కుర ఆచంట, ఉరువు పల్లి, ఏఖూర ఒంగోడు కింగూర కిండుకూరు కంబురాం చెరువు, కొండముది చెంచెఱువు చెందలూరు తాళ్ళికొన్ట పటి వెణుకెపఱ్ఱు, ప్రాలుర, రావిరేవ తెందుఱూరు విటిపఱు, వేపుర-మున్నగు దేశిరూపా లైన స్థలనామాలు, ఈ యుగంలో తెలుగుభాష ఉనికినీ మనికినీ తెలుపు తున్నవి ఇంతకుమించి తెలుగుభాషకు సంబంధించిన విశేషాంశాలు తెలి యడం లేదు గోల (<గోపాల) దొణ (<ద్రోణ) శబ్దాలు తద్భవాలు దొడ్డి, మంచణ్ణ దేశ్యాలు కావచ్చు శర్మ, స్వామి తత్సమాలైన పట్టణపు పేర్లు స్థలవాచకాల ఉత్తరభాగాన కనిపించే ఊరు, కొండ, చెరువు, పఱ్ఱు, పల్లి, ముది, రేవు-మున్నగునవి నేడుకూడ గ్రామనామాల భాగాలుగా ప్రచురం

ప్రాఙ్నన్నయ యుగంనాటి తెలుగుభాషా స్వరూపాన్ని నిరూపించ డానికి ఆ యుగానికి చెందిన నూరారు తెలుగు శాసనాలనూ, సంస్కృత ప్రాకృత శాసనాలలోని తెలుగుభాగాలను ఆధారంగా తీసుకోవలసి

ఉంటుందని ఈ వరకే అనుకున్నాం ఈ యుగం తెలుగు శాసనాలలో కొన్ని పద్యమయాలు కొన్ని గద్యమయాలు, కొన్ని ఉభయాత్మకాలు స్వీకరించిన ఛందస్సులలోనూ దేశీయతాముద్ర ఎక్కువ తొలిదశలో ఆటవెలది, తరువోజ తేటగీతి మధ్యాక్కర, సీసం మున్నగు దేశీయచ్ఛందాలు ఎక్కువగా వాడుక చేయబడ్డాయి రాను రాను సంస్కృత లక్షణంలో కనిపించని యతిప్రాసల బిగింపుగల చంపకోత్పలమాలలూ, మత్తేభాలూ వాడుకలోకి వచ్చాయి సంస్కృతంలో రచించిన వృత్తాలు కొన్నింట యతిప్రాసల వినియోగం ఉండడం గమనించదగిన విశేషం పండరంగని అద్దంకి శాసనంలో తరువోజ యుద్ధమల్లుని బెజవాడశాసనంలో మధ్యాక్కర, గుణగ విజయాదిత్యుని కందుకూరు శాసనంలోనూ సీసము ఎత్తుగీతలో ఆటవెలదిగాని, తేటగీతిగాని ఉపయోగించబడ్డాయి.

వర్ణమాల విషయంగా ఱ' కారం ఉనికి ఒక విశిష్టత ఏఱువేలు (ఏడువేలు) పుఱోలు (-ప్రోలు), తాఱి (-తాడి) ఎెఁదులూరు (-దెందులూరు) - వంటి ఱ పాలలో కనిపించే 'ఱ' కారం తరువాతి యుగాలలో ఉచ్చారణలో లేకపోయినా, కావ్యభాషలో కనిపించకపోయినా తెలుగు శాసనాలలో క్రీ శ పదమూడో శతాబ్దిదాకా లేఖన చిహ్నంగా నిలిచిఉంది పండరంగు, కరికాలచోడు రాజకళింగగంగు మున్నగు సంజ్ఞావాచకాలలో మహదేకవచన ప్రత్యయమే లేదు చామియన్ త్రిభువనాదిత్యన్, శ్రీమహేంద్రన్ - వంటి రూపాలలో తమిళంతో అభిన్నమైన న కారం మహదేకవచన ప్రత్యయంగా ప్రయుక్తమైంది వాన్డు (వాడు) మగన్డు (మగడు - కుమారుడు) పుణ్యకుమారున్డు, గణ్యమానున్డు-లలోని 'న్డు' నేటి డుజర్థకానికి తొలిరూపం

ఈ యుగం తొలిదశలో దేశ్యపదాలపాలు అధికంగా ఉండేది మలిదశలో క్రమక్రమంగా సంస్కృత ప్రభావం పెచ్చుపెరిగింది రెండు దశలలోని మొత్తం పదజాలాన్ని విశ్లేషిస్తే ఉజ్జాయింపుగా సగం దేశ్యాలూ ముడింట ఒక వంతు తద్భవాలూ ఉన్నట్టు లెక్కతేలుతుంది అమృతపడి

చౌషష్టి, జీవితమాడ, పోర్మ్ముఖరామ, రాచమానంబు - వంటి మిశ్రసమా సాలుకూడ ఎడనెడ ఎదురవుతుంటాయి 'అనేక సమరసంఘట్టన భుజాసి భాసురుండు', 'అనేక రిపునృపతి మణిమకుట మకరికాకషణ ఖరనకర పంజర ' వంటి సుదీర్ఘ సంస్కృత సమాసరచనా క్వాచిత్కంగా కనిపిస్తుంది

వాక్య రచనాపరంగా దేశీయ లక్షణాలే ఎక్కువగా గోచరించినా అక్కడక్కడ సంస్కృత ముద్ర సైతం ద్యోతకమవుతుంది చేయం బడిన ధర్మ్మవుల', వైదుంబుళ చేతం బట్టం కట్టబడి' - వంటి కర్మణి ప్రయోగాలనూ, 'నీకే వలయుం దాని వేండికొమ్మ', 'వేంగినాంటికెవ్వరు రాజులైరి వాడం బూర్వస్థితిం దప్పక పాలించువారు' - అన్న యత్తదర్థక ప్రయోగాలనూ విశేష్య విశేషణాలకు లింగవచన విభక్తి వచనాలలో ఏకరూపతగల 'చాలుక్య భీమునకు శౌదకందర్పునకు వేగీశ్వరునకు వంటి ప్రయోగాలనూ సంస్కృతప్రయోగ ఫక్కికా ప్రభావానికి ఉదాహరణలుగా ప్రదర్శించవచ్చు

శాసనవాఙ్మయంలోని శైలిని మచ్చుకు కొంత అనుశీలించండి 'కుసుమాయుధు పెద్దకొడుకు రాజ్యంబుసేయుచు నిష్టవిషయ కామభోగంబు లనుభవించుచు సుఖంబుండి యొక్కనాండు కొరవినల్ల వేఱెయ కొడుకు పెద్దన రావించి నీవు నా ప్రాణసమానుండవైన చెలివి నీ చేసిన యుపకారం బునకుం బ్రత్యుపకారంబు సేయవలయుంగాన నీ కేమి వలయుం దాని వేండికొమ్మ'న్న కొరవిశాసనంలోని హృద్యమైన ఈ గద్యభణితి నూరు నూట యాభై యేళ్ళ తరువాత నన్నయాదుల వచన రచనకు ఒజ్జబంతిగా ఉందనడం స్వభావోక్తి

ప్రాఙ్నన్నయ యుగానికిచెందిన తెలుగుభాష ద్రవస్థితిలో ఉండేదనీ, దానికి స్థిరరూపమంటూ ఏర్పడలేదనీ, మహాకావ్య రచనకు యోగ్యమైన ఉదాత్త స్థాయికి అది చేరుకోలేదనీ, కొందరు విపరీత ప్రతిపాదనలు చేస్తుంటారు ఇట్టివి వట్టి అపోహలే కాని నిశిత పరీక్షకు నిలిచే వాదాలు కావు అవకాశాలను బట్టీ, ఆవశ్యకాలను బట్టీ భాష ఎదుగుతుంది అది నీటికొలది తామర !

# తెలుగు : సజాతీయ భాషాపదాలు

ఏ సంస్థకానీ, ఏ వ్యవస్థకానీ, ఎంత సుసంపన్నమైనప్పటికీ ఎంత స్వయంసమృద్ధమైనప్పటికీ - ఏకాకిగా తన ఉనికిని స్థిరపరుచుకుని సార్థక మైన మనుగడను సాగించడమూ ఇతోఽధికమైన అభ్యుదయాన్ని సాధించ డమూ అలవికాని పనులు నవనవోన్మేషంగా వర్ధిల్లాలంటేనూ, నలుగురి మెప్పు పొందాలంటేనూ స్వీయశక్తి యుక్తులకు తోడుగా క్రియాశీలమైన ప్రతిసంస్థకూ, ప్రతివ్యవస్థకూ పరుల చేదోడువాదోడు తప్పనిసరి మానవ సమాజంలో అనునిత్యమూ పెరుగుతున్న అవసరాలదృష్ట్యా అనుక్షణమూ మారుతున్న విలువలదృష్ట్యా భావావిష్కరణ విధానాలలో ప్రధాన సాధన మైన భాష పెరుగుతుంది, సరికొత్త మలుపులతో మారుతుంది అది సొంత వనరులతో కొంత ఎదగవచ్చు, పరభాషల సంసర్గంతో మరికొంత పెరగ వచ్చు ఆ యా భాషావ్యవహర్తల అవసరాలపరమైన మౌలికదృష్టీ, స్వస్థానవేష భాషాప్రియత్వమూ, పాలక పాలిత సంబంధాలూ, పరభాషల పట్లగల వ్యామోహవైముఖ్యాలూ మున్నగు అనేకానేకాంశాలపై ఏ తద్భాషల పరమైన ఆదాన వైవిధ్యమూ, అభివృద్ధి విధానమూ ఆధారపడి ఉంటాయి

పదజాలాన్ని సమకూర్చుకునే ముఖ్య పద్ధతుల ఆధారంగా శాస్త్రజ్ఞులు భాషలను రెండురకాలుగా వర్గీకరిస్తూ ఉంటారు వీలైనంతవరకూ దేశీయమైన ధాతుప్రత్యయ సామగ్రితో జన్యపదజాలాన్ని సృష్టించుకుని నూతనావశ్యకాలను సులువుగా ఎదుర్కొనగల వాటిని స్వయం నిర్మితిభాషలు (building languages) అంటారు కొత్తకొత్త అవసరాలేర్పడినప్పుడు సంసర్గసంబంధంగల ఇతర భాషలనుంచి భావంతోపాటు భావబోధకాలైన

పదాలను సైతం విరివిగా ఎరువుతెచ్చుకుని పరిపుష్టనందేవాటిని పరాదాన భాషలు (borrowing languages) అంటారు తమిళం, టిబెటిన్ మున్నగు భాషలు మొదటి కుదురునకూ, తెలుగు ఇంగ్లీషు వంటి భాషలు రెండోకోవకూ చెందుతాయి నూతనభావాలనూ వస్తువులనూ గూర్చి చెప్పవలసివచ్చినప్పుడు ఆ యా భావాదికాలను మాత్రం పర భాషలనుంచి స్వీకరించి, తత్తద్బోధక పదావళిని సాధ్యమైనంతవరకూ దేశీయభాషా సామగ్రితో రూపొందించుకోవడం తమిళం, టిబెటన్ మొదలైన భాషల విశిష్టత భావంతోపాటు ప్రదాతృభాష (lending/donor language) లోని పదాలను యథాతథంగానో లేక ఒకిపాటి ధ్వని పరిణామాలతోనో ఎరువుతెచ్చుకోవడం తెలుగు, ఇంగ్లీషువంటి ప్రతిగ్రహీతృభాషల (recepient languages) ప్రత్యేకత

ప్రతిష్ఠను ఆశించి (prestige motive) కానీ ప్రయోజనాన్ని అపేక్షించి (need filling motive) కానీ పర భాషలనుంచి మాటలనూ కొన్నికొన్ని చోట్ల ఇతర వ్యాకరణాంశాలనూ ఎరవు తెచ్చుకొవడం చాల భాషలలో కనిపించే సాధారణ లక్షణం పరభాషీయులలోని ఏదో ఒక ఆధిక్యాన్ని పురస్కరించుకుని వారిని ఇతరులు అనుకరించడం ఆనవాయితీ విజితులు విజేతలను, పాలితులు పాలకులను మెహర్బానీ కోసమో, మేలి జీవిక కోసమో అనుసరించడం కద్దు అధికార ప్రాబల్యం ఆర్థిక ప్రాధాన్యం, మతప్రాధమ్యం సంస్కృతి ప్రాశస్త్యం, సాహితీ ప్రాచుర్యం మొదలైన వాటిలో అన్నిగానీ, కొన్నిగానీ కలవారిది ప్రాయికంగా సమాజ జీవనంలో పై చేయిగా ఉంటుంది వారి వేషభాషాదికాలను అనుకరించాలని పరాధీనవృత్తులైన ఇతరులు ఎగబడి ముగబడడం సహజ ధర్మం సముత్థానశీలమైన సమాజంలో ఇదంతా వంతుకూ వాసికీ ప్రవర్తిల్లె పెనగులాట! భాషలమధ్య జరిగే ఈ ఇచ్చిపుచ్చుకోవడాలను ఆదాన ప్రదానాలని భాషా విజ్ఞానవేత్తలు పరిభాషిస్తారు సామాన్యంగా

ఇరుగుపొరుగు భాషలనుంచి మాటలను ఎరవు తెచ్చుకోవడం పరిపాటి మత వాణిజ్య రాజకీయాది సంబంధాలవల్ల దూరతీరదేశాల భాషల పరంగా కూడా ఈ ఆదానప్రదానాలు ప్రవర్తిల్లడం కొత్తకాదు మన దగ్గర లేనివాటిని పరులనుంచి అప్పుగానో, చేబదులుగానో తెచ్చుకుని మన పబ్బం గడుపుకోవడం మామూలే కదా! ఎరవుసొమ్ము పరువుచేటో, బరువుచేటో అంటూ ఉంటారు తగవూ ధర్మమూ తెలిసిన పెద్దలు తిరిగి వాపసుచేసే ఇబ్బందులంటూ ఉండవు కాబట్టి ఇతరభాషల నుంచి ఒక భాషలోకి మాటలను ఎరవు తెచ్చుకోవడం పరువు చేటూ కాదు బరువు చేటూ కాదు ఏదైనా మితిమీరితే అతి అవుతుందని పాడీ పంతమూ పరికించే విజ్ఞులు చెబుతుంటారు

ఈ చూపుతో ప్రతి భాషలోని పదజాలం (**vocabulary**) ను దేశ్యము, (**native**) దేశ్యేతరమూ (**non-native**) అని రెండు తెగల కింద వర్గీకరించవచ్చు మూలమాతృక (**proto-language**) నుంచి పుత్రికా భాషలకు నైతృకంగా - నిసర్గంగా - సంక్రమించిన పద సముదాయం దేశ్యమనీ, తక్కిన భాగం - ఇతర భాషలతోడి సంసర్గం వల్ల వేర్వేరు కాలాలలో ఎరవు తెచ్చిన పదావళి - దేశ్యేతరమనీ స్థూలంగా చెప్పుకోవచ్చు అంటే, దేశ్యేతర విభాగంలో సజాతీయ భాషల-జ్ఞాతిభాషల (**cognate languages**) నుంచి కొనితెచ్చిన పదాలూ ఉండవచ్చు విజాతీయ భాషల (**non-cognate languages**) నుంచి ఎరవు తెచ్చిన పదాలూ ఉండవచ్చు వెరసి అవీ ఇవీ అన్నీకలిసి ప్రవృత్తి పరంగా ఒక భాషా పదాలుగానే చలామణీ అవుతుంటాయి

ఉదాహరణకి ద్రావిడభాషా కుటుంబానికి చెందిన తెలుగు భాషనే తీసుకుందాం పదజాలం విషయంగా తెలుగుభాషలో దేశ్యభాగమూ ఉంది, దేశ్యేతర విభాగమూ ఉంది మూలద్రావిడ (**proto-dravidian**) భాష

నుంచి పైతృకంగా - నేరుగా - తెలుగునకు సంక్రమించిన పదజాలాన్ని దేశ్యమని నిష్కర్షించవచ్చు వివిధ వికాస దశలలో తెలుగుభాష ఎరవు తెచ్చుకున్న భాషాసముదాయాల చూపులో బద్దింపు చేస్తే తెలుగునందలి దేశ్యేతర విభాగాన్ని ఆరువర్గాల కింద వింగడించవచ్చు తెలుగునకు సోదరభాషలు - సజాతీయ భాషలు (**sister languages**) గా నిర్ధారిత మైన కన్నడం, తమిళం వంటి ద్రావిడ కుటుంబ భాషలనుంచి అప్పుడప్పుడు ఎరవు తెచ్చినవీ, తెచ్చుకుంటున్నవీ మొట్టమొదటి వర్గం సంస్కృత ప్రాకృతాది ప్రాచీన హిందార్య భాషల (**old and middle Indo - Aryan languages**) నుంచి తెలుగులో చేరి, తత్సమాలు (**Un - assimilated loans**) గానో, తద్భవాలు (**assimilated loans**) గానో పరి భాషించబడుతున్న పదాలు రెండోవర్గం మధ్యయుగాలలో ప్రవర్తిల్లిన వాణిజ్య రాజకీయాది సంసర్గ సంబంధాల మూలంగా అరబ్బీ, తుర్కీ, పారసీ మొదలైన మధ్య ప్రాచ్యదేశీయ భాషలనుంచి ప్రత్యక్షంగానో లేక పరో క్షంగా ఉర్దూ, ఒరియా మరాఠీ వంటి నవీన హిందార్య భాషల (**neo - Indo - Aryan languages**) ముఖంగానో తెలుగున చేరిన పదసము దాయం మూడోవర్గం ఇంచుమించుగా ఇదే యుగాలలో మలేషియా, సింగపూర్ మొదలైన దూరప్రాచ్యసీమల భాషలనుంచి తెలుగులోకి తెచ్చిన పదాలు నాలుగోవర్గం తెలుగుభాష ప్రామాణిక సాహిత్యస్థాయిని పొందిన మూరారు సంవత్సరాల తర్వాత స్వతంత్రప్రతిపత్తిగల భాషలుగా రూపె త్తిన ఉర్దూ ఒరియా మరాఠీ మొదలైన నవీనోత్తరాహ భాషలనుంచి తెలుగులో ప్రవేశించి కొందరు తెలుగు లాక్షణికులచే అన్యదేశాలనో, అన్య దేశజాలనో పేర్కొబడ్డ ఎరువుమాటలు ఐదోవర్గం ఇంగ్లీషు డచ్చి పోర్చుగీసు - మొదలైన పాశ్చాత్య వాణిజ్య సంఘాల రాక కారణంగా క్రీస్తుశకం పదహారు పదిహేడు శతాబ్దులనుంచి తెలుగుపై తమ ప్రభావాన్ని ప్రదర్శించిన యూరోపియన్ భాషలనుంచి వచ్చిన పదాలు ఆరోవర్గం

తెలుగునకు సజాతీయ భాషలని నిరూపితమైన కన్నడ, తమిళ భాషల నుంచి తెలుగులోకి వచ్చిన ఎరవుమాటల ప్రసక్తికి ప్రస్తుత చర్చను సీమితం చేయవలసి ఉంది తెలుగు, తమిళం, కన్నడం మొదలైన భాషలు ఒకే మూలమాతృక - ప్రాచీన మూలద్రావిడం (proto - dravidian) - నుంచి పుట్టిపెరిగిన భాషలని విజ్ఞుల నిర్ణయం అంతేకాని ఏదో ఒక ద్రావిడ భాష నుంచి మరొక భాషగా రూపొందినవి కావు తమిళం నుంచి తెలుగు పుట్టిందని వివాదవివశులు కొందరు చేసిన ప్రతిపాదన అశాస్త్రీయం, ఆధార రహితం, అప్రామాణికం ఐతే, సాహిత్యస్థాయిని పొందిన విషయంగా తమిళం చాలా ప్రాచీనమైనది కావచ్చు దానికి కారణం ఆ భాషా వ్యవహార ప్రాంతాన్ని పాలించిన పరిపాలకుల మాతృభాషాభిమానమే తమిళం తర్వాత సాహిత్య స్థాయిని పొందిన భాష కన్నడం కన్నడంలో ఏడో శతాబ్ది నాటికే ప్రామాణిక సాహిత్యం వెలసినట్లు పరిశోధకుల అభిప్రాయం దొరిన ఆధారాల మేరకు పదకొండో శతాబ్ది నాటికి కాని తెలుగునకు ప్రామాణిక సాహిత్య స్థాయి అబ్బలేదని చరిత్రకారుల భావన కన్నడ, తమిళ భాషలు తెలుగునకు ఇరుగుపొరుగు భాషలు సమీపవర్తిత్వం వల్లనూ, రాజకీయాది కారణాలవల్లనూ శైవ, వైష్ణవ మతాల ప్రభావం వల్లనూ ఈ రెండు భాషల ముద్ర తెలుగుపై స్పష్టంగా పడిందని ఒప్పుకోక తప్పదు సాహిత్యపరంగా కథావస్తువులు, సన్నివేశాలు ఛందస్సు మొదలైన అంశాలమాట అటుంచి ఈ రెండు భాషలనుంచి నూరారు మాటలు తెలుగున ప్రవేశించి తెలుగునకు పుష్టిని కల్పించాయి ప్రకృతప్రసంగం మాదిరికి స్వీకరించిన కొన్ని ఎరవుమాటల అట్టుపుట్టాన వాళ్ల నిరూపణ వరకే పరిమితం

మొదట కన్నడం నుంచి వచ్చిన ఎరవు మాటల సంగతి చూద్దాం అప్పణె (= ఆజ్ఞ శృంగార సం పు 257) కన్నడ 'అప్పణె' నుంచి వచ్చింది తిమ్మరసు, బాచమరుసు మొదలైన వ్యక్తి వాచకాలలోని 'అరసు'

లేక 'అరుసు' కన్నడ పదమే 'చుల్కందనమిల్ల', 'సౌఖ్యమిల్ల' మొదలైన ప్రయోగంలోని నాస్తి వాచకమైన 'ఇల్ల' కన్నడ భాషా పదమే ఉద్దులు, ఉద్దుపొడిలలోని ఉద్దు (మినుములు) కన్నడ నుంచి వచ్చింది 'ఒప్పుగా నరకము మా కుంబళిచ్చి' (అధ్యా సం పు 71), 'ఉంబళికలు గల కమ్మ, వెంమదొరలు', (రాజవా 5-13) మొదలైన ప్రయోగాలలోని ఉంబళి, ఉంబళికలు పన్నుకట్ట నక్కరలేని భూమి లేక గ్రామం అనే అర్థాలుగల కన్నడ భాషా పదాలే 'కిడలేని తమకమున కాంతాళమును గలిగె' (అధ్యా సం 89) ఈ ప్రయోగంలోని కాంతాళము కన్నడ కాంతళకు ఎరవు రూపం కెలసము పని, 'నాకుందగిన కెలసంబు గంటి (కు సం 4-410), 'నా కెలసం బెవ్వరి కెక్కెడు' (సౌ ప్తిక 1-24) మున్నగు ప్రయోగాలలోని 'కెలసము కన్నడ 'కెలస' నుంచి వచ్చింది ఇట్లే కైవారము (స్తోత్ర పారం) 'కాంతి సంపదనేల కైవారమొనరింప' (భీమ 1-89), గేరి (వాడ), తాయి (తల్లి), దేవర (ప్రభువు, స్వామి) శివరా 5-26 నాయి (కుక్క) మడక (నాగలి), మొసరు (దధి), కుం సం 1-12, మొదలైన పదాలేకాక ఒగళము (తొలగిపోవడం), 'బగళంబు తొలగు (భీమ 5-25), బన్నసరం, బయకారులు, బయ్యకలు (వేవిళ్లు), బసవడు, బసివి, బాడుదల (బతికిన తల, శత్రువును జీవగ్రాహంగా పట్టితేవడం), కర్ణ 2-6, బాలకి (బాలిక) భోజరా 3-175, బాళికె (మన్నికె), బిజమాడు (విజయం చేయు) కాశ 1-33, బిసినీరు (వేడినీరు) 'ఎళనీరు బిసినీరు', ప్రబంధ - 57 బీగము (తాళంకప్ప), 'బీగంబు వేయిచే బీగముల్ దెఱచి' (ద్వి పరమ 3.9), వెఱకు సెనగి బేడలు సెనగపప్పు, 'బెల్లపు ఓచ్చులున్ సెనగబేడలు', (హర 2-91) మొదలైన బకారాది పదాలు, చోళ (చోడ) తాళి (మంగళసూత్రం), మొదలైన ళకారఘటిత దేశీయ రూపాలు, హజ్జ (అడుగు జాడ) ఏనుంగు హజ్జంరా, (శాంతి 2-236), హడపము పక్కలాకుల సంచి, 'కాళంజిహడపంబు' ద్విపదం 4-27,

హత్తించు, హత్తు హదను (అదను), హరిగె (డాలు) ద్వి పరమ 496, హవుదు (ఔను) 'సైబాసుమేలు హవుదంచు', కువల 4-113, హసాదు (అనుమతి) ద్వి పరమ పు 200 హాయి, హుళక్కి అభావం, 'విద్యయు హుళక్కి' కాశీ 4-111, హెగ్గడి ద్వి పరమ పు 281 హెచ్చరిక, హెచ్చు, హేరాళము 'పెక్కు దినముల్ హేరాళమై వర్షముల్ జడిగా బట్టి' హర 2-28 హొన్ను, బంగారు, ఘటికా 2-69, హోరాటు మున్నగు హకారాది పదాలు కన్నడం నుంచి తెలుగులోకి వచ్చాయి హళాహళి వంటి ధ్వన్యను కరణాలు, హుటాహుటి, హేమాహేమీలు, హోరాహోరి పైది 2-37, మున్నగు ఆమ్రేడితాలు, బ్రదికి బాళెద ద్వి పరమ పు 154, సెట్టి సవాసేరు లింగం అడిసేరు హళ్ళికి హళ్ళి (సున్నకు సున్న) వంటి నుడికారాలు కన్నడ ప్రభావ సూచకాలు ఇక, తెలుగు సాహిత్యంలోనూ, శాసనాలలోనూ కనిపించే బిరుదావళిలో చాలభాగం కన్నడం నుంచి ఎరవు తెచ్చిందే అరివీర బసవ శంకర (నై 6-145), ఇరువత్తు గండ (భీమ పీఠిక, 16) ఇరవై మందికి మొనగాడని దీని కర్థం 'ఉభయర గండ నరస 5-20 గండర గండ (మగవారికి మగడు) జగనొబ్బగండ (నై పీ 37 భీమ పీఠిక, 29)కు జగదేకవీరుడని అర్థం జోగరగండ యోగులకు వైరియైన మన్మథుడు మీసరగండ (మీసాలుగలవారికి మగడు) మూరురాయరగండ (అశ్వపతి, గజపతి, నరపతులకు గండడు) మనుచ 1-12 రాయగురు పరమేశ్వర, (భీమ పీ 32) రాయచౌహత్తమల్ల (ద్వి పరమ పు 232) రాయవేశ్యా భుజంగ (భీమ పీ 35) 'శంభు ద్రోహరగండడు వీర 5-79 స్వామిద్రోహరగండ (స్వామిద్రోహులకు గండడు) (నై పీ 30) హత్తుమువ్వరగండ (పదముగ్గురకు గండడు), హన్నిబ్బరగండ (పన్నెండుమందికి గండడు)-విశిష్ట సామర్థ్యసూచకమైన ఈ బిరుదావళి అంతా కన్నడభాషనుంచి తెచ్చిందే

ఇక తమిళపదాల మాట అడియరి సేవకుడు, ఉద్యో 1-250, అరవం, ఉణ్ణాముల (అపీతకుచాంబ) కాళ 3-185, 'కూటు', 'జియ్య' హర 2-134 'తణ్ణీరు' తిగుళ తమిళ సంబంధి ఘటికా 2-780 తైరు పెరుగు 'ఊరు బిండ్లూరగాయలు తైరుశొంరి' ఘటికా 2-17 నంగనాచి (చతురురాలు) పళ్ళికూటము (వీధిబడి) పిళ్ళె పెణ్ణాస (స్త్రీపైగల ఆశ) కాళ 3-185 పెరుమాళ్ళ కోవెల వైజ 2-28, పొణ్ణాస (బంగారుమీది ఆశ) పైది 3-185, భాగవతార్ భాగవతారిణి, మణ్ణాస (భూకాంక్ష) పైది, 3-185 మొదలియార్ మోరు (మజ్జిగ) 'నీరుమోరా రగించి, ఘటికా 2-16, సాపడు, తిను అన్నము సాపడి, విక్ర 2-33 సాపాటు స్వయంపాక మాచరించి సాపాటుచేయుదు, వైజ 2-122, సాంబారు-మొదలైన సాధారణపదాలేకాక వైష్ణవమత వాసనవల్ల నూర్గారు తమిళపదాలు తెలుగులో వాడుకపడ్డాయి 'అనంతాళువారు' అధ్యా సం 103, 'కురువరతినంబి' పైది, 103, 'గోద' ద్వి పరమ 483, 'చిరుతొండనంబి' హర 232, 'చూడికుడుత్తనాచారి' ద్వి పరమ 384 'తిరుకచ్చినంబి' పైది, 103 హర 2-65, 'తిరుపాణుడు' ద్వి పరమ 261, 'తిరుమంగయాళువారు' పైది 83 'తిరుమలనంబి' పై॰, 103 'తొండమాన్ జక్క్రవర్తి' అధ్యా సం 103 'తొండరతిప్పొడి, వైజ 1-75, 'తొండరడిప్పొడియాళ్వార్' పైది, 4-135, 'పెరియనంబి' ద్వి పరమ 601, 'పెరియాళువారు పైది, 83 మొదలైన ఆచార్యపురుషుల, వైష్ణవ భక్తకోటి వ్యక్తివాచకాలు తెలుగులో కనిపిస్తాయి

'అణ్ణామల' కాళ 3-185 'అలమేలు మంగనాచారి' అధ్యా సం పు 83, తిరుకాళహస్తికాళ 4-53, తిరుక్కణ్ణన్‌గుడి, ఘటికా, 1-46, 'తిరుమల' పైది 'తిరువరంగము' - శ్రీరంగక్షేత్రం వైజ 3 92, తిరువళందూరు, ఘటికా 1-38, తిరువళూరు హర పీ 10, తిరువెంగ నాంచి (హర 2-43), 'తిరువెంగడము' అధ్యా సంపు 3 'తిరువెంగ

శేషుడు' అధ్యా సం పు 18, తిర్వలిక్కేణి' ఘటికా, 1-65, 'పల్లిగొండ పెర్మాళ్ళు 1-61, 'పెరుమాళ్ళు' పైది, 151- మన్ననారు,ఘటికా 1-54 శ్రీవిల్లిపుత్తూరు, పైది, 1-51, మొదలైన క్షేత్రమూర్తి వాచకాలు కూడా వైష్ణవ ప్రభావాన్ని పుక్కిలించే తమిళభాషాపదాలు ఇవికాక 'ఆండాళ్ 'ఆళ్వా (రి) రు, వైజ 4-135, ఉడయవర్లు 'తంబి' 'తళిహ' (భోజన పాత్ర), ప్రింబధ 112, తొండ (దాసుడు, భక్తుడు), 'నాలాయిరం' (ద్రావిడదివ్య ప్రబంధం), పల్లాండు' (మ గళగీతం), ద్విపరమ 398 'పాశురం', 'పుళికాపు' (పులికాపు) శళ్వప్పిళ్ళ మొదలైనవి కూడా వైష్ణవ వాసనావాసితాలు

తిరుకట్టె, తిరు చిన్నము (వాద్య విశేషం) తిరుచుట్టు మాలె (భీము 331,) తిరుచూర్ణము, ద్వి పరమ పు 187, తిరుతొళని, ఘటికా 2-11, తిరునగరు, తిరునామము (శృంగార సం పు 162), తిరునాళ్ళు అధ్యా సం పు 246, తిరుపవిత్రము ఘటికా 2-8, తిరుపుట్టము పవిత్ర వస్త్రం, వైజ 2-115, తిరుబాస హర 2-56, తిరుమజ్జనం, తిరుమణి ద్వి పరమ 187, తిరుమణిపెట్టె, ఘటికా, 2-10 తిరుమంత్ర పరనము అధ్యా సం పు 7 తిరుమంత్రము, తిరుమాల, తిరుమాళిగ, తిరువడిగళు (శ్రీపాదాలు) పరమ 3-13 తిరువారాధనం, తిర్వికక్కు (తిర్లిక = శ్రీదీపం), తిరువిధులు (ఊరేగింపు) వంటి తిరుశబ్దపూర్వకాలైన అనేక తమిళపదాలు వైష్ణవ పారమ్య సూచకాలుగా ప్రయుక్తమవడం తెలుగు సాహిత్యంపై తిరుగులేని తాతాచార్యుల ముద్రకు తార్కాణం సంస్కృత 'శ్రీ' శబ్ద జన్యమైన ప్రాకృత 'సిరి' శబ్దం తమిళంలోని 'తిరు'కు మూలమని అభిజ్ఞుల నిర్ధారణ కంచిగరుడసేవ, గురువుకు పంగ నామాలు పెట్టు తాతాచార్ల ముద్ర, దాసరి తప్పులు దండంతో సరి నంబిసాయం తంబళిసేద్యం, పెన్నదాటితే పెరుమాళ్ళసేవ మధ్య వైష్ణవు నకు నామాలు పెద్ద, రామదాసు కొలువు (జీతబత్తెంలు లేని ఉద్యోగం)

వైష్ణవమాయ శరగోపం పెట్టు ( = మోసగించు) మొదలైన నాడునుడులు వైష్ణవ ప్రభావ సూచకాలు 'అడియేన్ దాసోఽహ' మ్మన్న వైష్ణవాభివాదన వాచకంలో తమిళ సంస్కృత వాగ్వ్యవహారాలు రెండూ - ఉభయ వేదాంత సిద్ధాంతాల కనుగుణంగా-ఇమిడి ఉండడం జగద్విదితం

'దేశభాషలందు తెలుగులెస్స' అని ఎల్ల నృపులు కొలువ బాసాడి అన్నిభాషల అందచందాలను నిండార ఆకళించుకున్న రసిక ప్రభువు శ్రీకృష్ణదేవరాయల యోగ్యతాపత్రం ఈ పద్యపాదం వల్లభరాయలదైనా ఆంధ్రభోజునిచే ఆమ్రేడితం, శ్రీకాకుళాంధ్ర వల్లభుని సూక్తిగా ప్రచారితం పైన రూపించిన రీతిగా అనేక భాషల సారాన్ని తనలో సమ్మరిపాళ్ళలో సంతరించుకున్న తెలుగుభాష తీయటిదే కాక నేడు కూడా దేశభాషలలో నిజంగా లెస్స అనిపించుకోగల మంచిగడియలు రాబోతున్నవి స్వస్త్యస్తు

# శ్రీనాథ సాహితిలో అన్యదేశ్యపదాలు

'పేషణీ హనుమంత బిరుదాంకులగు రాచవారికి నెయ్యంపు వరసుతుండు మంత్రి అల్లాడరాజు (1-32) శ్రీనాథుడు తెనిగించిన శృంగారనైషధం కావ్యావతారికలోని ఒకానొక పద్యపాదమిది ఇందలి 'పేషణీ హనుమంత ఒక బిరుదు వాచకంగా శాసనాల్లోనూ, సాహిత్యం లోనూ కనిపిస్తుంది 'పేషణీ' అనగా సన్నికల్లు హనుమంతుడు సన్నికంటి మీద పచ్చడినూరిన నెట్లు నూరునో శత్రువులను అట్లు నూరెడివాడు అని బిరుదార్థంకానోపు' అని సర్వంకషావ్యాఖ్య సమన్వయం ఐతే, 'పేషణీ హనుమంత' బిరుదానికి సర్వంకషావ్యాఖ్యచేసిన ఊహ సరికాదు ఇక్కడి 'పేషణీ' శబ్దాన్ని సంస్కృత సమంగా ఊహించి వ్యాఖ్యానించడం ప్రకరణానుగుణంకాదు షాడ్గుణ్య విద్యానిధులైన చక్రవర్తులు సంధి విగ్రహాది చతురుపాయ ప్రయోగచతురులైన తమ రాయబారులకు ప్రసాదించే బిరుదమిది చూచిరమ్మంటే కాల్చివచ్చే దూత హనుమంతుడు కార్యఖడ్గ ప్రయోగనిపుణులైన దూతలలో హనుమంతుని వంటివాడని మీద పేర్కొన్న బిరుదానికి అసలైన సిసలైన అర్థం 'సన్నికల్లు' అనే అర్థం గల పేషణీ శబ్దం సంస్కృతంలో ఉన్నమాట వాస్తవం కాని, ఈ బిరుదు వాచకంలోని పేషణీ సంస్కృత సమంకాదు, సంస్కృత భవం ఆదేశం, నియోజనం అనే అర్థాలు గల సంస్కృత 'ప్రేషణ' శబ్దానికిది వికృతి కాగా, సన్నికంటికీ, ఈ బిరుదానికీ ఏమాత్రం సంబంధంలేదు పరంపరీణ బాంధవంవల్ల మరాఠీభాషనుంచి తెలుగులోకి వచ్చిన ఈ 'పేషణీ' అన్యదేశ్యం

ఇలాంటి అన్యదేశ్యపదాలను శ్రీనాథుడు యాథైకిపైగా తన సాహిత్యసృష్టిలో ఉపయోగించాడు శ్రీనాథుని పేరు వినగానే ఒక ఉద్ధతుడూ, ఉన్నతుడూ ఐన సాహితీశిల్పి మన కళ్ళముందు సాక్షాత్కరిస్తాడు అష్టభాషాభారతీ సందర్భ సౌభాగ్య గరిమంబు సంగ్రహించిన విశిష్ట శబ్దప్రభుత ఆయనది 'శ్రుతి పురాణాగమ స్మృతి సాంఖ్య సిద్ధాంత కబళన వ్యుత్పత్తి గౌరవంబు సాధించిన శ్రుతవంతుడాయన ఆయన కర్ణాట క్షితిపాలుర ముత్యాలశాలలో దీనారటంకాల తీర్థమాడి ధిక్కృత ధిషణాధిపుడుగా దిక్కు దిక్కుల వాసిగాంచినవాడు రెడ్డిరాజుల విద్యాధికారిగా విద్యాపరీక్షణ వేళలలో బహుదేశ బుధులతో భాషించిన బహుముఖ ప్రజ్ఞాశాలి రావుసింగ మహీపాలుని పేరోలగంలో శారదాహీర మంజీరాల ఝుళం ఝుళలు వినదింపజేసిన కవితాపట్టాభిషక్తుడు ఆయనను ఆదరించిన సాహితీపోషకులంతా ద్వీపాంతరమండలికా భూపాలక మాననీయ పురుషార్థ పరులై, నానారాజ సభాంతరాలలో వర్ణన కెక్కిన హేమాహేమీలు సకలాంధ్ర మహీపాలకులుగా సరస సాహితీ విద్యా వినోద దీక్షితులుగా, యవనాధీశ సభానిరంకుశ వచోవ్యాపార పారాయణులుగా, అంతర్జాతీయ వాణిజ్య వ్యవహారదక్షులుగా, నిగ్రహానుగ్రహ క్రియానిపుణులుగా పేరు పెంపులు గడించినవారు తెలుగునేల నాల్గుచెరగులే కాక, ఇరుగుపొరుగు సీమలు తిరిగి దేశదేశాల పలుకుబళ్ళ తీరుతీయాలెరిగిన విద్వత్కవి కాబట్టి శ్రీనాథుని రచనలలో నిర్మల సాహిత్య కళాసమృద్ధికై విశిష్టమైన అన్యదేశ్యపదాలు ప్రకరణోచితంగా ప్రయుక్తమయ్యాయి

శృంగారనైషధం, భీమేశ్వరపురాణం (భీమ ఖండం), కాశీ ఖండం, హరవిలాసం శివరాత్రి మాహాత్మ్యం- ఈ ఐదూ మనకు లభ్యమవుతున్న శ్రీనాథుని రచనలు క్రీడాభిరామ పల్నాటి వీర చరిత్రల కర్తృత్వం వివాదగ్రస్తం శ్రీనాథ కవిరాజ కృతాలుగా నిర్ధారితాలైన పండితారాధ్య చరిత్ర, మరుత్తరాట్చరిత్ర, శాలివాహన సప్తశతి మొదలైనవి మనకు

దక్కలేదు అవి కాలగర్భంలో కలసిపోయినట్లే లెక్క శ్రీనాథుని పేర చలామణీ అవుతున్న చాటు ధారావళిలో ఎంత భాగం శ్రీనాథుని సొంతమో, ఎంత భాగం అర్వాచీనలు ఆయనకు అంటగట్టి దో చెప్పలేం నిర్ద్వంద్వంగా నిష్కర్షించిన ఈ రచన ప్రయోగ ఫక్కి ఆధారంగా బహు భాషావర్చస్వి యైన శ్రీనాథుని వర్ణాంకవిచేష్టలలో అక్షరాకృతి నందిన అన్యదేశ్యపదాల జాతకచక్రానుశీలనం ఈ ప్రసంగానికి పరిమితీ ప్రయోజనమూ

'అహేయమన్య దేశీయం యత్తదేవ ప్రయుజ్యతే' అని అన్యదేశీయ పదాల ప్రయోగానికి మన లాక్షణికులు అనుమతించారుగాని అన్యదేశ్యం లేక అన్యదేశీయం అన్న వ్యాకరణ పరిభాషకు వారు చెప్పిన నిర్వచనాలలో గానీ చూపిన ఉదాహరణంలో గానీ ఏకవాక్యత ఏ మాత్రమూ కన్పించదు బహమనీ సుల్తానుల హయాంలో ఇంతెజామి-నజంనఫ్క, అదాలత్, లష్కరీ మొదలైన అధికార భాషా వినియోగ రంగాలలో వాడుకపడ్డ దక్షినీ భాషాభేదం నుంచి కానీ ఒడియా మరాఠీ మున్నగు నవీనొత్తరాహ భాషలనుంచి కానీ తెలుగులో ప్రవేశించిన పదాలనూ మధ్య ప్రాచ్య భాషలైన అరబ్బీ, పారసీ, తుర్కీ మొదలైన భాషలనుంచి ప్రత్యక్షంగాగానీ పరోక్షంగా దక్షినీ, మరాఠీ మొదలుగా గల భాషల ముఖంగాగానీ తెలుగులో చేరిన పదాలను అన్యదేశ్యాలని స్థూలంగా నిర్వచించవచ్చు చీనీ, మలయా ఇత్యాది భాషలనుంచి మధ్య యుగాలలో సంసర్గ వశంవల్ల తెలుగులో వచ్చి చేరిన పదాలను కూడా ఈ వర్గంలో చేర్చుకోక తప్పదు ఇంగ్లీషు, పోర్చుగీసువంటి పాశ్చాత్య భాషలనుంచీ, తిలతండుల న్యాయంగా తెలుగు వారి నోట చర్వితచర్వణమవుతున్న ఉర్దూ భాషనుంచీ తెలుగులో చేరిన పదాలనుకూడ అన్యదేశ్యాలుగానే పరిగణించవచ్చు ఐతే, ఇవి మరీ ఇటీవలివి తెలుగులో ప్రబంధయుగానికి అనంతరీయాలు, అందుచే, శ్రీనాథుని సాహితీ వరివస్యలో కనిపించడానికి బొత్తిగా అవకాశం లేనివి

శ్రీనాథుని రచనలలో కనిపించే అన్యదేశ్యాలు చాలపాలు మూర్త పదార్థ (concrete objects) బోధకాలు మూడో నాలుగో మాత్రమే అమూర్తపదార్థ (abstract things) బోధకాలు ఇందులో స్థలవాచకాలు, భాషానామాలు, వాణిజ్య సంబంధి పదాలు, రాజకీయ వ్యవహార సూచకాలు, ఆహార విహార ఆహార్యాల పరమైనవి కనిపిస్తాయి వరుసగా ఒక్కొక్క విభాగానికి సంబంధించిన అన్యదేశ్యాల అనుపానులను అనుశీలనచేద్దాం

"ఒడ్డె ధాత్రీనాథుడుపద బుత్తెంచిన భద్రేభములు వీట బాళెముండు' పీఠిక 83) అన్న భీమఖండ ప్రయోగంలోని దేశవాచకమైన 'ఒడ్డె' ఒడియాభాషా రూపానికి వికృతి దీని మూలం 'ఓడ్రాః' అని కొందరూ, 'ఉదీచ్య - అని కొందరు వితర్కిస్తున్నారు మనదేశం పడమటి తీరం లోని గొవా ప్రసిద్ధమైన రేవు పట్టణం 'గోవ జవ్వాది', 'గోవ సంశుద్ధ సంకుమదద్రవము' మొదలైన శ్రీనాథుని ప్రయోగాలలో గోవా పట్టణం పేర్కొనబడింది 'చీని చీనాంబర శ్రేణిదెచ్చి (పీఠిక 26) 'చీని సింహళ తవాయి ' మొదలైన ప్రయోగాలలో చీనాదేశ ప్రసక్తి కనిపిస్తుంది 'యాంపగట్టాణి ముత్యాలు దెచ్చి' (పీఠిక, 26) అన్న హరవిలా ప్రయోగంలోని 'యాంప' నేటి శ్రీలంకలోని జాఫ్నా 'పండువా ఢిల్లీ రాఢాది పట్టణములు' ' కర్ణాట వరాట ఘూర్జర దహాళ కళింగ కుళింగ మండలా ' (పైది 29) వీటిలోని ఢిల్లీ, దహాళ శబ్దాలు సంస్కృత దేహళి శబ్దానికి వికృతులు దహాళ నేటి ఢిల్లీకి సమీప మాతృక ఢిల్లి దహాళ రూపాలు దక్షిని భాషాభేదం నుంచి వచ్చినవి కావచ్చు ఇట్లే తరుణాసీరి, తవాయి రమణా మొదలైన రేవు పట్టణాల ప్రసక్తి కూడ శ్రీనాథ సాహితిలో కనిపిస్తుంది 'తరుణాసీరి' బర్మా దేశపు దక్షిణ భాగాన తన్నాసరి నది ఒడ్డున ప్రకృతి సంపదకు ఆట పట్టయిన ఒక రేవు పట్టణం మలయా భాషలో 'తనాహ్‌సరి' అంటే

ఆనందసీమ అని అర్థం 'తవాయి' సైతం దక్షిణ బర్మాలోని తవాయి నది తూర్పు ఒడ్డు నందలి ఒక రేవు పట్టణం బర్మీ భాషలో 'థవాయ్ అంటే ఖడ్గాల క్రయవిక్రయాలు జరిగేచోటు అని అర్థం బర్మా దేశం లోని ఇరావతీ నదీ ముఖద్వారా భూమికి 'రమన్యా' అని ప్రాచీన వ్యవహారం 'తరుణాసీరి తవాయి గోవ రమణా స్థానంబులన్ అన్న హరవిలాస ప్రయోగంలో ఈ రమణీయ ప్రాంతం రమణా అని ఉద్ధరించబడింది పదునాల్గు పదైదు శతాబ్దంలో పశ్చిమ బంగాళాన్ని పాలించిన సుల్తానుల రాజధానియైన 'ఫాండవా' పట్టణం 'పండువా' అని శ్రీనాథుని ప్రయోగాలలో కనిపిస్తుంది 'పండువా సురతాణి పావడం బిచ్చిన భద్రేభములు ' 'పండువాఢిల్లి రాఢాది పట్టణముల' అని శ్రీనాథుని ప్రయోగాలు 'మక్కా' మండువ పండువా ' అని అర్వా చీనుల ప్రయోగం దుకాణము పై బొందిలి దొర్తునిల్చె' అన్న చాటువు లోని 'బొందిలి జాతి దేశ వాచకం బుందేల్ఖండ్ ప్రాంతీయులకి వాడుక ప్రసిద్ధం పారశీక జలసంధిలో గల పెద్ద రేవు పట్టణం 'హురుముజ్ ' ఇది క్రీస్తు పూర్వం నాలుగో శతాబ్దం నుంచి గుర్రాల, ముత్యాల ఎగుమతికి ప్రసిద్ధి 'సింహళంబున గంధసింధురంబుల దెచ్చె హురుముంజి గొప్ప ముత్తెపునత్తు మోవిపై నొక వింత ముద్దు గుల్క' అని హురుముజ్ 'హురుముంజి'గా మార్పు చెందింది

విదేశ భాషలలో అరబీ, పారసీ భాషల ప్రసక్తి శ్రీనాథ రచనలలో కనిపిస్తుంది భీమేశ్వరపురాణ కృతిపతి బెండపూడి అన్నయమంత్రి అరబీ పారసీ భాషలను నేర్చి ఆ భాషలలో విలాయతీ సుల్తానులకు ఉత్తరాలు రాసేవాడట ఈతడే ' అహమ్మదు సాహి వదాన్య భూమి భృత్సన్నిధి కిన్' పారసీ భాషలో కాకితాలు రాసి పంపేవాడట

కత్తురాని, కాకితము, గంజాయి, గసగస, ఒరీ, తేజీ, త్రాసు, దుకాణము, బాజారు, మోళము మొదలైన వాణిజ్యవాచకాలు, కప్పలి, జోంగు, వల్లి, వలికా, సమ్మాను మొదలైన పడవల-ఓడల పేర్లు, కమరు, కుల్లాయి, కోహళి మొదలైన ఆహార్య విశేషాలు శ్రీనాథుని రచనలో చాల చోట్ల కనిపిస్తాయి

'తెల్లని యొక కత్తులాని తేజీ హయమున్' నలునకు మామగారిచ్చిన కట్నకానుకలలో ఖత్తులాన దేశపు గుర్రంకూడా ఉన్నట్టు శృంగార నైషధ ప్రయోగం 'కాకితమందలి వ్రాతపద్ధతుల్' అన్న భీమఖండంలో ప్రయుక్తమైన కాకితం మరొక అన్యదేశ్యం పారసి భాషలోని 'కాఘజ్', లేదా 'కాఘిజ్' దీనికి మూలమూర్తి మరాఠీలోని 'కాగద్' ద్వారా తెలుగులోనికి వచ్చింది 'గంజాయి దినగనుత్క్రంఠ జేసినవాడ ' (3-64) 'గంజాయిదినె' (5-26) అన్న శివరాత్రి మాహాత్మ్య ప్రయోగాలలో గంజాపత్రితో తయారుచేసిన ఒక మాదకద్రవ్యం పేర్కొబడింది 'గసగస లివయును' (3-57) అని భీమఖండంలోనూ, 'గసగస యెసక మెసగె' (3-23) అని కాశీఖండంలోను గసగసాల ప్రసక్తి రెండు తావుల వచ్చింది 'జరిగొన్న వెలపట్టు జన్నిదంబులతోడ' (2-90) అన్న శివరాత్రి మాహాత్మ్య పద్యంలోని 'జరి' బంగారు అనే అర్థంకల పారసీ భాషాపదం నుంచి వచ్చింది 'హురుముంజి బలుతేజి హరులు దెచ్చె' అన్న హరవిలాస ప్రయోగంలో కనిపించే 'తేజి' పారసి భాషా పదం బేరసారాల తూనికలలో ప్రధానపాత్ర వహించే త్రాసు పారసి భాషాపదమైన 'తరాజూ' నుంచి వచ్చింది '[త్రాసుపై గల్లె చందమున' అని భీమఖండ ప్రయోగం '[త్రాసులంబోసి చిత్తంబుల తోడుత ' అని త్రాసును తిక్కన్న కూడా ప్రయోగించాడు దుకాణము మీదనున్న అయ్యలికులవేణి', దుకాణముపై వొందిలి దోర్తునిల్చె' అన్న చాటువులలో దుకాణం కనిపిస్తుంది దూకాన్,

దుక్కాన్ అన్న పారసీ అరబీ భాషా పదాలు దీనికి మూల మూర్తులు
మరాఠీ భాషలోని దుకాన, దుకాణ దీనికి సమీప మాతృకలు 'బాజారే
తిరిగి చూచి పక్కన నవ్వెన్' అని శ్రీనాథుని చాటువు పారసీ భాషా
పదమైన 'బాజార్' దీనికి మూలరూపం సంస్కృతంలోని 'ప్రసార'
పారసీ భాషా పదానికి జ్ఞాతిరూపం తెలుగు వాడుకలోని పవరీ పచారు
(కొట్టు) దీని పరంపరా సంబంధి రూపాలు 'పైకిమోళము కటారి' (6 94)
అన్న నైషధ ప్రయోగంలోని 'మోళము' లోహం పై పూతగావేసే పారసీ
'ములమ్మా' నుంచి రూపు తీర్చుకుంది తెలుగునందలి ములామ, మొలామ
దీని రూపాంతరాలు

'శరధిం గప్పలి జోంగు వల్లి వలికా, సమ్మ్రన్ల దెప్పించు' అన్న
హరవిలాస ప్రయోగంలోని కప్పలి జోంగు, వల్లి వలికా, సమ్మ్రాను
శబ్దాలు మలయా భాషనుంచి వచ్చిన అంబుతరణాల (పడవల, ఓడల)
పేర్లు కప్పలి తెలుగున శుద్ధదేశ్యమని కూడా కొందరి భావన 'కప్పలు
వాయి' వంటి గ్రామవాచకంలోని 'కప్పలు', 'కప్పలి'కి రూపాంతరం
కావచ్చునని ఒక ఊహ పడవల రాకపోకలకు వాయి (ముఖద్వారం)
కాబట్టి జలాశయతీరంలోని ఈ జనపదానికీ పేరు సార్థకం కావచ్చు ఇదే
కొందరి గృహనామాలలో కప్పలవాయి, కబళవాయి అని కనిపిస్తుంది
'కప్పల్' తమిళభాషా పదమని మరికొందరి నిర్ధారణం ఇక 'జోంగు'
మాట - 'ఒకచో పునర్వసు పూగె వృక్షము కొమ్మ సుడివడ్డ ముత్యాల
జోంగువోలె' (1-138) అని పడవ అన్న అర్థంలో కాశీఖండ ప్రయోగం
' కుంకుమ రజః కస్తూరికా ద్రవ్యముల్ జోంగు సమ్మ్రాన్ల
దెప్పించు ' (పీఠిక, 21) వణిక్ శ్రేష్ఠులలో హరవిలాసకృతి స్వీకర్త
అవచి తిప్పయసెట్టి అగ్రసరుడు పై కాశీఖండ ప్రయోగాన్ని బట్టి పునర్వసు
నక్షత్రం ఐదుచుక్కల గుంపుగా చక్రాకారంలో ఉంటుంది కాబట్టి గుండ్రటి
'పుట్టి' ఆకారంలోగల అంబుతరణంగా 'జోంగు'ను అన్వయించవచ్చు

'సమ్మాను' సమ్ + పన్ ముడుకొయ్యల పడవగా తీర్మానించడం జరిగింది చీనీ భాషలో సమ్ అంటే ముడు, పన్ అంటే కొయ్య అని అర్థాలు కొన్ని ముద్రిత ప్రతులలో కనిపించే 'పిరివిగా సమాన్లు దెప్పించు' అను పాఠం సరికాదు వల్లి, వలికా - ఈ రెండింటి వ్యుత్పత్తి చింత్యం

కాశీఖండం (3-240) లోనూ శివరాత్రి మాహాత్మ్యం (2-3) లోను 'ఒడ్డాణం' అన్న అర్థం కల 'వజ్రాలకమరు' లోని 'కమరు' పారసి భాషా పదభవం మూలభాషలోని 'కమర్'కు నడుము అని అర్థం నడుమున ధరించే భూషా విశేషమని తెలుగున ఆధారాధేయ సంబంధాన్ని అనుసరించి అర్థవ్యాకోచం 'కుల్లాయుంచితికోఁ సుట్టితి' అనే చాటువులో కుల్లాయి కనిపిస్తుంది నల్లగొర్రెపిల్ల తోలుతో చేసిన టోపి అనే అర్థంకల పారసిభాషలోని 'కలాహ్' దీనికి మూలమూర్తి 'మౌళిం గోహళి సంఘటించిన క్రియన్ ' అన్న హరవిలాస పద్య పాదంలోని 'కోహళ' శబ్దం కూడ పారసిభాషనుంచి వచ్చి సంస్కృతపు తొడుగు తొడిగిన రూపం

దివాణము, రావుతు సహా/శాహి, సురధాణి, హజారము మొదలైన అన్యదేశ్యాలను కూడా శ్రీనాథుడు తన రచనలలో యుటితిస్ఫూర్తి కోసం ప్రయోగించాడు 'కుంభోదరుపాళెమున నికుంభు దివాణమున భృంగి కులపతిగా ' (5-9) అన్న హరవిలాస ప్రయోగంలో రాజ భవన సముదాయమన్న అర్థంలో పారసి 'దీవాన్' పద వికృతి రూపం ప్రయోగించబడింది దివాణమన్న మరాఠీ పదం తెలుగునకు సమీప మాతృక 'ఎలుక నెక్కిన రావుతు రాజు' (1-2) అన్న భీమ ఖండ ప్రయోగంలోని 'రావుతు' సంస్కృత రాజపుత్ర - శబ్దంమూలము ర్తిగా మరాఠీ 'రావుత్' సమీప మాతృకగా అశ్వారోహకుడన్న అర్థంలో ప్రయుక్తమైంది అర్వాచీన యుగాలలో ఇదే 'రౌతు'గా తెలుగున కనిపిస్తుంది సార్వభౌముడు అనే అర్థం కల శాహి,సహ శబ్దాలు అహమ్మదు శాహి', 'హరిహరరాయ

పేరోజ సహా ' మొదలైన ప్రయోగాలలో కనిపిస్తాయి 'షహా' అన్న పారసిమాట వీటికి మూల మాతృక, మరాఠీలోని 'శహా' సమీప మాతృక షహా షా, సాహా మొదలైనవి తెలుగున దీని రూపాంతరాలు చక్రవర్తి అనే అర్థంకల పారసీపదం సుల్తాన్ శ్రీనాథుని చేతిలో సురత్రాణ, సురధాణి సురధాని మొదలైన ఎన్నో రూపాంతరాలను పొందింది 'ధారాసురత్రాణ ధాటీ సమారంభ గర్వపాథోరాశి కలశజులు' అని భీమఖండ ప్రయోగం 'ప్రబల ధారా సురత్రాణ భద్రజాతి' అని కాశీఖండ ప్రయోగం 'హరి హరరాయ పేరోజసహా సురధాణ గజాధిపాది భూవరులు ' అని హర విలాస ప్రయోగం కొలువు కూటమనే అర్థంకల 'హజారము' 'ఇంద్రుని హజారపు మేడ ' కాశీఖండంలో ప్రత్యక్షమవుతుంది పారసి భాషలోని 'హాజరీ' లేక 'హుజూరి' దీనికి మూల రూపాలు

'ఎవ్వాడు నలువ తేరెక్కి అష్టాదశ ద్వీపాళి యసివారు దిరిగె లీల' (4-195) అన్న కాశీఖండ ప్రయోగంలోని 'అసివారు'కు గుర్రం మొదలైన వాటి నెక్కి వాహ్యాళి వెళ్ళడం అని అర్థం మరాఠీలో 'అసివార' అంటే గుర్రపు రౌతు అని అర్థం ఇదే అర్థంకల 'అస్వార్' అన్న పారసి భాషా పదం దీనికి మూలం 'అశ్వారోహ' - అన్న సంస్కృత రూపం పారసి మాటకు జ్ఞాతి రూపం ఆనాటి అసివారు ఈనాటి వాడుకలో 'సవారి', 'స్వారి అయింది వాస్తవ స్థితి ఇలా ఉండగా కవి హృదయాన్ని సరిగా గుర్తించక 'అసివారు'ను తప్పుగా విరిచి అల్పార్థకమైన 'అసి' - పై పరుగెత్తు అను అర్థంకల 'పాఱు'ను చేర్చి శకట రేఫ ఘటితమైన 'అసివాఱు' అన్న ఒక సరికొత్త శాస్త్రిని శిల్పించి దానికి 'మందగమనం'అన్న అర్థాన్ని కల్పించి మనల్ని తప్పు దారి పట్టించారు నిఘంటుకారులు కొందరు 'ఖుసి మీఱన్ సురధాణి నిండుకొలువై కూర్చున్నచో ' (1-22) అన్న హర విలాస ప్రయోగంలోని 'ఖుసి' పారసి భాషలోని 'ఖుసీ' నుంచి వచ్చింది వాడుకలో 'ఖుషీ' అన్న రూపం కూడా ప్రచురం విలాసం సంతోషం

అని దీని అర్థాలు 'చిఱుసాన బట్టించి చికిలి సేయించిన గండ్రగొడ్డలి నిశా గహన లతకు', 'చికిలిసేసిన అడిదంబు'అన్న శ్రీనాథకవి ప్రయోగాలలోని 'చికిలి' కి మెరుగు, పదును అని అర్థాలు ఇదే అర్థం కల 'సకిల్' అన్న అరబ్బీ భాషా పదం దీనికి మూలం

బంగారుపూత అనే అర్థం కల 'జలపోసనము' కూడా అన్యదేశ్యమే 'పసిండి జలపోసనము'(హర 5-55), 'పైడి జలపోసనము'(కాశీ 6-161) అని శ్రీనాథుని ప్రయోగాలు పారసీ భాషలో ఇదే అర్థం కల 'జర్‌పోష్' నుంచి జలపోసనము వచ్చింది పారసీ భాషలో 'జర్' అంటే బంగారం, పోష్ అంటే ఆచ్ఛాదనం పైపూత అని అర్థాలు మన లాక్షణికులు కొందరు జలమూ పోసనమూ అని విరిచిన విరుపూ, చెప్పిన వ్యుత్పత్తీ సరైనవికావు

తెలుగు దేశ్య పదాలలో ప్రశంసను తెలిపే మాటలు సాధువాదార్థక పదాలు - మిక్కిలి తక్కువ, లేవన్నను పెద్దగా తకరారు లేదు 'దేవ బ్రాహ్మణ భూములు భూవరునకు జెప్పి ధారవోయించె భళి దేవయ లింగన ' (పీఠిక, 64) అన్న భీమఖండ కృత్యవతరణికా పద్యంలోని ప్రశంసార్థకమైన 'భళి' మరాఠీ భాషా పదం సంస్కృతంలోని మంగళా శీరర్థకమైన 'భద్ర'-శబ్దం దీనికి మూలమాతృక ప్రాకృతంలోని 'భల్ల-' సమీప మాతృక 'అన్ని గుణములు నౌ బలే యవగుణంబు' (4-34) అని ఆశ్చర్యార్థకంగా కాశీఖండ ప్రయోగంలో ప్రయుక్తమైన 'బలే' 'భళి కి పర్యాయవాచకం కవుల కైవాడలలోనూ జనుల రోజువారీ వాడుకలోనూ విరివిగా ప్రచారం కలిగి తెలుగున పొగడ్తను తెలిపే భలా భలే, భళా భళారోయ్ భళి భళి భళి భళిరా, భళిరే - మొదలైన పదాలు దీని రూపాంతరాలు 'సెబాసు' అన్న ప్రశంసార్థక పదాన్ని 'ననుమెచ్చించెదవే నవుడు నిన్ను సేబాసందున్' అని శ్రీనాథుడు హర విలాసంలో ప్రయోగించాడు ఈ మెచ్చికోలు మాటకు సహ్‌బాష్' అన్న పారసి భాషా పదం మూలం దీని అర్థం మేలు మేలు !

# తెలుగులోని పాశ్చాత్య భాషాప్రభావం

ఇరుగుపొరుగు భాషలనుంచే కాక, నూరారు ఆమడల దూరాలలో అపారమైన పారావారాల ఆవలితీరాలలో వాడుకలో ఉన్న అనేక భాషలనుంచి తెలుగుభాష తన తుష్టికీ, పుష్టికీ వేయారు పదాలను ఎరవు తెచ్చుకుంది వీటిలో ఇంగ్లీషు, డచ్చి, పోర్చుగీసు భాషలు ప్రధానస్థాన మాక్రమిస్తాయి తెలుగుపై పోర్చుగీస్, డచ్చి భాషల ప్రభావం కేవలం పరిమితమైన పదవినిమయంతో పరిపూర్తి అయింది ఇండో యూరోపియన్ భాషా కుటుంబంలో అంతర్భాగమైన రొమాన్స్ (ఇటాలియన్) శాఖకు చెందిన భాషలలో పోర్చుగీస్ ఒకటి దీనిని లాటిన్ మాండలికం (Latin-dialect) అనికూడ అంటారు పదిహేడు, పద్దెనిమిది శతాబ్దులనాటి తెలుగుసాహిత్యంలో పోర్చుగీసు అన్నపదం పుడతకీసు', 'పురతకీశు', 'బుడతకీచు' అన్న రూపాంతరాలలోనూ, వారి దేశనామమైన పోర్చుగల్ 'పుడతకాల్' 'పురతకాలు', 'పురతగాలు', 'బుడతకాలు'-అన్న రూపాంతరాలతోనూ కన్పిస్తున్నవి పోర్చుగీసువారు భారతదేశపు పడమటితీరంలో వర్తక - సైనిక స్థావరాలనేర్పరచుకున్న కొద్దికాలంలోనే నాటి విజయనగర రాజ్య ప్రజలతో, పాలకులతో వారికి ప్రత్యక్ష సంబంధాలేర్పడినట్లు చరిత్ర వల్ల తెలుస్తున్నది వారి ముఖ్యస్థావరమైన గోవాతో తెలుగుదేశానికి మత వాణిజ్య రాజకీయాది సంబంధాలు క్రమక్రమంగా పెరుగుతూ వచ్చాయి తమకు వాణిజ్యాది సంబంధాలుగల ఇతర దేశాలలో సంచరించేటప్పుడు కన్పించిన కొత్తకొత్త చెట్టుచేమలను, పండుఫలాలను బుడతకీచువారు తమ వలస దేశాలకు తెచ్చిపెంచేవారు అనాస, జామ, బంగాళదుంప, బొప్పాయి,

మిరప, వేరుసెనగ, సీతాఫలం మున్నగునవి ఇలాతెచ్చి పెంచిన వాటిలో కొన్ని తరుగుల్మలతాదులు

ఇంజనీర్లుగా, మతబోధకులుగా, యుద్ధవిద్యాశిక్షకులుగా, రాయబారులుగా, వాణిజ్య ప్రతినిధులుగా, దుబాసీలుగా సలహాదారులుగా పోర్చుగీసు వారు చాలమందికి తెలుగుదేశంతో సమీప సంబంధాలుండేవి చంద్రగిరి, చెన్నపట్నం, ఫిరంగిపురం, మచిలీపట్నం, విశాఖపట్నం, శాంథోం, హంపీ విజయనగరం మున్నగుచోట్ల పోర్చుగీసువారు పరిగణించదగ్గ సంఖ్యలో నివసించేవారు ఇంచుమించుగా ఇన్నూరేళ్ళపాటు పోర్చుగీసు భాష సాగరతీర ప్రాంతాలలో అరదేశి పరదేశి నానాదేశవర్తకుల మధ్యా, దౌత్యవ్యవహర్తల మధ్యా అనుసంధానభాష (**Link language**) గా ఉండేది పదిహేడో శతాబ్దిలోని ఇంగ్లీషు, డచ్చి వర్తకసంఘాల కార్యకర్తలు పోర్చుగీసు భాషను నేర్చిన దుబాసీల **Translators**) సాయంతో తెలుగుదేశంలో తమ వ్యవహారాలు చక్కదిద్దుకునే వారు ఆ రోజులలో దక్షిణ భారతంలోని న్యాయస్థానాలలోనూ, స్థానిక సంస్థలలోనూ, అధికారభాషాస్థాయిలో పోర్చుగీసు భాషకు ప్రచుర వ్యవహారముండేది

ఈ యీ కారణాలవల్ల రమారమి నూటయాభై పోర్చుగీసు భాషా పదాలు తెలుగువారి వాడుకకెక్కినట్లు లెక్క తేలుతుంది

అనాస అలమారు, అల్పి (గుండుసూది) కమీజు (చొక్కా), గమేళా (ఇనుప వొచ్చె) బాల్చి (బకెట్), బొత్తాము (గుండీ), సొప్పాయి రోదా(బండిచక్రం) మున్నగువాటిని కొన్ని ఉదాహరణలుగా పేర్కొవచ్చు గుండు సూదిని కళింగాంధ్రంలో 'అల్పి పిన్ను' అంటారు ఇది 'ఆల్ఫినే' అన్న పోర్చుగీసు మాటకు వికృతి అల్పమైన పిన్ను అని కొందరు చెప్పింది గమ్మత్తు వ్యుత్పత్తి మాత్రమే అనాస పండును 'అనాస పనాస'

అని కూడా కొందరంటార 'అననాష్' అనే పోర్చుగీసు మాట దీనికి మూలం, అక్బరు చక్రవర్తి కాలంలో పోర్చుగీసు వారు దీనిని మన దేశానికి తెచ్చారు 'అక్కా పచ్చని చిలుక వచ్చె, కొందామా, తిందామా, అంగట్లో పెట్టుకు అమ్ముదామా అని గోదావరి మండలం లోని ఒక పొడుపు కథ 'అనాస పండు' అని దీని విడుపు 'బీగంబు చేయిచే బీగముల్ దెఱచి' అన్న ద్విపద పరమయోగి విలాస ప్రయోగం ఇక్కడ గమనించదగ్గది 'బీగంబు చేయి' అంటే తాళం చెవి అని అర్థం తాళం చెయ్, చేతులు వాస్త శబ్దార్థాలు కావు 'షావి' అనే పోర్చుగీసు భాషా పదం నుంచి 'చెవి' ఏర్పడింది కర్ణం అనే అర్థం గల తెలుగు చెవి వేరు, మన చర్చలోని ఈ చెవివేరు పాపరాజు ఉత్తర రామాయణంలోను, తంజాపుర యక్షగానాలలోను చాలతూర్లు పేర్కొబడ్డ 'పురతకాల్ పట్టు పాపోసులు', పురతకాల్ పరుపులు, పురతకాల్ తలగడల్, బుడతకాల్ మంచము' మున్నగు ప్రయోగాలలోని పురతకాల్/బుడతకాల్ అన్నవి పోర్చుగల్ అన్నమాటకు వికృతిరూపాలు బుడతకాళిలన్న వస్త్ర విశేషా లను హంసవింశతి కూడ పేర్కొంది ఆ రోజులలో పోర్చుగల్ నుంచి మనదేశానికి దిగుమతి అయ్యే పట్టుకు గొప్ప గిరాకీ ఉండేదని చరిత్రలో ఇతరత్రా నిరూపితమైన అంశం దీనిబట్టి ధ్రువపడుతున్నది 'బుడత కాల్'లోని 'బుడుత' గా దిద్ది 'చిన్న', 'అల్పమైనది' అని కొందరు నిఘంటు కారులు వ్యాఖ్యానించారు 'బుడుత' యేమిటి? 'ఉడుతకాల్ పట్టు' అయి ఉంటుందని చెప్పి ఆమేరకు అసలు పాఠం దిద్దివేసి 'ఉడుతకాలిమీది బొచ్చుతో తయారైన పట్టు అని కొందరు ప్రాచీన గ్రంథ పరిష్కర్తలు వ్యాఖ్యానించడం సైతం జరిగింది

పోర్చుగీసువారి రాకకు తర్వాత సుమారు నూరు నూటయాభై యేళ్లకు ఇంగ్లీషు ఈస్టిండియా కుంఫిణీ వాణిజ్యం నిమిత్తం మనదేశానికి వచ్చింది ఇండో యూరపియన్ భాషా కుటుంబానికి చెందిన జర్మానిక్

శాఖలోని ఆంగ్లోశాగ్జన్ విభాగానికి చేరిన భాష ఇంగ్లీషు ఈ కుంఫిణీ క్రమ క్రమంగా పరిపాలనాధికారం చేజిక్కించుకుంది తెలుగుపై ఇది నెరపిన ప్రభుతకు అంతులేదు, నాటికి నేటికీ మున్నూరేళ్లకు పైబడి ఇంగ్లీషు మన భాషపై, మొత్తం మన ఆలోచనాసరళిపై తిరుగులేని పెత్తనం చలాయిస్తూ వస్తున్నది ఆ రంగము ఈ రంగము అని పేర్కొనక్కరలేదు అన్ని రంగాలలో, అన్ని వ్యాసంగాలలో ఇంగ్లీషు భాషాప్రభావం అతివేలంగా కన్పిస్తుంది పండితులకూ - పామరులకూ పిన్నలకూ - పెద్దలకూ, ఆడ - మగ అందరికీ ఇంగ్లీషు మాట నోటరానిదే క్షణం గడవదంటే అత్యుక్తికాదు పద్మనాభయుద్ధం చెన్నపురీ విలాసం మొదలైన తెలుగు కావ్యాలలో ఇంగ్లీషు పదాలు పుంఖానుపుంఖాలుగా గుప్పించబడ్డాయి కాఫీ, టీ, హోటల్, బస్సు, కారు, డిపో, రైలు,రోడ్డు మైలు, టికెట్టు, కండక్టరు, డ్రైవరు, స్టేషన్, మిల్లు, మీటింగు, స్కూలు, కాలేజి, మేస్టారు, మేనేజరు, పెన్ను, పెన్సిల్, పేపరు, ఆఫీసు, రేడియో, సినిమా, కోర్టు, జడ్జి, ప్లీడరు, లాయర్ మొదలయిన వేలాది పదాలు తెలుగువారి రోజువారి వాడుకలో ఎదురవుతున్నవి తెలుగులో సుమారు ఐదువేల ఇంగ్లీషు పదాలుంటాయని పరిశీలకుల అంచనా

ఇంగ్లీషులోని యఫ్ (f) అన్న వర్ణోచ్చారణ ప్రభావంవల్ల కఫం రేఫం, ఫలం, ఫలితం సుఫల - వంటి సంస్కృత సమాలలోని ఉభయోష్ఠ్యశ్వాసవత్ స్పర్శవర్ణాన్ని (Un voiced aspirated labial plosive) దంతోష్ఠ్యశ్వాసవదూష్మం (Unvoiced aspirated labio-dental fricative)గా ఉచ్చరించడం సాగరాంధ్రులలో కొందరి అలవాటు

ఐక్యరాజ్యసమితి (United Nations Organisation) నల్ల బజారు (black market) భద్రతాసమితి (Security council),

భూరాజస్వం (**land revenue**), మండలకరగ్రాహి (**District Collector**), శిఖరాగ్రచర్చలు (**summit talks**), శ్వేతపత్రం (**white paper**) మున్నగు భావానువాదాలను అనూదితాదానా (**loan translations**) లంటారు. తెలుగులోని పాతపదాలకే కొత్త అర్థాలు కల్పించడాన్ని 'నవీనార్థకల్పన' (**loan shift**) అని అంటారు. మంత్ర పూర్వకమైన ప్రయోగోపసంహారాలుకల ఆయుధాన్ని సంస్కృతంలో 'అస్త్రం' అంటారు ఇదే తత్సమంగా తెలుగువాడుక. 'ఆటంబాంబు' అన్న ఇంగ్లీషు పదబంధాన్ని 'అణ్వస్త్రం' అని అనువదించి అస్త్రశబ్దానికి 'నవీనార్థం' కల్పించడం జరిగింది. 'కంటకం' అనే అర్థంగల తెలుగుమాట 'ముల్లు' ఆకృతి సామ్యంచేత గడియారపుముల్లు (చిన్నముల్లు, పెద్దముల్లు) అన్నవాడుకలలో నూతనార్థాలను సంతరించుకుంది. కొసలోగల వాడితనం వల్ల ఇంగ్లీషుభాషయందలి 'సిరంజి'కి 'సూది' అనీ, దీని ముఖంగా ఎక్కించే మందుకు 'సూదిమందు' అనీ కొత్త అర్థాలు ఏర్పడ్డాయి.

ధ్వని పరిణామం వచ్చిన ఇంగ్లీషు మాటలు (**assimilated loans**) కూడా తెలుగులో వందలకొద్దీ వాడుకపడ్డాయి. ఆస్పత్రి (**hospital**), ఇసుకోలు (**school**), గళాసు (**glass**), గుళాపు (**globe**), డాక్టరు (**Doctor**), దరాము (**Drane**), దసుకు (**Desk**), డిరీసు (**dress**), పంచేరు (**puncture**), పళాస్త్రి (**plaster**), పింఛను (**pension**), పీవన్ (**peon**), బిల్లేడు (**blade**), బురుసు (**brush**), బులుగు (**blue**) బూడ్సులు (**boots**), లవణసు (**allowance**), వుయిలు (**will**). సీకు (**sick**), సూప్రెంట్ (**Superintendent**), హేడ్డు (**Head constable**) మొదలైనవి.

ఇంగ్లీషు 'క్రియావాచకాలమీద అగు, అవు చేయు పడు మొదలైన వాటిని సాహాయ్యక క్రియలుగా వాడడం ప్రచురంగా గోచరిస్తుంది.

ఐసగు, ప్యాసవు, బర్‌స్టవు మిస్సగు ఫెయిలవు ఓట్‌చేయు ఓవర్‌టేక్ చేయు, ఓవర్‌లోడ్‌చేయు, డ్రైవ్‌చేయు, పబ్లిష్‌చేయు, ప్రపోజ్‌చేయు బైహార్ట్‌చేయు, విష్‌చేయు, హెల్ప్‌చేయు, పంచేరు పడింది, ఫోన్‌పెట్టు మొదలైన వాడుకలు ఇందుకు నిదర్శనాలు నూతన ప్రియులైన ఆధునిక కవులొకరు ప్రయోగించిన 'పెరిషించు (Perish + ఇంచు) వంటి 'ఇంచుక్కు' చేరిన వాడుకలు చాలా ఎబ్బెట్టుగా ఉన్నందువల్ల కావోలు చలామణిలోకి రాలేదు

బుక్స్, లాక్స్ మున్నగు పదాలలోని ఇంగ్లీషు బహువచన ప్రత్యయం ఉచ్చారణను పురస్కరించుకుని ఏకవచన రూపాలైన 'సమ్మన్స్', 'బాడీస్' అన్నవాటిలోని 'యస్' అన్న ధ్వనిని బహువచన ప్రత్యయంగా భ్రాంతిపడి 'సమన్, బాడీ' అని వాడుతున్నాము ఇక్కడి పదాంతంలోని సకారోచ్చారణం శబ్దగతమేకాని ఇంగ్లీషులోని బహువచన ప్రత్యయం కాదు తెలుగు బహువచనమన్న భ్రమలో పడినందున 'కాన్స్టబుల్, కనిస్టేబుల్' 'కనిస్టీబు, కనిస్టీపు'గా మారాడు కళింగాంధ్ర వ్యవహారంలోని 'కనిష్టీబు గురజాడ వారి కన్యాశుల్కంలో మనకు కనిపిస్తాడు నోట్స్ (Notes) అన్న రూపం వ్యావర్తకంగా రెండర్థాలలో ప్రవర్తిస్తున్నది నోట్స్ అంటే బడిపిల్లలు రాసుకునే పాఠ విషయాలు అనీ నోట్లు అంటే కరెన్సీ నోట్లు అని వాడుక పౌండ్ రౌండ్ పదాలపై తెలుగు బహువచన ప్రత్యయం చేరగా ఏర్పడ్డ పౌండ్లు, రౌండ్లు నుంచి పౌను, రౌను అన్న పశ్చాన్నిర్మిత (back f rmation) రూపాలు కళ్లు-కన్ను వంటి తెలుగు రూపాల సామ్యంవల్ల సిద్ధించినవి భిన్న భాషల లోని సమానార్థక రూపాలను పునరుక్తులుగా వాడటం కూడా కద్దు కిరసనాయిలు నూనె, గేట్‌వాకిలి సంతమార్కెట్, స్లేట్‌పలక మొదలయిన వాటిని ఉదాహరణలుగా పేర్కొనవచ్చు

ఆంగ్లేయుల ఉచ్చారణలో మార్పాటునందిన దేశీయస్థల వాచకాలను ప్రతి గ్రహీతృ భాషలలో వాడడాన్ని ఉచ్చారణాదానం ((Pronunciation loan) అంటారు ఊటీ ఉటక్‌మండ్ (ఉదకమండలం), కల్కటా (కాళిఘట్ట కాళిఘాట్) కాలికట్ (కోటికోడ్) కెడి పేట (కృష్ణదేవ పేట), క్విలన్ (కొయిలాన్) గూటి (గుత్తి), టిన్నెవెల్లి (తిరునెల్వేలి), టూటికోరిన్ (తూత్తుకుడి), ట్రావెన్కూర్ (తిరువాన్కూర్) ట్రిచ్చి (తిరుచ్చిరాపల్లి), ట్రిప్లికేన్ (తిరువల్లికేణి), ట్రివెండ్రమ్ (తిరువనంత పురం) బీమ్లి (భీమునిపట్నం) బెర్హామ్‌పూర్ (బరంపురం), మాడపోలం (మాధవపాలెం) వైజాగ్‌పటాం (విశాఖపట్నం) సామల్‌కోట్ (సామర్ల కోట) - మున్నగునవి ఈ రీతికి కొన్ని ఉదాహరణలు

ఇంగ్లీషుతో అంతగా పరిచయంలేని స్థానిక రాజకీయనాయకులు చాలమందికి నెంబర్ (number) కీ మెంబర్ (member) కీ భేదం తెలీదు ఈ కోవకు చెందినవారే (over haul) ను 'ఓవరాయిల్' అనీ, (stipend) ను 'స్టే ఫండ్' (stay fund) అనీ వాడటం మనం గమనించవచ్చు High School ను 'ఎత్తుబడి' అనీ, (village level worker) ను 'గ్రామసమమట్టపు పనివాడు' అనీ చేసిన అనువాదాలు తమాషా తర్జుమాలుగా చెప్పుకోవాలి కాంగ్రెసేతర కమ్యూనిష్టేతర సంధులు సరేసరి

ఇంగ్లీషు పదాలతోనూ, ఇతర భాషాపదాలతోను ఏర్పడ్డ మిశ్రమ సమాసాలకు అంతులేదు ఖాదీబోర్డు జిల్లాకోర్టు, జిల్లా జడ్జీ, తపాలా ఆఫీసు, తాలుకాఫీసు, పంచాయతీ ప్రెసిడెంటు లారీచార్జి ఇవి అన్యదేశ్యమూ ఇంగ్లీషూ కలిసినవి ఓటింగు హక్కు, కోర్టు అమీనా, కోర్టుగుమాస్తా, జాయింట్ పట్టా, సివిల్ దావా, హైకోర్టు వకీలు—ఇవి ఇంగ్లీషు అన్య దేశ్యాలతో రూపెత్తిన మిశ్రసమాసాలు ఉచితటికెట్టు జాతీయ కాంగ్రెస్,

దక్షిణ మధ్య రైల్వే, ధర్మాసుపత్రి, ఎరిషత్ ఛైర్మన్—ఇవి సంస్కృత సమమూ ఇంగ్లీషు కలసి యేర్పడ్డ మిశ్ర సమాసాలు జిల్లాపరిషత్తు లైట్ స్తంభం, సినిమాతార—పై సమాసాలకు విపరీత రీతి అయ్యపురెడ్డి ఇర్సాల్‌మెట్టు బేస్‌మట్టం, లట్‌పిట్టు—మున్నగు జానపదుల వాడుకలు ఇంగ్లీషు శబ్దార్థాల నిర్దిష్ట స్వరూపం స్పష్టంగా తెలీని కారణంగా క్రమంగా హైబ్రిడ్ (hybrid) - సంకరజాతి, ఇన్‌సాల్వెంట్ (insoluent), బేస్‌మెంట్ (basement) నాట్ పెయిడ్ (not paid - తపాలాపరిభాష) నుంచి దేశీయపద సమ్మిశ్రంతో ఏర్పడ్డవి తెలుగు 'రుబ్బు'నకు ఇంగ్లీషు-ing చేర్చి 'రుబ్బింగ్ మిషన్', 'రుబ్బింగ్ చేయుడును' వాడుకలు అక్కడక్కడ మనం గమనించవచ్చు

ఇంగ్లీషునుడికారాలు కొన్నింటిని సబబూ సందర్భము లేకుండా తెనిగించడం మనం గమనించవచ్చు పక్షపాతదృష్టితో చూస్తున్నారనడానికి 'శీతకన్ను' వేశారని అనడం ఇప్పటికీ తెలుగునాట అలవాటు ఇది సీతమ్మ వారి కన్ను కాదు, శీతాకాలంలో శీత-కోల్డ్ ఐ (cold eye) అన్న ఇంగ్లీషు పలుకుబడికి తెలుగుతర్జుమా నిజంగాచూస్తే ఉష్ణమండలవాసులైన తెలుగు వారికి చల్లనిచూపే చాల ఇష్టం కడుపు చల్లన, చల్లనికబురు, తల్లికడుపు చల్లగా పుట్టిన, చల్లగా బతుకు చేతిచలువ వంటి దేసితనం పుక్కిలించే పలుకుబళ్ళు తెలుగున కోకొల్లలు చలిదేశాలలో పుట్టి చలినెగళ్ళ చుట్టూ తిరిగి రొమ్ములనకుపట్లు పెట్టుకు పెరిగిన ఇంగ్లీషువారికి చల్లదనమంటే చెడ్డచీదర వెచ్చదనమంటే మహాప్రీతి అందుకే హార్దికమైన స్వాగతాన్ని వామ్ వెల్‌కమ్ (warm welcome) వామ్ రెసెప్షన్ (warm reception) అని, వామ్ రిగార్డ్స్ (warm regards) అంటారు ఇంగ్లీషు వాళ్ళు దొంగయేడ్పును తెలుగువాళ్ళు మొసలికన్నీళ్లు కార్చడం అని వాడటం ఇంగ్లీషు ప్రభావానికి చక్కటి ఉదాహరణం క్రోకొడయిల్

టియర్స్ (Crocodile tears) అన్న ఇంగ్లీషు నుడికారానికి ఇవి మక్కికి మక్కి తెనిగింపు పరమపదించినవారి సంస్మరణ సభలలో ఆత్మకుశాంతి కలుగుగాక' అన్న ఇప్పటి తెలుగువారి వాడుక ఇంగ్లీషువారి 'May his soul rest in peace' అన్న పలుకుబడికి ముక్కస్యముక్క తెలుగుసేత ఈ ఇంగ్లీషు పలుకుబడి క్రైస్తవ మతవిశ్వాసానుకారి హైందవుల మతవిశ్వాసానికి విరుద్ధమైన అనువాదం తెనిగింపులో కనిపిస్తుంది అట్లాగే 'ఆ అమ్మాయి నవ్వింధని వాడు ఐసయి పొయ్యాడు, ఇది తెలిసి ఆ అమ్మాయివాళ్ళ నాన్న ఫైరయి పోయ్యాడు' అన్న వాడుకలుకూడా మనలో ప్రచురం సద్యస్స్ఫూర్తి కొరవడ్డ వ్యక్తిని 'ట్యూబ్‌లైట్' అని అడ్డపేరుపెట్టి తమాషా చేస్తుంటారు ట్యూబ్‌లైట్ మీటనొక్కిన వెంటనే వెలగదు వెలగనా వద్దా అన్నట్లు కాస్సేపు తటపటాయించి ఆపిమ్మట జిగేల్ మంటుంది I concur - నేనూ కంకరే, I love you, I love you too(two) I love you three - ప్రహసనాల వెనుకగల మిడిమిడి జ్ఞానపు - మిడిమేలపు దొరలగాధలు కొందరికే తెలుసు పెద్దాసుపత్రిలోని పురిటినొప్పులగలది (లేబర్ రూమ్) బోర్డును చూచిన లేబర్‌మినిష్టర్ గారొకరు 'ఇంటి ఆస్పత్రి'ని దర్శించేనపుడు లేబర్‌రూమ్' లేదేమి? అని అమాయికంగా అడిగిన ప్రశ్నలో ఈ పదబంధంలోని మొదటి రూపానికి గల ప్రకరణార్థంకాక మరొక అర్థం స్ఫురిస్తుంది

డచ్‌దేశాన్నీ, జాతినీ, భాషనూ ఒకనాటి తెలుగువాళ్ళు ఒలాందా/ ఒళాందా, వళందేజు అని పిలిచేవారు నేటి నెదర్లాండ్స్ (Netherlands) దేశానికి పూర్వవ్యవహార నామమైన హాలండ్ (Holland) కు ఇది సమీపోచ్చారణ పదాది 'హ' కారం డచ్చిభాషలో అనుచ్చరితం (silent) ఒళందా కిరువాలు, ఒళందావారిపేట - మొదలైన వాడుకలు నేటికీ కృష్ణాజిల్లాలో ప్రచురం బొబ్బిలి యుద్ధంలో 'వళందావారి షాజు' పాల్గొన్నట్లు

రంగరాయచరిత్ర పేర్కొంది 'ఈడమువళంద బందర యింగిలీషు' అని తెలుగునాటి సెట్లతో బేరమాడవచ్చిన విలాతిసీమ వర్తకులలో 'వళంద' దేశీయులన్నట్లునూ, రామచంద్ర పెరుమాళ్ళ తిరునాళ్ళ వేడుకలను తిలకించవచ్చిన జనసందోహంలో పరంగు లింగి లీసులు, పరాసులు వళందలు' ఉన్నట్లునూ హంసవింశతి కథనం దశావతార చరిత్ర కృతిపతియైన మగదల కృష్ణ మంత్రి మొదలైన ఆనాటి డచ్చి ఈస్టిండియా కుంఫిణీ కార్యకర్తలు 'పరదేశ భాషలు ప్రభువుకు వినిపింప' నేర్పుగలిగిన రాజనీతిపరులుగా రాణకెక్కినవారు ఆనందరంగరాట్ఛందం కృతిస్వామి అయిన ఆనంద రంగపిళ్ళె తండ్రి తిరువెంగడం పిళ్ళె 'ఫ్రాంసు హింగ్లీజు దినమార్గ యొలందా పురతకేశ ' మొదలైన భాషలలో దిట్ట అని పేర్కొబడ్డాడు (దినమార్గ - డెన్మార్క్, దేశపు (డేనిష్) భాష)

డచ్చివారు బీమ్లి (భీమునిపట్నం), విశాఖపట్నం, కాకినాడ, మాధవపాలెం, మచిలీపట్నం, పులికాట్ చెన్నపురి తూత్తుకుడి మొదలైనచోట్ల వర్తకస్థావరాలు నిర్మించుకుని తెలుగుదేశంతో ప్రత్యక్షసంబంధాలు ఏర్పరచుకున్న వారు డచ్చికుంపిణీవారు కార్యస్థానాలుగా, గిడ్డంగులుగా, నివాసస్థానాలుగా ఆనాడు కట్టిన నిర్మాణాలు కొన్ని శిథిలమైనప్పటికీ చాలభాగం మిగిలే ఉన్నాయి

డచ్ భాష ఇండో యూరపియన్ భాషాకుటుంబంలోని జర్మానిక్ శాఖకు చెందినది దీనినుంచి తెలుగులో ప్రవేశించిన పదాలు పాతిక పైచిలుకు ఉండవచ్చని లెక్కకట్టవచ్చు పేకాటలోని 'క్లబ్స్' (clubs) అనే పేక ముక్కను, డచ్చిభాషా పరిచయంవల్ల కాబోలు గ్రామీణులైన పేకాట రాయళ్ళు 'కళావర్' అని అంటారు కళావర్ జాకీ, కళావర్ రాణీ, కళావర్ కింగ్ కళావర్ ముక్కుపుడక - ప్రయోగాలు సైతం ప్రసిద్ధం ఇదే అర్థంగల క్లోవర్ (Klover) అన్న డచ్చిభాషా పదానికి ఇది పరిణత రూపం పేకాటలోనిదే అయిన 'తురుపు' (trump) కూడ డచ్చి భాష నుంచి వచ్చిందే

'టాయ్‌లెట్రీ'- ప్రసాధనమందిరం అన్నమాటకు పశ్చిమాంధ్రంలో కక్కస్/కక్కుస్ అనివాడుక కక్కస్‌దొడ్డి ఇపుడు శౌచాలయంగా వాడుక పడింది 'కక్ + హుయిస్' అన్న డచ్చి భాషాపదం దీనికి మూలం నూల్ కోల్ (**Knul koal**) దుంప, బత్తాయికూడా డచ్చిభాషనుంచి వచ్చినవే నూల్‌కోల్‌ను కొందరు 'నవలకింద' అని పిలవడం కద్దు 'నూల్' నవలగా మారింది ఆకారవిశేషాన్ని అనుసరించి 'కంద' కొత్తగా చేరింది బత్తా వియాదీవులనుంచి డచ్చి వర్తకులు తెచ్చిన ఫలవృక్షమే బత్తాయి మన నిఘంటుకారులు దేశ్యంగానో, వైకృతంగానో, సంస్కృత సమంగానో ఉల్లె ఖించిన 'పంపరమాస'కు తెలుగునాట కొన్ని జిల్లాలలో 'పంపర పనస' 'పంపర మనాస' అన్నవి రూపాంతరాలు పంపర —పృధుల అన్న వృక్ష విశేషమని సూ ని కారుల సూచన

# వ్యావహారిక భాషోద్యమ నేపథ్యం గిడుగువారి సారథ్యం

'ఏరోయ్! బరంపురం వాసనగాని తగిలిందా? అప్రాచ్యుడా! భాషను తగలేస్తున్నావ్! బెంచీ మీద నుంచో' 'ఓహో! పర్లాకిమిడిగాలి విసిరింది కాబోలు! అందుకా ఈ తప్పుల తడికలు! వందసార్లు ఇంపొజిషన్‌రాయి'- ఈ వెక్కిరింతలూ, ఈ వెటకారాలూ ఈ నాటివి కావు నాలుగైదు పుష్కరాల క్రితం నాటి ముచ్చట్లు తెలుగునాటి ఇసుకోలు బళ్ళలోనూ, కళాశాల తరగతుల్లోనూ తరచుగా వినిపిస్తూ వచ్చిన అవహేళన మిళాయించిన గద్దింపు సుద్దులివి విద్యార్థుల వ్యాసరచనలోగాని, పరీక్షల జవాబు పత్రాలలోకాని వాడుకభాషా ప్రయోగాలు తెలిసో, తెలీకో దొర్లితే ఇలా ఊరబ్బలు నారబ్బలుగా పెడబొబ్బలు పెట్టేవారు వీరగ్రాంధిక భాషాభిమానులైన తెలుగు పంతుళ్ళు వాడుకభాషకు 'వ్యావహారికం', 'శిష్టవ్యావహారికం' అన్న పరిభాషకూ అర్థచ్ఛాయలో సూక్ష్మభేదాలు ఉన్నప్పటికీ ఈ ప్రసంగంలో ఇవి మూడూ ఇంచుమించు సమానార్థకాలుగా స్థూల దృష్టితో స్వీకరించడం జరిగింది గ్రాంథికవాదులు దీనినే 'గ్రామ్య' మనీ పేర్కొనేవారు

ఆధునిక విద్యారంగంలోనూ, సాహితీవ్యాసంగంలోనూ మాధ్యమంగా పాతగిల్లిన కావ్యభాషను కాక సజీవమైన వాడుక భాషను ఉపయోగించాలన్న ఉద్యమానికి తమ జీవితాన్ని అంకితంచేసిన మహాభాగులు గిడుగు వెంకటరామమూర్తి పంతులుగారు ఆయన ఆనాటి గంజాం జిల్లా బరంపురం వైపునగల పర్లాకిమిడి పట్టణంలోని రాజావారి కళాశాలలో

ఉపన్యాసకులుగా బహుకాలం పనిచేస్తూ ఆ సీమ తమ కార్యక్షేత్రంగా వాడుకభాషా ఉద్యమానికి సారథ్యం వహించారు ఆయన తలపెట్టిన ఈ ఉద్యమంపై తొలినాళ్ళలో తెలుగునాట కొన్ని వర్గాలలోగల చిన్నచూపు వల్ల పంతులుగారి నివాసప్రాంతాలను ఉద్దేశించి ఈసడింపుతో ఇలా యెద్దేవా చేసేవారు సంకుచితబుద్ధులైన కొందరు ప్రబుద్ధులు

రమారమి క్రీస్తుశకం మొదటిశతాబ్దులనాటికే తెలుగుభాష వ్యాప్తిలో ఉన్నట్లు చరిత్రకారుల అంచనా ఆరో శతాబ్ది నుంచీ రాజాజ్ఞప్తి రూపాలుగానో ప్రభువుల విజయాంకాలుగానో ధర్మపరుల దానప్రకటన లేఖనాలుగానో, తెలుగునాట నెలకొన్న నూరారు తెలుగు శాసనాలలో పద్యరూపంగానో, గద్యరూపంగానో అచ్చమైన తెలుగుభాష కన్పిస్తుంది దీని స్వరూప స్వభావాలను విశ్లేషించి చూస్తే పద్యరూపంలోని భాషాశైలికి అనంతర యుగాలలోని కావ్యభాషాశైలి వరవడిగా నిలిచిందనీ, వచనరూపంలోని భాష సమకాలిక సామాన్యజనుల వాడుక భాషకు చాల సమీపంగా ఉండేదనీ ధ్రువపడుతుంది తెలుగునకు ప్రామ్కృతిక సాహిత్యస్థాయి అబ్బిననటికి కూడ తెలుగుభాషా ప్రవాహంలో ఒక పాయగా కావ్యభాష, మరొకపాయగా వాడుకభాష ఒకదాని సరసన ఒకటి ప్రవహిల్లుతూ పరస్పర ప్రభావితాలుగా ప్రవర్తిల్లుతూ వచ్చినట్లు నిర్ధారించవచ్చు వాడుకభాషను సంస్కరించగా రూపొందింది కావ్యభాష వాడుకభాష సర్వకాల సర్వావస్థలలో అశేషజనుల భావవాహకం కాగా కావ్యభాష అల్పసంఖ్యాకులైన జనుల పరిమిత ప్రయోజనం కోసం ఉద్దిష్టమైన లిఖితరూపవ్యవహారం

కావ్య ప్రబంధాలకూ శాస్త్ర గ్రంధాలకూ ఆయా కాలాలలో వ్యాఖ్యాకారులు కూర్చిన వ్యాఖ్యానాలలోనూ తీర్చిన టీకా తాత్పర్యాలలోనూ చాల మట్టుకు వ్యావహారిక భాషయె ఉపయోగించినట్టు ప్రత్యక్షసాక్ష్యం కావలసినంత ఉంది పదహారో శతాబ్దంనుంచి రూపొందిన వచనరచనలలో సైతం

అనాటి వాడుకభాష ప్రయుక్తమైంది కవనార్థం వాడినపుడు ప్రాయికంగా ప్రాచీన లక్షణబద్ధమైన శైలినీ శాస్త్రార్థాలు చేసినపుడు వ్యవహారిక శైలినీ ఉపయోగించినట్లు నిష్కర్షించవచ్చు మరి జానపదమాధ్యమాలైన పురాణ ప్రవచన హరికథా కాలక్షేపాదులు సాగినపుడు జానపదుల అంతస్తుకు దగ్గరదగ్గరగా ఉన్న స్థానిక శైలిని వాడక తప్పదు గదా! ఒగ్గు కథ, దాసరికం (దశావతారాలు), పగటివేషాలు, బయలాట, బుర్రకథ మొదలైన జానపద కళారూపాల ప్రయోగంలో జానపదుల జాను భాషయే ఉపయుక్తమవడం జగమెరిగిన సత్యం ఎటొచ్చీ ప్రభు పోషణమూ, పరిషదవలంబనమూ పొందిన కావ్య భాషకు తప్ప ఇతర మౌఖిక రూపాలకు అక్షర రూపం రావడానికి అవకాశాలు లేనందున అవి పరంపరీణంగా జానపద కళాకారుల నోటి వాడుకకే పరిమితం కావలసి వచ్చింది

జనరంజనం కోసమో, ఝుడితిస్ఫూర్తి కోసమో ప్రయుక్తమైన మహాకవుల లక్షణ విరుద్ధ ప్రయోగాలు లాక్షణికులకు తరచుగా కొరకరాని కొయ్యలుగా తయారు కాగా కవులు నిరంకుశులన్న సాకు చూపి ఈ ప్రయోగాలకు వారి ఔద్ధత్యం కారణమని సర్ది చెపుతూ వాటికి అనింద్య గ్రామ్యాలని పేరుపెట్టి సరిపెట్టుకుంటూ వచ్చారు లాక్షణికులు లక్షణ విరుద్ధమైన భాష గ్రామ్యమనీ తాము విధించిన నియమ నిబంధనలకు లొంగని ప్రయోగ రీతి అగ్రాహ్యమనీ వీరు ఎప్పటికప్పుడు ఎచ్చరికలు చేస్తూ, వాడుక భాషా ప్రయోగాలను నిషేధిస్తూ, జనప్రియ ధోరణి నిరోధిస్తూ, కట్టుదిట్టంగా బోలెడు గ్రంథం నడిపించారు

ఇలాగా తరతరాలుగా లాక్షణికులు నిరాకరించినా, సంప్రదాయ వాదులు నిరాదరించినా అనునిత్యం జనుల నాల్కలపై చిందులు వేస్తూ తీయందనాలు చిలికే పలుకుబళ్ళనూ, సుతారపు నుడికారపు సొంపులనూ మాచి మాచి కాదనడానికి మనసొప్పక స్వస్థాన వేష భాషా ప్రియులైన

మనకవుఌ కొందరు వాటిని రతనాలు మాదిరిగా ఏరి చికిలివేసి, చిత్రికపట్టి రచనలలో జవకట్టి తమ ప్రయోగపద్ధతికి పద్ధతిగా జిలుగు నగిషీలు చెక్కారు తిక్కన, సోమన, శ్రీనాథ, పెద్దనాది మహా కవులు ఈ ప్రలో భానికీ, ఈ ప్రలాభానికీ లోనైన మాననీయులే 'అప్పాచెల్లెంద్రు', 'ఇరువై యెన్మిది మూళ్ళమేర', 'నమ్మినమ్మకి', 'నుయిదాటే వానికిన్', 'నూటిరువై యెన్మిది భేదముల్', 'నెలరెణ్ణెల్లకు', 'ము నాళ్లు', 'చేసిందేమిటి' 'రోసిం దేమిటి', 'వస్తూచూ స్తిమి'— వంటి వ్యావహారిక ప్రయోగాలను కోకొల్లలుగా కొసరి కొసరి ధృతిమంతులూ, ప్రతవంతులూ ఐన ప్రామాణిక కవులు తమ చతురవచో విలాసంలో పదింబదిగా ప్రయోగించారు.

రాయల యుగానికి సమకాలికమైన రాయవాచకాదుల శైలినీ, ఆనాటి తెలుగు శాసనాల బాసతీరుతెన్నులను పరిశీలిస్తే ఆ బాణీ ఆనాటి వ్యావహారిక భాషా స్వరూపానికి ఎంత సమీపంగా నిలుస్తున్నదో తెలుస్తుంది మధుర - తంజావూరు సీమలను పాలించిన తెలుగు నాయక రాజుల కాలంలో యక్ష గానాది జనప్రియ రూపక రచనా ప్రయోగాలలో జనానికి చేరువైన వాడుకభాషకు మరింత విశిష్ట స్థానం లభించింది ఇంగ్లీషు ఈస్టిండియా కుంఫిణీ సర్కారు హయాంలోనూ, ఆ దరిమిలా రాణీ పరిపాలనా కాలం నుంచీ వాడుక భాషకు మహాదశ పట్టింది ఆర్థి రాజకీయరంగాలలో గొప్ప పరిణామం వచ్చింది పరిపాలనా వ్యవస్థలోనూ న్యాయస్థానాల లోనూ సామాన్యుల వాడుక భాషను చాలమట్టుకు వాడ తప్పలేదు పుస్తకాల భాషతోకాక జనుల వాడుక భాషతో కుంఫిణీ సర్కారువారికి సరాసరి సంబంధాలు ఏర్పరచు కోవలసిన అవసరం [illegible] కుంఫిణీ ఉద్యోగులూ, క్రైస్తవమత ప్రచారకులూ, [illegible] పాశ్చాత్య పరిశోధక పండితులూ తెలుగునాటి వాడుకభాషను నేర్చుకొని తమ తమ కార్యకలాపాలు నిర్వహించవలసి వచ్చింది.

అది వలసవిధానమే కావచ్చుగాని ఆంగ్ల విద్యా పద్ధతిలో అనేక విద్యా సంస్థలు స్థాపించడం మూలంగా ఆంగ్ల భాషా సాహిత్యాలతో, ఆలోచనా సంయోజనంతో సంక్రమించిన పరిచయాన్ని పురస్కరించుకుని దేశీయులైన విద్యాధికుల దృక్పథంలో సామాజిక సాంస్కృతిక రంగాల పరంగా ఎన్నెన్నో కీలకమైన మార్పులు పొడసూపాయి తాటాకు పుస్తకాలతో, కడిదం కవిలెకట్టలతో కుస్తీపట్టే కాలానికి స్వస్తిచెప్పి, కాగితం విరివిగా వాడుకలోకి వచ్చి అచ్చుకూటాలు తెలుగునేల నాలుగు చెరగులా నెలకొనడంతో వాడుక భాషా విషయంగా బ్రహ్మాండమైన పరిణామం ప్రవర్తిల్లింది సామాన్యులకు కూడా ఆధునిక విద్యాసౌకర్యాలు కొంత వరకు అందుబాటులోనికి వచ్చాయి రావిపాటి గురుమూర్తి శాస్త్రి, ఏనుగుల వీరాస్వామయ్య మొదలైనవారు ఆనాటి వాడుక భాషకు దగ్గరి శైలిలో రచించిన పుస్తకాలు వివిధ విద్యాసంస్థలలో పాఠ్యగ్రంధాలుగా నిర్ణీతమయ్యాయి లోకవృత్తాంత దర్శకాలుగా, ధీరవిచారుల ఆలోచనాధారకు భాష్యాలుగా, రాజకీయ సామాజిక విషయ చర్చావేదికలుగా అనేక వార్తా పత్రికలు అవతరించాయి ఇలాగా పరిపాలనా పరమైన అవసరాలూ ఆధునిక పద్ధతులలో విద్యాసంస్థల అవతరణమూ, ముద్రణాసౌకర్యాలూ, ఒక మోస్తరు వాడుక భాషలో దేశ భాషా పత్రికల ప్రచురణమూ, విద్యాధికుల సంఘ సంస్కరణాభిలాషా ఒకదానికొంటి తోడుకాగా వాడుక భాష అధికారికంగా రంగప్రవేశం చేయడానికి అనువైన నేపథ్యం సిద్ధమవుతూ వచ్చింది గత శతాబ్దం మధ్యలో వెలుగులోకి వచ్చిన సామినేని ముద్దు నరసింహనాయని 'హితసూచని' అన్న వ్యాస సంకలనం దీనికొక మచ్చుతునక బంగాళా రాష్ట్రంలో ప్రచలితమైన 'చలిత్' భాషోద్యమ ప్రతిస్పందన సైతం ఇందులో ఉందని చెప్పవచ్చు ప్రజల భాషపట్లను, దాని ప్రయోజనం పట్లను శాస్త్రీయమైన అవగాహనా, అజేయమైన వాదనా పటిమా కల గిడుగువారి సూత్రధారిత్వంతో దానికి మాంచి ఊపువచ్చి

నిర్దిష్టమైన రూపకల్పన పరికల్పితమైంది అంతేకాని, ఇదేదో ఉన్నట్టుండి ఒకానొక శుభోదయాన ఆకాశంనుంచి ఊడిపడ్డ ఉద్యమం మాత్రం కాదు అనాదిగా, అనుస్యూతంగా అధిక సంఖ్యాకుల నిత్యవ్యవహారంలో ఉండి కూడ రాజ్యాంగంలోనూ, విద్యా సాంస్కృతికాది రంగాలలోనూ గుర్తింపునకు నోచుకోక వాడుకభాష అచ్చంగా ప్రవాస జీవితం గడిపింది

ఈ శతాబ్దపు తొలిదశకంలో కళింగాంధ్రంలోని ఇసుకోలు బళ్ళ ఇన్స్పెక్టర్ యేట్స్ దొరగారి ప్రేరణతో గురజాడ అప్పారావు, బుర్రా శేషగిరిరావు, పి టి శ్రీనివాస అయ్యంగారు మున్నగు వ్యావహారిక భాషా ప్రియుల ప్రోత్సాహంతో గిడుగు రామమూర్తి పంతులుగారు వ్యావహారిక భాషోద్యమానికి సారథ్యం వహించారు 'గిడుగు గ్రాంథిక వాదం పాలిటి పిడుగు' అని వారి ఇష్టులు కొందరు కీర్తించినా గిడుగువారికి గ్రాంథికభాషపై ద్వేషంగానీ, చిన్నచూపుగానీ ఎంతమాత్రమూలేవు ఐతే దాని పరిమితులూ ప్రయోజనాలూ వేరని ఆయన మతం చదువుసంధ్యలూ, తక్కిన రాతకోతలూ వాడుకభాషాముఖంగా సాగాలన్నది ఆయన వాదం నన్నయగారినుంచి చిన్నయసూరిదాకా వెలసిన కవిపండితులు, గ్రాంథిక భాషలో నిర్మించిన తెలుగువాఙ్మయం నుంచి తప్పులను తవ్వి కుప్పలు కుప్పలుగా పోశారాయన సమకాలికులైన విద్వత్కవుల రచనలనుంచి తప్పుల తిప్పలను బట్టకెత్తి తూర్పారబట్టారు కొమ్ములు తిరిగిన ఉద్దండ పండితులే నిర్దుష్టంగా రాయలేని గ్రాంథికభాషాశైలిలో బడిపిల్లలూ సామాన్యులూ రాయాలని ఉద్దేశించడం అశాస్త్రీయమనీ ఆదేశించడం అన్యాయమనీ, అది ఏటికెదురీత వంటిదనీ గిడుగువారు పత్రికాముఖంగా ప్రబోధం కావించారు తెలుగు మాగాణమంతా తిరిగి సభాముఖంగానూ, విజ్ఞప్తులపరంగానూ ప్రచారం చేశారు

'ఆచార్యాద్వేదితా విద్యా' అంటారు నూటికో కోటికో తప్ప ఆ ఆచార్యుల బోధనాశైలి సైతం వ్యావహారికమేకదా! ఇంటా బయటా నూటికి తొంభై తొమ్మిది పనులకోసంవాడే మధురమైన నిసర్గశైలిని విస్మరించి కేవలం పాతబడ్డ పాఠ్యగ్రంథాల బాణీని బట్టిపట్టి ఒంటబట్టని కృతకమైన శైలిలో జవాబులు రాయాలని పిల్లలను నిర్బంధించి వేధించడం అందని పొందని ధోరణికదా! అని ఎవరికైనా అనిపిస్తుంది మద్రాసురాష్ట్ర విద్యా శాఖవారు నియమించిన తెలుగు కాంపొజిషన్ కమిటీ గిడుగువారి వాదంలోని ఔచిత్యాన్నీ, అవసరాన్నీ గుర్తించి వాడుకభాషను సిఫార్సుచేసింది, దానిని ప్రభుత్వం అమలుపరచింది

ఈ వాడుకభాషా ఉద్యమానికి ప్రతిస్పర్థులుగా గ్రాంధికభాషా వాదులైన హేమాహేమీలు - జయంతి రామయ్యపంతులు, కొమర్రాజు వెంకటలక్ష్మణరావు వేదం వెంకటరాయశాస్త్రి శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి వావిలకొలను సుబ్బారావు కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి ప్రభృతులైన గురు వృద్ధులు ఎందరెందరో గిడుగువర్గాన్ని ప్రతిభటించి గిడుగువాదాన్ని ప్రతిఘటించి సకల యుక్తులనూ సర్వశక్తులనూ మోహరించి, ఓహరి సాహరిగా పోరాడారు అచ్చంగా ఆనాడు అదొక కురుక్షేత్రమే అయింది పదస్థుల బలంతో, ప్రాచీనవాదుల బలగంతో కాంపొజిషన్ కమిటీ నిర్ణయా లను తిరగతోడడంతో 'సరళ గ్రాంథికం' పేర గ్రాంథికవాదానిది పైచేయి అయింది ఆ దశలో 'గిడుగు రామమూర్తి నుడుగు నిల్వకపోయె ఒగి జయంతి రామయోక్తి గెలిచె' అని వడ్డాది సుబ్బారాయకవి వంటి వివాద వివరులు ఉద్ఘాటించినా కడకు గిడుగువారి నుడుగే గెలిచింది, తెలుగుల వాడు భాషకు అది గొడుగుగా నిలిచింది మంచి మార్పులకోసం ఉద్దేశించిన ఉద్యమాలకు మారొడ్డి నిలవడము, క్రమంగా వాటి ధాటికి తట్టుకోలేక అంతరించడమూ కొన్ని తిరోగమనశక్తుల సహజలక్షణం ఇది సృష్ట్యాదిగా సామాజిక వ్యవస్థలో సాగుతూవస్తున్న సమరప్రక్రియ

రాష్ట్ర ప్రభుత్వమూ రాష్ట్రంలోని విశ్వవిద్యాలయాలూ అవలంబించిన వ్యావహారిక భాషా ప్రయోగానుకూల వైఖరి ఫలితంగా సుమారు ఐదారు పుష్కరాలుగా కొనసాగుతూ వచ్చిన గ్రాంథిక వ్యావహారిక భాషా వివాదానికి తెరపడింది ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నియమించిన లక్ష్మీకాంతం కమిటీ, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు నియమించిన అప్పారావు కమిటీ, వెంకటేశ్వర విశ్వవిద్యాలయం వారి విద్యావిషయిక మండలీ, ఉస్మానియా విశ్వవిద్యాలయం వారి ప్రాచ్య భాషా పండిత పరిషత్తూ చూపిన చొరవా, చేసిన సిఫార్సులూ వ్యావహారిక భాషోద్యమానికి అధికారికమైన అదనపు బలాన్ని సమకూర్చాయి మాండలికస్పర్శకు అతీతమైన నేటి ఆధునిక ప్రామాణిక భాషావతరణకు నాటి వ్యావహారిక భాషోద్యమం ప్రధాన భూమికగా ప్రవర్తిల్లింది ఇందులో ప్రముఖ రచయితలు, ప్రసిద్ధ ప్రచురణ సంస్థలు, నవ్యసాహితీ సంస్థ అభ్యుదయ రచయితల సంఘం, ఆకాశవాణి, తెలుగు పత్రికలు చేసిన విశిష్టకృషి విస్మరించరానిది ప్రస్తుతం అన్ని విశ్వవిద్యాలయాలలోనూ, అన్ని స్థాయి భేదాలలోనూ చివరకు బడిపిల్లల వాచకాల రచనలలోనూ వ్యావహారిక భాషకు అధికారికమైన స్థానం లభించింది తెలుగు నేర్చుకోదలచిన-వయోజనుల ప్రవాసాంధ్రుల ఆంధ్రేతరుల, ఉద్యోగుల, ఇతర జిజ్ఞాసువుల-అవసరాలదృష్టిలో కూడ ఈ మార్పు ఎంతో సముచితమని ప్రస్పష్టంగా రుజువైంది

గ్రాంథికవాదులు ఏ కొందరోతప్ప నేడు చాలమంది రచయితలు వ్యావహారి భాషాశైలిలో సృజనాత్మక, విమర్శనాత్మక రచనలు చేస్తున్నారు ఛందఃప్రవాహం సన్నగిల్లింది పద్యరచనాశక్తి పాతబడింది 'ఛందోబందోబస్తుల' బాదరబందీ లేనందున కేవలం ప్రతిభావంతులేకాదు శబ్దప్రభుతా, శాస్త్రప్రతిష్ఠాగల ప్రతిపత్తిమంతులు సైతం గేయభణితిలో చిట్టచివరకు జానపదులబాణీలో విశిష్టకావ్యసృష్టి కావిస్తున్నారు ఆకాశవాణి,

వార్తాపత్రికలు, చలన చిత్రసీమ, రూపకప్రయోగరంగం, వివిధ గోష్ఠి చర్చా సభా వేదికలు, బోధనా మాధ్యమం, శాస్త్ర సాహిత్య విద్యా వ్యాసంగం, అక్షరాస్యతా ప్రసార విభాగం, విశ్వజనీన విద్యావ్యాప్తి, ప్రభుత్వ యంత్రాంగం మున్నగు ఆధునిక ప్రచార సాధనాలన్నింటిలోనూ, భాషావ్యాపక విధానాలన్నింటిలోనూ వ్యావహారిక భాషే ముక్కాలుం మువ్వీసం పాలు ఏకైక భావవాహకంగా చలామణీ అవుతూ మౌలికమైన భాషా ప్రయోజనాలకు సార్థకతను చేకూరుస్తున్నది

వ్యావహారిక భాషానుసరణం స్వధర్మమేకాని పరధర్మం కాదు విశిష్య, యుగధర్మం అతి విశాలమైన ధర్మస్వరూపంలో యుగధర్మం ఒక భాగం అంతేకాదు 'రాజా ప్రకృతి రంజనాత్', 'రాజానుమతో ధర్మః' అని వట్టినే అనలేదు పెద్దలు ఇది రాజధర్మం, రాజ్యాంగ ధర్మం 'సారపు ధర్మమున్ విమల సత్యము ' మన ఆదర్శమని సారదిదృక్షామతుల అభిమతం అదే మన మతం, అదే మన వ్రతం

# భాషలో వస్తున్న మార్పు

మన ఆలోచనలనూ, అభిప్రాయాలనూ ఆవిష్కరించే సాధనాలలో భాష చాలా ముఖ్యమైన పాత్రను నిర్వహిస్తున్నది పరాపశ్యంతీ మధ్యమా వైఖరీ వాక్కుల మాట అటుంచి వివేచిస్తే దీనికి రెండుదశలు మొదటిది ధ్వనిసంకేతం, రెండోది రేఖాసంకేతం ధ్వని రూపదశ ప్రాచీనం, రేఖా రూపదశ అర్వాచీనం ధ్వనిరూపంగానో, రేఖారూపంగానో భావాలను గ్రహించేవారు క్రమంగా శ్రోతలూ, చదువరులూ ఒళ్ళువిరుపూ, ఓర చూపూ, కోరచూపూ, కళ్ళకదలికా, తల ఆడింపూ, తల బరుకుడూ, తొడ చరపూ, నుదుటి చిట్లింపూ, పిడికిలి బిగింపూ, పెదవిపై పంటినొక్కూ, పెదవి విరుపూ, పెదవులు నాకుకోవడం, బుజాల ఎగరవేతా, బొమముడి తీరూ, చేతుల కదలికా, ముక్కు విరుపూ, మూతిముడుపూ, మొగం మురకటింపూ మున్నగు శరీరావయవ విన్యాసాలవల్ల కూడా భావప్రసారం కొంతమట్టుకు సాధ్యమేకాని ఇవి భాషేతరమైన భావప్రకటనా సాధనాలు, భాషలో భాగాలు మాత్రం కావు అతి తీవ్రమైన అనుభూతులనూ, అభిప్రాయాలనూ అదే స్థాయిలో ప్రకటీకరించడం విశాలశబ్దవశీకారంగల వారికైనా కష్టసాధ్యం శబ్దసంపత్తి కొరవడినప్పుడూ, సమయస్ఫూర్తి చాలనప్పుడూ హస్తవిన్యాసాదికాలు భావప్రకటనలో పరిపూరకంగా సైతం పనికి వస్తాయి

పైకి చూడడానికి ప్రతి భాషలోనూ సమరూపత ఉన్నట్లు కనిపిస్తుంది శాస్త్ర లోతుకు వెళ్ళి పరికిస్తే అందులో ఎన్నెన్నో భేదాలు పొడగట్టుతాయి భాషా వ్యవహర్తలందరిలో ఆలోచనాయోజనంకానీ, గ్రాహక

శక్తిగానీ, భావప్రకటనాశక్తిగానీ ఒకే మోతాదులో ఉండవు ఎందుకంటే ఈ శక్తులకు భూమికలైన వీరి సంస్కారం, సమకూర్చుకున్న శబ్దసంపత్తీ వేరువేరు నేపథ్యాలమీద ఆధారపడి ఉంటాయి వ్యవహర్తల వయస్సూ, చదువు సంధ్యలూ, సాంఘికస్థాయీ స్త్రీ పుం భేదం, చేపట్టిన వృత్తీ పుట్టి పెరిగిన పరిసరాలూ ఇతర ప్రాంతాలతో గల పరిచయాలు - ఇలాగా వ్యక్తి మూర్తిత్వ కల్పనలో పాత్రవహించే సవాలక్ష అంశాలు ఇందులో అంతో ఇంతో పాలుపంచుకుంటూ ఉంటాయి

అంతేకాదు, నిర్దిష్ట సంస్కారబలము , విశిష్ట శబ్దప్రభుతా కల ఒకే వ్యక్తి వేరువేరు వ్యక్తులతో, వేరువేరు సన్నివేశాలలో విభిన్నమైన భాషా శైలులను ఉపయోగించగా గమనించడం మనకు కొత్తకాదు ఒక వ్యక్తి ఇంట్లో నౌకర్లతో, చాకర్లతో పనిపాట్లను గూర్చి మాట్లాడేటప్పుడు వాడే శైలికీ, కుటుంబసభ్యులతో మాటామంతీ చెప్పుకునేటప్పుడు వాడే శైలికీ, వృత్తిపరమైన కార్యక్రమాలలో వినియోగించే శైలికీ ఎంతో తేడా ఉండి తీరుతుంది ఉదాహరణకి గృహిణుల విషయమే తీసుకుందాం వారు పని మనిషితో పాలమనిషితో, పత్రికల కుర్రాడితో మాటాడేటప్పుడూ కూర గాయలమ్మితో బేరసారా లాడేటప్పుడూ ఉపయోగించే శైలికీ, పక్కింటి పిన్నిగారితో, ఎదురింటి బామ్మగారితో పిచ్చాపాటీ సాగించేటప్పటి శైలికీ తప్పనిసరిగా భేదం ఉంటుంది అలాగే, రోజువారీ పనులకు చెందిన సామాన్య విషయాలు ప్రస్తావించేటప్పుడు వాడే శైలికీ, సాహితీ చర్చలలో సాంకేతిక గోష్ఠులలో సాంస్కృతిక కార్యకలాపాలలో వాడే శైలికి అజ గజాంతరం ఉంటుంది

సంస్కృతి పరమైన ప్రచార విధానాలూ, ప్రసార సాధనాలూ అన్ని సమాజాలలో అన్ని కాలాలలో ఒకే మోస్తరుగా రూపొంది ఉండ జాలవు ఆనాటి అవకాశాలనుబట్టీ, ఆవశ్యకాలను బట్టీ అవి పుట్టి పురుడు

తీర్చుకుంటూ ఉంటాయి నాడూ నేడూ తెలుగునాట విలసిల్లిన ప్రచార కళారూపాలను పరిశీలిస్తే ఈ ప్రతిపాదన స్పష్టమౌతుంది మొన్న మొన్నటిదాకా ఈనాట చదువుకున్న వారి సంఖ్య బొత్తిగా తక్కువ అందులోనూ పురాణేతిహాస కావ్యాదికాలను సొంతంగా, సొంతంగా చదివి అర్థం చేసుకుని ఆనందించేవారి సంఖ్య ఏ జనపదంలో చూచినా వేళ్ళమీది లెక్క అందుకని ఈ సమాజానికి అవసరమైన ఆధ్యాత్మిక వ్యావహారిక విషయాలను ప్రజలలో ప్రచారం చేయడానికి కొన్ని కళారూపాలూ, వీటిని ప్రదర్శించి ప్రవచించి ప్రస్తారించడానికి పలురకాల ప్రచారకులూ ఏర్పడడం తప్పనిసరి అయింది అందుకనే ఆసాదివారి నాటకాలూ ఒగ్గు కథా, గొల్లసుద్దులూ, చిందుభాగవతము జముకుల కథలూ, పగటి వేషాలూ, పురాణ కాలక్షేపాలూ బయలాటలూ బుర్ర కథలూ, బొమ్మ లాటలూ, యక్షగానాలూ, వాలకాలూ, వీథి భాగవతాలూ, హరికథా ప్రవచనము మొదలైన జానపద మాధ్యమిక కళారూపాలకు విశేషప్రశస్తి వచ్చింది ఇలాగా కళాకారులైన మధ్యవర్తుల ముఖంగా ప్రాచీన విజ్ఞానమూ ప్రాపంచిక వ్యవహారాలూ సామాన్య ప్రజలకు అవసరాలకు తగినంత మట్టుకు ఎప్పటికప్పుడు అందుబాటులో ఉంటూ వచ్చాయి మధ్యవర్తులైన ఈ వ్యాఖ్యాతలు తమ ఎదుటనున్నవారి అంతస్తులకు అనుగుణంగా వారి అభిరుచులను కూడా దృష్టిలో పెట్టుకుని జనరంజనం చేసేవారు అయితే ప్రాచీన సాహిత్య పరన పారనాలను దృష్టిలో పెట్టుకుని పాతకాలపు చదువు సాములు సాగినందున పాండిత్య ప్రకటనకై సాగిన పాకులాట అందులో కన్పిస్తుంది

విజ్ఞానాత్మకాలూ, వినోదాత్మకాలూ అయిన రచనలు గ్రంథాదికాల ముఖంగా లిపి రూపంలోనూ, ఆకాశవాణి ముఖంగా ధ్వని రూపంలోనూ ప్రచారమవుతున్నాయి దేని పరిమితులు దానికున్నాయి దేని ప్రయోజనాలు దానికున్నాయి రేడియోలో వక్తకు ఎదురుగా శ్రోతలుండరు ప్రసార

మయ్యే ధ్వని ఒక్కటే ఈ సాధనానికి ఆధారం శ్రోతల ఎదుట వక్త హస్త విన్యాసాదికాలవల్ల ప్రకటించే అదనపు భావప్రకాశన సౌకర్యం రేడియోప్రసారంలో ఉండదు కాని భాషలో ముఖ్య భాగాలైన ఉచ్చారణా పరమైన ఊపూ ఒడుపూ, నొక్కూ పెక్కూ, విరుపూ విరామమూ, ఇతర కాకుస్వర భేదాలు రేడియో ప్రసారంలోని వాగ్రూప భావప్రకటనకు అదనపు బలాన్ని సమకూరుస్తాయి అయితే హస్తవిన్యాసాదికాలూ ఉచ్చారణ వైవిధ్యాలూ నిర్దేశించడానికి సాంప్రదాయిక వర్ణ సమామ్నాయంలో రేఖా సంకేతాలు లేనందున లిపి రూపమైన భాషా ముఖంగా చదువరులు అనంతమైన వాటి అందాల అంచులను అందుకోలేరు

భాషయొక్క ప్రయోజనం శ్రోతలకూ, చదువరులకూ చెప్పిన బోధపడడమే కాదు, శ్రోతల - చదువరుల అంతస్తులకు అనురూపమైన శైలిని వాడినప్పుడే దాని ప్రయోజనం పరిపూర్ణంగా నెరవేరుతుంది అలాకాక ఎవరిదారి వారిదైతే ఆ ప్రసంగాలు గాని ఆ రచనలు గాని చెప్పేదేదో చెవికెక్కక చదివేదేదో మనసుకు పట్టక మూగ చెవిటివారి ముచ్చటలాగా మారక తప్పదు అయితే మన వక్తల రచయితల ధోరణి ఎలా ఉందో ఒకసారి పరిశీలిద్దాం ఎవరిని ఉద్దేశించి, దేనిని గూర్చి తమ భావాలను ప్రకటిస్తున్నామో అన్న దృష్టి వారికున్నంతమాత్రాన చాలదు శ్రోతలనుగాని, చదువరులనుగాని ఆకట్టుకుని తనవెంట లాక్కుపోయే శక్తిమంతమైన శైలిని ఉత్తమమైనదిగా చెప్పవచ్చు అందుకే 'మధుమతీం వాచం', కళ్యాణీం వాచం హృదయ హారిణీమ్' మధురమనోహరమూ, కళ్యాణకారకమూ హృదయరంజకము అయిన వాక్కు ఉత్తమ సంస్కారానికి చిహ్నమని పెద్దలు అంటూ ఉంటారు భరతాది ప్రాచీనాలంకారికులు సైతం రూపక ప్రయోగంలో పాత్రోచిత భాషయొక్క ప్రాముఖ్యాన్ని పదే పదే గుర్తుచేస్తూ వచ్చారు పాత్రోచితమూ, ప్రకరణోచితము కాని భాషా ప్రయోగ ఫక్కీ అటు శ్రోతలనూ, ఇటు చదువరులనూ అలరించలేదు

ఉదాహరణకి ఆకాశవాణి ప్రసారాలనే పరిశీలిద్దాం నగరాలలోనూ, పట్టణాలలోనూ నివసించే పై అంతస్తు నడిమి అంతస్తులకు చెందిన శ్రోతలను దృష్టిలో పెట్టుకునే నిన్నా మొన్నటిదాకా ప్రసారాలు ఎక్కువగా సాగుతుండేవి ఇపుడు పల్లెపల్లెకూ, వాడవాడకూ, గడప గడపకూ రేడియో లొచ్చాయి అందువల్ల ఆకాశవాణి యంత్రాంగంలో, మంత్రాంగంలో చాల పెద్ద మార్పు రాక తప్పలేదు జనాభాలో అధిక సంఖ్యాకులైన జానపదులవైపు చూపు మళ్ళింది వారి కార్యక్రమాల ప్రసార కాలం హెచ్చింది వాటిలో వైవిధ్యంకూడా వచ్చింది బాలలూ మహిళలూ, కార్మికులూ, కర్షకులూ మున్నగువారి నుద్దేశించి అనేక కార్యక్రమాలు రూపొందించబడ్డవి ప్రాథమిక, మాధ్యమిక ఉన్నతపాఠశాలా విద్యార్థులకూ, కళాశాలల విద్యార్థులకూ ఇతర యువజనులకూ ఆవశ్యకమైన అంశాలతో కార్యక్రమాలు ప్రసారమవుతున్నవి విద్యావైజ్ఞానిక విషయాల పట్లనే కాక పైరుపంటలకూ, పశువుల పెంపకాలకూ ఇతర అనుబంధ వృత్తులకూ సంబంధించిన కార్యక్రమాలుకూడ అమలులో ఉన్నవి వీలైనంతవరకు ఆ యా అంతస్తుల శ్రోతల అభిరుచుల కనుగుణంగా పద జాలాన్ని ఉపయోగించడంలో రేడియోసిబ్బంది ఇతర రచయితలూ కొంత వరకు కృతకృత్యులయినట్లే చెప్పవచ్చు

ప్రభుత్వ పాఠ్యప్రణాళికల మేరకు తయారవుతున్న బడిపిల్లల వాచకాల రచనలలో కూడ అవసరమైన మార్పులను, మౌలికమైన మలుపులను ప్రవేశపెట్టాలన్న తపన అటు ప్రభుత్వవిధానంలోనూ, ఆచరణలో అధికారవర్గంలోనూ, ఇటు రచయితలలోనూ కనిపిస్తుంది అయితే, నిర్దిష్టమూ, నిర్దుష్టమూ అయిన విధానం లేకపోవడంవల్లనూ, ప్రణాళికా రచనలో శాస్త్రీయదృష్టి కొరవడడంవల్లనూ, ప్రణాళికను అమలు పరచడంలో సరియైన సమన్వయశక్తి లోపించడంవల్లనూ, భాషాశైలి పరంగా పిల్లల వాచకాలలోను, తక్కిన పఠనసామగ్రిలోను ఆశించినంతగా

మంచిమార్పు వచ్చిందని చెప్పలేం కొన్ని వాచకాలలో గ్రాంథికము, కొన్నింటిలో వ్యావహారికమూ ఉపయోగించడం ఆ యా వాచకాలలో వాడిన పదజాలం పిల్లల వయస్సుననుసరించి ఒక నిర్ణీతమైన ఆరోహణ క్రమంలో రూపొందినవి కా పోవడంవంటి ముఖ్యలోపాలు వాచకరచనలో కొట్టివచ్చి నట్లు కనిపిస్తాయి వేర్వేరు తరగతుల వాచకరచయితల సంపాదకుల మధ్య సరియైన సమన్వయంలేని కారణంగా పాఠ్యవిషయాల ఎంపికలో పునరుక్తికూడ పొడసూపింది కొన్ని కొన్నిచోట్ల పై తరగతి వాచకాల కంటే కింది తరగతి వాచకాల భాష కఠినంగా ఉన్న ఘట్టాలుకూడా లేకపోలేదు

బాలల కోసమని అనేక పత్రికలు వెలువడుతున్నవి బాలల కథా సాహిత్యం సైతం గణనీయంగా పెరిగింది జానపద సాహిత్యానికి అను కరణంగా బాలసాహిత్యం కుప్పలు తెప్పలుగా వచ్చిపడుతున్నది ఇందలి భాష బాలలకంటే బాలబుద్ధులైన వృద్ధులనే ఎక్కువగా ఆకర్షిస్తున్నట్లు గమనించవచ్చు భాషాశైలి విషయంగా ఇంకా ఎక్కువ శ్రద్ధను చూప వలసిఉంది పొడుగాటి సంస్కృత సమాసాలనూ, పిల్లల అంతస్తుకు అందని మాటలనూ, అనుభవానికి మించిన అభిప్రాయాలనూ పరిహరిస్తే తప్ప ఇందలి శైలిగానీ, విషయంగానీ రక్తికట్టవు, ఆశించిన ప్రయోజనం సిద్ధించదు

నిర్బంధంగా నైతేనేమి - స్వచ్ఛందంగా నైతేనేమి తెలుగునాట, చదువరుల సంఖ్య ఏటేటా పెరుగుతున్నమాట వాస్తవం ఇలాగా అంతో ఇంతో అక్షరజ్ఞానం సంపాదించుకున్న సామాన్య పాఠకుల జ్ఞానతృష్ణను తీర్చడానికి సరిపడా పఠనసామగ్రి తెలుగులో తయారైలేదు కాస్తో కూస్తో ఆ ఉన్నది సైతం వారి స్థాయికి తగినట్లుగానూ, ఉత్తమాభిరుచులను పెంపొందించేదిగానూ ఉందని చెప్పలేం భాషమాట అలాఉంచి క్షణికో

ప్రదేశాలనూ, హింసాత్మక ప్రవృత్తినీ రెచ్చగొట్టే క్షుద్రసాహిత్యం ఇబ్బడి కొద్దీ విడుదలై యువజనతను చెడుదారులు - పెడదారులు పట్టిస్తున్నది దీనిపై గట్టి అదుపులేకపోతే యువత గమ్యం అగమ్యంగా, అయోమయంగా తయారవుతుంది

శాస్త్రీయ - సాంకేతిక విజ్ఞానం గూర్చి ఎంత సులభశైలితో రచించినా ప్రవచించినా చదువరులకూ శ్రోతలకూ ఆ యా రంగాలలో ప్రాథమికమైన పరిచయమంటూ లేకపోతే అర్థంకాదు మహాఅయితే గురికి బారెడుదూరంగా అర్థం అయినట్టు కానట్టూ ఉంటుంది మాటవరసకి ఐన్‌స్టీన్ సాపేక్ష సిద్ధాంతం గూర్చి, ఆడమ్‌స్మిత్ అర్థిం విశ్లేషణం గూర్చి కారల్‌మార్క్స్ గతితార్కిక భౌతిక సిద్ధాంతం గూర్చి, పాణినీయ వ్యాకరణ పరిభాషా కల్పనాశిల్పం గూర్చి మామూలు మాటలలో చెప్పినా వినేవారికీ చదివేవారికీ ప్రాథమిక పరిజ్ఞానం లేంపోతే గోడ అడ్డం పెట్టినట్లుగా ఉంటుంది అందుచేత అన్ని ప్రసంగాలూ అన్ని అంతస్తుల శ్రోతలనూ అలరిస్తాయని అంచనావేయడం సరికాదు

జానపదులను ఆకట్టుకోగల భాషను పట్టుకుని ప్రయోగించడంలో ప్రసిద్ధ రచయితలు కొందరు తబ్బిబ్బు పడుతున్నట్లు మనం గమనించ వచ్చు ఎంత చిత్రికపట్టి, ఎంత చికిలిపెట్టి శైలిని వినియోగించినా చెప్పదలచిన దానిని సూటిగా చెప్పలేకపోతున్నారు కొందరు రచయితలు సందర్భ శుద్ధిలేని వర్ణనలతో, సన్నివేశానికి వ్యర్థ పదాడంబరంతో తమ రచనలను ముంచెత్తుతున్నారు ముఖ్యంగా తమకు సుపరిచితం కాని పాత్రల సంభాషణలలో కృతకమూ, ఊహాసిద్ధము అయిన యాసను ప్రవేశపెట్టి తాము నవ్వుల పాలవడమేకాక చదువరులను తికమకపెట్టి ఆయా పాత్రలకు తీరని అన్యాయం చేస్తున్నారు చేతకానప్పుడు తమకు

సుపరిచితంకాని నేపథ్యం గల కథా వస్తువులనూ, సన్నివేశాలనూ, పాత్రలనూ ఎన్నుకోకుండా ఉండడం సర్వులకూ శ్రేయం జనుల నాడినీ, వారి పలుకుబడి వాడినీ నిదానించి శిల్పించిననాడే అది సహజమూ, సార్థకమూ ఐన కళారూప మవుతుంది

దిన దినము లోకం పోకడలనూ, దేశ దేశాల తీరుతెన్నులనూ తెలుసుకోదలచిన అన్ని అంతస్తుల చదువరుల బతుకు పయనంలో తప్పని సరి 'దారి బత్తెం'గా తిరుగులేని 'దినవెచ్చం'గా తయారైన పత్రికల పాత్ర భావ ప్రసార విధానాల పరంగాను, భాషా ప్రచార సాధనాల పరంగాను విశిష్టమైనది పాఠకుల ఆలోచనాలోచనాలను సుదూర క్షితిజ తీరాలకు ప్రసరింపజేయడంలో అవి ప్రదర్శిస్తూ వస్తున్న మాపూ, చొరవా అనన్య సామాన్యమైనవి అంతేకాదు, ఆధునిక ప్రామాణిక వ్యావహారిక భాషా శైలీ స్థిరీకరణంలోను, సకలాంధ్ర మాండలిక భాషా సమన్వయం లోను, విశేషించి వినూత్న పరిభాషా కల్పనంలోను బహుముఖమైన వీటి కృషి విలువకట్టలేనిది, విస్మరించరానిది

పల్లెపట్టులలోని రైతాంగం ఎన్నెన్నో ఆధునిక పద్ధతులనూ, పరి కరాలనూ తమ పొలం పనులలో వినియోగించడం మనకు తెలుసు వారికి సంబధించిన రేడియో కార్యక్రమాలలో కొత్త పదాలనేకం చోటు చేసుకుంటున్నవి రైతుల రోజువారీ వాడుకలో నలుగుడు పడుతున్న ఇంగ్లీషు పదాలనేకం తెలుగు పదజాలంలో భాగంగా కలిసిపోయినవి ఎండ్రిన్, ఎస్ పి కె గమాక్సిన్, పొటాష్, యూరియా, సల్ఫర్, సూపర్ వంటి పైర్ల ఎరువులూ, పంటతెగుళ్ళ మందులూ అయ్యపరెడ్డి (ఐబ్రిడ్), కరెంటు, కెనాల్, క్రేన్, జెర్సీ, ట్రాక్టర్, డైరీ, పౌల్ట్రీ, పాస్‌బుక్, బోర్‌వెల్, లోన్, సబ్సిడీ, సాయిల్‌టెస్ట్ సీజన్-మొదలైన సేద్యానికి సంబంధించిన మాటలు పేర్కొదగ్గవి సంస్కృతం 'వంశ'

శబ్దభవమూ, తెలుగులో తద్భవమూ ఐన 'వంగడం' నిన్నటిదాకా పాత పుస్తకాలలో మాత్రమే కనిపించేది పైరుపచ్చల రకాలు అనే అర్థంలో వంగడాలు అనే మాటను ప్రవేశపెట్టింది వ్యవసాయ పరిశోధకశాఖవారే ఐనా ఈ వాడుకను ప్రచుర ప్రచారంలోకి తెచ్చింది ఆకాశవాణి తెలుగు దేశంలోని అన్ని ప్రాంతాల, అన్ని వర్గాల జనులకూ ఒకేసారి వినిపించడం వల్ల మాండలిక స్పర్శకు అతీతమైన ఒక ప్రామాణిక భాష రూపొంద డానికి మన పత్రికలతోపాటు ఆకాశవాణికూడా సమర్థమైన పాత్రను నిర్వహించిందని మెచ్చుకోకతప్పదు

స్వతస్సిద్ధమైన అందచందాలెన్ని అమరి ఉన్నా అదనుకు అను గుణమైన ముస్తాబు లేకపోతే ఏదీ రాణించదు అవసరాలనుబట్టీ, పరిసరా లనుబట్టీ మన హృదయాలకు అద్దం వంటిదైన భాషకూడా బొట్టూ కాటుకా దిద్దుకుంటుంది

# తెలుగు మాండలికాలు : విచిత్రాలు

కర్నూలు ఆంధ్ర రాజధానిగా ఉన్నరోజులవి విశాఖజిల్లాలో పుట్టి పెరిగిన ఒక మంత్రిగారు వాకిలికావలి బంట్రోతును పిలిచి రోజువారీ ఇంటర్వ్యూలు ముగిసే సమయంలో పైన ఇంకెవరైనా ఉన్నారా ? అని అడిగారు కర్నూలుప్రాంతానికి చెందిన ఆ బంట్రోతు గదివెలుపలికి వెళ్ళి భవనం పైభాగం వైపు చూస్తూ ఉండిపోయాడు బయటికి వెళ్ళిన బంట్రోతు ఎంత సేపటికీ తిరిగిరానందున విసుగెత్తి మంత్రిగారే స్వయంగా గదివెలుపలికి విచ్చేసి చూడగా ఆ బంట్రోతు మేడ పైభాగం వైపు అదే పనిగా చూస్తూ ఉండడం గమనించారు 'ఇదేమి'టని అడిగితే 'పైన ఎవరైనా ఉండారేమో చూడమంటిరి గదా, దేవరా !' అని బంట్రోతు జవాబు భాషపట్లా, సాహిత్యంపట్లా ప్రత్యేకదృష్టి కలిగిన ఆ మంత్రిగారికి అసలువిషయం బోధపడింది విశాఖజిల్లాలో 'పైన ఎవరున్నారు' 'పైకి వెళ్దామా' అన్నవాడుకలు వెలుపల, బయట అనే అర్థాలలో ప్రసిద్ధం పైన అంటే రాయలసీమలో మీద అని అర్థం

తెలంగాణా ప్రాంతీయులైన ఒక ప్రొఫెసర్‌గారు తెలతెలవారుతుండగా రాజమండ్రిలో రైలుదిగి జానపద వాఙ్మయోద్ధారకులు నేదునూరి గంగాధరంగారిని చూడవచ్చిన ఉదంతం వినండి గంగాధరంగారి ఇల్లు విక్రమహాలు సమీపంలో ఉంటుందని చెప్పారెవరో ఆ ప్రొఫెసర్‌గారికి దారిలో కనిపించిన వారినీ వీరినీ అడుగుతూ వెళ్తున్నారాయన ఇంటిముందు కళ్ళాపిచల్లి రంగవల్లికలు తీరుస్తున్నదొక పడుచుపిల్ల ఆ పిల్లను పిల్చి 'విక్రమహాలుకు దారి ఎటు ?' అని ఆయన అడిగారు 'తిన్నగా వెళ్ళండి'

అని ఆ అమ్మాయి జవాబు పడుచుపిల్లను ఎందుకు పలకరించావా అని ప్రొఫెసర్‌గారికి గుండెదడ పుట్టింది ఇంతలో 'ఎవరూ' అంటూ ఇంటిలో నించి జమాజెట్టీలాంటి ఒక యువకుడు గుమ్మంలోకి వచ్చాడు దానితో వి త్తరపోయి ఆ ప్రొఫెసర్‌గారు బతుకుజీవుడా అని నేదునూరి వారి నివాసం చేరేదాకా ఒకే పరుగుగా కాలికి బుద్ధి చెప్పారట ప్రొఫెసర్‌గారి పరుగుకు కారణం తెలుసుకున్న గంగాధరంగారు కడుపుబ్బ నవ్వుకుని అసలు విషయం విశదపరిచారట 'తిన్నగా వెళ్ళండి' అన్న మాటలను 'పడుచుపిల్లను పలకరించే పొగరా' బుద్ధిగా వెళ్ళు అన్నతీరులో అర్థం చేసుకున్నారు ప్రొఫెసర్‌గారు ఆ అమ్మాయి జవాబు ఆ అర్థాన్ని ఉద్దేశించనే లేదు తిన్నగా అంటే ఎటుపక్కా తిరగకుండా నేరుగా వెళ్ళండి అని ఆమె ఉద్దేశం

ఒకసారి వాల్తేరు ఆంధ్ర విశ్వవిద్యాలయం హాస్టల్లో నెల్లూరు నివాసి ఐన ఒక విద్యార్థికి తీవ్రంగా జబ్బుచేస్తే కింగ్‌జార్జి ఆస్పత్రిలో చేర్పించి తక్షణంవచ్చి చూడవలసిందిగా అతని తల్లిదండ్రులుకు హాస్టలు అధికారులు ఆనవాయితీప్రకారం తంతి ఇచ్చారు వారు కంగారుగా రైలు దిగి హాస్టలుకువచ్చి తమ అబ్బాయి పేరుచెప్పి టెలిగ్రాం కాగితం చూపించా రొక విద్యార్థికి టెలిగ్రాం చూచిన విద్యార్థి అనంతపురంజిల్లా వాస్తవ్యుడు 'పక్కన హాస్టలు ఆఫీసుంది అక్కడ విచారించండి' అని అతను సలహా ఇచ్చాడు వచ్చిన తల్లిదండ్రులు గొల్లుమని ఏడుస్తూ రోడ్డుమీదే కూల బడ్డారు 'విచారించండి' వాక్యాన్ని 'తెలుసుకోండి' అనే అర్థంలో ఆ విద్యార్థి వాడాడు 'ఏడవండి' అని ఆ తల్లిదండ్రులు అర్థంచేసుకున్నారు అసలు విషయం వారికి బోధపరచి ఓదార్చడానికి తాతలు దిగవచ్చారు

రాజకీయాల్లో వామపక్షానికి చెందిన ఒక రాయలసీమ నాయకుడు గుంటూరులో ఒక విద్యార్థుల సభలో క్విట్ ఇండియా ఉద్యమాన్నిగూర్చి

ప్రసంగిస్తూ 'వెయ్యేన్ని తొమ్మన్నూటా నలభై రెండో సంవత్సరం' అన్నప్పుడు కొందరు విద్యార్థులు 'వెయిన్ని తొమ్మన్నూటా ఏమిటి' పడమటిమోటు ! 'పందొమ్మిదివందల' అని అనకూడదా అని వెటకారం చేశారు శతార్థకమైన 'నూరు' రాయలసీమవాడుకలో ప్రచురం సాగరాంధ్రంలో 'వంద' ఎక్కువ ప్రసిద్ధం ఇందులో ఒక పదానికి గొప్పతనం లేదు మరొకదానికి చిన్నతనంలేదు వ్యవహర్తల దృష్టిలో రెండూ సమానగౌరవం కలవే ఐతే మన సాహిత్యాన్నిగానీ, శాసనభాషనుగానీ పరికిస్తే 'నూరు' అన్నమాట తప్ప 'వంద' అన్నమాట కలికానకైనా కనిపించదు నన్నయ మొదలైన తెలుగు కవులంతా 'నూరు'నే వాడారు నూటపదార్లు, వెయ్యేన్నూటపదార్లు నూటొక్కధార, నూటాయెనిమిది తిరుపతులు, నూటికి నెలకువడ్డీ, నూటికీ కోటికీ, నూరార్లు మున్నగునవి రోజువారీ తెలుగువారి వాడుకలో 'నూరు' అన్న మాటకే ప్రచుర ప్రచారం ఉన్నట్లు స్పష్టపరుస్తాయి నూరు-వంద అన్నవి పర్యాయపదాలు నూరు అసలైన దేశ్యపదం, వంద తద్భవం సంస్కృతంలో 'బృంద' శబ్ద పర్యాయ రూపమైన 'వృంద'కు వికృతి ఐనా ముందువచ్చిన చెవులకంటే వెనకు వచ్చిన కొమ్ములువాడి కదా !

హైదరాబాదులో జరిగిన ఒకానొక పడింతగోష్ఠిలో 'రమణ బత్తీసాదిరాగంబులకును' వంటి తెలుగుకావ్య ప్రయోగాలలో ప్రసక్తమైన 'బత్తీసు' రాగాల ప్రసంగం రాగా, బహుకాలం ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగుశాఖలో ప్రధానాచార్యులుగా పనిచేస్తూ వచ్చిన ఒక ఆచార్యుడు-సాగరాంధ్రవాసి-అదేదో తనకు తెలీదని అన్నారు పక్కనే ఉన్న తెలంగాణా సాహితీప్రియులొకరు నిజంగా దానిభావం తమకు తెలీదా అని ఆశ్చర్యం ప్రకటించారు వాస్తవంగా పండితలోకం పరవ్వారనాలలో అంతగా నలుగుడుపడని మారుమూల ఘట్టాలవి ఇలాంటి

పట్టులలో సంగీతశాస్త్ర పరిభాష అనో, సంగీతరాగ విశేషమనో గురికి బారెడు ఎడ గా సన్నివేశానుగుణంగా ఏదో అర్థం చెప్పి దాటవేస్తారు కొంత మంది అధ్యాపకులు 'సింహాసన ద్వాత్రింశిక' (32 మెట్ల సింహాసన కథా) కావ్యనామం సుప్రసిద్ధమైనా దానికీ దీనికీగల జన్యజనక సంబంధం చప్పున స్ఫురించలేదాయనకు 'బత్తీసు' దానికి వికృతి అని ఆయన ఎరుగరు ఉజ్జాయింపు టూహలతో ఊకదంపుడు వాదం చేయకుండా నిజాయితీపరుడైన ఆ ఆచార్యుడు నిజంగానే దాని అసలు అర్థం తనకు అవగాహనకాలేదని ఒప్పుకోగా, పైన పేర్కొన్న తెలంగాణా మిత్రులు బత్తీసంటే ముప్పైరెండు అని ఠక్కున జవాబిచ్చారు ఇది మరాఠీ మాటో, దఖినీ భాషాపదమో కావచ్చు ముప్పైరెండు అనే అర్థంగల సంస్కృత 'ద్వాత్రింశతి'/'ద్విత్రింశతి' దీనికి మూలమూర్తి 'బాతీస్' అన్న ప్రాకృతరూపం సమీపమాతృక ఇదే అర్థంగల బత్తీస్ బత్తీసీ అన్న హిందీ భాషాపదాలు చాల అర్వాచీనాలు దఖినీ భాషాపరిణత రూపమైన ఉర్దూలో బత్తీస్' ప్రచుర ప్రచారం కలది బాహత్తరి (ద్విసప్తతి) 72 ఛత్తీసు (షట్త్రింశత్) 36 వంటి ప్రయోగాలు సైతం ఆయన స్మరణకు రాలేదు బత్తీస్, బత్తీసీ అంటే ఉర్దూలో ముప్పైరెండని అర్థం 'బత్తీసీ' అంటే ముప్పైరెండు పళ్ళు అనికూడా అర్థం ఉర్దూలో ఉంది ఉర్దూభాషీయుల కీ రూపాలు కొట్టినపిండి ఎవ్వరూ సర్వజ్ఞులు కారుకదా? 'కాలోహ్యయం నిరవధి ర్విపులాచ పృధ్వీ'

1955లో అనుకుంటాను విజయవాడనుంచి హైదరాబాదుకు రైలులో ప్రయాణం ఎదురుగా అప్పుడే పరిచితుడైన తెలంగాణా ప్రయాణీకులొకరు తెలుగుపేపర్ చదువుతూ ఉన్నారు కొద్ది మాటల్లోనే ఆయనది ఉద్రిక్తస్వభావం అని అర్థమయింది ఉన్నట్టుండి 'ఇది నాలాయక్ బేసబబ్' అని ఆయన గట్టిగా అరిచాడు 'ఇలు ధర్మాసనాలా శ్మశాన ఆవాసాలా' అని గొంతుచించుకున్నాడు ఆయనచూపులో ఉక్రో

షమూ, ఉద్వేగము మెరమెరలాడాయి, ఆయన కంఠస్వరంలో ఆక్రందనా, ఆవేదనా చిరచిరలాడాయి అందులో ఆయన అంత ఆవేశపడాల్సిన అవసరమేముందన్న ఆదుర్దా నాకు కలిగింది అసహనంతో, ఆయాసంతో ఊగిపోతున్న ఆయన చేతినుంచి పేపరందుకుని చూద్దునుకదా ! ఏముంది ? 'ముద్దాయికి మూడేళ్ళ కఠిన కారాగార శిక్ష-మూడువేల జరిమానా సెషన్స్ కోర్టు తీర్పు' అన్న వార్త అందులో పెద్దబాక్సు కట్టి వేసి ఉంది ఇందులో ఆయన ఆవేశకావేషాలకు కారణ మిదా అని తెలిసి నవ్వాలనిపించింది కాని, ఆ పెద్దమనిషి ఉన్న ఉద్విగ్న స్థితిలో బలవంతంగా నవ్వాపుకున్నాను ఇంతకూ అయన చెప్పిందిది 'ముద్దాయి' అంటే తెలంగాణా మాండలికంలో కోర్టు వ్యాజ్యంలో 'వాది' అని అర్థమట ! 'ముద్దాయి' అన్న పదం ఉర్దూపదమనీ, 'ముద్దా'ఈ' అనే అరబ్బీ భాషాపదం దీని మూలమాతృక అనీ ఉర్దూలో దీనికి 'వాది' అని అర్థమనీ, అభియోగం అనే అర్థంగల, 'ముద్ద'ఈ' అన్న అరబ్బీభాషాపదంనుంచి ఇది ఏర్పడిందనీ అధ్యాపక ధోరణిలో సోదాహరణంగా బోధించి, వాదికి శిక్షపడడ మేమి సబబనీ, ధర్మానికి తావులేదని విచారవదనంతో ఆయన తనవాదం ముగించాడు భాషావిజ్ఞానంపై సహజంగా ఆసక్తిగల నాకు మానవతావాది ఐన ఆయన బాధ బోధపడింది తెలంగాణేతర ప్రాంతాలలో 'ముద్దాయి'కి 'దోషి', 'నేరంచేసినవాడు' అన్న విపరీతార్థం సంక్రమించిందనీ, ఈ అపార్థానికి మీరు ఆవేశపడకూడదనీ నేను సర్దిచెప్పవలసి వచ్చింది నా సంజాయిషీతో ఆయన సమాధానపడి, తమాయించుకున్నాడు ఇలాగా నా బతుకుపయనంలో తారసపడిన మాండలిక పదాల పరమైన వింత ఉదంతాలు పెద్ద పట్టికగా ఈవచ్చు ఒకేమాట -అది దేశ్యమైనా, దేశ్యేతరమైన తెలుగునాటి వేర్వేరు సీమల ప్రజలనోట ఎలాటి భిన్నార్థచ్ఛాయలు కలిగి ఉందో తెలుసుకోడానికి కీ మాదిరి ఉదాహరణలు చాలు

ఈ సంఘటనలను పరికిస్తే తెలుగుదేశంలో తెలుగువారు మాట్లాడే భాష ఒకటే ఐనప్పటికీ అందులో అనేక ప్రాంతీయ భేదాలున్నట్లు విశదమవుతుంది ఒక పదం అనేకార్థాలను తెలుపుతుందనీ, ఒక అర్థాన్ని బోధించడానికి వేర్వేరు మాటలు వాడుతున్నారనీకూడా స్పష్టపడుతున్నది ఒకే భాషా ప్రాంతంలో ప్రామాణిక భాషకంటే భిన్నమైన ప్రాంతీయ వ్యవహారాలు అన్ని భాషలలో అన్ని కాలాలలోనూ ఉంటాయని శాస్త్రకారుల అభిప్రాయం

'మండలం' అన్నది సంస్కృత భాషా పదం దీనికి ఎన్నో అర్థాలు ఉన్నవి జనసమూహం, చర్మరోగం, నలభై రోజులు, దేశభాగం పరివేషం, సూర్యచంద్రాదుల బింబం, యుద్ధ వ్యూహం మొదలైన దీని అర్థాలలో మనచర్చకు పనికివచ్చేవి నిర్దిష్ట దేశభాగం, నిర్ణీత జనసమూహం అనే రెండు అర్థాలు మాత్రమే మండలాధిపతులు మహామండలేశ్వరులు మాండలికులు, ఆంధ్రమండలం అన్నవాడుకలను పరిశీలిస్తే 'మండలం' అన్నది భూభాగాన్ని సూచించే పదంగా నిష్కర్ష అవుతుంది నిర్ణీతమైన జనసమూహంలో గానీ, నిర్దిష్టమైన భూభాగంలోగానీ వాడుకలో ఉన్న వాగ్వ్యవహారాన్ని మాండలికమని అంటున్నాం ఈ మాండలికాలను వాటి స్వరూప స్వభావాలను బట్టి స్థానిక మాండలికాలు, వర్గమాండలికాలు అని రెండు భేదాలుగా వర్గీకరించవచ్చు ఆ యా ప్రాంతాలకు పరిమితమైన వాడుకగలవి స్థానిక మాండలికాలు ఆ యా వృత్తులకో, వర్ణాలకో చెందిన జనులు మాట్లాడే వాటిని వర్గమాండలికాలనవచ్చు ఈ రెండు భేదాలలోనూ శిష్టుల వాడుక, శిష్టేతరుల వాడుక అన్న విభాగాలు కూడా లేకపోలేదు వ్యవహర్తల కులం, వయస్సు వ్యక్తిత్వం, వృత్తి వాసస్థానం, చదువు సంధ్యలు, సాంఘిక స్థాయి స్త్రీ పురుషభేదం వయోభేదం మొదలైన అనేక విషయాలు ఆధారంగా ప్రతి భాషలోనూ మాండలిక భేదాలు కన్పిస్తుంటాయి

ఇంకా సూక్ష్మవివేచనచేస్తే ఒకే వ్యక్తి భిన్న సమయాలలో భిన్న పరిసరాలలో మాట్లాడే భాషాశైలిలో అనేక భేదాలు గోచరిస్తాయి వ్యక్తి గతమైన ఈ శైలీ భేదాలు శ్రోతనుబట్టి, చర్చావిషయాన్నిబట్టి, వ్యక్తి యొక్క మానసిక ప్రవృత్తిని బట్టి పరిపరి విధాలుగా ప్రవర్తితమవు తుంటాయి వ్యక్తిపరమైన ఈ శైలీ భేదాల సంపుటిని వైయక్తిక వ్యవ హారం అంటారు ఇంగ్లీషులో దీనికి ఇడియొలెక్ట్ (Idiolect) అని వ్యవ హారం మాండలికం అన్నది ఇలాటి వైయక్తికమైన శైలీభేదాలకతీత మైన వాగ్వ్యవహారం

తెలుగు అకాడమీ సాహిత్య అకాడమీ మున్నగు విద్యా సాంస్కృ తిక సంస్థలూ, ఇతర పరిశోధకులూ ఇన్నేళ్ళుగా చేసిన కృషికి మూలంగా తెలుగుభాషలో స్థూలంగా నాలుగు ప్రధానమైన మాండలికాలున్నట్లు నిర్ధా రించబడ్డవి తెలంగాణం, రాయలసీమ విశాఖ విజయనగరం, శ్రీకాకుళం జిల్లాలతోకూడిన కళింగాంధ్రం తక్కిన కోస్తా ఆంధ్రప్రాంతం-ఇవి నాలుగూ ప్రధానమైన మాండలికాలు నిరక్షరాస్యత పెచ్చుపెరిగి ఉండడం, భాషా వ్యాపక సాధనాలైన రాకపోకలు లేకపోవడం, వ్యవహార ప్రాంతం విస్త రించడం ఇరుగుపొరుగునగల ఇతరభాషల పదాలువచ్చి చేరడం, ఆయా మాండలిక ప్రాంతాల నైసర్గికస్థితి, వాతావరణం తమ ప్రభావాన్ని చూపడం, ఆ యా ప్రాంతాలలో వృత్తులకుగల ప్రాధాన్యం ఒకే భాషా ప్రాంతం రాజకీయంగా భిన్నసీమలుగా విడగొట్టబడడం - మొదలైన కార ణాలవల్ల మాండలికాలు ఏర్పడతాయి

చదువుకున్నవారూ, చదువుకోనివారు అనే చూపుతో చూస్తే మొత్తం తెలుగువాడుక శిష్టభాషాశైలి శిష్టేతర భాషాశైలి అని రెండు తెగలుగా కని పిస్తుంది శిష్టేతరుల భాషలో మహాప్రాణాలు లోపించడం ఒక లక్షణం సుఖం-సుకం, ధరలు-దరలు, భార్య-బార్య లాభం-లాబం అన్లే పదాది

చకారం సకారంగా మారడం శిష్టేతరులలో చూస్తాం చదువు - సదువు, చిన్న - సిన్న చూపు - సూపు, చెయ్యి - సెయ్యి శిష్టభాషశైలిని అనుకరించాలనే కుతూహలంతో సకార స్థానంలో చకారాన్ని నిల్పడం వీరిలో గమనించవచ్చు సరే - చరే, సెలవివ్వండి - చెలవివ్వండి కలిసి-కల్చి, తెలుసునా - తెల్చునా మొదలైనవి పదాది వకార లోపం కూడా ఒక విశిష్టత వేసంగి-ఏసంగి, వాడు-ఆడు, వీడు - యీడు అట్లాగే మూర్ధన్య వర్ణాలకు బదులుగా లకారాన్ని వాడడం కూడా ఒక విలక్షణ వాళ్ళు-ఆల్లు, వీళ్ళు-ఈల్లు, వెళ్ళు-యెల్లు, పెళ్ళి-పెల్లి, వస్తాడు, చేస్తాడు, వచ్చేస్తున్నాడు మొదలగు శిష్టరూపాలు వత్తాడు, చేత్తాడు, వచ్చేత్తున్నాడు అని శిష్టేతరుల శైలిలో ప్రచురం పదాది లకారం నకారంగా మారడం కూడా ఒక విశిష్టలక్షణంగా కనిపిస్తుంది లంచం-నంచం, లభం-నాబం, లేత-నేత, లేదు-నేదు, లెగు-నెగు, లైట్లు-నైట్లు మొదలైనవి కొన్ని ఉదాహరణలు

దూరవర్తి నిర్దేశ సర్వనామ ప్రాతిపదిక ఐన అకారం మీద తెలంగాణా మాండలికంలో గకారం వచ్చి చేరుతుంటుంది అట్ల అనడానికి గట్ల అనీ, అది అనడానికి గది అనీ, అపుడు అనడానికి గపుడు అనీ వాడుక చెయ్యడం గమనించవచ్చు ఈ గకారం అదిగో అగో అనువాటికి పరిశిష్టరూపం కావచ్చు

అట, అట్లాగూ, వస్తారటయ్యా మొదలైన ప్రామాణిక శైలిలోని వాడుకలు అష అష్టాగూ, వస్సారషయా అని వైదికుల మాండలికంలో వినిపిస్తాయి 'ఆస్సే చూస్సి వషే విస్సావఝ్ఝలవారి బుర్రినష ఆ విస్సాయి కిస్సారుషే, విస్సండెంతటి వాడే యేళ్ళు పదిషే ' అన్నదాసు శ్రీరాములుగారి పద్యభాగం ఈ సందర్భంలో గమనించదగ్గది అంటున్నావు, తింటున్నావు అన్న మాటలను అంచున్నావు, తించున్నావు అని వ్యవహరించడం, లేనిచోట్ల రేఫనువత్తుగా నిల్పడం వైదికుల శైలిలోని విశిష్ట

లక్షణం ఆ మాటకే మంచున్నావే అన్న వాడుక వైదికం ప్రిల్లి మ్యావ్ మ్యావ్ మన్నదన్న పరిహాసానికి స్థానమైంది వెందుకైనా వుంచినావో బందిఖానాలో ఈ దేహము గాలి బుడగరా, అన్న తాత్త్విక కీర్తనలలోనూ అనావశ్యకమైన రేఫ ప్రయోగం కనిపిస్తుంది

బండిచక్రాన్ని తెలుగుదేశం వేర్వేరుచోట్ల ఉండ గాను, గాలు, చెక్రం, రోజా, రోదా అనే పేర్లతో వ్యవహరిస్తారు ఉండ అన్నది గుండ్రటి పదార్థమన్న దేశ్యపదంగాను, గాలు రాయి అనే అర్థంకల దేశ్యపదమైన కల్లునుంచి ఏర్పడ్డవి చెక్రం సంస్కృత చక్ర శబ్దానికి వికృతి రోజా, రోదా అన్న మాటలు కృష్ణా ఖమ్మం జిల్లాలకు పరిమితం రోదా అన్న పోర్చుగీసు భాషాపదం నుంచి ఈ రెండూ అవతరించాయి

పునాది-బునాది అన్న మాటలు తెలుగుదేశమంతటా ప్రచురమైనవి ఉర్దూ భాషాముఖంగా తెలుగులో వచ్చి చేరిన అరబ్బీభాషా పదమిది కడప, కర్నూలు, నెల్లూరు, చిత్తూరు ప్రాంతాలలో దీనిని గుణాది, గునాది, గునాదరం అంటారు పుంటికూర, పొంటికూర, పుండేకు, పుండికూర అన్న మాటలు కన్నడదేశానికి సరిహద్దులో గల తెలుగుదేశమంతటా వాడుకలో ఉన్నాయి దీనికి పర్యాయవాచకాలుగా గోగాకు, గోంగూర అన్నవి తక్కిన ఆంధ్ర ప్రాంతంలో వ్యవహరించబడుతున్నవి అట్లే ఆనప, ఆనబ, ఆనగ, ఆనిపె, ఆనిగెం, ఆనుగ-అన్న రూపాలు తెలంగాణంలోనూ కళింగాంధ్రంలోనూ వాడుకలో ఉన్నాయి 'సొర' అన్నది తక్కిన ఆంధ్రదేశంలో వాడుకలో ఉంది సొర అన్నది దేశ్యపదం ఆనప, దీని రూపాంతరాలూ సంస్కృతంలో అలాబూ శబ్దానికి వికృతులు

పెండ, పేడ ఈ రెండు పదాలలో పెండ ప్రాథమికం, పేడ పరిణతం పెండ తెలంగాణా వారి వాడుక పేడ తక్కిన తెలుగుదేశం వాడుక గ్రాంథిక భాషా శైలిలో కనిపించే అడుసు, అసలు అన్నవాటిలో

అడుసు కళింగాంధ్రం కాక తక్కిన సాగరాంధ్రంలో ప్రచుర వ్యవహారంలో ఉంది అసలు తెలంగాణాకు పరిమితం శ్లేష్మం, మాతృక అనే అర్థాలుగల 'అసల్' అనే పదం ఉర్దూ పద, తెలంగాణాలో ఉన్నప్పటికీ బురద అనే అర్థం కల ఈ అసలు కూడా వాడుక ఉండడం వింతగా కనిపిస్తుంది కృష్ణా జిల్లా కొన్ని ప్రాంతాలలో దీన్ని బాడి అని అంటారు తక్కిన తెలుగుదేశంలో బురజ, బురద అన్న పదాలు వాడుకపడిఉన్నాయి నూలు వడకడానికీ, చుట్టడానికి వాడే కొయ్యపనిముట్టు ఐన రాట్నం-రాటం, రాట్టం, రాట్నం అనే రూపాంతరాలతో తెలుగుదేశమంతటా ప్రసిద్ధమైన వ్యవహారం ఇది మరాఠీ భాషనుంచి వచ్చిన మాట చరఖా, చరకా అన్న వాడుకలు జాతీయోద్యమం ప్రబలిన తర్వాత కొన్ని ప్రాంతాలలో అతి విరళంగా ఉపయోగించబడుతున్నవి సంస్కృతంలోని 'చక్ర' శబ్దం తారుమారు చెంది చరకా, చరఖా, చర్ఖా అయింది

ఇలాగా మాండలిక పద ప్రయోగాలలోని విచిత్రాలను ఎన్నైనా నిరూపించవచ్చు ఇప్పటి కింత చాలు

# తెలుగులో అర్థ విపరిణామం

'అదృష్టం ఉండాలయ్యా దేనికైనా', 'అనుమానం పెనుభూతం', 'ఉత్తర దక్షిణాలు లేనిదే ఉద్యోగం - సద్యోగం దొరకడం కనాకష్టం', 'వాడి గ్రహచారం అలావుంది', 'వీడికి తెలివితేటలు పూజ్యం', 'ముష్టికి మూడు సంచులా', 'మూలవిరాట్టే ముష్టెత్తుకుంటూంటే ఉత్సవవిగ్రహానికి తెప్పతిరుణాళ్ళట', 'అవ్వాకావాలి - బువ్వాకావాలి' అంటే యెలాగయ్యా' 'ఈ ఊళ్ళో సందుగొందులన్నీ కంపు కంపు', 'తగవులు పెట్టి తమాషా చూస్తారు' - మొదలైన వాడుకలు అనుక్షణం మనం వింటూ ఉంటాము పీటిలోని అదృష్టం, అనుమానం, ఉత్తర దక్షిణాలు, ఉద్యోగం, గ్రహచారం, పూజ్యం, ముష్టి - అన్న పదాలు సంస్కృతభాషనుంచి తెలుగులో ప్రవేశించినవి అవ్వ, కంపు, తగవు అన్నవి తెలుగున శుద్ధ దేశ్యాలు

అదృష్టమంటే సంస్కృతంలో కనిపించనిదని అర్థం తెలుగులో కలిసిరావడమని అర్థం అనుమానమంటే సంస్కృతంలో ప్రత్యక్షాది ప్రమాణాలలో ఒకటి, సందేహమని తెలుగునగల అర్థం 'అనుమానము కలిగెనేని అరిగెద నధిపా' అని తిక్కన్న తీర్పు ఉత్తర దక్షిణాలు సంస్కృతంలో దిక్కులపేర్లు, తెలుగుల వాడుకలో సిఫారసు లంచం అని అర్థాంలో మార్పు 'ఉద్యోగం అంటే పూనిక అని మౌలికార్థం, జీవనోపాధికై చేసేపని అని తెలుగులోని వాడుక గ్రహాలగమనం అనే అర్థం గల సంస్కృత గ్రహచారపదం తెలుగులో దురదృష్టమన్న అర్థంలో ప్రయుక్తం పూజ్యమంటే పూజనీయమని సంస్కృతార్థం, తెలుగులో శూన్యం అనే అర్థంలో వాడుక ముష్టి అంటే పిడికిలి అని

సంస్కృత వ్యవహారం, తెలుగులో బిచ్చమనే అర్థంలో రూఢి 'అవ్వ' అంటే అనాథ తల్లి అని అర్థం, తల్లి తల్లి, తండ్రి తల్లి లేక వృద్ధురాలు అని ఈనాడు పొందిన మార్పు తెలంగాణా జా పదాలలో నేడూ తల్లి అనే అర్థంలోనే వాడుక 'కంపు' ప్రాచీనార్థంలో కమ్మటివాసన అని వాడుక, ప్రకృతం చెడువాసన అని వాడుక 'తగవు' అంటే న్యాయం, యుక్తం అని ప్రాచీనార్థాలు, జగడం, వివాదం అని పరిణతార్థాలు భాషలో అర్థ పరమైన ఈలాంటి మార్పును అర్థవిపరిణామమని పేర్కొంటారు ఈ మార్పు స్వరూప స్వభావాలను కొంత పరిశీలిద్దాం

మార్పు అన్నది ప్రసిద్ధగుణమేకాక ప్రకృతిసిద్ధగుణం కూడ ప్రకృతికేకాదు మానవ ప్రకృతికి సైతం మార్పు తప్పనిసరి ఆచార విచారాలలో, ఆహార విహారాలలో మానవసమాజంలో క్షణక్షణం మార్పులు జరగడం సహజలక్షణం ఇది మానవుల ఆలోచనా సంపత్తికీ, ఆవిష్కరణ ప్రవృత్తికీ ప్రధానసాధనమైన భాష పట్లనూ వర్తిస్తుంది భాష అంటే శబ్దార్థాల కూర్పు, ఇది వాగర్థప్రతిపత్తి అని కవికుల తిలకుల తీర్పు పదానికీ పదార్థానికీ మధ్యగల సంబంధం నియతమని కొందరభావన, నియతం కాదని కొందరవాదన శబ్దార్థాల సంబంధం నిత్యమనీ, అనాది సిద్ధమనీ, కల్పితం కాదనీ ప్రాచీనులు సంస్కృతీయులు ఊహించిన వ్యవస్థ

వాస్తవ స్థితిని పరికిస్తే శబ్దార్థాల సంబంధం నియతం కాదనే అని పిస్తుంది అంతేకాదు, ఉన్న ఆపాటి సంబంధం సైతం స్థిరం కాదు ఇక, అది అనాది సిద్ధమంటారా, ఇక్ష్వాకుల నాటి మాట ఇప్పుడు చెప్పలేము నూటికో కోటికో కనిపించే కాకి, కోకిల, మేకవంటి ధ్వన్యనుకరణ పదాలను బట్టి కూకూ (రైలు బండి) కొక్కొరోకో (కోడి), పపామ్ (బస్సు), భౌభౌ (కుక్క) మ్యావ్ మ్యావ్ (పిల్లి) వంటి పిల్లల వాడుకనుబట్టి శబ్దార్థాల సంబంధం నియతమనీ నిత్యమనీ భావించడం సరికాదు అపారమైన భాషా సింధువులో బిందువువంటి ఈ అల్పాంశాన్ని పురస్కరించుకుని శబ్దార్థాల

సంబంధం నియతమని నిర్ధారించడం సబబు కాదు ఎందుకంటే, ఒకే వస్తు వునీ లేక భావాన్నీ సూచించడానికి వేరువేరు భాషా కుటుంబాలలో వేరువేరు పదాలుండడం ప్రత్యక్ష సాక్ష్యం అదేకాదు, దేశకాల పాత్రల ననుసరించి ఒకే భాషలోనే ఒక భావాన్నీ లేక వస్తువునీ నిర్దేశించడానికి రెండు మూడు పదాలు వాడుకలో ఉండడం, ఒకే పదం అనేకార్థాలను బోధించడం వంటి వైవిధ్యం మనం నిత్యం గమనిస్తున్న పరిస్థితి దీనిని తంత్రలక్షణంగా సంస్కృత శాబ్దికులు రూపించారు ఆ యా మానవ సమాజాల సామాజిక ప్రయోజనం నిమిత్తం ప్రముఖమైన పనిముట్టుగా భాష ఉపకరిస్తూవస్తున్నది అందుచేత శబ్దార్థాల మధ్యగల సంబంధం యాదృచ్ఛికమని చెప్పకోక తప్పదు

భాషాపరంగా ప్రకృత సమీక్షలో నలుగుతున్న ఈ మార్పు శబ్దం లోనూ వస్తుంది, అర్థంలోనూ వస్తుంది అర్థం మారినప్పుడల్లా శబ్దం మారి తీరుతుందనిగానీ నియమం లేదు పరస్పరం ఒకదానితో ఒకటి సంబంధం లేకుండానే స్వతంత్రంగా ఈమార్పులు ప్రవర్తిస్తాయని నిశ్చయించవచ్చు అయితే, ఒకోసారి శబ్దార్థాలు రెండింటిలోనూ ఒకేసారి మార్పులు జరిగినా జరగవచ్చు అంతమాత్రాన అవి అన్యోన్యాశ్రయాలని నిర్ణయించడం కూడా యుక్తిసహం కాదు

ఈ మార్పులు భాషలోని అంతశ్శక్తుల వల్లనూ జరగవచ్చు లేక బహిశ్శక్తులవల్లనూ సాధ్యపడవచ్చు అంతశ్శక్తులవల్ల ప్రవర్తిల్లే మార్పు క్రమ పరిణామం, బహిశ్శక్తుల ప్రభావంవల్ల పరిఢవిల్లే మార్పు హఠాత్పరి ణామం పూవు పిందెగా పిందె కాయగా, కాయ పండుగా మారడమూ, శిశువు యువకుడుగా యువకుడు వృద్ధుడుగా మారడము క్రమ పరిణా మానికి ఉదాహరణాలు పసి వయస్సులోనే వార్ధక దశా చిహ్నాలు పొడ సూపడం హఠాత్పరిణామానికి నిదర్శనం అంచేత, కొత్త అవసరాలూ,

కొత్త పరిసరాలూ ప్రవర్తిల్లినపుడు భాషలో అంతర్నిహితంగానే మార్పులు జరగవచ్చు పరభాషా సంసర్గంవల్ల ఈమార్పులు త్వరితగతిలో జరగడం సర్వసాధారణం శబ్ద సంబంధమైన మార్పును ధ్వని పరిణామం (**Phonetic change**) అనీ, అర్థ సంబంధమైన మార్పును అర్థ విపరిణామం (**Semantic change or semantic divergency**) అనీ శాస్త్రకారులు పరిభాషించారు ప్రస్తుత చర్చ అర్థ విపరిణామానికి పరిమితం

అర్థవిపరిణామానికి హేతువులు అనేకం వాటిని ఇన్ని అనీ, ఇవేఅనీ, నిక్కచ్చిగా గిరగీసి చెప్పలేము వక్తల అస్పష్టోచ్చారణమూ శ్రోతల అలసత్వము, అస్పష్టగ్రహణమూ ముఖ్య కారణాలుగా విశేషజ్ఞులు పరిగణిస్తూ ఉంటారు అస్పష్ట గ్రహణానికి శ్రోతల అనవధానతగానీ, అధికార లోపంగానీ, వినికిడిలోని లోటునకు మూలం కావచ్చు అంతేకాక, మానవుడిలోని కవితాశక్తి అర్థ గోపనంపై అతనికి గల ఆసక్తి దీనికి దోహదం చేయవచ్చు భాషా ప్రయోగ సందర్భాలు తారుమారవడం, నూతన వస్తువులతో, వినూత్న భావాలతో పరిచయం ఏర్పడడం మున్నగు వాటినికూడా ఈ పట్టికలో చేర్చవచ్చు

భాషలోని అర్థపరమైన మార్పును వర్ణనాత్మకం (**descriptive**), చారిత్రకం (**diochronic**) అనీ రెండు విధాలుగా, అభిజ్ఞులు అనువర్ణించడం కద్దు నిర్ణీతమైన దేశ కాలపరిధులకు సీమితమైన భాషను దాని పూర్వాపర దశలతో ప్రమేయం లేకుండా అర్థ స్వరూపాన్ని విశ్లేషించి వివరించడం వర్ణనాత్మకం వివిధ వికాస దశలలో ఒక భాషలో వచ్చిన అర్ధ పరిణామాలను ఆ యా దశల ననుసరించి కాలక్రమానుసారంగా చారిత్రకదృష్టితో విశ్లేషించి నిరూపిస్తే అది చారిత్రకం అనిపించుకుంటుంది

వర్ణనాత్మక దృష్టితో చూస్తే ఖసేల్‌మని ఘువ్వని ఛెళ్ళుమని, ఝుమ్మని ధామ్మని, భళ్ళున' వంటి ధ్వన్యనుకరణాలు, కిలకిల, చర చర, దిర్‌దిర, నకినక, పుటపుట ఫెళఫెళ బెకబెక, మిలమిల, సలసల వంటి ఆమ్రేడిత ధన్యాదన్యకిరణ పదాలు కృదంత రూపాలు తద్ధిత రూపాలు ఈ కోవలో కొన్నింటినిగా ఉదాహరించవచ్చు సమాసంలోని పదాల మౌలికార్థాలకు పూర్తిగా విపరీతమైన నూతనార్థ స్ఫురణ కొన్ని సమాసాల విలక్షణత అలాగే శబ్ద పల్లవాలు, జాతీయాలు అనేకార్థక పదాలు, దేశ్యేతర పదజాలం, విభిన్న భాషలలోని సదృశ రూపాలు మున్నగునవి ఈ మొదటి వర్గంలో చేరుతాయి

చారిత్రక దృష్టితో పరిశీలించినపుడు అర్థ విపరిణామాన్ని అర్థ వ్యాకోచం, అర్థ సంకోచం, అర్థ గౌరవం, అర్థాపకర్ష, సభ్యోక్తి, సంకేతి తార్థాలు, లక్ష్యార్థసిద్ధి లోకనిరుక్తి మొదలైన విభాగాలుగా వర్గీక రించవచ్చు

**అర్థ వ్యాకోచం** - పరిమితార్థంలో వాడుకపడ్డ పదం విస్తృతమైన అర్థాన్ని పొందడాన్ని అర్థ వ్యాకోచం అంటారు 'చెంబు' అనే తెలుగు మాటకు ఎర్రటి లోహంతో లేక రాగితో చేసిన పాత్ర అని మౌలికార్థం దీని ఆకారమూ ప్రయోజనము కలిగి ఇతర లోహాలతో తుదకు ప్లాస్టిక్‌తో చేసిన పాత్రలన్నింటికీ 'చెంబు' అనే మాట ప్రకృతం విపులార్థంలో రూఢమయింది ఇత్తడి చెంబు, ఇనుప చెంబు, వెండి చెంబు మరచెంబు మున్నగు వాటిని ఉదాహరణలుగా పేర్కొనవచ్చు అలాగే నూనె అంటే నూ నెయ్ నువ్వుల నుంచి తీసిన చమురు అని ఒకనాటి అర్థం ఆముదాలు ఎండు కొబ్బరి, నిమ్మగడ్డి, పత్తి గింజలు, వేరుసెనగ మొదలైన వాటినుంచి తీసిన తక్కిన చమురులకు కూడా నూనె అన్న వాడుక విస్తరించింది చివరికి మట్టినుంచి తీసిన కిరసనాయిలుకు కూడ

మట్టి, నూనె, కిరొసిన్ నూన అనే వ్యవహారాలు తెలుగులో ప్రచురం ఈ విధంగానే తిలలనుంచి తీసిన చమురు (తైలం)గా మౌలితర్థ పేరండ తైలం, కర్పూర తైలం, మంటి తైలం మొదలైనవి ప్రపంచార్థంలో ప్రియుక్తమవుతున్న వాడుకలు ఇలాగా విశాలార్థాలను పొందిన ఈతైలం ఇంతతో ఆగలేదు ఇంకా ముందుకు సాగి 'లంచం' అన్న అర్థాన్నికూడా సంతరించుకుంది 'తైలం వేస్తేనే బండి నడుస్తుంది' అన్న వాడుక కొత్త కాదు 'ఇరుసున కందెన వెట్టక పరమేశ్వరు బండియైన పారదు ' అన్న సుమతి శతకకారుని పద్య ధోరణి దీనికి కొంత ఆలంబనం అయి ఉండవచ్చు దాసి, దూతి అనే పరిమితార్థాలుగల సంస్కృత చేటికా శబ్దం తెలుగున చేడియ/చేడె గా మారి స్త్రీ సామాన్య వాచకంగా అర్థ విస్తృతిని పొందింది

**అర్థ సంకోచం** - విస్తృతార్థంలో ఉన్న పదానికి సంకుచితార్థం ఏర్పడడం అర్థ సంకోచం 'కుల్లాయుంచితి కోక జుట్టితి వెసన్ గూర్పాస మున్ దొడ్గితిన్ ' 'నా కొడుకును నా కోడలు కోక లెరుంగన్ పారిన ' మున్నగు ప్రయోగాలలోని 'కోక' ఒకనాడు స్త్రీ పురుషులుభయులూ ధరించే వస్త్ర సామాన్యమని తేలుతుంది ఆ రీతిగానే ఆ ఋషి పుత్రుడు గట్టిన చీరలు మృదులములు ', 'వేరు వలలుండు కూడుంజీర యునిడి', 'విరాట తనయుండు తల చీర యలవరించికొని ', 'చీర లేని మగని చెలువ తా నీక్షించి ' మొదలైన ప్రయోగాలలో 'చీర' స్త్రీ - పుం సామాన్య వస్త్రంగా ప్రయోగించబడింది ఐతే, కోక, చీర ఈ రెండూ నేడు స్త్రీల వస్త్రార్థాలుగా పరిమిత పరిధిలో వాడుక చేయబడుతున్నాయి ఉపాధ్యాయుడనే అర్థం గల పారసీక భాషా పదం 'ఉస్తాద్' తెలుగులో 'వస్తాదు'గా మారి మొదట ఉపదేశకుడనీ, [illegible] ఆ పిమ్మట మల్లవిద్యాప్రవీణుడని పరిమితార్థాలను సంతరించుకుంది

**అర్థ గౌరవం :-** దీనినే అర్థ సౌమ్యత అనీ, ప్రచ్ఛన్నార్థమనీ కూడా అంటారు ఒక నిర్దిష్టకాలంలో నిందార్థకంగా వాడుకపడిన మాటలకు అనంతర కాలంలో అర్థోత్కర్ష సంక్రమిస్తే అర్థ గౌరమని పరిభాష. సభి కులు అంటే జూదగాళ్ళని నీచార్థంలో ప్రాచీన ప్రయోగాలు. 'సత్యములు చేసి సభికుల సాక్షిగోర' అని నీచార్థంలో అంటాడు కేతన్న. ఆ పిమ్మట ఇదేమాట రాజుల కొలువుకూటంలోని పూజనీయ సభ్యులన్న అర్థగౌరవాన్ని సంపాదించుకోగలిగింది. ఇలాగే దుర్మార్గుడు, రాక్షసుడు మున్నగు మాటలు నేడు మౌలికమైన నిందార్థాలలో కాక సాహసి, దీక్షాపరుడు అనే ప్రశంసార్థాలలో

**అర్థాపకర్ష :-** దీనిని గ్రామ్యత్వం, అర్థగ్రామ్యత అనికూడా వ్యవహరిస్తున్నారు. మొదట పూజ్యార్థంలో ప్రయోగించబడ్డ పదాలకు నిందార్థంలోగాని, నీచార్థంలోగాని జరిగిన అర్థవిపరిణామానికి అర్థాపకర్ష అని పరిభాష. వేదవిదుడనే అర్థంగల 'ఛాందసుడు' నేడు మందబుద్ధి, లౌకిక జ్ఞానహీనుడు అన్న నీచార్థాలలో రూఢికెక్కాడు. 'సారథి ఛాంద సుండు ' అన్న తెనాలివారి ప్రయోగంలో తెగడ్త స్ఫురిస్తుంది. ఆ మాదిరిగానే వేదసంబంధాన్ని సూచించే ఛాందసమన్న సంస్కృతపదం తెలుగులో లోకజ్ఞానహీనత్వం అనే అర్థంతో వాడుక పడింది. దీని మార్పాటు మాట అయిన 'చాదస్తం' అర్థపరంగా ఎంతదూరంపోయిందో చూస్తున్నాం గదా! అలాగే సర్వసంగపరిత్యాగం చేసిన వ్యక్తిని 'సంన్యాసి' అన్నారు పెద్దలు. పనికిమాలిన వ్యక్తి అని నేటి అర్థం. శబ్దపరంగానూ మార్పునందిన 'సన్నాసి' ఎంత చులకనగా చూడబడుతున్నాడో మనకు తెలుసు. సేవాభావం అనే పవిత్రార్థం కలిగిన 'కైంకర్య' శబ్దం నేడు దొంగిలించడం, మోసగించడం అనే అర్థాపకర్షతో ప్రయోగించబడుతున్నది. 'భుజించు' అనే అర్థం కలిగిన 'కుడుచు' నేడు కొన్ని సందర్భాలలో తిట్టుగా అశ్లీలార్థంలో ప్రయుక్తమవుతున్నది. దక్షాధ్వర ఘట్టంలో శివాప

రాధకులైన సదస్యుల నుద్దేశించి 'ఏమి కడవంగ వచ్చినారిండ్లు విడిచి' అని దధీచి మహాముని దూషించినట్లు శ్రీనాథుని ప్రయోగం

సభోక్తి: అశుభార్థకాలూ అశ్లీలద్యోతకాలూ అయిన మాటలను పదిమంది ముందూ బాహాటంగా వాచ్యం చెయ్యలేము. వీటిని పరోక్షంగా గానీ, నవీన పదకల్పనంతోగానీ అభివ్యక్తంచేసే రీతిని సభ్యోక్తి అంటారు విధవ అనడానికి 'పూర్వసువాసిని' సభ్యోక్తి బియ్యం లేవు అనడానికి 'కుండలో బియ్యం నిండుకున్నవి' అని చెప్పడం సభ్యోక్తి మంగళ సూత్రం తెగితే 'పెరిగిం'దనీ దీపం ఆరిపోయిందనడానికి 'దీపం కొండెక్కింది' అనీ అనడం సభ్యోక్తులుగా చలామణి అవుతున్నాయి అశుభ సూచకమైన మరణాన్ని సూచించడానికి కథావశేషులగు, కీర్తి శేషులగు, దివంగతులగు, పరమపదించు పరలోకగతుడగు, పెద్దలలో కలియు, లింగైక్యంచెందు, శివైక్యం పొందు మొదలైన సభ్యోక్తులు వాడడం మామూలు బహిర్భూమికి పోవు అనే అర్థం తెలపడానికి అశ్లీలతానివారకాలుగా తొలుత ఉపయుక్తమైన కాల్వతట్టుపోవు చెంబట్టుకుపోవు దొడ్డికెళ్ళు, బయలు కెళ్ళు మున్నగునవికూడా నేడు దిగజారిన అర్థాలలో ప్రవర్తిల్లుతున్నవి

సంకేతితార్థాలు: ఇవి కొన్ని వర్గాలకూ, వృత్తులకూ పరిమితమైన పదాలు 'వయం దేవస్య', 'దేవతార్చన' అన్న వైదికపరిభాషకు భోజనమన్న అర్థం కేవలం సంకేతార్థం తూకం విషయంగా చిన్నరాయి, పెద్దరాయి అని చెప్పడానికి చిన్నకక్క, పెద్దకక్క అని వ్యాపారులు కొందరు వ్యవహరించడం వృత్తిపరమైన సంకేతార్థాలు

లక్ష్యార్థసిద్ధి: భాషలో అనేక పదాలకు ఆధారాధేయ, కార్యకారణ, అంగాంగి ఏకదేశాది సంబంధాలవల్ల లక్ష్యార్థాలు ఏర్పడడం సర్వసాధారణం ఇలా ఏర్పడిన పదాలు తెలుగులో కోకొల్లలు ముష్టి అంటే పిడికిలి

అని మూలార్థం తెలుగులో ముష్టితో పెట్టే పదార్థమైన బిచ్చానికని అర్థం మారింది అక్కడ ఆధారార్థం ఆధేయానికి సంక్రమించింది సంస్కృతంలో దాహం అంటే దహించడం, తపించడం, అని అర్థాలు కార్య కారణ సంబంధం మూలంగా ఇక్కడ తాపానికి కార్యమైన దప్పి, దాని ఉపశమనానికి మార్గమైన పానీయం అనే అర్థాలు ఏర్పడ్డాయి అలాగే ఆకార సాదృశ్యాన్నిబట్టి సూది, ముల్లు అనే పదాలకు ఇంజెక్షన్ పరికరం, గడియారపుముల్లు రూఢికెక్కాయి భారవి రచించిన కిరాతార్జునీయ కావ్యానికి 'భారవి' అనీ, మాఘుడు రచించిన శిశుపాలవధకు 'మాఘ'మనీ, అమరసింహుడు కూర్చిన సంస్కృత నిఘంటువు 'నామలింగానుశాసనానికి' 'అమర'మనీ ఇదే రీతిలో వాడుక లేర్పడ్డవి 'ఆయన గంగిగోవండీ', 'వీడు గుంటనక్కసుమీ', 'వీడు పెద్దపులి', 'ఆవిడ గజ్జెల గుర్రం' 'ఆమె కైకమ్మ', 'ఈమె చిత్రాంగి', 'అది మంథర', 'ఇది తాటక', 'వాడు కుంభకర్ణుడు' వీడు బకాసురుడు', 'వాడసలే విశ్వామిత్రుడు', 'వానికితోడు వీడొకడు నక్షత్రకుడు' -ఇలాంటి పలుకుబళ్ళలో గుణసామ్యంవల్ల ఆ యా జంతునామాలతో, పౌరాణిక వ్యక్తులపేర్లతో సమకాలికులను వ్యవహరించడం సర్వసాధారణం సద్యః స్ఫూర్తి కొరవడ్డ వ్యక్తిని 'ట్యూబ్‌లైట్‌గా'డని పిలవడం క్రియాసామ్యం 'మూడు కొప్పులొకచోట కలిస్తే ' అని అవయవాన్ని అవయవిగా చెప్పడం జరిగింది 'అరవ' అంటే తమిళనాడులో ఉత్తరదిక్కున తెలుగు నాటికి పొరుగునగల ఉత్తరార్కాడు మండలం - అరవై నాడు - లోని పార్వతేయులైన ఒక తెగజనులకు పేరు సముదాయంలో ఏకదేశమైన 'అరవ' శబ్దం మొత్తం తమిళులకు పర్యాయవాచిగా తెలుగులచే వాడబడు తున్నది 'కంచి యరవతల సమాస్తుశ్రిఖడలతలు ' అని శ్రీనాథుని ప్రయోగం ఆలంకారిక శైలిలో ఉపమానోపమేయాలు తారుమారవడం కూడా లేకపోలేదు 'కత్తుంతో పొడుచు' అన్న ఉచ్చారణభాగానికి 'తీక్ష్ణ దృష్టితో చూచు' అని అర్థం

లోకనిరుక్తి - పదాల వ్యుత్పత్తులు స్పష్టంగా తెలియనప్పుడు పామరులూ, అప్రతిభులైన పండితులూ కొత్త వ్యుత్పత్తులను ఊహించి ప్రతిభాషించడాన్ని జననిరుక్తి లేక లోకనిరుక్తి (folk etymology) అంటారు అత్తెసరు ఆకాశరామన్న నారదసింహాచలం మొదలైన వాటిని లోకనిరుక్తికి కొన్ని ఉదాహరణలుగా ఉట్టంకించవచ్చు పెట్టిన యెసటికీ, పోసిన బియ్యానికీ సమ్మసరిగా అత్తిపోయేట్టు పోసిన నీరు అత్తెసరు కానీ, బద్ధకం ముదిరిన అత్తగారు పెట్టే ఎసరు అని గమ్మత్తు వ్యుత్పత్తిని కల్పించడం జననిరుక్తి కలియు, కూడు అనే అర్థాలుగల 'అత్తు' క్రియా ధాతువునకు కృదంతరూపమే అత్త అని ఒక వ్యుత్పత్తి అత్త అంటే మగని తల్లి లేక భార్య తల్లి అని అర్థం వాస్తవంగా తెలుగునందలి ఈ అత్తు కన్నడంలోని హత్తు/పత్తు నుంచి ఎరువు తెచ్చింది హకారాది రూపం లోని ఆదిమ హల్లు లోపించగా ఏర్పడ్డ అజాదిరూపమిది కన్నడంలోని హత్తు/పత్తు తెలుగులో గ్రహించు, స్వీకరించు అనే అర్థాలుగల 'పట్టు' ధాతువునకు జ్ఞాతిరూపం అంతేగాని ఇరువంకల బంధుగులను వైవాహికాది సంబంధాలవల్ల కలిపే వ్యక్తి అనే వ్యుత్పత్తి సుపరీక్షితంకాదు, వట్టి జననిరుక్తి ఆకాశనామ్న - ఆకాశం పేరిటివాడు అంటే అసలే అడా పొడా లేనివాడని అర్థం ఇది రామనామ ప్రభావంవల్ల ఆకాశరామన్నగా వాడుక పడడం జననిరుక్తి విశాఖపట్టణం చేరువలోగల సింహాచలం కొండదిగువనగల ఒక రైల్వేస్టేషన్ 'నార్త్ సింహాచలం', 'సింహాచలం నార్త్' అని ఒకనాటి వాడుక ఇది జనుల నోళ్ళలోపడి నార్త్ సింహాచలమై **North** అన్న ఇంగ్లీషు పదం గూర్చి తెలీని పామరుల దేశీయ పండితుల కల్పనలో ఇది నారద సింహాచలమై దేవర్షి నారదుడు ప్రతిష్ఠించిన సింహాచలమన్న వివరణతో నారద సింహాచలంగా వాడుకకెక్కడం జననిరుక్తి

ఇలాగా ఎన్నెన్నో మాటలు వింతవింత అర్థాలలో విపరీతార్థాలలో మన చెవిని పడుతుంటాయి

# తెలుగువారి ఇంటిపేర్లు

'ఊరెయ్యది? చీపురుపలి,
పేరో? సూరకవి, ఇంటిపే? రడిదము వార్,
మీరాజు? విజయరామ మ
హారా, జతడేమి సరసుడా? భోజుడయా!'

క్రీ శ పద్ధెనిమిదో శతాబ్దినాటి అడిదము సూరకవి అట్టు పుట్టాన వాళ్ళను గ్యూర్చి ఆనాటి ఒక కవికీ, అడిదము సూరకవికీ జరిగిందని సాహిత్య చరిత్రకారులు భావిస్తున్న వాకోవాక్య విన్యాసాన్ని తెలిపే ఈ చాటు పద్యంలో ఇంటిపేరు ప్రసక్తి వచ్చింది ఇంటిపేరునే కుటుంబ నామమనీ, గృహనామ మనీ, వంశ నామమనీ అటూ ఇటూగా పేర్కొనడం కద్దు ఇలా దేశకాల కుల జాతి వస్తు వ్యక్తి పరిచ్ఛేదమన్నది వ్యవహార సౌలభ్యం కోసం రూపించుకున్న ఒకానొక గుర్తు మాత్రమే

నవ్యభాషా విజ్ఞానంలో సంజ్ఞానామ విజ్ఞానం (onomastics) ఒక ముఖ్య విభాగం గృహనామాలూ, వ్యక్తినామాలూ, పట్టపు పేర్లూ, స్థలవాచకాలూ, సరిత్సాగర వాచకాలూ మొదలైనవి ఇందలి కొన్ని అంతర్విభాగాలు మానవసమాజంలో ఒక వ్యక్తి నుంచి మరొక వ్యక్తిని వేరుచేసి 'ఫలానా' అని నిర్దేశించడానికి వాడే సంజ్ఞావాచకమే వ్యక్తినామం అలాగే ఒక కుటుంబం నుంచి మరొక కుటుంబాన్ని వేరుగా గుర్తించడానికి ఉపకరించే భాషా సంకేతమే ఇంటి పేరు వ్యక్తులనూ, కుటుంబాలనూ, కులాలనూ, ఉప కులాలనూ, తెగలనూ, శాఖలనూ, జాతులనూ, ఉపజాతులనూ ఇది ఇదీ, ఇవి ఇవీ అని నిర్ణీత జనసమూహాలనుంచి వేరుపరిచి,

వ్యావర్తకంగా నిర్దేశించడానికి కొన్ని కొండగుర్తులు తప్పనిసరి ఇలాంటి గుర్తులలో ఇంటిపేరొకటి

సామాజిక వ్యవస్థలో కుటుంబం మూల ప్రాతిపదిక, ప్రాథమిక ఘటకం ఇంటాయనతో కలిపి ఆయన పెళ్ళాం పిల్లలూ, తల్లిదండ్రులూ మొదలైన పోష్యవర్గం కుటుంబమని సామాన్యార్థం రక్త సంబంధమో దత్తతానుబంధమో వైవాహికానుబంధమో కల వ్యక్తుల సమూహం కుటుంబం అని స్థూలంగా చెప్పవచ్చు సజాతివృక్ష మృగాదుల సమూహాలను సైతం కుటుంబాలని ఆ యా శాస్త్ర వేత్తలు పేర్కొనడం మామూలే సంఘజీవులైన మానవుల నైతిక భౌతిక, మానసిక, సామాజికావశ్యకాల కోసం పరికల్పితమైన విస్తృత వ్యవస్థలో ఒక భాగమిది మాతృస్వామిక ప్రాధాన్యం దృశ్యాదృశ్యంగా కన్పిస్తున్నా పితృవంశీయతమీద రూపొందిన కుటుంబ వ్యవస్థయే తెలుగునాట ప్రచురంగా వ్యాప్తిలో ఉన్నట్లు స్పష్టం

తెలుగువారి ఇంటిపేర్లు రకరాలుగా రూపొంది పెంపొందినట్లు మనం గుర్తించవచ్చు బహుకాలం నివసించిన స్థలవాచకాలమీదగానీ ప్రసిద్ధులైన మూలపురుషుల వ్యక్తినామాల మీదగానీ, ఆ యా యుగాలలో ఆ యా కుటుంబాల కూటస్థులు ప్రదర్శించిన విద్యావిక్రమ వితరణాది విశిష్ట గుణ గణాలవల్లగానీ, అవలంబించిన ఆచార విచారాలవల్లగానీ, ఆశ్రయించిన వృత్తి ప్రవృత్తులవల్లగానీ ఇంకా చిల్లరమల్లర అమాంబాపతు రీతులవల్లగానీ ఇంటిపేర్లకు రూపకల్పన జరిగినట్లు విశ్లేషించవచ్చు

మొదట స్థలవాచకాలపై ఏర్పడ్డ ఇంటిపేర్ల తీరుతెన్నులను విహంగావలోకనం చేద్దాం ప్రసంగపరిధినీ, గ్రంథవిస్తరభీతినీ దృష్టిలో పెట్టుకొని ఒకో రీతికి రెండు మూడు ఉదాహరణలు మాత్రం స్థలవాచకాల ఉత్తరభాగాల అకారాద్యనుక్రమంలో క్లుప్తంగా వాటి వ్యుత్పత్తి వివరణలతో పాటు ప్రదర్శించడం జరిగింది ఇది మచ్చుపట్టికయే గాని సమగ్రం కాదు

అద్దంకి, రోణంకి, పోణంగి, మున్నంగి - మొదలైన ఇంటిపేర్లలో ఉత్తరభాగాలైన - అంకి/ - అంగి అంచు లేక సరిహద్దు సూచకాలు భద్రాచలం సింహాచలం -లలోని-అచలం, భద్రాద్రి, హేమాద్రి-లలోని-అద్రి పర్వతార్థకాలైన సంస్కృతపదాలు ఐనకల్లు తనకల్లు కొక్కంటి, బొమ్మకంటి, వెన్నెలకంటి, కప్పగల్లు, కురుగంటి, మాగంటి - లలోని-కల్లు/ -కంటి, -గల్లు/ -గంటి తెలుగులో శిలార్థకమైన కల్లునుంచి ఏర్పడ్డవి పాల్కురికి, చీకలగురికి, చేళ్ళగురికి - లలోని - కురికి/ -గురికి, తేపన కుర్రు, బోడసకుర్రు, చిలంకుర్తి, చీమకుర్తి కుందనగుర్తి - లలోని చివరిభాగాలు అల్పార్థకమైన - కుర్రునుంచి రూపొందినవి నడకుదుటి, నెలకుదుటి - లలోని - కుదుటి కుదురునుంచి ఏర్పడింది 'కొంకుదురు'లో మార్పు లేదు ధనికొండ, రాటకొండ, పెనుగొండలలోని ఉత్తరభాగాలు తెలుగు 'కొండ' నుంచి వచ్చినవి అళ్ళగడ్డ, పులిగడ్డలలోని - గడ్డ మెట్ట లేక చిన్న దీవి అనే అర్థాలు కలది బూదగవిలోని - గవి సంస్కృత గుహా శబ్దభవం ఉదయగిరి, చిప్పగిరి, భువనగిరిలలోని 'గిరి' సంస్కృత శబ్దం రామనగుండు, కొదమగుండ్ల జెట్టిగుండ్ల లలో-గుండు కనిపిస్తుంది బెళుగుప్ప, ముదిగుబ్బ, బూదిగుమ్మలలోని చివరిరూపాలకు సంస్కృత గుహా శబ్దభవంగా ప్రాకృతాలలో కనిపించే - 'గుంఫ' మూలమూర్తి తోకతిప్ప, భైరవానితిప్ప, వాకతిప్పలలోని - తిప్ప దిబ్బ చిన్నమెట్ట అన్న అర్థాలు కలది మొగల్తుర్రు, ఆదుర్తి, కుందుర్తి, పెందుర్తి-లలోని ఉత్తరభాగాలు చిన్నవాగుల నడిమి దీవి అన్న అర్థాలు కల తెలుగు దేశ్య రూపం-తుర్రు నుంచి ఏర్పడ్డాయి అమళ్ళదిన్నె పలకలదిన్నె-లలోని దిన్నె తెలుగు తిన్నెనుంచి రూపొందినది కొల్లిపర, విప్పర్ల, కాకిపర్రు, బల్లిపర్రు తగ్గుపర్తి, పుట్టపర్తి, దగ్గుబర్రు, పెంబర్తి-లలోని చివరిభాగాలు బయలు అనే అర్థంగల తెలుగు పర్రునుంచి ఏర్పడ్డవి ఉండబండ చాకిబండ, పాటిబండ్ల-లలోని బండకు బండరాయి అని అర్థం గూటిబయలు, మర్లబయలు-లలోని

చివరిభాగానికి పెద్దమైదానమని అర్థం తిరుమల, సి గనమల-లలోని 'మల' పర్వతసూచి కందిమళ్ళ తడకమళ్ళ గరిమెళ్ళ తురిమెళ్ళ-లలోని చివరిభాగాలు తెలుగు 'మడి'కి బహువచన రూపమైన 'మడుల'కు రూపాంతరాలు బండారులంక వక్కలంకలలోనిది దీవి అనే అర్థంకల సంస్కృత లంకా శబ్దానికి తత్సమం ఇందాకా చెప్పినవన్నీ భూసంబంధులు

ఇక జలసంబంధులు - కౌలుట్ల, పిల్లుట్ల, మరుట్ల-లలోని చివరి భాగం తెలుగు 'ఊట'కు బహువచనరూపం పాలకోడేరు, తెన్నేటి, పాలేటి, చివరిభాగాలకు తెలుగులో నదీవాచకమైన ఏరు మూలమూర్తి పమిడికాల్వ, వంకరాసికాల్వ వంటి గ్రామనామాలలోని కాల్వ తెలుగుకాలువ తూముకుంట, దురదకుంట, కవకుంట్ల, దూంగుంట,ఎర్రగుంట్ల రూపనగుంట్ల-లలోని చివరి భాగాలకు మూలం తెలుగు 'కుంట' అడివికొలను, వావిలకొలను, పాల కొల్లు గండుగొలను, మాదుగొల్లు-లలోని చివరి భాగాలు తెలుగు 'కొలను' నుంచి వచ్చినవి శివకోడు కలుగోడు, వెలుగోటి-లలోనిది నీటిపల్లం అనే అర్థం కల 'కోడు' కొత్తచెరువు, రాచర్ల, గాడిచెర్ల, చలంచెర్ల చేజెర్ల, జడ్చెర్ల, నలజెర్ల-లలోని చివరి భాగాలకు మూలం తటాకార్థకమైన చెరువు నగరుడోణ, బెళడోణ-లలోని 'డోణ' కొండమీది నీటిగుంట అనే అర్థం కల తెలుగు 'దొన'కు రూపాంతరం ఉప్పునూతల, నేంనూతల రావి నూతల లోని ఉత్తరభాగం తెలుగు 'నూయి'కి బహువచనరూపం గడుపూటి నందం పూండి, జక్కంపూడి, మళ్ళపూడి, జాగర్లమూడి, నెదురుమూడి-వీటిలోని చివరిభాగాలు చిన్నపంటకాలువ అనే అర్థం కల 'పూండి'నుంచి రూపొంది నవి కాశీబుగ్గలోని 'బుగ్గ'కు నీటి ఊట అని అర్థం కడదరబెంచి, ఆమంచ /ఆవంత్స, కట్టమంచి, కూచిమంచి, పొన్వంచ - వీటి చివరివి సేజిదొరువు లేక జలదారి అనే అర్థంకల 'బెంచి'నుంచి వచ్చినవి నల్లమడ, వాకమడ లలోని 'మడ'కు చెరువుతూము అని అర్థం జమ్మలమడక, పూడిమడకల

లోని 'మడక' నూతిమడుగు, రాచమడుగులలోని 'మడుగు'కూడ జలాశయార్థకాలు ఏరు, చెరువు మొదలైన వాటిలో దిగడానికి ఏర్పరిచిన తావు అనే అర్థంకల రేవునుంచి తాళ్ళరేవు, వాడ్రేవు ఓగిరాల, చెర్వీరాల, దుగ్గిరాల-లలోని-రేవు/రాలలు ఏర్పడ్డాయి కపిలవాయి కలువాయి మెళవాయి -లలోని-వాయికి జలాశయాల ముఖద్వారం అని అర్థం కప్పలు వాయి (ఓడలు నిలిచే తావు) నుంచి కపిలవాయి, కబళవాయి రూపొందాయి చోళసంద్రం, నాగసంద్రం తిమ్మసముద్రం, బొమ్మసముద్రం-లు పెద్ద జలాశయాల ఒడ్డున నిర్మితమైనవి 'సంద్రం' సంస్కృత సముద్ర శబ్దానికి వికృతి అనంతసాగరం, రామసాగ్రం-మొదలైన స్థలవాచకాల లోని-సాగరం/-సాగ్రం కూడ సంస్కృత రూపాలు ప్రకరణాన్నిబట్టి పెద్ద చెరువుల గట్టున పెంసిన పరెపట్టుని అర్థం

చింత, తంగేటి, నిమ్మ (ల) బలుసు, మద్ది మర్రి, మామిడి, మొగలి, రావి, రావుల, రావిచెట్టు మొదలైన ఇంటిపేర్లు తరులతాగుల్మ వాచకాలపై రూపెత్తినవి

ఇక మానవ కల్పితాలైన ఇతరాంశాలు విషయం చూద్దాం అనేక గ్రామ నామాల చివర కన్పించే అగ్రహారం ఏకభోగంగానో, గణ భోగంగానో మూర్తి నందిన బ్రహ్మస్వం కందుకూరి, నందమూరి, గూడూరు, ముండ్లూరులలో తెలుగు 'ఊరు'న్నూ, దీని ఔపవిభక్తిక రూపమున్నూ కన్పిస్తాయి గండికోట పెంటకోటలలోని కోట దుర్గార్థకం జనగామ, నందిగామలలోని 'గామ' గ్రామ శబ్దానికి వికృతి ఎర్రగుడి, రూపనగుడి - వీటిలోని గుడికి జనావాసమని అర్థం మోక్షగుండం, రామగుండంలలోని గుండం సంస్కృత 'కుండ' శబ్ద భవం దుమ్ము గూడెం, పంగిడి గూడెంలలోని గూడెంకు అరణ్యకుల పల్లె అని మౌలికార్థం కాకర్లతోట, పెందోటలలో తోట కనిపిస్తుంది కళ్యాణ దుర్గం,

రాయ దుర్గంలలో సంస్కృత దుర్గం కన్పిస్తుంది చెంగల్పట్టు పూతల
పట్టు చంద్రుపట్ల, మద్దిపట్ల-లలోని - 'పట్టు నివాసార్థకం కాశిపట్నం,
బుక్కపట్నం మొదలైన వాటిలోని పట్నం నీటి ఒడ్డున గల వాసస్థానం
'పట్టణం' నుంచి ఏర్పడ్డది చుక్కపల్లి, రాళ్ళపల్లిలలో సంస్కృత 'పల్లి'
కన్పిస్తుంది తాళ్ళపాక మండపాక, పుత్తుంబాక దుబ్బాక, చెంగంబాకం,
వంబాకం, వేంబాకం, ఉపమాక పెనుమాక-లలో గుడిసెల గుంపు అనే
అర్థం కల 'పాక' కన్పిస్తుంది తమిళంలో 'పాక్కమ్' దీని జ్ఞాతిరూపం
పనప్పాకం నుంగంబాక్కం మీనంబాక్కం, పరశువాక్కం మొదలైనవి
తమిళంలో స్థలవాచకాలు కోటపాటి గుడిపాటి దగ్గుబాటి, ఎంమాటి,
తూమాటి (<తూబాడు <తూంబాడు)లలోని చివరిభాగాలు - పాడునుంచి
రూపొందినవి రాచపాళెం, గూళపాళ్యంలోని చివరిభాగాలు చిన్నపల్లె,
దండువిడిసే చోటు, సామంతుని నివాసం వంటి అర్థాలుకల 'పాళయం'
నుంచి ఏర్పడ్డవి గాండ్లపెంట పాచిపెంట జగ్గంపేట, రాజంపేట-లలో
కనిపించే పెంట/-పేటలు శాఖానగరార్థకాలు బిజాపురం, వంగీపురపు,
ధర్మపురిలలోని చివరిభాగాలు పురశబ్ద సంబంధులు పిండిప్రోలు,
రాయప్రోలు, చేబోలు నిడుబ్రోలు, చనుమోలు, ఒంగోలు, బేతవోలు,
భీమడోలు - లలో పట్టణార్థకమైన ప్రోలు శబ్దమూ దాని వికృతులూ
కన్పిస్తాయి కరకు ముక్కల, నిడుముక్కల, పమిడిముక్కల మొదలగు
వాటిలోని - ముక్కల మూడు జనపదాల పొలిమేరలు కలిసేచోటు -
'ముక్కల్లు'నుంచి ఏర్పడి ఉండవచ్చు కొత్తవలస మునగవలస-లలోని
'వలస'కు ఇతర ప్రాంతాలనుంచి వలసవచ్చి జనులు విడిదిచేసిన చోటు
అని అర్థం చావలి, పెరవలి, కురుమద్దాలి, కొడాలి, తెనాలి-లలోని వలి/-
ఆలికి దారి అనే అర్థం కల ప్రాచీనరూపం 'వటీ' మూలమూర్తి
చదలవాడ, నందివాడ, కోరాడ, డొంకాడ-లలో సంస్కృత 'వాట' శబ్దభవ
మైన ప్రాకృతరూపం 'వాడ' కన్పిస్తుంది ఆకివీడు, కలచవిడు, అరవీటి,

కొండవీటి-వంటి ఇంటిపేర్లలో విడిదిపట్టు అనే అర్థంకల తెలుగు 'వీడు' కనిపిస్తుంది

బహుకాల నివాసం, గురుకుల విద్యాభ్యాసం, తరచుగా చేసిన యాత్రలు, గురుపరంపరా ప్రభావం మొదలైనవి కారణాలుగా అయోధ్య కంచి, కాళహస్తి, కాశీ, తిరుపతి, తిరుమల, ద్వారక, ప్రయాగ, బృందా వనం, భద్రాచలం, మహానంది, యాగంటి, వనారస, వారణాశి, శ్రీరంగం శ్రీశైలం - వంటి క్షేత్ర నామాలు కొందరి ఇంటిపేర్లుగా వాడుకిపడ్డాయి

'ప్రస్తుతం నివసిస్తున్న జనావాసానికి ఏ దిక్కునుంచి వలసవచ్చి స్థిరపడ్డారో ఆ వైనాన్ని సూచిస్తూ 'తూర్పు', 'పడమటి' అన్న దిగ్వాచకాలు కొందరి ఇంటి పేర్లుగా చలామణీ అవుతున్నాయి ఆ యా జనపదాలలో నివాసగృహాల ఉనికినిబట్టి 'తూర్పింటి' 'నడిమింటి', 'పడమటింటి' 'పై ఇంటి', మూలింటి', 'బజారింటి', సావడింటి అనీ, పరిసరాలననుసరించి ఊరివాకిలి, కొండకింది, కొండమీది, గడ్డమీది, గుడికాటి, చింతకింది పాటిమీది, పాతర్లగడ్డ, బావికాటి, బావిగడ్డ, బొడ్రాయి దగ్గర్తి, వేపమానింటి కోట్లో (కోటలో), దొడ్ల, దొడ్లో (దొడ్డిలో), వంకలో, చర్ల (చెరువులో), బయటిగేరి, సందింటి, సందులో అనీ కొన్ని ఇంటిపేర్లు వాడుకకెక్కాయి నివాసాల నిర్మాణ సామగ్రినిబట్టి, రీతినిబట్టికూడ గారింటి, పిన్నింటి, మిద్దింటి, మిద్దె, కొట్టం, గుడిసె, పందిరి, మాడీ ఇంటి (మేడ ఇంటి) మొదలైనవీ, ఇళ్ళ నిర్మాణకాలపు పూర్వాపరాలనుబట్టి కొత్తింటి, పాతింటి అన్నవీ ఇంటిపేర్లుగా వ్యవహరించబడుతున్నాయి

కొన్ని ఇంటిపేర్లు ప్రసిద్ధులైన కొందరు మూలపురుషుల పేర్లమీద రూపొందాయి అసలు పేర్లను అటుంచి అయ్యగారి, ఎరచిన్నగారి, పుల్లమ్మగారి, మాదయగారి మొదలైనవి వాడుకలో మన మెరిగినవే ఆదిత్యుని, కాశీనాథుని, గోపాలుని, పరశురాముని, బలభద్రుని, మహాదేవుని,

రాజశేఖరుని, లింగనమఖి, శివదేవుని అన్నవి మూలపురుషుల పేర్లపై ఏర్పడ్డ ఇంటిపేర్లలో కొన్ని బొమ్మరసు, వైజరసు చక్రావధానుల, మాణిక్యావధానుల, అనపోజు ఎర్రోజు, ఎలకూచి పోతుకూచి, ముదగని నరగౌని, అనగాని జానగాని, రేగాని, నల్లగోని, రామగోని, ఇటిగౌని, పెదగౌని, కాశీచయనుల, మల్లాజెట్టి రామాజెట్టి, బ్రహ్మజోస్యుల వల్లభజోస్యుల అయ్యదేవర, సూర్యదేవర, అప్పాద్వేదుల, యల్లాద్వేదుల గోపినీటి కేతినీడి, తిప్పినీడి, అక్కినన, బిక్కినన, గంగినేని, సాదినేని, ధనపండా పురిపండా, అనంతపంతుల పరశురామపంతుల, దామోదర పాత్రుని, బలభద్రపాత్రుని చెళ్ళపిళ్ళ, మరుపిళ్ళ, గౌరిపెద్ది, మాధవపెద్ది అన్నాప్రగడ తల్లాప్రగడ అన్నాబత్తుని తాళాబత్తుని, దాడిబోయిన, ముద్రబోయిన, కాశీభట్ల, విష్ణుభట్ల, దండిభొట్ల పుల్లాభొట్ల, లచ్చుభుక్త, చినమల్లు, రాచమల్లు, మహావ్రతయాజుల, వాజపేయయాజుల, కొమర్రాజు బసవరాజు మాణిక్యారావు వసంతరావు కొమ్మారెడ్డి వాసిరెడ్డి, తల్లావజ్ఝల రామావజ్ఝల, చలసాని పెమ్మసాని తలిసెట్టి, పినిసెట్టి, అయలసోమయాజుల, పద్మనాభ సోమయాజుల మొదలైన ఇంటిపేర్లలోని పూర్వభాగాలు వ్యక్తివాచకాలు, చివరిభాగాలు ఆ యా వ్యక్తుల వృత్తి ప్రవృత్తి సూచకాలు చివరి భాగాలైన - అరసు, - అవధానుల, -ఓజు, కూచి, -గని/-గాని/గౌని/-గోని/-గౌని (<గాదని), - చయనుల,-జెట్టి, -జోస్యుల, -దేవర - ద్వేదుల, -నీటి / -నీడి/ - నేని (<నాయని <నాయుడు), - పండా, - పంతుల, - పాత్రుని, - పిళ్ళ, - పెద్ది, -ప్రగడ, - బత్తుని, బోయిన - భట్ల/ - భొట్ల, -భుక్త, - మల్లు, -యాజుల, రాజు -రావు, -రెడ్డి, - వజ్ఝల, -సాని, (<శ్రేణి, సాహిణీ <సాధనీ) -సెట్టి, -సోమయాజుల అన్నవి ఆ యా కుటుంబాల మూల పురుషుల వృత్తి ప్రవృత్తుల పరమైన విశిష్టతలను తెలిపే పట్టపు పేర్లు

పట్టపు పేర్లే ఇంటిపేర్లుగా కొన్నిచోట్ల చలామణి అవడం కద్దు పట్టపు పేరుతోటే ఒక ప్రసిద్ధ వ్యక్తి ప్రచుర ప్రచారాన్ని పొందినపుడు అదే అతని సంతతివారికి ఇంటిపేరుగా సంక్రమించి స్థిరపడడం కూడ సహజం! అవధానుల ఆచార్ల, గవిని, గౌడు చౌదరి, జెట్టి జోస్యుల, దీక్షితుల, నాయని, పటేలు, పంతుల, పాటీలు, పాంయాజ పిళ్ళా, బట్టు, బత్తుల, భట్టు, మంత్రి రావు రెడ్డి, వజ్ఝ, వజ్ఝల సాహిణి, సెట్టి, సోమయాజుల మొదలైనవి వ్యక్తినామ భాగం లోపించి, పట్టపు పేర్లు శేషించినవి 'మంత్రిప్రగడ'లో సమానార్థకాలైన రెండుపదాలు పునరుక్తమై ఇంటిపేరుగా రూపొందడం విశేషం

కొన్ని కొన్ని సందర్భాలలో ఇంటిపేరు మరుగునపడి, కొన్ని కులాల, తెగల, వృత్తుల పేర్లే కొందరి ఇంటిపేరుగా ప్రచురప్రచారంలోకి రావడం కనిపిస్తుంది ఆది ఆంధ్ర ఆరె, ఆసాది, ఈడిగి, ఉప్పర, ఎరకల, కటికి/కట్టికి కమ్మ, కమ్మర కంసల/కంసాలి, కాపు కుమ్మర కురుబ, కొరిచె, కోమటి, గవర్ల, గాజుల గాండ్ల, గౌరగ, గొల్ల, చాకల, చిప్పిగె, జక్కుల, జంగం, జీర్ల, తంబళ్ళ, తాపీ, దూదేకుల దొమ్మర, నంబి, నేసే, పింజిరి, పూజారి, బట్రాజు, బలిజ, బెస్త, బోయ, బైసీండ్ల, మంగలి, మాదిగ, మాల, ముచ్చిగ, మేదరి, రసపుత్ర, వడ్డె వడ్ల, సాలె, సాహిణి, హరిజన మొదలైన ఇంటి పేర్లు జనుల వాడుకలోనే కాక ఓటర్ల జాబితాలలోనూ, సర్కారు గెజెట్లలోనూ కనిపిస్తాయి

ఆ యా కుటుంబాల వారి పూర్వ పురుషులు అవలంబించిన వైదిక లౌకిక వృత్తుల ఆధారంగా ఏర్పడ్డ ఇంటి పేర్లు కోకొల్లలు ఋగ్వేది, ఋగ్వేదుల, చతుర్వేదుల, తియ్యాళి/త్యాడి (త్రిపాఠీ), త్రివేదుల, ద్వివేదుల, వేదం, వేదాల, వేదుల, శ్రీభాష్యం, సామవేదం మొదలైనవి ఒకనాటి వేద విద్యా ప్రవీణుల ఇంటి పేర్లు అవధానం, ఉపద్రష్ట, కప్పగంతుల, కాణాదం,

జటావల్లభుల పన్నాల, భాట్టం, భాష్యకార్ల భాష్యం, మహావ్రతయాజుల, వాజపేయుల వాజపేయయాజుల శ్రీపాద షడ్దర్శనం మొదలైనవి అధ్యయన అధ్యాపనాలలో, వైదిక మంత్ర వ్యాఖ్యానంలో నిష్ణాతులైనవారి ఇంటి పేర్లు అష్టకాల, ఉపాధ్యాయుల చదువుల, నైషధం, పంతుల, పురాణం, భారతం భారతుల మూలఘటిక వైయాకరణం, వ్యాకరణం మొదలైనవి కావ్యపురాణ పఠన ప్రవచనకారుల శాస్త్ర విద్యాచరణప్రచారణాచణుల సంతతికి చెందినవారి గృహనామాలు అగ్నిహోత్రం అన్నదాత అన్నదానం అయాచితం, కాల జ్ఞానం గడియారం జంధ్యాల, జల సూత్రం, దర్భముళ్ళ పంచాగ్నుల, సంధ్యావందనం సన్నిధానం మొదలైనవి శాస్త్రోక్త కర్మాచరణంలో ప్రసిద్ధి పొందిన వారి వారసుల ఇంటి పేర్లు యోగవిద్యారాధకులూ షణ్ముఖి ముద్రాసాధకులూ ఐనవారి ఇంటిపేరుగా షణ్ముఖి' వాడుకపడి ఉండవచ్చు ద్వాదశి శనివారపు - తిథివారాలపై రూపొందిన ఇంటి పేర్లు ద్వాదశిని భద్రతిథి అంటారు దైవజ్ఞులు మదన ద్వాదశి, విభూతి ద్వాదశి, విశోక ద్వాదశి - మొదలైన పుణ్య తిథులలో శాస్త్రోక్త వ్రతాచరణ నియమంగల వారికీ ఇంటిపేర్లు సంక్రమించి ఉండవచ్చు ఇక, శనివార మాహాత్మ్యం గూర్చి వేరుగా చెప్పనక్కరలేదు

వెనకటి రాజాస్థానాలలో బాహత్తరి (ద్విసప్తతి) అంటే డెబ్బై రెండు రకాల ఉద్యోగి భేదాలుండేవి ఆ యా ఉద్యోగాలలో కొన్నితరాలుగా నియోజితులైనవారి ఇంటిపేర్లు బహుప్రకారాలుగా రూపొందినట్లు గమనించవచ్చు అడపం/అడపా, అధికార్ల, అవసరం/అవసరాల, కాశంజి, కావలి, కొట్టరువు గొడుగు జోస్యం తంత్రవహి, తలారి దళవాయి దినవహి, పంచాంగం, పడాల పారా, బండరు / బండరువు / బండారు / భండారు, మండలి మండలిక మంత్రి,రాయబార్ల రాయసం వాయువేగుల,

విన్నపాల, వెజ్జు/వైద్యుల, వేగుల, సమయం, సమయమంత్రి సముఖం, సాహిణి సుంకర/సుంకరి, స్థానం, స్థానాపతి మొదలైనవి ఈ రకంగా ఏర్పడ్డ ఇంటిపేర్లు

ఆ యా కుటుంబాల కూటస్థుల విద్యావినోద విక్రమ క్రమ వితరణ విశిష్టతలు కారణంగా ఆనాటి పాలకులనుంచి ఆచార్య పురుషులనుంచి పొందిన బిరుదావళి ముఖ్యంగా రూపెత్తిన పౌరుషనామాలు అనేకం తెలుగు వారి ఇంటిపేర్లుగా కనిపిస్తాయి పౌరుషం బహుప్రకారం 'శస్త్రే యోద్ధా, శాస్త్రేబోద్ధా' అని కదా పురాణవాక్యం! శస్త్రాస్త్ర విద్యా నైపుణ్యం, శాస్త్రార్థ విద్యా ప్రావీణ్యం పౌరుషంలో కొన్ని విభాగాలు

అడిదం, అమ్ముల, ఈటె, ఉండేల (<ఉండవిల్లు) కటారి కత్తి, కత్తుల, కొంతం, గుదే (గుదియ) జానకి (తుపాకి మొ॥ వాటికి నిప్పు అంటించే తాడు) తుపాకుల, బందూకు, బాణాల, సింగాడి/సింగిణి మొదలైన ఇంటిపేర్లు సమరాంగణ సాధనాల సంపత్తివల్లగానీ వాటి తయారీలోని నేర్పరితనంవల్లగాని, వాటి ప్రయోగంలోని సాహస చాకచక్యాల వల్లగానీ ఏర్పడ్డవి ఏనుగు ఏనుగుల, గుర్రం గుర్రాల, వీరగంధం మొదలైన ఇంటిపేర్లు అసమాన ధైర్యశౌర్య స్సాహసాలు ప్రదర్శించి, వాటికి గుర్తింపుగా సమరాంగణ కళాధురీణులూ గుణగ్రహణపారీణులూ ఐన ఒకనాటి ప్రభువుల నుంచి పొందిన పురస్కారాలకు స్మృతిచిహ్నాలు

అమృతకవి, ఆశుకవి, కవిరాయని, కవుల, ఘోరకవి, చిత్రకవి, డిట్టకవి, నిదానకవి, నిమిషకవి, ప్రౌఢకవి, బంధకవి, భద్రకవి, భారతకవి, మధురకవి, వరకవి, వర్ణకవి, వార్తకవి విరాట్కవి, శృంగారకవి, ప్రబంధం ప్రబంధాంకం, పమిడిఘంటం /పైడిఘంటం, శతఘంటం మున్నగునవి విమల విద్యాభారతి వల్లభులైన ప్రభువుల సభాంతరాలలోగాని, పరమ వివేక సౌరభ విభాసితాలైన పరిషత్తులలోగాని, పరిఢవించిన కవితా విద్యా

వినోద క్రీడలమూలంగా ఆయా విద్వత్కవులకు సువర్ణ ఘంటా కింకిణ గండ పెండేరాలతోపాటు సంక్రమించిన బిరుదావళిపై రూపొందిన గృహనామాలు అమరవాది చలవాది, మంత్రవాది, మహావాది, కోలాహలం, ఝంఝా మారుతం, నిరాఘాటం, పరాంకుశం, ప్రతివాది భయంకరం, బడబాగ్ని, మీసరగండ మొదలైనవి ఉద్భట వివాదప్రౌఢి - పరపక్ష నిరాకరణ స్వపక్ష సంస్థాపనలతో - ప్రత్యర్థులను చిత్తుచేసి, తర్కకర్కశధీకలితు లైన పీఠాధిపతుల/మఠాధిపతుల సన్నిధానంలోగానీ విద్యాదయితులైన ప్రభువుల హజారాలలోగానీ వాదు పెండేరాలతోపాటు మెప్పులందిన వారి వారసుల ఇంటిపేర్లు

ఒగ్గు కించుగంటల, కొమ్ము, గజ్జెల ఘటం, డప్పు, డోలు, తప్పెట, తిత్తి, తుడుము, పంబ(ల), భేరీ మద్దెల, రుంజ(ల) వీణ, వీరణాల మొదలైన ఇంటిపేర్లు ఆయా సంగీత పరికరాలమీద అవతరించి నవి చిత్తారు, చిందు(ల) జక్కుల, తరంగాల, నట్టువ పదాల బయలాట బొమ్మలాట భజన, భాగవతి, భాగవతుల, సుద్దుల, హరిభజన మొదలైన సంగీత శిల్పనృత్య కళారూపాలమీదా అశ్వధాటి, క్రమధాటి, కళానిధి, ఘనం తోడి పల్లవి బయకారం షట్కాలం స్వరకాడు, స్వరం-మొదలైన లలితకళా పారిభాషిక పదాలమీదా రూపొందిన గృహ నామాల ఆయా కళాసంబంధి రంగాలలో కళాకారులు సాధించిన ఘనతకు తార్కాణాలుగా రాణకెక్కినవి

పశుపక్షి మృగాదుల పెంపకంవల్లనో, వాటి క్రయవిక్రయాలవల్లనో, వాటితో వ్యవసాయం, రవాణావ్యాపారాలు చేయడంవల్లనో, వాటితో క్రీడాదికాలు నిర్వహించడంవల్లనో ఆ యా క్రూరమృగాలను వేటాడి జనులను వాటిబారినుంచి కాపాడడంవల్లనో ఆబోతుల ఆవుల, ఈగల, ఈగా, ఎడ్ల ఎద్దు(ల), ఎనుముల, ఒంటెల ఒంటెద్దు(ల) కరెడ్ల కాకి,

కోడి, కోడెల, కోన/కోనా (<ప్రా గోణ <సం గోః = గోధనం) గువ్వల, గేదె(ల), గొర్రె(ల) గొర్ల, చిలక (చిలకా) జింక జింకల, జోడావుల, డేగల, డేగా, తెల్లమేకల, దున్నపోతుల, దూడా, నంది, నందుల, నల్లమేకల, నల్లబోతుల, నల్లమోతు నెమలి, పంది, పయ్యావుల, పాముల, పావురాల, పిచ్చుక, పిట్టల, పిల్లి, పులి బర్రె, బొల్లెద్దుల, బోడావుల, ముంగి, మేకల, లేళ్ళ, మేకా, వెలుగుబంటి, సింగం మొదలైన ఇంటిపేర్లు ఏర్పడినట్లుగా చెప్పవచ్చు పశుపాలన గోలాలన వృత్తులలో పేరు పెంపులు గడించిన వారి ఇంటిపేరు 'కిలారు' గోకులం, ఆలమంద అనే అర్థాలు గల కిలారం/కీలారం నుంచి వచ్చింది

కొడవంటి/కొడవలి గాదె గుజ్జుల, గుంటక, గుద్దంటి గొడ్డళ్ళ, గొర్తి గొనెల, చిక్కం, తోక(ల) (<మేడితోక), నాగళ్ళ, దుడ్డు, పంటేరు, బండి బళ్ళ, మడక మొదలైన వ్యవసాయ పరికరాల తయారీ వల్లనో, వీటిని ఉపయోగించడంలో చూపిన నేర్పరితనంవల్లనో వీటిమీద ఇంటిపేర్లు ఏర్పడ్డాయి

అనుముల ఆరుగల ఆళ్ళ కందికట్టు కందిబ్యాళ్ళ కందుల, గుమ్మడి, గోగుల చిక్కుడుకాయల చింతగింజల, చేమకూర జొన్న జొన్నగింజల జొన్నవిత్తుల, టెంకాయల, తోటకూర, దోసకాయల, ధనియాల నువ్వుల, పాలకూర, పుచ్చకాయల, పెసల, ప్రత్తి, మామిడి, మామిండ్ల రాగుల వంకాయల, వంగల, వనం, సజ్జల, సెనిగల మొదలైన ఇంటిపేర్లు పైరుపంటల కూరగాయలపై ఏర్పడ్డవి

అతిరసాల, అప్పాల అంబటి, అల్లం, ఆవాల ఇంగువ, ఉప్పు, ఊరుబిండి, కొర్రకూటి, గంజి, చక్కిలం, చక్కిలాల, చల్లా, చింతపులుసు, చేబియ్యం జున్ను నూకల నూనె, నేతి, పచ్చిపులుసు పప్పు, పులగం పెరుగు, బూరెల, బెల్లం, మజ్జిగపులుసు, మీగడ, రొట్టెల, వడియాల,

వరికూటి, శొంఠి, సంకటి, మొదలైనవి ఆహారపదార్థాల మీదా, ఆ యా సంభారాలమీదా ఏర్పడ్డ ఇంటిపేర్లు

అందె (ల), కంకణాల, కడియాల, కంటె, చెవ్వాకుల, దుద్దుల, పోగుల, ముక్కర, ముంగర, మువ్వల, లక్కాకుల మొదలైన ఇంటిపేర్లు ఆభరణ వాచకాలపై రూపొందాయి నీలం, పగడాల, ముత్యం, ముత్యాల వజ్రాల వంటి రత్నవాచకాలు, పైడి, బంగారు మొదలైన లోహవాచకాలు ఇంటిపేరుగాను కనిపిస్తాయి

అత్తరు, కస్తూరి, గందోడి, గంధం జవ్వాజి (ది) పచ్చకప్పురపు, ధూపం, పన్నీరు, పునుగు, బుక్కా, బుక్కాం, బుక్కిట్ల మొదలగు సుగంధ ద్రవ్యవాచకాల మీదా, చెంగల్వల, చేమంతుల, పువ్వుల, పూల, పొన్నపూల, మల్లెల మొదలైన పుష్పవాచకాల మీదా ఇంటిపేర్లు కొన్ని వాడుక కెక్కాయి

కాసు, కాసుల, చిల్లర, రొక్కం మొదలైన ఇంటిపేర్లు డబ్బా దస్కానికి సంబంధించినవి

కాళ్ళ, గడ్డం, గుండె, గోరు, డొక్కా, నోరి, పిల్లికండ్ల, బుర్రా, బొడ్డు, మీసాల, ముక్కు, మొదలైనవి కొట్టొచ్చినట్టున్న కొన్ని శరీరావయవ నిర్మాణ విశిష్టతలను పట్టి ఇచ్చే వ్యక్తులపై రూపెత్తిన ఇంటిపేర్లు

ఈ ఇంటిపేర్ల ప్రదర్శనమంతా కొండను అద్దంలో చూపినట్లు

# ఇంటిపేర్ల మార్పు

అది అసఫ్‌జాహీ సల్తనత్ నసబ్‌నామా - వంశ పరంపర - లో ఆఖిరీ నిజాము హయాము తన ఇలాఖా ప్రజలను కన్నబిడ్డలుగా భావించి పాలించిన వెనకటి నిజాం మహబూబ్ అలీ ఖాన్ ప్రజల చూపులో నిజంగా అబుల్ ఫజల్ అని అభిజ్ఞులంటూ ఉంటారు ఆ దరిమిలా తఖ్తు నెక్కిన ఉస్మాన్ అలీఖాన్ పిత్ర్యంగా పొందినది రాజ్యాధికార మేకాని ప్రకృతిరంజనం కాదు స్వతహాగా అతని బుర్రలో తొలిచేదో, లేక ఎవరైనా చెవులుకొరికే చాడీకోరుల చెడు సలహాలపై తోచేదో కాని, ఆఖిరీ నిజాముకు తెలుగువ్యక్తి కనిపిస్తే తత్తరపాటు, తెలుగు పలుకు వినిపిస్తే ఉలికిపాటు, తెలుగులిపి కనిపిస్తే తడబాటు, తెలుగుదనం వాసిస్తే కలవరపాటు, తెలుగు గాలి వీస్తే గగుర్పాటు తెలుగు సభలంటే గుండెపోటు

అవి సంస్థానం బయట 'భారత జాతీయ సమరం' ముమ్మరంగా సాగుతూ ఉన్నరోజులు ఛప్పన్నారు దేశాలలో సర్వస్వతంత్ర పాలకుడు కావాలన్న తుర్రీపుర్రీ తపనా సలాకార్లుకాని రజాకార్ జతగాళ్ళ వత్తాసూ, ఇతర విద్రోహకారుల - దఫల్‌బాజీశక్తుల జులుం జబర్దస్తీలు తోడుకాగా, సంస్థానం తాలూకు ప్రజలకు గడిగడి గండంగా గడచిన గడ్డుగడియలవి ఈ ఆటుపోట్లకు తోడు అంచెలంచెలుగా జాతీయ సమరపు సెగాపొగా తగిలి నిజాం ఇలాఖా జనం రగిలిపొగిలినప్పుడు ప్రజల ఊహలపై, ఉద్యమాలపై ఉచ్చులు మరింత బిర్రబిగిసేవి బహిరంగ సభలుకాని, ఊరేగింపులుకాని, ఉత్సవాలుకాని క్లుప్తంగా, గుప్తంగానైనా జరుపుకోవడానికి కూడ అన్నీ పేచాపేచీలే, అన్నీ తంటాతకరారులే! అనుక్షణమూ ఆదుర్దా, అడుగడుగునా

ఆటంకాలు ఎన్నెన్నో (ఇస్తిహారులూ) గస్తీనిషాన్‌లూ, ఎకరార్నామాలూ గైర్‌ముల్కీ ఖానూన్‌లూ వగైరాలు జనుల గొంతులకు ఉరితాళ్ళుగా, కాలి సంకెళ్ళుగా, నోటి తాళాలుగా అమలులో ఉండేవి

గ్రంధాలయ కార్యక్రమాల పేర, సంస్కరణోద్యమాల చాటున, సాహితీ సాంస్కృతిక సభల సాకుతో, కవులూ, కళాకారుల సత్కారాల మిషతో - ఏ రావిచెట్టు వారింటనో, ఏ హనుమంతరావుగారి భవంతిలోనో లేక మునగాల రాజావారి నివాసంలోనో, రంగధామ నాయడుగారి కుటీరంలోనో, మరీ ఫరవాలేదనుకుంటే శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయంలోనో చాటుమాటు సమావేశాలు కార్యకర్తల చలాకీ తనంతో గప్‌చుప్‌గా జరిగేవి పశ్చిమాంధ్ర ప్రాంతంనుంచో, సాగరాంధ్ర తీరంనుంచో ప్రజాశ్రేయఃకాములైన నాయకులు నిజాం హద్‌బందీ దాటి లోపల అడుగుపెడితే చాలు వారి అంటూసొంటూ గిట్టని బందోబస్తు అధికారవర్గమూ వారిసిబ్బందీ తరతరలాడుతూ వేయికళ్ళతో నిఘాపహారాలు చేసేవారు

సదరదాలత్ కోర్టు అమీనుల తాఖీదు తర్హీఫ్‌లలో, నాజిరీ అదాలత్ నిగాబానుల దఫ్తరీ తహజ్జీ తర్జుమాలలో, తీర్పులివ్వడానికి తైయారైన హుకుందారీ హుజూరు కచేరి దర్వానుల పిలుపులలో కొత్వాలీ నిగాబానుల నమూదారీ నక్షాలలో, తార్‌తపాలా దఫ్తరీ జవానుల వాకబులలో ఆంధ్ర నాయకుల పేరు వింతవింత రూపాలతో వినిపించేవీ, కనిపించేవీ టూగ్ టూటీపీర్‌కాశీం, పట్టాభయ్ సత్తార్‌మియా టప్పాభాయ్ సత్తార్‌మియా ఖొండా వెన్కాటప్పాభాయ్ పెంటాలూ - వంటివి వీటికి కొన్ని ఉదాహరణాలు మొదటిది టంగుటూరి ప్రకాశంగారి పేరు రెండూమూడూ భోగరాజు పట్టాభిసీతారామయ్యగారి వికృతి రూపాలు చివరిది కొండా వెంకటప్పయ్య పంతులుగారి పేరుకు వచ్చిన తిప్పలు

ఉర్దూ భాషీయుల మాట అటుంచి ఉర్దూ భాషాముఖంగా ఓనమాలు దిద్దుకుని తర్ఫీదు పొంది పట్టాలు స్వీకరించి పదస్థులైన తెలుగువారి

ఉచ్చారణతో పాటు తెలుగు భాషా జ్ఞానం సైతం అంతంత మాత్రంగా ఉండేవి ఇక తతిమ్మా అలగాజనం నిశానీశాస్త్రీల ఉచ్చారణ తీరుగూర్చి హయ్‌రానపడ (ఆశ్చర్యపడ) నక్కరలేదు! ఉర్దూ లిపి కూర్పులో, ధ్వనుల పలుకు తీర్పులో తెలుగువారి పేర్లకు వచ్చిన మార్పులివి టాంగ్ టూటీ అంటే కాళ్ళు విరిగిన అనీ టప్పాభాయ్ అంటే తపాలా బంట్రోతు అనీ అర్థాలు ఈ తరహా ఉల్టా పల్టా ఉచ్చారణ-ఉచ్చాటనలకు బలియైన తెలుగువారి పేర్లకు వీటిని ఉదాహరణలుగా స్థానికులైన పెద్దలు పేర్కొంటూ చమత్కరిస్తూ ఉంటారు

దేశకాల వస్తు వ్యక్తి జన్మ సంస్కార వృత్తి ప్రవృత్త్యాది ఉపాధి భేదాలను ఆశ్రయించి ఇంటిపేర్లు ఏర్పడుతుంటాయని వెనకటి ప్రసంగంలో స్థిరీకరించడం జరిగింది అందువల్ల ఈ ఇంటిపేర్లు స్థిరంగా ఉంటాయన్న భరోసా ఎవ్వరూ ఇవ్వలేరు అయితే అనేక కారణాలవల్ల కొన్ని ఇంటి పేర్లు చకచకా మార్పులకు లోనుకావచ్చు, వాటి అభావంలో కొన్ని చాల తరాలకుగాని మార్పునందకపోవచ్చు ఉపాధి భేదాలైన దేశకాలాదులు మారినప్పుడల్లా ఇంటిపేర్లు సర్వసామాన్యంగా మారిపోతాయని నిరూపించడమే ప్రకృత ప్రసంగానికి పరమార్థం

ఇంటిపేర్ల మార్పులకు హేతువులు ఇన్నీ అన్నీ కావు దత్తు వెళ్ళినప్పుడూ స్త్రీకి వివాహానంతరము, స్త్రీ విడాకులు పొందినప్పుడూ, ప్రసిద్ధుల ఇంటికి పురుషులు ఇల్లరికం వెళ్ళినప్పుడూ, అశ్లీలార్థక-నీచార్థక నివారణకూ ఇంటిపేర్లు మారడం సహజం ఇవికాక, కృత్రిమ వ్యుత్పత్తులూ, సంస్కృతీకరణలూ, పోషకుల మెహర్బానీకై కవి పండితులు చేసిన కైవారాల చమత్కారాలూ ఆ యా వ్యక్తుల అవయవ వైకల్యాలూ కొత్తగా చేపట్టిన వృత్తి ప్రవృత్తులూ - ఇలాగా ఎన్నెన్నో అంశాలు ఇంటిపేర్ల మార్పునకు హేతుభూతాలవుతుంటాయి ప్రకృతం ఒక్కొక్క అంశాన్ని విడివిడిగా సోదాహరణంగా పరిశీలిద్దాం

కొడుకులు కొమ్మలు లేని దంపతులకు నరకం తప్పదని మన నమ్మకం 'అపుత్రస్యగతిర్నాస్తి'-'నాపుత్రస్యలోకోస్తి' అందుకని దత్తు తెచ్చుకోవడం పరిపాటి దత్తు వెళ్తే దత్తుడి జనకపితరుల ఇంటిపేరు పాలకపితరుల ఇంటిపేరుగా మారుతుంది కాశీ కృష్ణాచార్యులు పుట్టుకతో అక్కివారి అబ్బాయి వాగ్దేవి పురుషోత్తం జనకపితరులు అమలాపురం నివాసులు జోగులాంబ సుబ్బారావులు మంచాళవారు ప్రసిద్ధ సంగీత విద్వాంసులు మంచాళ జగన్నాథరావుగారూ, వీరూ ఏకోదరులు గుడిపాటి వెంకటచలం కొమ్మూరివారి కుర్రవాడు, కొమ్మూరి వెంకట్రామయ్యగారి సోదరులు ఎలమంచిలి గ్రామనివాసులు పూడిపెద్ది గోపాలశాస్త్రిగారి కుమారులు వెంకటచయనులు విశాఖపట్టణం వాస్తవ్యులు శ్రీరంగం సూర్యనారాయణగారికి దత్తువచ్చి శ్రీరంగం వెంకటరమణయ్య (శ్రీశ్రీ జనకులు)గా మారాడు. విజయనగరం వాస్తవ్యులు మూలా పేరన్న శాస్త్రి తాతావారి ఔరసపుత్రులు

ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తి జస్టిస్ శ్రీ ఎద్దుల సీతారామ రెడ్డిగారి జనకపితరులు ఉండవిల్లి వాస్తవ్యులు పొడుగు వెంకట్రామమ్మ చెన్నారెడ్డి దంపతులు కించుపాడు నివాసులైన ఎద్దుల తులశమ్మ తిప్పారెడ్డిగార్లు వీరి పాలక పితరులు ప్రఖ్యాత మానసికవైద్యులు డాక్టర్ పొడుగు రఘురామరెడ్డిగారు జస్టిస్ సీతారామరెడ్డిగారికి స్వయానాసోదరులు. కాకతీయ విశ్వవిద్యాలయం మాజీ వైస్-ఛాన్సలర్ ఆచార్య వెంకట్రామయ్యగారు కైలాసవారి ఇంటికి దత్తులు మూలకుల గోత్రీయ ఆర్యవైశ్య కులోద్భవులు ఖమ్మం జిల్లా మధిర తాలూకా పెదేళ్ళపాడు గ్రామవాసులు శ్రీ తొండెపు రత్నమ్మ ఆదెయ్యలు వీరి జనక పితరులు ఇదే కుల గోత్రాలు గల సికిందరాబాదు సోమసుందరం పేట వాస్తవ్యులు కైలాస నరసమ్మ వెంకన్నలు పాలక పితరులు అలాగే పాపన్నపేట జమీందారు రాజారామ చంద్రరెడ్డిగారు కూడా దత్తులే శ్రీవత్సగోత్రులు అల్లాడ అంబమ్మ

లక్ష్మణ శాస్త్రిల కుమారులైన వెంకట నరసింహయ్య రంగంపేట నివాసులైన గుడిమంచి అంబయ్యకు దత్తుడుగా వెళ్ళి గుడిమంచి బంగారు శాస్త్రిగా మారినారు పద్దెనిమిదో శతాబ్దినాటి తెలంగాణా యక్షగాన కర్తలలో బంగారు శాస్త్రి ఒకరు ప్రసిద్ధ విద్వత్పరిశోధకులు రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ కర్ణమడకల అలమేలు మంగమ్మ కృష్ణమాచార్యుల ఔరస పుత్రులు అనంతపురం జిల్లా రాళ్ళపల్లి గ్రామ వాస్తవ్యులైన వీరి మాతామహి రాళ్ళపల్లి లక్ష్మమ్మగారి దత్తు స్వీకారమైనందున ఇంటిపేరు మారింది

బళ్ళారి జిల్లా జోళదరాసి గ్రామవాస్తవ్యులు కెంగల్లు చిన్న హొన్నన గౌడ భోగమ్మల దౌహిత్రులూ హావళిగి పంపనగౌడ రుద్రమ్మల పుత్రులూ (రుద్రమ్మ చిన్న హొన్నన గౌడ కొమార్తె), రాయలసీమ రంగస్థల నటులూ ఐనదొడ్డన గౌడ మాతామహుల ఇంటికి దత్తువెళ్ళి మాతామహుల గ్రామనామ గృహనామాలతోపాటు జోళదరాసి దొడ్డనగా వాడుక పడ్డారు పంపనగౌడ సొంత సోదరులూ దొడ్డనగౌడ పినతండ్రీఐన హావళిగి హొన్ననగౌడ తన కుటుంబంతో అన్నగారి నీడన జోళదరాసిలో నివసిస్తూ దొడ్డనగౌడ గారికి సంతతిలేనందున కెంగల్లువారి ఆస్తిపాస్తులలో నాల్గింట మూడోవంతు దనంగా స్వీకరించి కెంగల్లు పంపనగౌడగా వ్యవహృతులయ్యారు ఇక్కడ దత్తూలేదు, ఇల్లరికము లేదు కేవలం అనుకోని రీతిలో కెంగల్లు వారి ఆస్తి దఖలు పడడంచేత అసలు ఇంటిపేరు మరుగునపడి 'కెంగల్లు' అన్న కొత్త ఇంటిపేరు సంక్రమించింది

వివాహానంతరం స్త్రీ పుట్టింటి పేరు స్థానంలో సాధారణంగా అత్తింటివారి పేరు వచ్చి నిలుస్తుంది భండారు అచ్చమాంబ పుట్టింటిపేరు కొమర్రాజు వారు గొడేవారి ఆడపడుచు పెళ్ళయ్యాక మనినె సుభద్ర య్యమ్మగా మారింది అన్నాప్రగడ చన్నఘంటమ్మ కల్లివారి కన్య

నారాయణాచార్యుల భార్య పుట్టపర్తి కనకమ్మ కిడాంబి శేషమ్మ దేశికాచార్యుల తనయ కోటిరెడ్డి (1886-1981) గారి భార్య కడపరామ సుబ్బమ్మ (1902-1982) కొవదుల అచ్చమ్మ రామచంద్రారెడ్డి (కడప జిల్లా జమ్మలమడుగు తాలుకా సుద్దపల్లె వాస్తవ్యులు) గార్ల కూతురు మాజీ రాష్ట్రపతి డాక్టర్ నీలం సంజీవరెడ్డిగారి సతీమణి నీలం నాగరత్నమ్మ తరిమెల సుబ్బారెడ్డిగారి పుత్రిక నాగిరెడ్డిగారి భార్య తరిమెల లక్ష్మీకాంతమ్మ, నీలం సంజీవరెడ్డిగారి సోదరి ఇల్లిందల సీతారామారావు గారి భార్య సరస్వతీదేవి కామరాజు రత్నమ్మ వెంకటప్పయ్యల కన్య టి యన్ (తక్కెళ్ళ నారాయణ) సదాలక్ష్మి కర్రెగోపమ్మ కొండయ్యల పుత్రిక ఆవుల జయప్రదా దేవి లింగం వారి ఆడబడుచు కొత్త లక్ష్మీరఘురామ్ జంపాలవారి ఆడబడుచు గారపాటి రేణుకాచౌదరి కానుమిల్లి వారి కన్య

గౌతు ఝాన్సీలక్ష్మీబాయి రావల ఝాన్సీలక్ష్మిగా మారింది మల్లాది సుబ్బమ్మ కొండూరివారి కూతురు మాదిరెడ్డి సులోచనగారి పుట్టింటి పేరు మామిడివారు యద్దనపూడి సులోచనారాణి పుట్టింటివారు నెమలికంటివారు తెలంగాణం శంకరంపేట వాస్తవ్యులు శ్రీవైష్ణవ బ్రాహ్మణులు చింతామణి వెంకటలక్ష్మమ్మ శేషాచార్యుల తనయ ఆండాళమ్మ బోయినిపల్లెవారి కోడలై కృష్ణమాచార్యుల ఇల్లాలైనది గద్వాలాస్థాన విద్వత్కవి చింతామణి యామునాచార్యుల సోదరియైన ఈమె కవయిత్రి కూడా

పాఠకులు తబ్బిబ్బు పడకుండానూ, ప్రచురణ కర్తలకూ, పంపిణీ దారులకూ పుస్తక విక్రేతలకూ వ్యాపారపరంగా ఇబ్బంది కలగకుండానూ పుట్టింటి పేరూ, అత్తింటి పేరూ రెండు (పుట్టింటి పేరు బ్రాకెట్లలో అను కోండి) పెట్టుకుంటున్న రచయిత్రులు లబ్ధ ప్రతిష్ఠలు కొందరు కనిపిస్తారు ఆరెకపూడి (కోడూరి) కౌసల్యాదేవి శిఖా (గంటి) వెంకటరమణ, సత్య వాడ (ఓగేటి) ఇందిరాదేవి అవసరాల (వింజమూరి) అనసూయాదేవి మొదలైన వారిని ఇందుకు ఉదాహరణలుగా పేర్కొనవచ్చు

పెళ్ళి అయిన తర్వాతకూడా పుట్టింటి పేరుతోటే వాడుక పడ్డవారు కూడ కనిపిస్తారు  డాక్టర్ కొమర్రాజు అచ్చమాంబ, డాక్టర్ తూమాటి అనూరాధ (అత్తింటి పేరు గుర్రం వారు)  డాక్టర్ నాయని కృష్ణకుమారి (అత్తిల్లు కనకవల్లి)  డాక్టర్ ఇల్లిందల చిత్ర (భర్త నడింపల్లి వారు), శ్రీమతి నిడదవోలు మాలతి (అత్తిల్లు వెల్చేరు)  శ్రీమతి కోవెల శాంత (అత్తిల్లు నాగులపాటి), శ్రీమతి తెన్నేటి సుధ (అత్తిల్లు రామరాజు), కూచి (కె) రామలక్ష్మి (భాగవతుల) ఆరుద్రగారి సతి,  డాక్టర్ అన్నే లలితకుమారి (అత్తిల్లు పుయ్యూరు) మొదలైనవారు ఈ వర్గం కిందికివస్తారు అయితే, విదేశ యాత్రల అనుమతి పత్రాలలో, సివిల్ మ్యారేజి అర్హతా పత్రాలలో అత్తింటి పేరు నమోదు చేసినప్పటికీ స్వదేశంలో పుట్టింటిపేరు తోటే కొందరు చెలామణి అవుతున్నారు

విడాకులు పొందిన స్త్రీల ఇంటిపేర్లు 'మనోవర్తి' పొందినా, పొందక పోయినా ఫలానా పద్ధతిలోనే ఉండాలని విడాకుల చట్టం నిర్దిష్టంగా, నిర్ద్వంద్వంగా నిర్దేశించదు  వ్యక్తిగతమైన నిర్ణయంపై ఈపేరు మార్పిడి ఆధారపడి ఉంటుంది  భర్త ఇంటి పేరే ఉంచుకోవచ్చు లేదా పుట్టింటి పేరుకు మారవచ్చు, లేదా రెండింటి ప్రమేయం లేకుండా ఇంటి పేరుకు అతీతంగా ఉండవచ్చు  దద్దనాలవారి ఆడబడుచు పెళ్ళయ్యాక ముప్పాళ్ళ రంగనాయకమ్మగా వాడుకెక్కి విడాకుల తర్వాత రెండింటినీ కాదని వట్టి 'రంగనాయకమ్మ'గా తమ సాహితీ సృష్టి సాగిస్తున్నారు  వితంతువుగానీ, విడాకులు పొందిన మహిళగానీ పునర్వివాహం చేసుకుంటే దంపతుల ఇష్టా నిష్టాలపై ఇంటి పేరు ఆధారపడి ఉంటుంది  అవివాహితల ఇంటి పేరు మారదని విడిగా పేర్కొననక్కర లేదు

ప్రసిద్ధుల ఇంటికి ఇల్లరికం వెళ్తే అల్లుడికి ఇంటిపేరు అత్తవారిదిగా మారిన సంఘటనలు అక్కడక్కడ కనిపిస్తాయి  కర్నూలు జిల్లా వెలుగోడు

మండలం రేగడి గూడూరువాసులు దుబ్బా పెదలింగారెడ్డి, కోయిలకుంట్ల తాలూకా ఉయ్యాలవాడ గ్రామ వాస్తవ్యులు దానశీలురు బుడ్డా వెంగళరెడ్డి గారి చెల్లెలిని పెళ్ళాడి నందున తామరతంపరగా వర్ధిల్లిన పెదలింగారెడ్డి వంశపరంపరలో 'బుడ్డా' ఇంటిపేరుగా స్థిరోద్భవ అయింది. సంతతీ, జ్ఞాతి సంతతీ లేని అక్కగారు (చింతలాంపల్లి పోతులనాగమ్మ బాల నాగప్పల కొమార్తె) వెల్నాటి పెద్దక్క (ఈమె వెల్నాటి ఓబన్న భార్య) తమ్ముడైన పోతుల వెంకటప్ప, గంజికుంట గ్రామం - వజ్రకరూరు మండలం, అనంతపురం జిల్లా - వచ్చి అక్కగారికి తోడుగా నిలిచి స్థిరపడి ఇంటా బయటా వ్యవహారాలు నిర్వహిస్తూ దానవిక్రయం మూలంగా అక్కగారి ఆస్తిపాస్తులకు హక్కుదారుడైనందున వెల్నాటి వెంకటప్పగా జనంలో వాడుకపడ్డారు. పోతుల వెంకటప్ప అన్న పేరు కౌలు కదపాలు, దస్తావేజుల మతలబులకు మాత్రం పరిమితం. ఇది ఇల్లరికమూ కాదు, అలాగనీ దత్తూకాదు. వెంకటప్ప భార్య లక్ష్మమ్మ పుట్టిల్లు ఉత్తవరం. మహబూబ్ నగర్ జిల్లాలోని 'కేసిరెడ్డి' వరు 'మంద' వారి ఇంటికి ఇల్లరికం వెళ్ళి 'మంద' వారుగా మారారు. వకీలు మంద బాలకృష్ణారెడ్డి భార్యది 'ముకురాల' అందుకే 'మంద' వారిలో ఈ శాఖవారు 'ముకురాల' ఇంటిపేరి వారయ్యారు.

పోషకుల వంశనామానికి సమీపోచ్చారణం కలిగి, పురాణోక్తమైన ఏదో ఒక క్షత్రియ శాఖతో ముడిపెట్టి వారి ఆభిజాత్యాన్ని ఆకాశపుటంచుల కెత్తి పొగడ్తలతో ముంచెత్తి ఉబ్బించి, పబ్బం గడపుకోవడం పోష్య వర్గానికి చెందిన కవుల అనవాయితీ. దీనికి వలసినన్ని సాక్ష్యాలు చరిత్ర పుటలలో సాక్షాత్కరిస్తాయి. బ్రహ్మ 'చుళుకం' నుంచి పుట్టిన ఒక ప్రముఖ వ్యక్తి సంతతి 'చౌళుక్య'గా రూపొంది చిరకాల వ్యవహారంలో అదే 'చాళుక్య'గా మారిందని శాసనకవుల సంజాయిషీ. 'సలికి' అని కొన్ని శాసనాల పాఠం. విజయనగర రాజ్యపాలకులలో అతి ప్రసిద్ధుడైన శ్రీకృష్ణ దేవరాయల తాత ముతాతలు తుళు/తౌళవ భాషావ్యవహార ప్రాంతానికి

చెంది, ఆ పిమ్మట తెలుగుగడ్డపై అడుగుపెట్టి అందల మెక్కినందున వారి వంశనామం తుళువగా ఉపశ్లోకితమైందని చరిత్రకారుల కథనం మను చరిత్ర ప్రబంధకర్త అల్లసాని పెద్దన, కృతిపతి కృష్ణరాయల వంశావతార కీర్తనంచేస్తూ ప్రసిద్ధ చంద్రవంశ క్షత్రియ చక్రవర్తి యయాతి కుమారులలో ఒకరైన 'తుర్వసు' నామక వ్యక్తినుంచి తుళువ వంశనామం సంక్రమించినట్లు ' తుళువాన్వవాయమయ్యె'నని రూపిచడం మనకు తెలుసు

ఇంగ్లీషు కుంఫిణీ సర్కారువారికి నడినెత్తిమీద 'మేకు'గా తయారైనందున నూజివీడు సంస్థానాధిపతుల ఇంటిపేరు 'మేకా'గా రూపొందిందని ఒక ఆధునిక కవిగారి కైవారం కుంఫిణీ లష్కరు వారి రోజువారీ ఆగడాల బెడదలనుంచి తమను రక్షించుమని సంస్థాన ప్రజలు చిన్నా చితకా ముసలీముతకా ఈ 'మేకు'ను 'మేకా! మేకా!' అని ఆలగోడు బాలగోడుగా మొరపెట్టుకున్నారట! సంబుద్ధి సహితమైన ఈ ఆర్తనాదమే వీరి ఇంటిపేరు 'మేకా'గ స్థిరపడిందని ఈ కవిగారి సమర్థింపు నూజివీడు సంస్థాన పాలకులలో ఒకరైన నారయ్యాప్పారావు (క్రీ శ 1772-1782) కొన్ని కారణాలవల్ల కుంఫిణీ సర్కారుపై తిరుగుబాటొనర్చి కొన్నేళ్ళపాటు కుంఫిణీ సేనలతో మొరపుపోటు లడాయిచేసి ముప్పుతిప్పలు పెట్టిన మాట చరిత్రపుటలలోని యదార్థగాథయే కాని నారయ్యాప్పారావుకు చాల పూర్వమే ఈ సంస్థానపాలకులకు 'మేకా' అన్న ఇంటిపేరు వాడుకలో ఉంది నారయ్యాప్పారావుకు పూర్వం నూజివీడు పాలకులు కుంఫిణీ సర్కారు మీదగానీ గోలకొండ నవాబులతోగానీ తలపడినట్లు దాఖలాలు లేవు విప్పర్ల గోత్రజుడైన మేకా బసవన్న నూజివీడు వారి కోవకు మూలపురుషుడు పైగా, 'మేకా' అన్న గృహ నామం తెలుగునాట ఇతర కులాలలోనూ ప్రచురం కాగా కవిగారి కైవారంలోని కథనం అర్థరహితం ఆధార రహితం

పురాణాంలోని పృథు చక్రవర్తిలాగా కలిని దండించి, ధర్మాన్ని నాల్గు పాదాం నడిపించిన మొగల్తుర్రు సంస్థాన పాలకుల కూటస్థుం ఇంటి పేరు 'కలిదండి'యై దీని తీరుతెన్ను లెరుగని సామాన్య జనుల వాడుకలో 'కలిదిండి' గా మారిందని మొగల్తుర్రు పాలకుల కుదురునకు చెంది వర సావిత్రి చరిత్ర ప్రబంధ కర్తగా పరికీర్తితుడైన కవిరాజు రామరాజ కవి కైవాడం కలిదిండి' ఇంటి పేరుగా పెరిక తెగ వారిలోను ఉంది కాని కృష్ణా జిల్లాలో 'కలిదిండి' ఒక గ్రామ నామం 'ఝల్లిగడల' గృహ నామకులైన క్షత్రియులు 'కలిదిండి' కోటను సాధించి దానినే తమఇంటి పేరుగా పెట్టుకున్నట్లు క్షత్రియాన్వయ మ జూషా వివరణం కలిదిండి, ఇరుగదిండ్ల గొరుదిండ్ల, దిండిగల్లు దిండి మొదలైన స్థల వాచకాలను బట్టి 'కలిదిండి గ్రామ వాచకమేగాని 'కలిదిండి కి వికృతి కాదని తాత్పర్యం

'హరారి వధూ వితతుం కొప్పెర (కొప్పు + ఎర) గొనుటను బట్టి కొప్పెర అన్న ఇంటి పేరు వ్యుత్పత్తి కవితా శిల్పంలోని మరొక గడసరి కల్పన శత్రు రాజుం స్త్రీల కొప్పులను కప్పంగా స్వీకరించడం అంటే వారిని వితంతువులుగా మార్చి అని కవిగారి భాష్యం వెడల్పు మూతి గలిగి నీరూ, నూనె మొదలైన వాటిని నిలువ చేసుకునే ఇత్తడి,కంచు,రాగి, ఇనుప కాగును కొప్పెర అంటారు తైల కటాహమన్న అర్థంలో 'నూనియ తోట్టి' (జై 4-119) 'కాగిన చమురు గొప్పెరలలలోన' (పైది 4-110) అని కావ్యప్రయోగాలు చట్టి, పిడత, ముంతవంటి మట్టి పాత్రల పేర్లు ఇంటి పేర్లుగా ఉండడం సర్వజన విదితమే

పుంసపాలుడు లేక పుంసపాటుడు అనే క్షత్రియ వీరుని సంతతి వారు పూసపాటి గృహ నామకులుగా వాసికెక్కినట్లు మరొక ఆస్థాన కవిగారి నిర్వచనం ఇది కళింగ విజయనగరం జమీందారుం ఇంటిపేరు

కృష్ణా మండలం లోని పూసపాడు గ్రామ నివాసం కారణంగా ఈ జమీం దారుల ముఖ్య పురుషుల ఇంటిపేరు దీని షష్ఠీ విభక్తి రూపమైన 'పూస పాటి'గా రూపొందింది

అతిథులకు, అభ్యాగతులకు ఇతర తైర్థికులకు తమ ఇంట చోటు, నీరు ఇచ్చి ఆదరిస్తున్న కారణంగా అమలాపురం సివారు భూపయ్య అగ్రహారం వాస్తవ్యులు గౌతమసగోత్రీయులు 'పేరి' వారి ఇంటిపేరు 'చోటీ'ర్నిగా మారిందన్న స్థలజ్ఞుల కథనం అంత విశ్వసనీయంగా తోచదు పైగా ఈ పేరుకు 'చోటీరం అన్న రూపాంతరం ఉంది ఇది స్థల వాచకమనిపిస్తుంది కనకమేడల వారి పూర్వనామం కనకమాడల వారు అయి ఉండవచ్చు అర్చనావిధి ననుసరించిన 'కనకమాడల సమర్పణ' గాని అర్హతా క్రమాన్ని బట్టి సంక్రమించిన 'కనకమాడల స్వీకరణ' గాని ఇంటి పేరుకు మూలం కావచ్చు

ఇద్దరు తల్లుల ముద్దుల బిడ్డని సంతతివారికి ఉర్దూ భాషా రూపాలైన 'దో-మా' అన్న పేరు సంక్రమించిందని శతావధానులు దోమా వెంకటస్వామిగుప్తగారి ఆకాశపురాణ ప్రసంగపరమైన చమత్కార భాషణం వాస్తవంలో 'దోమా' తెలంగాణాలోని ఒక గ్రామ నామం ఇంటిపేర్ల వ్యుత్పత్తి నిరూపణంలో పండితులూ పామరులూ కల్పించిన జానపద వ్యుత్పత్తులూ (Folk etymologies), శిల్పించిన కృతక ప్రామాణికాలు (Hyper forms) లెక్కలేనన్ని వీటిలో కొన్ని

ఇలాగా పైన పేర్కొన్నవన్నీ చమత్కార చారువులేగాని సత్య చరిత్ర రచనలో దోహదకారులు కావు

షోడశ మహాదానాలలో చేరకపోవచ్చుగాని, పుల్లెయ (విస్తళ్ళు) కుట్టి యాత్రాపరులైన అరదేసి, పరదేశులకు తిండిపెట్టే స్తోమతలేక కాబోలు భోజన పాత్రలుగా ఉచితంగా పంచిపెట్టే దానశీలురు 'పుల్లెల' గృహ నామకులయ్యారనీ, వీరి యథాశక్తి ధర్మపరతను గుర్తించిన ఆనాటి ప్రభువులు వీరిని అగ్రహారాదిక సమ్మానాలతో సత్కరించారనీ ప్రతీతి 'ధర్మాల' గృహనామకులూ ఇట్టివారే కావచ్చు

పద్మశ్రీ బోయిభీమన్న గారి పూర్వ గృహనామం 'గడ్డం' వారు ప్రసిద్ధాంధ్ర రచయిత ఆరుద్ర (భాగవతుల) పూర్వపు గృహనామం 'ఆదిభట్ల'

ఇక సంస్కృతీకరణం మాట ఇంటిపేర్లు తేటతెలుగు మాటలతో వాడుకలో ఉంటే డాబూ దర్పము చాలవని వాటిని సంస్కృతీకరించడం గీర్వాణ ప్రియులైన కవి పండితుల భాషాభేషజంగా కనిపిస్తుంది అహోబల పండితీయ కర్త గాలి నరసయ్య ప్రభంజనం అహోబలపతిగా మార్పు చెందడం ఈ కోవకు చెందిందే నడిమింటి సర్వమంగళేశ్వరశాస్త్రి ఇంటి పేరు 'మధ్యమందిరం'గా, రెంటచింతల అన్న ఇంటిపేరు ద్వితింత్రిణి'గా, గుంటూరు 'గర్తపురి'గా, గోరుగుంతలపాడు 'నఖగర్తపురంగా' ఆయా యుగాలలో కవులు కొందరు సంస్కృతీకరించడం వారి భాషా భేషజానికి గుర్తుగా స్వీకరించవలసి ఉంటుంది ద్వైతమత ప్రతిష్ఠాపకులైన మధ్వా చార్యుల తండ్రి పేరు మధ్యగేహభట్టు, 'మధ్యగేహ కులమౌళి' అని శ్రీమధ్వవిజయ కావ్యంలో ప్రస్తావితం గ్రామ మధ్యంలో ఉన్న కారణంగా ఏర్పడ్డ 'నడ్డంతిల్లాయ అన్న తుళు భాషాపదానికిది సంస్కృత రూపం 'నడిమింటి ఆయన' అని తెలుగులో తీర్చవచ్చు ఆయన అసలు

పేరు నడ్డంతిల్లాయ నారాయణభట్టు భార్య వేదవతి* ఉడిపికి చేరువలోని దేవగిరి కొండల దిగువనగల 'శివరూప్య' మన్న జ పదం వీరి తొలి నివాసం ఈ కుటుంబం వారి తరువాతి అభిజనమైన 'పాజక క్షేత్రం' (ఉడిపికి దక్షిణదిశ)లోని రాజవీథి వరుసలో నడిమింటిలో కాపురమున్నం దున అసలు ఇంటిపేరు సంస్కృతీకరించబడి సొంతపేరు మటుమాయమై ఉనికిని బట్టి మూర్తి కట్టిన గృహ నామమే వ్యక్తి నామంగా చెలామణీ అయి ఉండవచ్చు భట్టు అన్నది వైదిక బ్రాహ్మణుల పట్టపు పేరు వాల్మీకి రామాయణం అయోధ్యాకాండ (12-24) వ్యాఖ్యానంలో ప్రసక్తమైన 'మధ్యమ వీధి' భట్టారకుని పిసినిగొట్టు కథనం చాల మందికి తెలియని అంశం

జాతాశౌచ మృతాశౌచాది బాధలనుంచి పరిహారంగా, తెలిసి తెలిసి చేసిన మార్పు త్రిపురనేనివారు, తిపర్నేని తిప్పిర్నేనిగా కావడం ఐతే ఇంటిపేరు మార్చుకుంటే జ్ఞాతి సంబంధాలు వీడిపోతాయన్న ఊహ పట్టి భ్రాంతి మూలకం మాత్రమే జ్ఞాతుల పరమైన అశౌచ కర్మాచరణం సాప్తపౌరుషం - ఏడు పురుషాంతరాలకు సంబంధించినది - అంటారు సంప్రదాయజ్ఞులు కూడా సాపిండ్య సంబంధం - జ్ఞాతిత్వం - ఇంటిపేరు

---

* తుళు బ్రాహ్మణ శాఖలలో వారి నివాస గృహాల ఉనికిని బట్టి ఇంటి పేర్లు ఏర్పడినట్లు తెలుస్తున్నది కండం తిల్లాయ (కండంత = వరి మడికి సంబంధించిన) తోటం తిల్లాయ (తోటంత = తోటకు చెందిన) నడువంతిల్లాయ (డువంత = నడిమి ప్రదేశం) బొండం తిల్లాయ (బొండంత = లేతకొబ్బెర బొండంకు సంబంధించిన) మొదలగునవి కొన్ని ఉదాహరణలు

**Private Communication from Dr B Ramachandra Rao, Osmania University, Hyderabad**

మార్పిడితో పోతుందనుకోవడం అర్ధరహితమని పెద్దలమాట మొదటి ఏడు తరాలూ అశౌచం దశరాత్రం, 14 తరాలూ త్రిరాత్రం, 21 తరాలూ ఏకరాత్రం ఆ తర్వాత అశౌచభయం నాస్తి ఐతే, ఎన్ని తరాలు గడచినా జ్ఞాతిత్వం మాత్రం పోదు ఏడు తరాలు దాటితే జ్ఞాతిత్వం విడిపోతుందన్నది ఆపద్ధర్మమే కాని శాస్త్రసమ్మతిలేనిది నిజరూపు ఇలా ఉండగా జ్ఞాతులలోని సంతతి బాహుళ్యంవల్ల పురుడు పుణ్యాలలో తక్కిన శుభాశుభ కార్యనిర్వహణలలో దినదినమూ ఇబ్బందులు ఏర్పడతాయని కొందరు తమ ఇంటి పేర్లలో పైన సూచించినట్లుగా చిన్నచిన్న మార్పులు చేసుకుని అశౌచ బాధలనుంచి విముక్తులమయ్యామని తృప్తి చెందుతుంటారు ఐతే, ఇలా చీలిపోయిన వారిలో కుటుంబ నియంత్రణ కారణంగానూ ఇతరత్రానూ జనాభా తగ్గి ముఖ్యంగా మృత శౌచాది సందర్భాలలో ఇరకాటం ఏర్పడడంతో పునరాలోచించి మళ్ళీ మొదటికే వచ్చి కలిసిపోయిన సందర్భాలూ లేకపోలేదు

తరతరాలుగా వస్తున్న తమ ఇంటిపేర్లలో అశ్లీలార్థమో, నైచ్యార్థమో ఉందని భ్రమపడడంవల్ల మార్పాటు పొందిన ఇంటిపేర్లు కూడా మనకు కనిపిస్తాయి ముట్లూరు, ముట్నూరుగా మారడం అశ్లీలార్థకి నివారణం కోసమని వారి భావన బొక్కావారు బ్రహ్మాండంవారుగానో, భారతం వారుగానో, భాగవతం వారుగానో, సాధుసభా సమ్మతంగా ఎవరికి తోచిన రీతిగా వారు మార్చుకోవడం కూడా వారి మౌలిక గృహనామానికి అశ్లీలార్థం ఆపాదించబడుతుందని భావించడమే మూలకారణం

తమ ఇంటిపేరు నాజూకుగా లేదని తమంత తమకు తోచిగానీ నైచ్యార్థకమవుతుందని ఆత్మీయులెవరో సూచించగా తెలిసిగానీ కొందరు తమ ఇంటిపేర్లను మార్చుకున్న సందర్భాలు కూడా లేకపోలేదు 'దాసరి' 'దామోదరం'గానూ, 'సింగాడి' 'సముద్రాల' గానూ మార్చుకోవడం ఈ మాదిరి మార్పులకు ఉదాహరణాలు

మూలపదం నిజరూప - మౌలికార్థాలలో తప్పిబ్బు పడడంవల్ల మౌలికమైన ఎన్నో ఇంటిపేర్లు జనసిరుక్తులతో కృత్రిమ వ్యుత్పత్తులతో మార్పాటు పొందడం మనం గమనించవచ్చు వీటిలో 'ఆసాది' 'ఆశావాది'గా మారడమొకటి వాస్తవంగా సంస్కృతంలోని ప్రసాద శబ్ద సంబంధి ఇది అస్తమానూ ప్రభు సన్నిధిలో మెలగుతూ ఆజ్ఞా సందర్భాలలో ప్రసాదం, మహా ప్రసాదం అంటూ ఏలికెల అవసరాలతో హాజరయ్యే నిపుణుం పడికట్టు మాట ఇది ఆ ప్రసాదమే కన్నడంలో హసాదు'గా మారి తెలుగులో అసాదు'గా చేరి ఆనాటి నిపుణుల సంతతి వారు ఆసాది వారయ్యారు అసలు తత్త్వమిలా ఉండగా ఆసాదివారు ఆశావాదిగా మారడం ఆశ్చర్యకరం

ము లపురుషుడైన కంఠమనాయని సంతతివారి ఇంటిపేరు కంఠమ నేనిగా మారి ఉచ్చారణ త్వరలో కింఠమని (అక్కిని బిక్కిని, గన్నమని వలె) అయింది 'కంఠమని'కి అర్థం లేదని భావించి కాబోలు 'కంఠమణి'గా చెలామణి అవుతున్నారు పురోహితులో ఒకపాటి డొక్కశుద్ధిగల ఇతరులో చెప్పిన సూచనలపై ఊహాసిద్ధమైన ఇలాంటి మార్పులు జరగడానికి ఆస్కారమైంది

కామరాజు అన్న ఇంటిపేరుకు మరొకరూపం కామరసు ఇది తిమ్మరసు దేవరసు, బొమ్మరసు, వైజరసు వంటి వాటిని పోలినది 'అరసు' కన్నడభాషా పదం రాజు తత్సమమనీ కొందరూ వైకృతమని కొందరూ ఏదిఏమైనా అరసు, రాజు శబ్దాలు సంస్కృత 'రాజ' శబ్ద సంబంధులు ఐతే కామఋషి శబ్దం కామరసు/కామర్సు అన్న వికృతి రూపాలుగా మార్పాటు చెందిందని పొరపడి కొందరు తమ ఇంటిపేర్లను కామఋషిగా మార్చుకున్నారు ఋుష శబ్దం అలసులూ, అల్పప్రజ్ఞులూ ఐన పామరుల పలుకుతీరులో అరసు'గా మారిందన్న వీరి అభిప్రాయం సరికాదు

ఇక 'భవనం' వారి సంగతి స్థానిక దేవతలకు - అమ్మవార్లకు - సమర్పించే నైవేద్యం బోనం బోనాలగంప, బోనాల పండుగ బోనాల పుటికి, బోనాలబండి, బోనాలెత్తు మొదలైన తెలుగు పలుకుబడులు జనపదాలలో అతి ప్రచురం బోనాలెత్తడం ఒక ప్రత్యేకమైన హక్కు- ప్రసిద్ధ గ్రామ దేవతలకు ప్రథమ నైవేద్యం - తొలి బోనం - సమర్పించే తరతరాల దర్జాదర్పాలు కొన్ని కుటుంబాలవారికి అనువశిమైన అధికారం సంస్కృత 'భోజన'-శబ్దం ప్రాకృతంలో 'భోయణం' లేక 'భోణం'గా మారుతుంది ప్రాకృతభవంగా తెలుగున 'బోనం' సిద్ధించింది ఈ పూర్వ చరిత్ర తెలియనివారు 'బోన' శబ్దం ఔద్ధత్యసూచకంగా లేదని 'భవనం'గా మార్చుకున్నట్లు ఊహించడంలో దోషంలేదు లేక రాజప్రాసాదాది మహోన్నత భవన రూపకల్పనా - నిర్మాణదక్షతా కలిగినవారి సంతతి వారమని చెప్పుకుంటారేమో!

'పొట్టపేగుల' అన్నది నేతపనివారిలో ఒకటి ఇంటిపేరు ఇది వాస్తవ గా 'పొత్తిపేగుల' నుంచి వికృతినందిన రూపంగా భావించవచ్చు పడుగుకు సరిపూసేటప్పుడుగానీ, కుంచె వేసేటప్పుడుగానీ, ఆసుపోసే వేళలోగానీ, మగ్గంపై నేతనేసేటప్పుడుగానీ పడుగు పేకిలలో ఏదైనా పోగుతెగిపోతే ఆ పోగులను పొత్తుచేసి అతకడానికి వాడే చిన్న నూలిపోగును 'పొత్తిపోగు' అని అంటారు దీనినే 'కొత్తముట్టు' అని తిక్కన్న ప్రయోగించినట్లున్నాడు ఈ పొత్తి పోగులను అతకడంలో నేర్పుగలవారి ఇంటి పేరు 'పొత్తిపోగుల' కావడం అతి సహజం అసలువృత్తికి దూరమై అన్య వృత్తులను చేపట్టినవారికి పూర్వ వృత్తిపరమైన మాటల ఆనుపానులెలా తెలుస్తాయి? దీని మౌలికార్థం మూలబడి 'పొట్టపేగుల' వెలికివచ్చింది అయితే, వీరశైవంలో వీరవ్రతాచార పరాయణుల ఆత్మార్పణ పద్ధతులలో తలనో, చేతులనో, కాళ్ళనో ఖండించి మహారుద్రునకు సమర్పించే తామసాచార మొకటి లేకపోలేదు ఈరీతి వీరవ్రతాచార విహారంలో 'పొటపేగుల'అన్న

ఇంటిపేరు ఏర్పడి ఉండకూడదా ? అన్న ప్రశ్నరావచ్చు కావచ్చు ఔగా ములు నిర్ధరించడానికి బంమైన ప్రమాణాలు కావాలి

శైవాచార పరాయణులైన దేవాంగులలో ఒకరి ఇంటిపేర్లలో 'మిడతల' ఒకటి వాస్తవంగా 'మిడుత' తో ఈ ఇంటిపేరుకు సంబంధం లేదు ఇది 'మిడిదల' వీరవ్రతాచార దీక్షితుల మొక్కుబడి తంతులో తలను నరికి ఇష్టదైవానికి సమర్పించిన సమయాచరపరుల సంప్రదాయం అపూర్వమైనది ఆనాటి వాడుకకు దూరమై ఆ ఆచరణమే భారమై, ఆధునిక సమాజంలో దురాచారమై అదృశ్యమైన దీని ఆనుపానులు సనిగా తెలియని దశలో ప్రచుర ప్రచారంలో ఉన్న మిడుతతో తమ ఇంటిపేరును ముడిపెట్టుకున్నట్లు తోస్తుంది

తెలుగుదనం భాసించాలనీ తమిళవాసన తగలరాదనీ కాబోలు తెలిసీ తెలిసీ ఇంటిపేరు మార్చుకున్నవారు కొందరున్నారు వారిలో నల్లదీగ వారూ నల్లదీగలవారూ పేర్కోదగ్గవారు నల్లదీగ నల్లదీగల - తెలంగాణంలో తెంగళ్ సంప్రదాయానికి చెందిన వైష్ణవుల గృహనామాలు ఇందలి 'తీగ' లతా వాచకం కాదు 'నల్లదీగ కులోద్భవం', నల్లదీగాన్వయం' అంటూ గీర్వాణంలో వీరి గృహనామం కనిపిస్తుంది ఒకరు ఏకవచనంతో ఏకాకు లయ్యారు ఒకరు బహువచనంతో బయటపడ్డారు మౌలికంగా ఈ ఇద్దరి ఇంటిపేరూ ఒక్కటే గోత్రసూత్రశాఖలూ ఒక్కటే వీరి గృహనామానికి పూర్వరూపం నల్లమ్ + తికళ్ ఇదే ఈ నాటి ఉచ్చారణలో నల్లంతిగళ్, నల్లందిఘళ్ ప్రకాశించే గుణాలుకల (గృహస్థులు) వారు అని ఈ తమిళ పద బంధానికి మౌలికార్థం తమిళం అనే అర్థంలో తిగుళ భూములు (జై భార అవతారిక 45), తిగళగురుని (ఘటిక 2-180) అన్న ప్రయోగాలు తెలుగు సాహిత్యంలో కనిపిస్తాయి 'తిగుళ్ళ' ఇంటిపేరుగాను,

స్థల వాచకంగాను తెలంగాణంలో కనిపిస్తుంది తిగళ, తిగుళ = వలస వచ్చిన తమిళుడని అర్థం

గణ యతి ప్రాసాది ఛందో నిర్బంధాలవల్ల ఇంటిపేర్లలో కొన్ని మార్పులు కనిపిస్తున్నాయి 'అమవస నిసి యన్నమాట అలసని పెదనా' (ఒక చాటువు), కాకునూర్యప్పసుకవి (అప్పకవీయము), శళ్వప్పిళ్ళ (ఘటికా 1-67) 'తిరుపతి వెంకటేశ కంధీరుం శిష్యుఁడ నాదుపేరు వేలురి శివరామ శాస్త్రి యని లోకము వాకొను ' చెళ్ళపిళ వంశస్వామి (రామాయణ కల్పవృక్షము), దామర వేంకట ప్రభువతంసుని వెంగళ భూప ' (బహుళాశ్వ 1-15), 'దామర్లాన్వయముఁ బొగడఁ దగదే ధాత్రిన్' (పైది 1-37), ' అ | బ్బే! గదవాల కాడ పెద్ద పెద్ద పెసంగము సేస్తడంటరా' (చాటువు), శ్రీ గొడె జగ్గరాయ భూ | ధవ' (శశిరేఖా పరిణయము, పు 2) 'కొత్తా వంశపయోధి చంద్ర !' (కె వి ఆర్ నరసింహంగారి సుజాత)' 'కుదురుగఁ బెంచి సత్ఫలము గూర్చిన మా మరిగంటి సత్కవి | ప్రథితయశస్కులన్ ' (శ్రీ రఘునందన కుశేశయ ప్రబంధము, 22) అల్లసాని, కాకునూరి, వేలూరి, చెళ్ళపిళ్ళ దామర్ల, గద్వాల గొడే కొత్త, మరింగంటి అని అసలు రూపాలు

భారతీయ జాతీయ స్వాతంత్ర్య సమరంలో భాగంగా సాగిన 'వందేమాతరం' ఉద్యమం (1938) లో ఇరవయ్యేళ్ళొండ్ల యువకుడుగా స్థిరకీర్తిని గడించిన గద్వాల వాస్తవ్యులు వావిలాల రామచంద్రరావు (1917- ) గారి ఇంటిపేరు ఏతదుద్యమ స్ఫూర్తిమూర్తిగా 'వందేమాతరం'గా మారిపోయింది అనంతపురం జిల్లా బుక్కరాయ సముద్రం వాస్తవ్యులూ, సంస్కృతాంధ్ర హిందీ భాషా విద్వాంసులూ, స్వాతంత్ర్య సమరయోధులూ అయిన శ్రీ పౌడరాళ్ళ లక్ష్మయ్య భగవద్గీతాది వేదాంత

గ్రంథాలకు వ్యాఖ్యానాలు రచించి ఉపనిషత్తత్త్వాన్ని జిజ్ఞాసువులలో ప్రవచించి పేరు పొందినందున వారి ఇంటిపేరు 'వేదాంతం'గా మారిపోయింది

ఉత్తర భారతదేశంలో ఖత్రి' తెగలలో ఒకరి పట్టపు పేరైన 'ఖన్నా'కు గల ప్రచార ప్రశస్తులను గమనించి అచ్చం తెలుగువారైన 'కన్నా' గృహ నామకులు ఈ రెండు పేర్లలో ఉచ్చారణ సామీప్యం ఉండడంచేత పబ్లిసిటీ గొప్పలకై పదాది అల్పప్రాణ వర్ణాన్ని మహాప్రాణంగా మార్చుకున్న వైనం లోకానికి తెలుసు ఏం చేస్తాం? పొరుగింటి పుల్లగూర రుచి! ఇలాగే ఎన్నో తెగలూ, కులాల పేర్ల మార్పిడికి మాత్రం ఉద్యమించి అంతతో ఆగిపోవడం శ్రేయం కాదు వీటిలో చాల భాగం పాతగిల్లి ఆధునికుల దృష్టిలో జుగుప్సనో, నైచ్యాన్నో సూచిస్తున్నమాట నిజమే పాత పంచారపు దేశవాళీ మాటల పొందిక నచ్చక మెరమెచ్చుల కోసం పరభాషలలోని పరిభాషలను ఆశ్రయిస్తున్నారు వీటిలో కొన్ని ఉపపత్తి పరామర్శ లోపించిన ఊహలు, కొన్ని వ్యుత్పత్తి బలంచాలని పిడి వాదాలు, కొన్ని యుక్తి ప్రమాణ కుశలులు అంగీకరించని విపరీతార్థ కల్పనలు, తక్కిన కొన్ని దైన్యాన్ని దాచుకోవడానికి తొక్కిన పక్కదారులు విశేషించి చరిత్ర గతినీ సంప్రదాయ పద్ధతినీ విస్మరించిన తొందరపాటు నిర్ణయాలివి విద్యా విషయిక చర్చలలో ఇలాటి మిడిమిడి జ్ఞానపు ప్రతిపాదనలు స్వాగతించ రానివి సమ్మతించరానివి

సమాజంలో ప్రతి వ్యక్తీ ప్రతి వర్గమూ ఉత్తమ స్థాయికి ఎదగాలనీ, ఉదాత్త కీర్తిని పొందాలనీ ఉబలాటపడడం అతి సహజమేగాక, అది అత్యావశ్యకం కూడా ఐతే పేర్లు మార్చుకున్నంత మాత్రాన ఎవరి ప్రతిష్ఠా పెరగదు పెంచుకోదలచడంలో తప్పులేదు కాని, సమాజంలో తమ ఉనికినీ, మనికినీ భద్రపరచుకోవడానికి వట్టిమాటలు కట్టిపెట్టి, గట్టిమేల్ తలపెట్టి పై పైపూతలను మఱచిపెట్టి వాస్తవమైన ఉన్నత

స్థితి నందుకోవడానికి తగినట్టుగా ఆ యా వ్యక్తులూ, వర్గాలూ ఆచరణ యోగ్యాలైన పథకాల ద్వారా, ఆమోదయోగ్యాలైన పద్ధతులద్వారా త్రికరణశుద్ధిగా కృషి చేయాలి అభ్యుదయం పట్ల ఆసక్తినీ, అందుల కవసరమైన శక్తియుక్తులనూ అన్నివర్గాలవారూ సమకూర్చు కోవాలి చిత్తశుద్ధీ సుస్థిరబుద్ధీ, కార్యనిర్వహణ దక్షతా అమరితే తప్ప లక్ష్యసిద్ధి కలలోని మాట! ఈవరకే పై అంతస్తులలో ఉన్నవారు తక్కినవారికి చేయూతనిచ్చి పైకి చేదుకోవాలి అధికార చక్రం చేపట్టినవారు దీనికి వలసిన హంగులనూ అవకాశాలనూ కల్పించాలి అటు కాక ఆశయాలకూ, ఆచరణలకూ ఆమడల దూరమైతె మన ఊహాలూ, ఉద్యమాలూ అన్నీ వృథా! వృథా!

సముద్రపు లోతులను చూడబోయిన ఉప్పు బొమ్మ ఉబలాటం వంటిది నా ఈ ఉపరి శోధనం 'సత్యం జ్ఞాన మనంతమ్'

# ఇంటి పేర్లు : ఇంకా కొన్ని విశేషాలు

పారా రామన్న, పారా లక్ష్మన్న అన్న పేర్లు చెవుల పడగానే శ్రోతలకు వీరిద్దరు కవలలో, ఏకోదరులో లేక సవతి సోదరులో, అక్క చెల్లెళ్ళ పుత్రులో కనీసం జ్ఞాతులో లేక పరంపరా సంబంధి బంధువులో అన్న అభిప్రాయం కలిగితీరుతుంది కానీ, వీరి మధ్య ఇలాంటి సంబంధాలేవీ లేవు పైపెచ్చు, వీరిద్దరూ వియ్యంకులని వింటే విస్మయం కలుగుతుంది ఇతఃపూర్వం వీరికి ఏ తరంలోనూ నెయ్యమూ, వియ్యమూ ఉన్నట్లు దాఖలాలు లేవు ఇది ఈ తరంలో ఏర్పడిన వియ్యమే వీరి నివాస గ్రామాల మధ్య ఎడం ఇరవై ఆమడల దూరం (సుమారు 300 కిలోమీటర్లు) ఉండవచ్చు ఇంటిపేరొకటైనా గోత్రాలు వేరు, కూటస్థులు వేరు కాబట్టి వీరు వియ్యమందడం శాస్త్రానికి కానీ, సంప్రదాయానికి గానీ విరుద్ధం కాదు

రామన్నగారిది కర్నూలు జిల్లా పత్తికొండ తాలూకాలోని పెరవలి గ్రామం, గుంతకల్లుకు పశ్చిమోత్తరదిశలో మూడుకోసుల దూరంలో తుగ్గలి రైలు స్టేషనుకు పడమరగా నెలకొని ఉంది ఈ పల్లెటూరు లక్ష్మన్నగారిది కడప జిల్లా రాజంపేట తాలూకా, రాజంపేట పట్టణానికి పడమరగా కోసెడు దూరంలో గల బ్రాహ్మణపల్లె గ్రామం రామన్నగారిది రాజేంద్ర గోత్రం, లక్ష్మన్నగారిది కుందేట్ల గోత్రం పారా ఆదిలక్ష్మి రామన్నల కొమార్తె లలితమ్మ పారా బసమ్మ, లక్ష్మన్న నాయుడుల కుమారుడు డాక్టర్ సుబ్బానాయుడు పెద్దల సమక్షంలో పెళ్ళాడి సత్సంతతితో విరాజిల్లుతున్నారు

వ్యక్తులు చేపట్టిన వృత్తులనుబట్టి కూడ ఇంటిపేరు ఏర్పడడం కొత్త కాదు పారా రామన్న, పారా లక్ష్మన్నల ప్రస్తుత వృత్తి వ్యవసాయమే కావచ్చు కానీ, కొన్ని శతాబ్దులకు ముందు వీరి పూర్వుల వృత్తి మరొకటై ఉండాలి సంస్కృతంలో 'ప్రహారం' అంటే కొట్టడమనీ, రోజులో ఎనిమిదో భాగమనీ అర్థాలు 'పారా' అన్నమాట సంస్కృత ప్రహార శబ్ద సంబంధి రాజప్రాసాదాలలో, గిరి జల స్థల దుర్గ రక్షణ కార్యక్రమాలలో నిమగ్నులై ఉండే డెబ్భైరెండు నియోగాల (రాజకీయోద్యోగాల)లో 'పారా' ఒకటి నేడు అందుబాటులో నున్న గడియారాల వంటివి ఆ రోజులలో లేవు ఒక విధమైన ఘటికార యంత్రాల తోడ్పాటుతోనూ రాత్రిపూట నక్షత్రాల గమనాన్ని బట్టి పట్టపగలు సూర్యగమనాన్ని బట్టి రాత్రింబగళ్ళు వేళలను గుర్తించి జాము జామునకు గంటలుకొట్టి, సమయసూచన కావిస్తూ గస్తీ నిఘాదారులను హుషారుచేస్తూ ప్రాబోధికులకు (వైతాళికులకు) ఎచ్చరికలు కావిస్తు దుర్గ ప్రాసాదాల గస్తీ పహారాల పర్యవేక్షణలో నియుక్తులైన రాజోద్యోగులలో ఒక భేదమే 'ప్రహా' లేక 'పారా' సంస్కృత ప్రహార శబ్దమే ప్రాకృతంలో 'పహార' అవుతుంది ఇదె ఉర్దూ హిందీలలో ప్రహా, ప్రహియా (ప్రాహారిక)గా మారుతుంది 'పహార్' అంటే ఎనిమిది గడియల కాలం అన్న అర్థంకూడా ఉంది ఎనిమిది గడియలు అంటే సుమారు మూడు మూడున్నర గంటల కాలం 'గడియారంబున మ్రోసె రెండెనిమిదుల్' అన్న క్రీడాభిరామ పద్యం ఈ పట్టున జ్ఞప్తికి వస్తుంది పదహారు తూర్లు గంటలు మోగాయనగా సూర్యోదయం నుండి సుమారు ఆరేడు గంటల సమయమన్నమాట! అంటే మధ్యాహ్నం అటూఇటూగా ఒంటి గంట అని తాత్పర్యం 'పారా' శబ్దానికి ఉర్దూలో పాదరసం అన్న అర్థమూ ఉంది కానీ, ఆ శబ్దార్థాలు ఇక్కడ పొసగవు

భిన్న గోత్రాలకు చెంది ఇంటిపేరొకటైనపుడు వియ్యమందిన సన్ని వేశాలు తెలుగుదేశమంతటా కోకొల్లలుగా కనిపిస్తాయి శ్రీవత్స గోత్రజు

లైన కొత్తపల్లివారు అదే ఇంటిపేరుగల భారద్వాజస గోత్రుంతోనూ, కౌండిన్యస గోత్రానికి చెందిన 'హరి' అన్న ఇంటి పేరుగలవారు అదే ఇంటి పేరుగల శాండిల్యస గోత్రంవారితోనూ, ఐదు గోత్రాలకు చెందిన 'భాగ వతుల' గృహనామకులు పరస్పరం ఒకరితో ఒకరూ, ఆరు గోత్రాలకు చెందిన 'రాంపల్లి' గృనామకులు పరస్పరం ఒకరితో ఒకరు వియ్య మందడం గుర్తించదగింది

ప్రకాశం జిల్లా ఒంగోలు పట్టణ వాస్తవ్యులూ వెల్లిశ్ళ గోత్రజులూ ఐన 'దాసరి' కోకిలమ్మ నారాయణరావుల పుత్రిక అనూరాధ అదే జిల్లా చదలవాడ గ్రామనివాసులూ, నెల్లుట్ల గోత్రీయులూ అయిన 'దాసరి' రామ లక్ష్మి వెంకటేశ్వర్లుగారి కుమారులు ఆచార్య దక్షిణామూర్తి 'సఖాసప్తపదా భవ' అని పెద్దల సన్నిధిలో దంపతుంయ్యారు ఇక్కడి 'దాసరి శబ్దం' దాసకార, దాస్యకార్య అన్న సంస్కృతశబ్దాలు మూంము ర్తులుగా 'దాస అర' 'దాసార'-అన్న ప్రాకృతభాషా రూపాలు సమీప మాతృకలుగా తెలుగున 'దాసరి' అన్నమాట ఏర్పడింది దాసరి గృహనామకులంతా ప్రాయికంగా వైష్ణవాభిమానులు

పైన పేర్కొన్న వేవీ ప్రేమించి చేసుకున్న కులాంతర వివాహాలు కావు అన్నీ జాగ్రత్తిగా ఆలోచించి, అంతా సానుకూలపడినప్పుడు పెళ్ళిళ్ళ పేరయ్యల తోడ్పాటు ఉండి గానీ, లేక గానీ ఇరువంకల పెద్దలు కుదిర్చి అమర్చిన కులమింటి పెళ్ళిళ్ళు ఇంటి పేరొకటే గాని గోత్రాలూ, సూత్రాలూ మాత్రం వేరు వేరు

చురుకూ, చొరవా, ముందు చూపూ కలిగిన పిల్లా పిల్లవాడు మధ్య ప్రేమ పాశాలు బిగిసి, ఇతరాంశాలు అనుకూలంగా బలసి, ఇరువైపు పెద్దల సమ్మతిని బడసి సగోత్రీయులైన వధూవరులు శాస్త్రోక్తంగా ఉభయవిధ బాంధవుల సమక్షంలో పెళ్ళాడిన సన్నివేశాలు ఎడనెడ లేక పోలేదు

'పరస్పరమవైవాహ్యా ఇత్యేతే (ఋషయః) పంక్తిత్రితాః అని పురాణోక్తి సగోత్రులయినవారి మధ్య వైవాహిక సంబంధాలు ఎలా సాధ్యపడ్డాయన్న శంక కలగడం సహజం మన ఆచార విచారాదికాలన్నింటికీ వలసినప్పుడల్లా అక్కడా ఇక్కడావెతికి అపవాదాలూ, ఆపద్ధర్మాలూ సిద్ధపరుస్తూనే ఉంటారు ధర్మప్రవచనసమర్థులైన పెద్దలూ, కడుపుకక్కుర్తి, పెళ్ళిళ్ళపేరయ్యలూ ప్రేమికుల గోత్రాలు ఒకటే అయి పెళ్ళి తప్పనిసరి ఐనప్పుడు సాధనాంతరాలను ఆలోచించాలి గదామరి! పిల్లదాన్ని వేరొక గోత్రం వారికి నామమాత్రపు పెంపకానికిచ్చిగానీ లేక పిల్లవాడిని భిన్నగోత్రం వారితో అప్పటికప్పుడు దత్త స్వీకారతంతును జరిపించి ఇలాగా క్షణాల మీద భిన్నగోత్రతను కృత్రిమంగా కల్పించిగానీ, ఏడు పురుషాంతరాలలో ఎలాంటి వియ్యమూ లేదని సర్ది చెప్పిగానీ వధూవరులను పెళ్ళి పీటల మీదకు తెచ్చి ఆ మూడుముళ్ళు వేయించి ఎదురైన సమస్యను ఇలాంటి చిట్కాలతో సులువుగా పరిష్కరిస్తారు వ్యవహారజ్ఞులైన పెళ్ళి పెద్దలు 'పంచానృతాన్యాహురపాతకాని' అన్న బ్రహ్మ పురాణ సమ్మతితోగాని 'వారిజాక్షులందు, వైవాహికములందు' అనే పద్య భావంతోగాని ఇక్కడ పని లేదు ఇలాటి పెళ్ళిళ్ళలో బొంకూలేదు, జంకూలేదు గోత్రాల మార్పిడి మాత్రం సూత్ర బద్ధంగా, శాస్త్రవిరుద్ధంగా జరిపిస్తారు అటు ఉత్సాహవర్ధనమైన ప్రేమికుల ప్రేమా గెలుస్తుంది, ఇటు సదాతనమైన శాస్త్రమర్యాదా నిలుస్తుంది అన్నింటా సంప్రదాయం వెలుస్తుంది సఖాయౌ సప్త పదా బభూవ' అని అనిపించగానే వధువు పితృ గృహం వీడుతుంది, పతి గృహం చేరుతుంది ఇది ఉభయతారక బహుళార్థసాధకమూ ఐన ఈ పరిష్కారపద్ధతి ప్రక్రమభంగంలేని పద్ధతి 'అలౌకికతత్త్వ సాక్షాత్కార సమర్థాః ఋషయః' అంటారు అభిరూప శేఖరులు మన కవులనేకాక ఇలాంటి పెళ్ళి పెద్దలను కూడా మనం ఋషి కల్పులుగానె సంభావించవలసి ఉంటుంది నిశ్చి

తార్థంఖువదలని సిపుణమతుఖ వీరి చంవవ్ల ~ ~ ~ పచ్చతోరణం తప్పనిసరి

అనంతపురంజిల్లా ధర్మవరం తాలూకా తొగరకుంట నివాసులు, భారద్వాజ గోత్రులు రత్నాకరం సంజీవమ్మ వెంకటనారాయణ రాజుల తనయ, కినగానపల్లిసివారు వాస్తవ్యులు, అదే గోత్రానికి చెందిన ఉపేంద్ర గోవిందరాజుగారి కుమారుడు ప్రభాకరరాజు ఈ విధంగా దంపతులయ్యారు కాశ్యపస గోత్రీయులైన మీసరగండ వెంకట నారాయణరాజు పెళ్ళి కూతురు పెంపకపు తండ్రి అని పురోహితునిచే చెప్పించి పెళ్ళితంతు పూర్తి చేశారు రత్నాకరం శంకరనారాయణరాజు వరదరాజులు వంటివారు ఈ తంతుకు సాక్షులు ఇట్టిదే ఇంకొకటి వధూవరులిద్దరు ఏక గోత్రీయులు భారద్వాజసగోత్రం ఏడు పురుషాంతరాలలో ఈ రెండు కుటుంబాల మధ్య వైవాహిక సంబంధాలు లేనందున - సప్త పూరుషానంతరదశ కాబట్టి సగోత్రమన్న ఆక్షేపణ రాలేదు శంకరనారాయణరాజు అరసుగారి కుమారులు రవికుమారరాజ అరసుకూ, కడప ప్రభుత్వ కళాశాల ప్రిన్సిపాల్ రఘునాథ్‌గారి కొమార్తెకు పెద్దల యెదుట శాస్త్రోక్తంగా వివాహం జరిగింది వధూవరులిద్దరూ పట్టభద్రులే

అందుచేత,ఇంటి పేరొకటైనంతమాత్రాన ఆ ఇంటి పేరుగల వారంతా జ్ఞాతులే కానక్కరలేదు అంతేకాదు, వారు ఒకే కులానికో, గోత్రానికో, వర్గానికో, వర్ణానికో, ప్రాంతానికో చెందినవారుకూడా కానవసరంలేదని ఈ సంఘటనలు స్పష్టపరుస్తున్నాయి వివిధ కులగోత్రాదికాలకు చెందిన జనులు ఒకనాడు ఒకే జనావాసం ఆవాసంగా కలిగి ఏవేవో కారణాలవల్ల అనంతర కాలాలలో ఇతర ప్రదేశాలకు వలసపోయి అనువైన తావుల స్థిరపడినప్పుడూ, దేశ కాలాదులనుబట్టి వేరువేరు కులగోత్రాదికాలకు చేరినవారు ఒకే రకం వృత్తి ప్రవృత్తులు చేపట్టినప్పుడూ,వారి వారి మూల పురుషులు సనామ్నులై ఆ మూలపురుషుల ప్రశస్తి మూలంగా వ్యక్తినామాలే గృహనామాలుగా

మార్పు చెందినప్పుడూ ఇంటి పేర్లలోని ఈ కలగలుపు సాధారణంగా ఏర్పడుతుంటుంది

ఒకే ఇంటి పేరు భిన్న కుల గోత్రాలవారిలో, భిన్న గోత్రీయులైన ఒకే కులం వారిలోనూ కనిపించడం కూడా కద్దు మచ్చుకు కొన్ని ఉదాహరణలు అన్నే (కమ్మవారిలో మూడు గోత్రాలు), ఆదిరాజు (ద్రావిడులు నియోగులు), ఎద్దు(ల) (ద్రావిళ్ళు రెడ్లు), ఒంటెద్దు(ల) (ద్రావిళ్ళు, రెడ్లు) కరారి (కమ్మ కాపు క్షత్రియ) కస్తూరి (కమ్మ, బ్రాహ్మణ), కావలి (బలిజ, బోయ, హరిజన), కొండా (రెడ్డి, పద్మసాలె, బ్రాహ్మణ) కొత్తపల్లి (క్షత్రియ, బ్రాహ్మణ హరిజన) కొత్తూరు (ద్రావిళ్ళు, వైశ్యులు) కొల్లూరు (కమ్మ ద్రావిళ్ళు) గంధం (కాపు, బ్రాహ్మణ వైశ్య) గాలి (కమ్మ, రెడ్లు బ్రాహ్మణ) పుత్రం (కమ్మ, పద్మసాలె యాదవ, రెడ్లు) గొర్తి (కాపు, బ్రాహ్మణ) గోకరాజు (కమ్మ, క్షత్రియ) చల్లా (కమ్మ, కాపు, బ్రాహ్మణ, యాదవ రెడ్లు, వైశ్య, హరిజన), చింతా (కాపు, పద్మసాలె, బ్రాహ్మణ హరిజన), చెళ్ళపిళ్ళ (కాళింగులు, ద్రావిళ్ళు), దాసరి (కమ్మ, కళావంతులు, కాపు, పెరిక, బలిజ, బోయ, హరిజన), పిళ్ళా (ద్రావిళ్ళు, నగరాలు) బండరువు/బండారి/బండారు/భండారు (జంగం, ద్రావిళ్ళు, బలిజ, బ్రాహ్మణ, లింగాయత, సాలె హరిజన), బండి (పెరిక, బలిజ, బ్రాహ్మణ, రెడ్లు సాలె), భట్టు (భట్రాజు, రెడ్లు, వైదిక బ్రాహ్మణులు), మల్రాజు (వెలమ, క్షత్రియ, మోతే (రెడ్లు, వైశ్య), సుంకర (కమ్మ, పెరిక, బలిజ), విశ్వనాధ (ద్రావిళ్ళు, వైదికులు)

మోదుకూరు గ్రామ నివాసం కారణంగా సిద్ధించిన 'మోదుకూరి అన్న ఇంటిపేరు చాల కులాలలో కనిపిస్తుంది సమర విద్యా విక్రమ క్రమంవల్ల రిపుంజయులైన వ్యక్తులు ఆనాటి సమరప్రియులైన ఏలికలను

మెప్పించి మెహన్నతుగా అడిదం (ఖడ్గం) పురస్కారం పొందిన కారణంగా మోదుకూరి గృహనామకులలో ఒకరి సంతతివారి ఇంటిపేరు తదనంతరం అడిదం'గా మారిందని చరిత్ర కళింగ విజయనగర రాజుల పోష్యవర్గానికి చెందిన సూరకవి ఈ అడిదం వంశీయులే ! ఈ ఖడ్గ పురస్కార ప్రసక్తిలేని తక్కిన మోదుకూరి గృహనామకులు సగోత్రీయులు కానివ్వండి ఇతర వర్ణాలవారు కానివ్వండి - తాము అడిదం వారమని చెప్పబూనడం సబబుకాదు, చరిత్ర కాదు అడిదంవారి పూర్వులు పూర్వం మోదుకూరివారు కావచ్చు కానీ మోదుకూరి గృహ నామకులంతా అడిదం వారు కాజాలరు దమిల ద్రావిడ శాఖకు చెందిన 'కర్రా' గృహ నామకులలో ఒకరు యజ్ఞంచేసి సోమయాజులైన కారణంగా, అతని సంతతి వారికి మాత్రమే 'సోమయాజుల' అన్న ఇంటిపేరు కొత్తగా సంక్రమించడం సహజం ఇక్కడ పేరు మార్పునకు హేతువైన ఈ యజ్ఞాచరణంతో నిమిత్తం లేని తక్కిన కర్రా గృహనామకులు తామూ సోమయాజుల వారమని చెప్పుకో యత్నిస్తే భేద కలనాశక్తి లోపంపల్ల అది అజ్ఞానమవుతుంది హాస్యాస్పద మవుతుంది అట్లే ఏనుగు లక్ష్మణ కవి పూర్వుల ఇంటిపేరు పైడిపాటివారు వీరి కూటస్థులలో ఒకరు ప్రదర్శించిన చతురంగబల వ్యూహరచనా భూమికయైన అక్ష విద్యా నైపుణ్యాన్ని పురస్కరించుకుని పెద్దా పురం సంస్థానాధిపతులు ఏనుగును బహూకరించగా ఆనాటి నుంచీ ఈ మూల పురుషుని సంతతి వారికి 'ఏనుగు' అన్న ఇంటిపేరు స్థిరపడింది మిగిలిన పైడిపాటివారు 'ఏనుగు' వారమని చెప్పుకుంటే అది అనచ్చబుద్ధుల అతివాదమవుతుంది, దుస్సాహసమవుతుంది

ఇస్లాం క్రైస్తవ మతాలను స్వీకరించిన తెలుగువారిలో వ్యక్తి నామాలు తప్ప ఇంటిపేర్లు చాలమట్టుకు మారలేదు మహా అయితే ఇస్లాం మతస్వీకర్తల ఇంటిపేర్లు కొన్నింటి స్థానంలో నూర్‌బాష్, పఠాన్, షేక్,

సయ్యద్ మొదలైన మహమ్మదీయుల తెగల పేర్లతో కొందరు వాడుక పడినా, చాలామంది మొదటి ఇంటిపేర్లనే నిలుపుకున్నట్లు కింది ఉదాహరణలు సూచిస్తాయి ఇనగంటి (దావూద్), కరవది (చినమౌలా) కొలిమి (ఘనీ) గగ్గులూరి (ఇమాంసాహేబ్), గాజుల (అబ్దుల్ ఖాదర్) చిలకలూరిపేట (చినమౌలానా) తాడిప్రతి (అక్బర్‌సాహెబ్) తుమురుకోట (బడేసాహెబ్), దగ్గుపాటి (హసన్) నూతలపాటి (సైదులు) బెపారపు (మస్తాన్), మంటినూనె (హుస్సేన్ సాహెబ్), వక్కల (హుసేన్‌పీరాన్) వడ్లమూడి (సిద్దయ్య), వల్లూరిపల్లి (ఇమాంసాహెబ్)

ఇక క్రైస్తవ మతానుయాయుల విషయం చూద్దాం వీరిలో సైతం తొల్లింట ఇంటిపేర్లే ఎక్కువగా నేటికి నిలచిఉన్నాయి సంస్కృతిగా ఇంటిపేరు స్థానంలో తండ్రిపేరు వచ్చి చేరుతుంటుంది ఈరీతికి ఉదాహరణలు జోసఫ్ డేనియల్, డేవిడ్ మోసెస్, బెంజిమన్ ఫ్రాంక్లిన్, సాల్మన్‌డేవిడ్ మున్నగునవి అత్తోట (రత్నకవి), కొలకలూరి (ఇనాక్), గండికోట (ఇన్నయ్య) గుజ్జర్లమూడి (కృపాచారి), గుడిసె (రవీనా) గుంటి (యోహాన్) గుమ్మడి (జోసెఫ్) గుర్రం (జాషువా), పాటిబండ్ల (జాకబ్), పినపాటి (జెర్మియా), బండారు (ఇస్సాకు) బీర్నీడి (మోషే) మొదలైనవి నేటికీ నిలిచిన తొలుతటి ఇంటిపేర్లు

ప్రసిద్ధ ఉద్యమ నాయకులు తరిమెల నాగిరెడ్డి పూర్వపు గృహనామం కంచిరెడ్డివారు అనంతపురం జిల్లా ఇల్లూరు గ్రామానికి దాపునగల తరిమెలకు కంచిరెడ్డి వారిలో ఒక కుటుంబం తరలివచ్చి స్థిరపడినందున వారికి తరిమెల అన్న ఇంటిపేరు ధ్రువపడింది

ప్రముఖ రాజకీయనాయకుడు, మాజీమంత్రి శ్రీ జి వెంకటస్వామి గారి అసలు ఇంటిపేరు గడ్డం' అని చాల మందికి తెలియదు 'గుడిసెల'

వెంకటస్వామి అని అందరూ అంటారు ఆయన అనుయాయులు సైతం అలాగే చమత్కరించడం కద్దు హైదరాబాదు నగరంలోని గుడిసెల నివాసుల హక్కులకై నిరంతరం పరిశ్రమించే వ్యక్తి కాబట్టి లోకుల వాడుకలో గుడిసెల అన్నదే వారి ఇంటిపేరుగా ప్రచుర ప్రచారంలోకి వచ్చింది

తొలిసారి నటించిన లేక నటీనటులకు పెద్ద పేరు తెచ్చిపెట్టి చిత్ర సీమలో గొప్ప సంచలనం కలిగించిన చలనచిత్రాల పేర్లు కొందరు టీ నటులకూ, సినీ రచయితలకూ ఇంటిపేర్లుగా స్థిరపడ్డాయి షావుకారు జానకి అసలు ఇంటిపేరు శంకరమంచి, సాక్షి రంగారావు అసలు ఇంటిపేరు రంగావఝ్ఝల, సుత్తి వీరభద్రరావు ఇంటిపేరు మావిడిపల్లి ఇంటిపేరుతో పాటు వ్యక్తి నామం కూడా మారిన సుత్తివేలు కురుమద్దాలి నరసింహారావు, నాలుగు స్తంభాలాట చిత్రంలో ఈ ఇద్దరు నటులూ పదేపదే ఉపయోగించి ప్రేక్షకులను ఉర్రూతలూగించిన ఊతపదం సుత్తి శంకరాభరణం సోమయాజులు అసలు ఇంటిపేరు జొన్నలగడ్డ ఇక గేయ రచయితగా 'సిరివెన్నెల చిత్రంతో సిరివెన్నెల సీతారామశాస్త్రిగా వన్నెకెక్కిన డాక్టర్ శాస్త్రిగారి ఇంటిపేరు 'గుంటూరు' వారు

సమాన రూపమో సమీపోచ్చారణమో కలిగి విభిన్న వ్యుత్పత్తులతో వాడుకపడ్డ ఇంటిపేర్లు కొన్ని కనిపిస్తాయి

గడ / గడ్డ [1] కాట్రగడ / కాట్రగడ్డ, ముద్రగడ మున్నగు ఇంటి పేర్లలో కనిపించే గడ (< ఖడ్, ఘడ = దుర్గం) లేక గడ్డ కటక - సీమల రక్షణార్థమై నిర్మించిన దుర్గాధరకాలు రాచరికపు రోజులలో రాజధానీ నగరానికీ, రాజ్యంలోని ముఖ్యమైన ఇతర పట్టణాలకూ చుట్టూర రక్షణార్థం రక రకాల కంచెలనూ, కందకాలనూ, కోటలనూ, బురుజులనూ నిర్మించేవారు శత్రుసేనలు గానీ, వారి గూఢ

చారులు గానీ - సులువుగా నగరంలో ప్రవేశించడానికి వీలులేకుండా కోటలు నిర్మించేవారు వీటిలో కంపకోట (ముళ్ళకంచె) కలుకోట (శిలా దుర్గం), మట్టి కోటలు ముఖ్యమైనవి ఈ కంపకోటనే కాట్రగడ అనీ, మట్టికోటను ముద్రగడ అనీ పిలిచేవారు ఈ యీ దుర్గాల గవకులలో, బురుజులపై రక్షణకై నియమితులయ్యే సైనికులనూ, శ్రేణీ నాయకులనూ ఈ పేర్లతో వ్యవహరించేవారు

గడ్డ[2] జొన్నలగడ్డ నిమ్మగడ్డ, పులిగడ్డ, వక్కలగడ్డ మొదలైన ఇంటిపేర్లు మౌలికంగా స్థలవాచకాలు వీటిలోని గడ్డకు దీవి లే మెట్ట అని అర్థాలు

గమిని గవని గవిని, గవుని- ఈ నాల్గు రూపాలలో గమిని గవని ఒక వర్గానికి చెందినవి గవిని గవుని మరో వర్గానికి చెందినవి జనుల ఉచ్చారణలో వీటి తారుమారు కూడ జరగవచ్చు మొదటి వర్గానికి చెందిన గమిని, గవని కోటవాకిలి అన్న అర్థంకల గవకు/గవను (బహువ గవకులు) రాచరికపు వ్యవస్థలో కోటవాకిలి సంరక్షణలో అహరహం నియుక్తులైనవారి సంతతికి సిద్ధించిన ఇంటి పేర్లు ఇవి, ప్రాయికంగా కమ్మవారి గృహనామాలు రెండో వర్గానికి చెందిన గవిని, గవుని సంస్కృత గ్రామకూట శబ్దానికి పరంపరా సంబంధులు 'గ్రామకూట' అనగా గ్రామాధికారి అని సంస్కృతంలోని అర్థం నేటి గ్రామమునసబుగిరీ వంటిది ఇది గ్రామకూట శబ్దం గామ ఊడ, గామఉండ గాముండ, గావుండ-గా మార్పులు చెందింది వీటి పరిణత రూపాలలో ఒకటైన గవుండ, గౌడ కన్నడంలో ప్రచురరూపాలు గౌండర్ తమిళరూపం గౌడ్/గౌడు తెలుగులోనికి ఎరవుతెచ్చిన కన్నడరూపాలు నాయడు-నాయని రాయడు-రాయని వలె గౌడుకు ద్వితీయాది విభక్త్యంగరూపం గౌడని ఇది ఇంకా మార్పులకులోనై -గని-గాని, గోని-గౌని-గవుని-గవినిగా

పరిణతిచెందింది ఈ గవుని రూపాంతరాలే ముదగని, అనగాని, జానగాని రేగాని, నరగొని, రామగోని, ఇటిగొని వంటి వ్యక్తివాచకాలపై ఏర్పడ్డ గృహనామాలలోని ఉత్తరభాగాలు ఇట్టి పట్టపుపేర్లు సాధారణంగా తెలుగు నాట ఈడిగ, కాపు, కురుబ, మున్నూరుకాపు, యాదవ మొదలైన తెగలలో కనిపిస్తాయి

పడాల[1] బంటూ పైదా (పియాదా, పైదల్) గల అల్పసేనకు అధిపతి అనేఅర్థంకల తద్భవపదం పడవాలకు రూపాంతరం సంస్కృతం లోని 'భటపాల' దీనికి మూలమూర్తి ప్రాకృతాలలో 'భడవాల' సమీప మాతృక పడవాలకు నిత్య బహువచనరూపం పడవాళ్ళు 'పడవాళ్ళం బనిచి' అని తిక్కన ప్రయోగం ఇది సైనిక పరిభాష

పడాల[2] అంబుతరణం (నీరుదాటించే ఉపకరణం) అనే అర్థం కల పడవ అన్న తెలుగుమాటకు బహువచనమైన పడవలుకు ద్వితీయాది విభక్త్యంగరూపం పడవల ఈ 'పడవల' రూపంనుంచి లోపదీర్ఘతవల్ల పడాల[2] సిద్ధించింది

అవయవలోప అంగవైకల్యాలను సూచించే పదాలు కొందరు వ్యక్తుల ఇంటిపేర్ల స్థానంలో వాడుకపడుతుంటాయి ఇవి తాత్కాలిక వ్యవహారాలు, జనులనోటివాడుకకే పరిమితాలు రాతకోతలలో అసలు ఇంటిపేరు వ్యవహృతమవుతూ ఉంటుంది ఆనెకాళ్ళ సుబ్బన్న, కర్రి (నల్లటి) రామప్ప, కుంటి గంగమ్మ, గరకినెత్తి వెంకయ్య, గిడ్డ (గిటక) అంజనయ్య, గుడ్డి రంగయ్య, గూని శేషయ్య, చప్పిడిముక్కు చెన్నమ్మ, చింపిరి నాగమ్మ, చెవిటి వెంకటరమణప్ప, చొంచు (ఉర్దూ చోంచా = వంకరతిరిగిన వెయ్యి) (వంకరతిరిగిన మోచేతి) సుబ్బన్న, జొల్లు తిమ్మయ్య, తొాదలు ఓబన్న, తొర్రి ఓబుళక్క, దుబ్బ దుర్గయ్య, దొడ్డి కాళ్ళ రంగన్న, నంగిరామన్న, నత్తి రాఘవరెడ్డి, నాస నారాయణ,

పట్టనెత్తి (బట్టతల) పాపన్న, పిల్లికండ్ల నాగన్న, పుచ్చిన (మొగంపై మశూచి మచ్చలుగల) రామయ్య, పుర్రచెయ్యి గంగన్న పొట్టి ప్రసాద్, పొతుగు సుబ్బయ్య, బొర్రముక్కు బుచ్చన్న, మిట్టపండ్ల రామక్క, ముక్కిడి మస్తానయ్య, మూగి ముత్యాలమ్మ, మెల్లకంటి వెంకటరంగయ్య, సుళ్ళు (అనర్థాలాడే) ఓబన్న, సొట్ట (వంకరకాలి) శేషరెడ్డి మొదలైనవి పరోక్షంలో వీటి వాడుక అధికం, ప్రత్యక్షంలో బహు అరుదు ఈ వాడుక ఆ వ్యక్తితోచే అంతరిస్తుంది వ్యక్తి పరోక్షంలో తప్ప, ప్రత్యక్షంలో ఈ అంగవైకల్య సూచక పదాలను ప్రాయికంగా వాడుక చెయ్యరు

వ్యక్తి వాచకాలకు పూర్వభాగాన ఇంటి పేరు సూచించడం నేటి తెలుగు సంప్రదాయం కాచనబసవన, కొమ్మయమంత్రి తిక్కడు దేవయతిప్ప ప్రభుండు, నాచన సోమన నారన సూరన, సాళ్వగుండయ నరసింగ జన విభుండు మొదలైన తెలుగుకవుల కవిపోషకుల పేర్లముందు ఇంటిపేరుకు బదులుగా తండ్రిపేరు కనిపిస్తుంది ఇంటి పేరుండవలసినచోట తండ్రి పేరు నిలపడం తమిళ సంప్రదాయం ఈ రెంటింటినీ నిలపడం మరాఠీ సంప్రదాయం ఇంటిపేరు వ్యక్తి నామానికి పూర్వ భాగాన రావడం సర్వ సాధారణం ఇంటి పేరూ తండ్రి పేరూ వ్యక్తి వాచకానికి ముందురావడం తమిళనాడులోనూ కనిపిస్తుంది ఈ ముద్ర క్వాచిత్కంగా తెలుగునాటనూ కనిపిస్తుంది ఇంటి పేరు తర్వాత తండ్రి పేరును కూడా జోడించి వ్యవహరించిన ఉదాహరణలు కొన్ని

డాక్టర్ పి ఎల్ సంజీవరెడ్డి (పైడి లక్ష్మయ్య సంజీవరెడ్డి)
డాక్టర్ ఎం ఎల్ గురప్ప చౌదరి
(ములుగోటి లగుమయ్య గురప్ప చౌదరి)

శ్రీ కె ఎస్ కోదండరామయ్య
(కోసూరు శివరామదాసు కోదండరామయ్య)
శ్రీ ఎం బి గౌతమ్ (మాదిరి భాగ్యరెడ్డి గౌతమ్ - హైదరాబాదు)
డాక్టర్ టి వి నారాయణ
(తక్కెళ్ళ వెంకయ్య నారాయణ - హైదరాబాదు)

ఇందులో వరుసగా లక్ష్మయ్య, లగుమయ్య, శివరామదాసు, భాగ్యరెడ్డి వెంకయ్య ఆ యా వ్యక్తుల తండ్రులపేర్లు, మొదటివి ఇంటిపేర్లు ఈ పట్టికలోని మొదటి వ్యక్తి కర్ణాటకంలోని మరిడిపల్లి గ్రామంలో మాతామహుల ఇంట జన్మించారు రెండోవారూ, మూడోవారూ వరుసగా తమిళనాడు - ధర్మపురి జిల్లా - హోసూరుతాలూకా, మాచినాయనిపల్లి, కారుపల్లి గ్రామ నివాసులు నాల్గోవారు మరాట్వాడా పరిసరాలలో పుట్టినవారు ఐదోవారు బొలారం కంటోన్మెంటులో తమిళ అధ్యాపకుల సన్నిధిలో ప్రాథమిక విద్య మొదలైనందున ఈ రీతి నామకరణం సాధ్య పడింది, కగా, ఆ యా నాడుల ప్రభావం వీరి నామకరణ రీతిపై పడినట్లు ఊహించవచ్చు

కొన్ని శతాబ్దాల క్రితం తెలుగునాటి నుంచి తమిళనాడుకు తరలి వెళ్ళి కోయంబత్తూరు ప్రాంతాల స్థిరపడి ప్రముఖ పారిశ్రామిక వేత్తలుగా పేరుపడ్డ శ్రీ ఎల్ ఆర్ జి నాయుడు (లక్ష్మినాయకన పాళయం రామస్వామి నాయుడు గోవిందరాజుల నాయుడు) శ్రీ ఎల్ జి బాలకృష్ణన్ (లక్ష్మినాయకన పాళయం గోవిందరాజులు నాయుడు బాలకృష్ణన్) ఈ వ్యవహార నామాలలో స్థల వాచకమైన ఇంటి పేరూ తర్వాత తండ్రి పేరూ ఆ పిమ్మట వ్యక్తి నామమూ నిలిచాయి శ్రీ జి డి నాయుడు (గోవిందరాజులు నాయుడు దామోదరస్వామి నాయుడు) ఆచార్య ఎన్ కె రాజా (నల్లయ్యరాజా కుమారస్వామి రాజా) వీటిలో తండ్రి పేరూ వ్యక్తి పేరూ వాడుకపడ్డాయి వీరంతా తెలుగువారైనా తమిళ దేశ సంప్రదాయాన్నిబట్టి

వ్యవహార నామాలు ఇలా తయ్యారయ్యాయి ఇందులో ఎన్ కె రాజాగారి జన్మస్థలం రాజపాళయం, కాని వాడుకలో ఊరి పేరు రాలేదు

సుప్రసిద్ధ సంకీర్తనాచార్యులు తరతరాలుగా ఏడుకొండల వాని భక్తులూ అయిన అన్నమాచార్యుల ఇంటి పేరు తాళ్ళపాకగానూ తమిళ నాడులో తాళ్ళపాకమ్‌గానూ వాడుక పడింది

వడగళ వైష్ణవ సంప్రదాయానికి చెంది మౌలికంగా 'తిరుమల పుట్టపర్తి' గృహనామకులైనవారు ఎందుచేతనో వట్టి 'పుట్టపర్తి'తో సరిపెట్టు కుంటున్నారు తెంగళ వైష్ణవ సంప్రదాయానికి చెందిన శ్రీమత్కందాళం వారిలో కొందరు 'కందాళం' చాలు ననుకుంటున్నారు

స్పష్టత కోసమో, పూర్వవాసంపై గల మమకారం కారణంగానో కొందరు రెండు స్థలవాచకాలు ఇంటిపేర్లుగా గలవారు కనిపిస్తారు ఆసూరి మరింగంటి శ్రీనివాసాచార్యులు జోళదరాశి కెంగల్లు దొడ్డనగౌడ తాడిపత్రి బళ్ళారి రాఘవ, ముండ్లూరి బళ్ళారి రామాంజనేయులు, ముష్టూరు గొల్లాపిన్ని వాసుదేవశాస్త్రి యెడుగూరు సందింటి రాజశేఖరరెడ్డి (వై ఎన్ రాజశేఖర రెడ్డిగారి వ్యవహార నామంలో ఊరి పేరూ, ఇంటి పేరూ రెండూ కలిశాయి వీరి చుట్టాలలో కొందరు యెడుగూరి వారనీ, మరికొందరు సందింటి వారనీ వ్యవహృతులు) రాచమడుగు రాకిట్ల నారాయణ చెట్టి

ప్రసిద్ధ నాట్యాచార్యులు నటరాజ రామకృష్ణగారి ఆచార్యకంలో పేరిణి నృత్య కళాకారులలో శిక్షణ పొందిన వివిధ గృహనామకులైన వారందరికీ 'పేరిణి' అన్నదే ఇంటిపేరుగా వాడుకలోకి వస్తున్నది పేరిణీ నృత్య ప్రదర్శన సమయంలో అందరూ ఇతర సమయాలలో అదే కళాకారులలో కొందరూ 'పేరిణి'నే ఇంటి పేరుగా ఉపయోగిస్తున్నారు పేరిణి అశోకరాజు (కలిదిండి), పేరిణి నాగేంద్ర ప్రసాద్‌రెడ్డి (కర్రి),

పేరిణి వరప్రసాద్ (అబ్బూరి), పేరిణి శివ (కొసరాజు), పేరిణి శ్రీనివాస్ (బోడపాటి), పేరిణి సీతారామ కేశవరావు (సలాది) పేరిణి సుధాకర్ (గాదె), పేరిణి సురేంద్ర (కొల్లం), బ్రాకెట్లలో చూపినవి ఈ కళాకారుల అసలు ఇంటి పేర్లు వంశీ ఆర్ట్స్ థియేటర్ కార్యకర్త వంశీ రామరాజు, అసలు పేరు రామరాజు పురుషోత్తమరావు

జాతీయాలు, సామెతలు, చమత్కారాలలో కొన్ని ఇంటిపేర్లు ప్రసక్తమయ్యాయి, అద్దంకి వారి ముద్ర, అతనికంటె ఘనుడు ఆచంట మల్లన్న, కట్టీక వానికి కత్తి అందించినట్లు, కమ్మా తుమ్మా, ఇంటిపేరు కస్తూరి వారు, ఇంటిపేరు క్షీరసాగరం వారు ఇంట్లో మజ్జిగ చుక్కలేదు, తంబళ్ళ దొరతనం, అమ్మ దాసర్లకు అయ్య జంగాలకు, దాసరి తిప్పలు పెరుమాళ్ళకెరుక, చెప్పేవి శ్రీరంగ నీతులు - దూరేవి దొమ్మరి గుడిసెలు, పక్షీర్లను కొట్టి పరాసులకు పెట్టినట్లు, వెయ్యేళ్ళ పూజారి మొద్దలైనవి 'పూసపాటి చెయ్యమా, మొక్కపాటి చెయ్యరా' అని ఇంటి పేర్లపై చమత్కారాలు అల్లసాని వారా ?, చేమకూర పాకాన పడింది, ఔరా శంకర మంచి వాడవు - మొదలైనవి శ్లేష చమత్కృతికి చక్కటి ఉదాహరణలు

ఇంత వివరించినా ఈ విశేషాలింకా సశేషాలే

# మన ఇంటిపేర్లపై పరసంస్కృతుల ముద్ర

తెలుగునకు ఇరుగు పొరుగు భాషలైన ఒరియా, కన్నడం, తమిళం, మరాఠీభాషల ముద్రతోపాటు శైవ వైష్ణవమతాల ప్రభావం తెలుగువారి ఇంటిపేర్లమీద కనిపిస్తుంది ఆధునికయుగంలో లేఖన పద్ధతులలో కొంతలో కొంత ఆంగ్లప్రభావమూ లేకపోలేదు

ఒరియా

కళింగాంధ్రం ఒరిస్సారాష్ట్రానికి సరిహద్దుభూమి బహుకాలం కళింగ గజపతుల ఏలుబడిలో ఉన్నందున కొంత ఒరియా ప్రభావం కనిపిస్తుంది మాదిరికి కొన్ని ఇంటిపేర్లు మహస్సూలులో నాల్గోవంతు పన్ను 'చౌత్' (చతుర్థ - ) వసూలుచేసే రెవిన్యూ ఉద్యోగి అని సామాన్యార్థం బంగాళా రాష్ట్రంలో హిందువులతోపాటు ముస్లింలకుసైతం ఇది పట్టపుపేరు తెలుగు నాటి కమ్మవారు కొందరు 'చౌదరి' అని పట్టపుపేరుగా వాడతారు గణకుడు, లేఖకుడు, తీర్పరి, వివాదపరిష్కర్త అన్న అర్థాలుకల 'దబీర్' పారసీభాషాపదం ఇదే తెలుగునాట ఇంటిపేరుగా 'డబ్బీరు' అని వాడుక పడింది అనంతర గజపతుల యుగంలోనూ, కళింగాంధ్ర జమీందారుల హయాంలోనూ రాజాస్థానాల ఆర్థికన్యాయశాఖల కచేరీలలో రాయసగాళ్ళుగా అదాలత్ కోర్టు వకీళ్ళుగా పదస్థులైనవారి ఇంటిపేరు 'డబ్బీరు'గా పేరు పడింది కలువాయి శతకకర్త డబ్బీరు నరసుకవి తెలుగు సాహిత్యరంగలో కనిపిస్తాడు డబ్బీరు గృహనామకులు విద్యాన్యాయ పరిపాలనా క్షేత్రాలలో నాటికీ, నేటికీ పరిగణించదగ్గ స్థాయిలో కీలకస్థానాలలో పనిచేస్తూ వస్తున్నారు 'పట్నాయకుని' పట్టనాయక శబ్దభవం 'పట్నా

యక్' అన్నది పట్టపుపేరు కూడా పరిపాలనా విభాగంలో ఒక అధికారి అని అర్థం ఇలపండా, ధనపండా పురాణపండ, పురిపండా, బాకురుపండా మొదలైన ఇంటిపేర్లలోని 'పండా' సంస్కృతంలో జ్ఞాని, పండితుడు, బుద్ధిశాలి అన్న అర్థాలుకల 'పండ' శబ్దభవం ఒరియా భాషలో పండా అంటే పూరీజగన్నాథ క్షేత్ర ప్రాంతంలోని పూజారి (పురోహితుల) తెగకు చెందిన వ్యక్తి అని అర్థం కళింగ గజపతిరాజుల కాలంలో పాత్రుని, మహాపాత్రుని మొదలైనవి అమాత్యపదవిలోనూ, సేనానిపదవిలోనూ పని చేసినవారి సంతతికి చెందిన గృహనామాలు 'బెహరా' అన్నది కూడ ఒరియా నుంచి వచ్చిన ఇంటి పేరు సంస్కృతంలోని వ్యవహార' లేక 'వ్యాపార' - శబ్దాలు దీనికి మూలం కావచ్చు తెలుగులో తద్భవ రూపాలుగా వణిజుడు, చిల్లర బేరగాడు అనే అర్థాలు కల 'బెహారి' 'బేహారి' మొదలైనవి ఈ ఒరియా మాటకు శబ్దార్థాలలో సామ్యంకల పదాలు

## కన్నడ ప్రాబల్య సూచకాలు

'కన్నడ కిత్తురి తెనుగు తేటె' అని కన్నడంలో ఒక నానుడి తెలుగు కన్నడాలు జ్ఞాతి భాషలే కాక వేలాది ఏళ్ళుగా ఇరుగుపొరుగు వాగ్వ్యవహారాలు తెలుగులు, కన్నడిగలు అనేక శతాబ్దులుగా ఏకపాలనంలో కలిసిమెలిసి బతికిబాళినవారు అందుచేత, తెలుగుపై కన్నడ ప్రభావం ఎంతో కనిపిస్తుంది కామరసు, కొండమరసు, తిమ్మరసు, దేవరసు బొమ్మరసు, భైరవరసు రాచమరసు, వైజరసు మొదలైన ఇంటిపేర్లలోని ఉత్తరభాగమైన 'అరసు' అచ్చంగా కన్నడపదం అనగాని, మాదిగోని రామగోని పెదగాని (<-గౌడని) మొదలైన ఇంటిపేర్లలోని చివరి భాగాలు కూడా కన్నడ భాషా ముద్రాముద్రితాలు దేవరింటి దేవర్ల అన్న తెలుగువారి ఇంటిపేర్లూ అన్నదేవర అయ్యదేవర కొండదేవర,గాలిదేవర, నరసింహదేవర, బొమ్మదేవర, సూర్యదేవర - మొదలైన గృహనామాల

చివరిభాగమూ, దారయలింగందేవర, నరసింహులుదేవర, బసవలింగం దేవర, వీరయ్యదేవర మున్నగు వ్యక్తివాచకాలలోగల 'దేవర' శబ్దమూ కన్నడం నుంచి ఎరవు తెచ్చినవే సంస్కృత 'దేవ'-వీటికి మూలమూర్తి తెలుగులోని దేవుడు మహదేక వచనం 'చిన్నచిన్నరాళ్ళు చిల్లరదేవుళ్ళు' అన్న చాటువులోని (లాక్షణికులు సమ్మతించని) వ్యావహారిక రూపం తప్ప తెలుగులో దీనికి బహువచనం లేదు* దేవి-దేవులు, భూదేవులు మొదలైన ప్రయోగాల రూపనిష్పాదన ప్రక్రియ వేరు సంస్కృత 'దేవ' శబ్దానికి కన్నడంలోని 'దేవరు' పూజ్యతావాచకం ఇదే తెలుగునందలి వ్యక్తి వాచకాలలోనూ, గృహనామాలలోనూ కనిపించే దేవర, దేవరవారు, దేవరా అన్న వాడుకలు విజ్ఞప్తులలో ఉపయుక్తాలయ్యే సంబుద్ధి వాచకాలు

పల్లి పెంచలపాడు, పెనకలపాడు, హోతూరు - మొదలైన గ్రామ నామాలు గృహనామాలుగాను వాడుకపడి వీటిని కన్నడీకరించగా హళ్ళి, హంచనహాళు, హనకనహాళు, హోతురు మొదలైన 'హ' కారాది రూపాలుగా పరిణతిచెంది కన్నడ ప్రభావ నిరూపకాలుగా నిలిచాయి కందిబేళ్ళ (కందిపప్పు) సాసువుల/సాసూల (ఆవాల) మొదలైనవి కూడా కన్నడ ప్రభావ ప్రదర్శకాలైన ఇంటిపేర్లే

**శైవపారమ్య నిరూపకాలు**

త్రిలింగదేశంగా ప్రశస్తిగాంచిన తెలుగునాట శైవానికి గల ప్రాచుర్యం తక్కువేమీ కాదు ఆరాధ్యుల పండితారాధ్యుల, మల్లికార్జున పండితారాధ్యుల శ్రీపతి పండితారాధ్యుల మొదలైన ఇంటిపేర్లు శైవంలో ఆచార్య పురుషుల సంతతివారికి చెందిన ఇంటిపేర్లు ఈశ్వర, కందుకూరి,

---

* తెలుగువారి మాపులో దేవుడొక్కడే (ఏకో దేవ స్సర్వభూతేషు) అని అర్థం కాబోలు!

కంబాళ, కాశీనాథుని, ధూర్జటి నంది, పంచాక్షరం, ముదిగొండ ములుగు, యథావాక్కుల, విభూతి శివదేవుని, శివభాష్యం, శివలెంక, శ్రీకంఠం, శ్రీగిరి మొదలైనవి కూడా విస్తృత ప్రచారంలోగల ఇంటిపేర్లు మఠం, అంగడిమఠం, చిదిరెమఠం డాకూరుమఠం, పెద్దమఠం, బింగిమఠం, భంగీమఠం, ముత్తినపిండెమఠం, రేకళిగెమఠం, సారంగధరమఠం హిరె మఠం మొదలైన ఇంటిపేర్లు సైతం శైవ పారమ్యద్యోతకాలు

**తమిళభాషా ప్రభావ ప్రదర్శకాలు**

అరవ, తిగుళ, తిగుళ్ళ తిరుపతి తిరుమల, తిరుక్కండ్యూర్, తిరుక్కోవళూరు మొదలైన ఇంటిపేర్లు తమిళనుంచి తెచ్చుకున్నవి

**వైష్ణవ పారమ్య బోధకాలు**

వేదాధ్యయనం, నాలాయిర దివ్యప్రబంధాను సంధానం, రామాయణ పారాయణం, తిరుమంత్ర తీర్థాదికాలు ఐదుగురు ఆచార్య పురుషుల నుంచి పొంది, పంచాచార్య పదాశ్రితులుగానూ, త్రిమతాచార్యులలో ఒకరుగానూ ప్రశస్తివహించిన భగవద్రామానుజులు రామానుజీయ వైష్ణవానికి ఆచార్యస్థానం శ్రీభాష్యం మొదలైన అనేక ప్రామాణిక దార్శనిక రచనలు నిర్మించి, దక్షిణభారతంలో శతాబ్దుల తరబడిగా 'ఉన్‌శరణల్లాల్ శరణిల్లై' (నీ చరణమే తప్ప వేరే శరణం లేదు) అని ఆళ్వారులు పెంపొందిస్తూ వచ్చిన భక్తిపారమ్య వైష్ణవాన్ని వేదార్థసమ్మితంగానూ, సర్వజనోత్తారక సాధనంగానూ మంచి ఉపనిషన్మతంగా విశిష్టాద్వైతంగా రూపు తీర్చినవారు ఆయన భరత ఖండం నలుమూలల సంచారం చేసి, వేదవిహిత కర్మాచరణకూ భగవద్భక్తి మార్గావలంబనకూ సమన్వయం కుదిర్చిన రీతిని ప్రచారం చేసి చతుస్సప్తతి (74) పీఠాలను స్థాపించి, ప్రబోధకులుగా డెబ్భైనాలుగురుమంది సాత్త్వికాచార్యుల - సింహాసనాధీశ్వరుల-ను నియోజించి వైష్ణవానికి నూతనతేజం కల్పించారు

ఆ పిమ్మట ఇన్నూరేళ్ళ అనంతరం అవతరించిన మణవాళ మాముని (14 వ శతాబ్ది) ఆచార్యకంలో అష్టదిగ్గజాలవంటి ఎనిమిది మంది శిష్యులూ - నల్గురు యతులూ నల్గురు గృహస్థులూ - కందాడై అణ్ణన్, కిందాడై అప్పన్, తిరుమల జియ్యరు, వానమామలై జియ్యరు మున్నగు వారి ఆధ్వర్యవంలో నాలాయిర ప్రాధమ్యం, భక్తి పారమ్యం, సంపూర్ణ శరణాగతి ముఖ్యలక్షణాలుగాగల వినూత్న వైష్ణవ సంప్రదాయ మొకటి వెలుగులోకి వచ్చింది ఈ సంప్రదాయానుయాయులను 'తెంగళ' తెగ (కన్నడంలో తెగలె) అని వ్యవహరిస్తారు పాదపీఠ సహితమైన శ్వేత మృత్తికాధారణం వీరి గుర్తు, అంటే, వీరు సపాదులు తోతాద్రి (తిరునల్వేలి జిల్లాలోని నాంగునేరి దీనికే వానమామలై అని నామాంతరం) మొదలైన చోట్ల వీరి పీఠాలు వెలిశాయి నాలాయిర దివ్య ప్రబంధానుసంధానం తర్వాత వేదగోష్ఠి వీరి సంప్రదాయంలోని ఆచారం ప్రపత్తిలో వీరిది మార్జాల కిశోరన్యాయం

వైష్ణవంలోని 'వడగళ' సంప్రదాయానికి (కన్నడంలో బడగలె) ఆచార్య పురుషులు వేదాంతదేశికులు వేదాలకు ప్రథమ స్థానం, నాలాయిరానికి గౌణస్థానం పాదపీఠరహితమైన పట్టెవర్ధనాలు వీరి ప్రధాన లక్షణాలు, అనగా, నిష్పాదులు అహోబల-పరకాల మఠాలు వీరి ముఖ్య సింహాసనాలు ప్రపత్తిపరంగా వీరిది మర్కట కిశోరన్యాయం తెలంగాణ, సాగరాంధ్రాలలో తెంగల జనాభా ఎక్కువ, పశ్చిమాంధ్రంలో వడగళ సంప్రదాయానుసారుల జనసంఖ్య ఎక్కువ

ఆ యా తీర్థమూర్తి క్షేత్రాలలో పాంచరాత్రులు వైఖానసులు ప్రధానార్చకులు వైష్ణవస్వాముల ద్విజేతరానుయాయులు నంబి, సాతాని మొదలైన తెగలవారు [illegible] ధరించినవారిది 'శాత్తిన' తెగ వీటికి అర్హతలేనివారిది 'శాత్తాద' తెగ తెలుగులో వీరిని 'సాతాని' వారని

అంటారు ప్రాయికంగా వీరు తమ ఆచార్య పురుషుల గృహనామాలనే ప్రపత్తి చిహ్నాలుగా తమ ఇంటి పేర్లుగా పెట్టుకోవడం కద్దు అళహరి గుడిసేవ తిరునగరి తిరువీదుల మొదలైనవి కొన్ని ఉదాహరణాలు

ఆయిలూరు, తిరుమల, వంగీపురం గృహనామకులు తెంగళుల లోనూ వడగళులలోనూ కనిపిస్తారు రామానుజుల మేనమామ తిరుమల నంబి సంతతికో, శిష్యసంతతికో చెందిన వడగళ తెగలో తిరుమల సర్వ సాధారణమైన గృహనామం దివ్యక్షేత్రమైన తిరుమల (తిరుపతి) నుంచి ఇతర సీమలకు వలసవచ్చిన తెంగళ తెగవారిలోనూ 'తిరుమల' ఇంటి పేరుగా చెదరుమదురుగా కనిపిస్తుంది ఆచార్య పదస్థులుగా ప్రసిద్ధిని కోరిగాని పూర్వసంప్రదాయ ప్రీతివల్లగాని కందాడై, గుదిమెళ్ళ, తిరుమల, పల్లెర్లమూడి, పుట్టపర్తి పెద్దింటి మొదలైన ఇంటి పేర్లుగల వైష్ణవులు శ్రీమత్/శ్రీమత్తిరుమలను పూర్వభాగాన చేర్చుకోవడం కూడ కనిపిస్తుంది శ్రీరంగ క్షేత్రానికి వైష్ణవ సంప్రదాయంలో 'కోయిల్' అని వ్యవహారనామం అక్కడినుంచి ఇతర సీమలకు తరలివచ్చినవారు 'కోవెల' గృహనామకులు కోయిల్ నుంచి వలసవచ్చిన 'కందాడై' వారు 'కోయిల్ కందాడై' వారుగానూ, 'కందాడై అప్పన్ వారుగానూ, 'కోయిల్ కందాడై అణ్ణన్' వారుగానూ వారి శిష్యసంతతి 'డింగరీ కోవెల కందాడై' వారుగానూ వాడుక ఏడినట్లు తెలుస్తున్నది

తెంగళులైన ముడుంబ/ముడుంబై ఇంటి పేరు గలవారిలో ఒకరి సంతతికి 'ప్రతివాది భయంకరం' అన్న బిరుదనామం గృహనామంగా సంక్రమించింది 'ప్రసిద్ధః పరగోష్ఠిషు భయంకరః' అన్న వ్యుత్పత్తి ఉద్భట వివాద ప్రౌఢితోకూడిన పాండితీవిరాళికి పరకాష్ఠ 'శ్రీ వైష్ణవానాం గోష్ఠిషు తద్దాస ఇతి మన్యతే' (తొండర్ తొండరగళ్) అన్నది పరిపూర్ణ ప్రపత్తినీ, పరమ వినయ ప్రవృత్తినీ ప్రకటించే పద్ధతి కిడాంబి/కిళాంబి వారు 74 సింహాసనాధీశ్వరులలో ఒకరు

శ్రీ భాష్యం, శ్రీ వచన భూషణం అన్న ఇటిపేర్లు ఆ యా పవిత్ర గ్రంథాలతోగల పఠన ప్రవచనాదికి సంబంధాన్ని సూచిస్తాయి 'మంత్రరత్నం' అన్న ఇంటి పేరు తిరుమంత్ర దీక్షావిధి నిర్వహణంలో రూపు దిద్దుకున్నది 'పరవస్తు' గృహనామకులలో సామవేదులూ, భారద్వాజస గోత్రులూ ఐన వైష్ణవులూ ఉన్నారు, యజుర్వేదులూ, గార్గేయస గోత్రజులూ ఐన వైష్ణవులూ ఉన్నారు సాతాని తెగకు చేరిన చిన్నయసూరి ఇంటిపేరు కూడా దాప ప్రపత్తి సంపత్తిచే 'పరవస్తు'గా స్థిరపడింది

అమరవాది, ఆచ్చి, ఆత్మకూరి, ఆసూరి ఆసూరి మరింగంటి, కిందాడ/కిందాడై, కందాళ/కందాళై, కిర్రి, కిడాంబి/కిళాంబి, కొండకింది, కొదమగుళ్ళ కోవెల, కోవెలకందాడై, ఘట్టు, చిక్కుడుకాయల, రంయ్యాల, డింగరి, డింగరీ కోవెల కందాడై నండూరి, ఫట్టరు, మంచెళ్ళ, మరింగంటి వానమామలై వింజమురి, వేదాం, శృంగారం, శ్రీరంగం, సముద్రాల, సిరిసెనఘళ్ మొదలైన ఇంటిపేర్లు గలవారు తెంగళ సంప్ర దాయానికి చెందినవారు

ఉరుపుటూరి కర్ణమడకల, కొడిచెర్ల, కొండాపురం, గాజులపల్లి, చేట్లూరి, తిరుమల పెనుగొండ, నంబాం, పప్పూరి, పుట్టపర్తి ప్రొద్దుటూరు, బుక్కపట్నం, రాళ్ళపల్లి, స్మార్చాల, హొసదుర్గం మొదలైన ఇంటిపేర్లు గలవారు వడగళ సంప్రదాయానికి చెందినవారు

**మరాఠీ ప్రాచుర్య పాండురంగ విఠలాది సంప్రదాయ సంబంధులు**

ఏకనాథ, జ్ఞానేశ్వర్, దత్తాత్రేయ, మాణిక్య మనోహర మార్తాండ మొదలైనవి వివిధావధూతల, నాథ సంప్రదాయానుయాయుల ముద్రకు భద్ర చిహ్నాలు

మరాఠీ పాలకుల పరిపాలనా నిర్వహణలో రూపెత్తిన వివిధ ఉద్యోగాల పేర్లపై ఏర్పడ్డ ఇంటిపేర్లు అంబర్‌ఖానా, ధాన్యాగారమని దీని అర్థం పారసీలో కుప్ప ధాన్యరాశి అనే అర్థం కల 'అంబార్' దీనికి మూలమూర్తి పారసీ భాషా గతమైన 'ఖానా' ఆగారం అనే అర్థం కల సంస్కృత 'స్థాన' శబ్దానికి జ్ఞాతి రూపం 'అంబారం' తెలుగులో అన్య దేశ్యం ధాన్యపు పాతర అనీ ధాన్యాగారమనీ అర్థాలు ధాన్యాగారాధ్యక్ష పదవిలో ఉన్న వారి ఇంటపేర్లు అంబర్‌ఖానాగా మూర్తి కట్టింది ఈ ఇంటిపేరి వారు తెలుగునాట అక్కడక్కడ కనిపిస్తున్నారు అంబారపు అన్నది కూడ తెలుగులో మరొక ఇంటిపేరు ధాన్య రాశితో గల ఏదో ఒక విశిష్ట సంబంధం కారణంగా 'అంబారపు అన్న ఇంటిపేరు వాడుకపడినట్లూహించవచ్చు 'ఆర' సంస్కృతంలోని ఆర్యాశబ్ద భవం పవిత్రులనీ పూజ్యులనీ సంస్కృతార్థం మరాఠ్వాడానుంచి తెలుగుదేశానికి వచ్చి స్థిరపడ్డ వారిని 'ఆరె' అనీ, ఆరె మరాఠీ అనకూడ పిలుస్తారు ఆరెపరుష (మహారాష్ట్రుల శ్రీశైలయాత్ర), ఆరెబాస (ఆరె తెగవారి వాగ్వ్యవహారం - మరాఠీభాష) అని పండితారాధ్యచరిత్ర ప్రయోగాలు కాళోజి ఖండోజి (స్కంద)అన్న ఇంటిపేర్లుకూడా ప్రచురం మహారాష్ట్ర పాలకుల కాలంనాటి రాచమహళ్ళలో వస్త్రాగార పర్యవేక్షకులుగా వ్యవహరించిన వారి ఇంటిపేరు 'తోశేఖానా దవే, దవేజి ధవేజీ-లు సంస్కృతంలో వేదద్వయ పారకుడన్న అర్థంకల ద్వివేది నుంచి వచ్చినవి దుబే అని హిందీలో, దోబే అని ఉర్దూలో ద్వివేదుల అని తెలుగులో వాడుక, దేశముఖ్, దేశాయి, సర్దేశాయి మొదలైనవి రెవిన్యూ శాఖాపరమైన గృహనామాలు

✓✓ ✓ మున్సబు గిరీని వెలాయిస్తున్న కొన్ని కుటుంబాల వారికీ, వారి జ్ఞాతులకూ, ఇతర పరంపరా సంబంధులకూ తెలంగాణంలో 'పటేలు' అనీ, పశ్చిమాంధ్రంలో 'పాటీలు అనీ ఇంటిపేర్లు మరాఠ్వాడాలో పన్నెండుమంది గ్రామాధికారులు - ఆయగాళ్ళు - వ్యవస్థను

'బారాబలూతీ' అంటారు. ఈ పన్నెండు మందిలో 'పటేలు' ఒకరు. పటేలు పట్వారీ, పోలీస్‌పటేల్ అన్న వాడుకలు తెలంగాణంలో ప్రచురం. గ్రామాధికారులలోని ముఖ్యులను రాయలసీమలో రెడ్డి కరణాలనీ, కోస్తా ప్రాంతంలో మున్సబూ కరణాలనీ, తెలంగాణంలో పటేల్ పట్వారీ అనీ, కర్ణాటకంలో గౌడ/శానుభోగ అనీ వ్యవహారం. పటేలు/పాటీలు రూపాలను నగరపాలకుడన్న అర్థం కల సంస్కృత 'ప్రస్థపాల' నుంచి గానీ, పదవీచిహ్నితుడన్న అర్థంకల సంస్కృత 'పట్టపాల' నుంచిగానీ నిష్పన్నం చేయవచ్చు. ప్రస్థపాల - ప్రాకృతాలలో 'పట్ఠవాల' - గానూ, పట్టపాల - పట్టవాల - గానూ మారుతాయి. మన చర్చలోని రూపాలకు ఈ రెండింటిలో ఏదైనా ఒకటి మూలం కావచ్చు. మూలమేదైనా మరాఠీ లోని పటేల్ లేక పాటిల్ - లు తెలుగురూపాలకు సమీపమాతృకలు. మరాఠీభాషలో పటేల్, పాటిల్ పట్టపు పేర్లు. పశ్చిమాంధ్రంలో ఇంటిపేరు గానే పరిమిత వ్యవహారం. తెలంగాణంలో ఇంటిపేరుగానూ, గ్రామాధికారి అనే రెండర్థాలలోనూ వాడుక. మరాఠీలో 'ఫడ్‌సాల' అంటే కార్యస్థాన వేదిక అని అర్థం తెలుగులో ఇంటి నిర్మాణంలో నడవకూ, నివాసపు గదులకూ నడుమగల విశాలమైనశాల. ఇక్కడే ఇంటి యజమానుడూ, ఇతర కుటుంబ సభ్యులూ, కార్యార్థులై వచ్చిపోయే చుట్టపక్కాలూ, తక్కిన ఊరిపెద్దలూ సమావేశమయ్యే చోటు. తెలుగులో 'పడసాల' ఒక ఇంటి పేరు. 'పడుసాల'ను పడుకునే శాల అనే అర్థం చెప్పుకోవచ్చు. గజశాలా అనే అర్థంకల పారసీ పీల్‌ఖానా దీని మొదటి రూపం. పారసీలో 'పీల్' అంటే ఏనుగు అనీ, పీల్‌బాన్ అంటే మావటీడు అనీ అర్థాలు. ఉర్దూలో పీల్‌ఖానా అంటారు. వీరంతా మాధ్వులు. పోద్దారి (<పోతేదారి = ఖజానా ఉద్యోగి) గృహనామం తెలంగాణంలో ప్రచురం. ప్రభువు, అధికారి అనే అర్థాలు కల సంస్కృత రాజ శబ్ద సంబంధియైన మహారాష్ట్రి ప్రాకృతం

లోని 'రావా' తెలుగులో పట్టపు పేరుగా, ఇంటిపేర్లలో చివరి భాగంగా 'రావు'కు సమీప రూపం గజగంతరావు, ప్రతాపరావు మాణిక్యారావు వసంతరావు, శతమంతరావు మొదలైనవి కొన్ని ఇంటిపేర్లు రశీదు కానా చెల్లు చీటీలు జారీచేసే కచేరీలో పనిచేసిన వారి వారసుల ఇంటిపేరు సంస్కృత పండిత శబ్ద సంబంధియైన మరాఠీలోని 'పంత్' నుంచి రూపొందిన తెలుగు మాట 'పంతులు' దీనికి ఇంటిపేరుగా సైతం తెలుగు నాట వాడుక పరశురామ పంత్ శ్యామాపంత్ మొదలైన కార్య ఖడ్గ నిపుణులు మరాఠ్వాడా నుంచి తెలంగాణానికి వలస వచ్చి స్థిరపడడం చేత, తెలుగువారి భాషా సంప్రదాయం మేరకు వారి కుటుంబాల వారు 'పరశురామ పంతుల' మొదలైన గృహనామకు లయ్యారు ద్రావిళ్ళైన అనంతపంతుల, మధునాపంతుల, కరణ కమ్మలైన కేశవపంతుల, వైదికులైన రామాపంతుల, తెలంగాణ్యులైన భాస్కరపంతుల, మరాఠ్వాడా నుంచి వచ్చి నియోగులైన పరశురామపంతుల మొదలైన వారి ఇంటిపేర్ల చివరి భాగంలోనూ ఇది కనిపిస్తుంది రామమూర్తి పంతులు, రామయ్య పంతులు, వీరేశలింగం పంతులు మొదలైన వ్యక్తి నామాలలోని ఉత్తరభాగం కూడా ఇదే మరాఠ్వాడాలో ఒక నాటి లష్కరీ - దఫ్తరీలో జమా ఖర్చులు రాతకోతలు చేసే పదవికి మరాఠీలో ష (స) బ్నవీస్ అంటారు షబ్నవీస్ అన్నది తెలుగునాట ఒక ఇంటిపేరు పారసీలో 'నవిస్' అంటే రాయసగాడు, 'నవీసీ' అంటే లేఖనం, 'నవిష్త' అంటే ఖరారు పత్రమనీ అర్థాలు విరల, విరలదేవుని, విరాల మొదలైన గృహనామాలు పాండురంగ విరల ప్రభావ సూచకాలు

బూర్గుల రామకృష్ణారావుగారి తొల్లింటి ఇంటిపేరు 'పుల్లమరాజు' వారు తాత ముత్తాతల నాటినుంచీ పరంపరగా మహబూబ్‌నగర్ జిల్లాలోని 'బూర్గుల' గ్రామము వీరి కాణాచి రామకృష్ణరావుగారి పై చదువులన్నీ

మరాఠ్వాడాలోని పూనా బొంబాయి నగరాలలోని ఉన్నత విద్యాసంస్థలలో సాగినందున ఆ సంస్థంలో ఆనాడు అమలులోఉన్న అడ్మిషన్ ఆనవాయితీ ప్రకారం అభ్యర్థి ఆవాస స్థానమైన 'బూర్గుల' గ్రామ నామం ఇంటిపేరు స్థానంలో నమోదైనందున దీక్షాంతవేళ అభ్యర్థి పొందిన ఆధికారిక పట్టాల పత్రాల మేరకు వీరికాలం నుంచీ 'బూర్గుల' యే ఇంటి పేరుగా స్థిరపడింది వీరి ఇంటిపేరు 'పుల్లమరాజు'కు తెరపడింది

బి ఆర్ అంబేద్కర్ మోహనదాస్ కరమ్‌చంద్ గాంధీ గోపాల కృష్ణ గోఖలే, అరవింద ఘోష్, పూర్ణచంద్ర జోషీ (పి సి జోషీ), ఝాన్సీ లక్ష్మీబాయి, బాలగంగాధర తిలక్ జవహార్‌లాల్ నెహ్రూ సురేంద్రనాథ బెనర్జీ సుభాస్ చంద్రబోస్, రాజా రామ్‌మోహనరాయ్, లాలా లజపతిరాయ్ మున్నగు మహనీయుల ఇంటి పేర్లైన అంబేద్కర్, గాంధీ గోఖలే ఘోష, జోషీ ఝాన్సీ తిలక్, నెహ్రూ బెనర్జీ బోస్, రాయ్, లాలా వంటివి తెలుగునాట ఇంటి పేర్లుగా కాక వ్యక్తి నామాలలో భాగాలుగా చేరిపోవడం గమనించదగింది (అంబేద్కర్ గురు గృహనామ మని ప్రతీతి )

**ఆంగ్ల ముద్ర**

తెలుగువారి ఇంటిపేర్లను ఇంగ్లీషు లిపిలో రాసేటప్పుడు ఎదురయ్యే సాధక బాధకాలను పరిశీలించి చూద్దాం కుంఫిణీ సర్కారు పరిపాలనానంతరం స్థాపితమైన జిల్లా ఇసుకోలు బళ్ళలో ప్రధానోపాధ్యాయులూ చాలవరకు అధ్యాపకులూ ఆంగ్లేయులుగా ఉండేవారు కార్యాలయోద్యోగులు కూడా ఆంగ్లభాషా వాసనావాసితులు బోధనామాధ్యమం కూడా ఆంగ్లమే పిల్ల లను ఈ ఇసుకోలు బళ్ళలో చేర్చేటప్పుడు ఆంగ్లభాషతెలియని తల్లిదండ్రుల అచ్చమైన తెలుగుతెలియని ప్రధానోపాధ్యాయుల ఉచ్చారణ వినికిడులను బట్టి ఆంగ్లలిపిలో పిల్లల పేర్లు ప్రవేశపు రిజిష్టరుంలో రాసేవారు తెలుగులో పదాదిని ఇకారోచ్చారణం కలిగిన పిల్లల ఇంటి పేర్లలో చాలవరకు

ఇంగ్లీషు వర్ణమాలలో మూడోదైన c'ని ఆద్యక్షరంగా వాడేవారు మాము లుగా కకారోచ్చారణ సంకేతాలుగా ఆంగ్లంలో c, k, q అన్న విడిలిపి సంకేతాలను వాడడంకద్దు 'k' కకారోచ్చారణకు పరిమితం q ఉత్తర భాగాన U వస్తేతప్ప వాడుకలేదు c తర్వాత a, l, o r, u లిపి సంకేతాలు వచ్చినప్పుడు కకారోచ్చారణం ఆ భాషాసంప్రదాయం కట్టమంచి (Cattamanchi) కడప (Cuddapah) కడలూరు (Cuddalore) కలకత్తా (Calcutta) కాకినాడ (Cocanada) కావలి (Cauvally) కోయంబత్తూరు (Coimbatore) మొదలైనవి కకారోచ్చారణంగల 'c' వర్ణంతో మొదలైన కొన్ని స్థలవాచకాలకు ఉదాహరణలు ఐతే, ఎందువల్లనో ఈ లేఖన సంప్రదాయం మేరకు కర్నూలు (Kurnool) అపవాదంగా కనిపిస్తుంది పాత రికార్డులు పరిశీలించినగాని ఈ విపరీత లేఖన పద్ధతికి కీలకం తెలియదు పైన పేర్కొన్న పట్టణాలలో కొన్ని పట్టణాల పేర్లలో k' లిపిన్యాసంతోనే అధికారముద్రికలతోపాటు ప్రకృతం ఉపయోగిస్తున్నారు కడపను తీసుకుంటే కడప కోటిరెడ్డి కె (K) కోటిరెడ్డిగా, కడప సుబ్బరాయుడు స (C) సుబ్బరాయుడుగా చెలామణి అవుతున్నారు కట్టమంచి రామలింగారెడ్డి సి ఆర్ (C R) రెడ్డిగానూ, సింగిరెడ్డి (Gingireddi) నారాయణరెడ్డి (C=సి)గా వాడుకపడడం విశేషం అంతేకాదు, పందొమ్మిదో శతాబ్ది చివరలో కర్నూలు కలెక్టరు కార్యాలయంలో హుజూర్ షెరస్తదారుగా పనిచేసిన ఆర్కాటు కుప్పుస్వామి మొదలియార్ ఇంగ్లీషు వర్ణక్రమాన్ని అనుసరించి **Cooppu Swamy** లేక **Cuppu Swamy** అని 'C' వర్ణంతోనే క వర్ణాన్ని ఉద్దేశించినట్లు పాతరికార్డులు పరికిస్తే కనిపిస్తుంది కుమారస్వామి (**Coomara Swamy**) నామం కూడా 'C' వర్ణంతోనే ప్రారంభమయ్యేది ఆనాడు

ఇంగ్లీషు వర్ణసమామ్నాయంలోని ఆ యా వర్ణాలను విడివిడిగా ఉచ్చారణ విధేయంగా పలికేతీరు తెలుగులేఖన పద్ధతిలో ప్రతిఫలిస్తుంటుంది బహువర్ణ సమ్మిశ్రితమైన ఇంటిపేరులోని ఆదిమ వర్ణం-అది అచ్చుకావచ్చు, హల్లు కావచ్చు-ఇంటిపేరుకు సంకేతంగా ప్రాతినిధ్యం వహించడం తెలుగు వారి ఇంటిపేర్లపై గల ఇంగ్లీషు ప్రభావానికి మచ్చుతునక అవసరాల, ఆవుల (హ్రస్వ దీర్ఘాలతో ప్రమేయం లెకుండా **A** = ఎ ), బలుసు, బసవ రాజు, (**B** = బి), భవనం, భావరాజు, భారతుల వంటి చోట (**B**/**Bh** = బి లేక బి హెచ్ ) వాస్తవంగా ఇక్కడి హకారం అనుచ్చరితం (**silent** )

చల్లా చౌదరి (**C** = సి ) కొందరు చకారాన్ని **Ch** = సి హెచ్ అని రాయడం కద్దు డింగరీ డేగ దగ్గుబాటి, దు ర్వారి మొదలైన వాటిలో డ, దలు రెండూ **D** = డి గా వ్యవహరిస్తారు ఇర్లి ఈదర, ఈడ్పుగంటి, ఎక్కిరాల మొదలైన వాటికి లిపి సంకేతం **E** = ఇ అయితే, ఇంగువ ఇందుకూరి, ఇలపావులూరి ఐదుకల్లు మొదలైన ఇంటిపేర్లను **I** = ఐ గా గు ర్తిస్తుంటారు గడియారం, ఘంటా మున్నగుచోట్ల విడిగా ఇత్వసహిత జకారం (**G** = జి ) గాను, ఇంటిపేరు పూర్తిగా ఉచ్చరించేటప్పుడు గకారంగా వాడుకచేస్తారు హేలహర్ని హొసదుర్గంలు (**H** = హెచ్ )గా సంకేతించబడుతున్నాయి ఇంగ్లీషు భాషా ధ్వనుల ఉచ్చారణ మర్యాదల మేరకు '**H**'ను అజాపగా 'ఎచ్' అనాలి జాస్తి జింకెలు (**J** = జె )గాను కాసు, ఖండవల్లి మొదలైన ఇంటిపేర్ల పట్ల (**K** = కె ) రిపిస్తుంది లంకపల్లి లింగంలు (**L** = ఎల , యల్ ) మామిడిపూడి ముమ్మనేని మొదలైన మకారాది రూపాలు (**M** = ఎమ్ , యం ) అని సంక్షేపించ బడ్డాయి అదే రీతిగా నాయని నార్ల అన్నవి (**N** = ఎన్ యన్ ) అన్న సంకేతాలతోనూ ఓబుళంపల్లి ఓరుగంటి మొదలైనవి (**O** = ఒ ) గానూ పింగళి, పొట్లూరి వంటివి (**P** = పి )గానూ, రత్నాకరం, రేబాల మున్నగు

రేఫాది రూపాలు (R = ఆర్ ) గానూ, సాలూరి సాదినేని మొదలైనవి (S = ఎస్ ,యస్ ) గానూ వాడుక కెక్కాయి ఓంగుటూరి, తాతిరెడ్డిలలో ట తలు రెండింటికి ఒకే లిపి సంకేతం (T =టి ) సరిపోతున్నది ఉపాధ్యాయుల, ఉపమాక మొదలైనవి (U =యు ) సంకేతంలో వ్యవహృతాలు ఉమ్మనేని, ఉప్పులపాటి మొదలైన అజాది రూపాలకు వికృతులైన వుమ్మనేని, వుప్పులపాటి మొదలైన చోట్లనూ వంగూరి, వజ్ఝల, వడ్లా మొదలైన ఇంటిపేర్లలో (V = వి ) సంక్షేపరూపం

ఏటుకూరి, ఏర్లగడ్ల అని తెలుగు లేఖన రీతిలో ప్రచురమైనప్పటికీ యామిజాల యెర్నేని మొదలైన 'య'కారాది రూపాలతోపాటు (Y =వై ) తో సూచితం

ప్రాచీనాంధ్ర కవుల ఇంటిపేర్లను పేర్కొనేటప్పుడు నవీన పరిశోధకుల రచనలలోకూడ ఎందువల్లనో ఇంగ్లీషు ముద్రపడ లేదు అడిదం, బమ్మెర, చేమకూర, దగ్గుబల్లి కంకంటి మూలఘటిక నంది, పాల్కురికి, రెంటూరి సారంగు తెనాలి మొదలైన గృహ నామాల పట్ల ఇంగ్లీషు లిపి సంకేతాలను ఉపయోగించే రీతి కనిపించదు బ్రౌణ్య నిఘంటువు (1852) సంకేతాక్షర వివరణ పట్టికలో రావిపాటి గురుమూర్తి R G అనీ జూలూరి అప్పయ్య Z A అనీ గుర్తించబడడం పరిశీలనార్హం ఎస్టీకర్ ఏయన్నార్ ఎ ఎస్ ఎన్ సి ఆర్ , ఎ ఆర్ ఆర్ ఎం ఆర్, కె టి ఆర్ మొదలైన సంకేతాలలో పేరూ, ఇంటిపేరూ ఇంగ్లీషు పొడి అక్షరాలలో ఎమిరేట్స్ గుర్తించవచ్చు కొకు , ఖ ల రంజనం , ఘ బ రా జ మా శర్మ పి ల కాంతం ము ర యా , రా రా , రావిశాస్త్రి శ్రీశ్రీ మొదలైనవి పొడి అక్షరాలలో నిబద్ధమైన కొందరి వ్యక్తుల పేర్లు

బెజవాడను విజయవాడగా ప్రభుత్వం అన్ని స్థాయిలలో మార్చినను 'బెజవాడ' గృహనామకులు తమ ఇంటిపేరులో మార్పు

తలపెట్టలేదు అసలు బెజవాడయే సరైనరూపమూ, ప్రాచీనరూపమూ విజయవాడ వైరిసమాసం గ్రామ మానుష్యనామాలపట్ల వైరిసమాస ప్రసక్తి పరిగణంలోకిరాదని కారికావళి కర్తల సంజాయిషీ చికాకోలు/శిఖాకొల్లును 'శ్రీకాకుళం'గా ప్రభుత్వంవారు మార్చినా, ఇంటి పేరుగా 'శిఖాకొల్లు' యథాతథంగా నిలచి ఉంది ఐ పోలవరం (**Island Polavaram**), కె డి పేట (కృష్ణదేవుపేట), ఎల్ గన్నవరం (లంకల గన్నవరం), ఎన్ హనుమాపురం (నీళ్ళులేని హనుమాపురం) మొదలైన స్థలవాచకాలలో ఇంగ్లీషు స్పర్శ కనిపిస్తుంది

పేరులో ఏముంది అంటారు చాలామంది అందులో ఇంత కథా కమామీషూ ఉందని ఎందరికి తెలుసు ? సూక్ష్మంలో మోక్షంగా వీటి పైనం చెప్పాలన్న కుతూహలమే ఈ ఎత్తుగడలోని ఎత్తుగడ

# తెలుగులో ప్రశంసార్థకాలు

'ఆంధ్రత్వమాంధ్రభాషాచ నాల్పస్య తపసఃఫల' మ్మని ఆలంకారిక చక్రవర్తి అప్పయదీక్షితుల కితపత్రం ఆంధ్రుల నిజతత్త్వానికీ, ఋజు వర్తనకూ ఇది తిరుగులేని రుజువు 'దేశభాషలందు తెలుగులెస్స' అని ఆంధ్రవల్లభుని వాల్లభ్యం 'తెనుగు తేటె' అని కన్నడిగల పొగడిక 'సుందర తెలుంగ' మని సుబ్రహ్మణ్య భారతి స్తుతిగీతికా భాగం 'ఇటాలి యన్ ఆఫ్ ద ఈస్ట్' అని ఇంగ్లీషువాడి మెచ్చికోలు

అయితే, తెలుగుభాషలో ప్రశంసార్థకాలైన దేశీయ పదాలు అస్తి నాస్తి విచికిత్సాహేతువులు గుణకథనం వ్యక్తిపరమైనదే కానక్కరలేదు, వయోభేదంతో గానీ, స్త్రీ పుం భేదంతోగానీ పనిలేదు సంస్థల పరంగానూ, వ్యవస్థాపరంగానూ ఉండవచ్చు అంతేకాదు, వ్యక్తుల భిన్న ఉపాధులను బట్టి ఈ గుణకథనం విభిన్న మూర్తులలో సాక్షాత్కరించవచ్చు కవులుగా కళాకారులుగా, రాజనీతి నిపుణులుగా, రణనీతి కోవిదులుగా, వేదవిద్యా విశారదులుగా, సప్తసంతాన ప్రతిష్ఠాపకులుగా, స్వచ్ఛంద సేవకులుగా, స్వాతంత్ర్య సమరయోధులుగా, సమరాంగణ సార్వభౌములుగా రాణించి ఉండవచ్చు, పురాణించి ఉండవచ్చు ఆ యా విశిష్ట వ్యక్తుల, జన సమూహాల సుగుణగణ సంకీర్తనమే ప్రశంస దీనిని ప్రకటీకరి చే మాటలే ప్రశంసార్థకాలు

అనిదం పూర్వమైన ఒకరి మంచినీ, అనితర సాధ్యమైన ఒరుల శక్తినీ మెచ్చే సౌహార్ద్రం తెలుగువారిలో లేదేమో అనిపిస్తుంది పై చూపులకు అయితే, పై పై అర్థాలు వేరు, పరమార్థం వేరు ప్రశంసార్థకాలుగా

తెలుగు కావ్య ప్రయోగాలలో గానీ లోకవ్యవహారంలోగానీ చెలామణిలో ఉన్నవాటిలో నూటికి తొంభై తొమ్మిది పైచిలుకు పరాయిభాషలనుంచి దిగుమతి చేసుకున్న కిరాయి పెనుసు ఎందుచేతనో పద్ధదేశాల్యు దృశ్యా దృశ్యాలు

ఆవేశ మెక్కువ ఆలోచన తక్కువ అన్న అభాండానికి తోడు ఆంధ్రులు ఆరంభశూరులన్న అపప్రథ ఒకటి ఉండనేఉంది అందులోనూ ఆత్మాభిమానం వీరి ఆయువుపట్టు అదే వీరి వజ్రకవచం కొన్ని కొన్ని తావుల ఆత్మవిశ్వాసం పాలుకూడ ఎక్కువ అది మరింత అహం వాసనా వాసితమైతే కార్యహానికీ ధర్మగ్లానికీ దారితీయవచ్చు వీరు సర్వేసర్వత్రా ఆనందవర్ధనులూ అశోకవర్ధనులూ హర్షవర్ధనులూ కాకపోవచ్చుగాని దృఢ విక్రములనీ సత్యపరాక్రములనీ పెద్ద పేరుమోసినవారు నూటొక్క సీమ లలో, ఛప్పన్నారు దేశాలలో అందగాళ్ళనీ అంగరంగ భోగాలలో అద్వి తీయులనీ విశిష్ట కళారంగప్రభువులనీ, వినూత్న కవితారసిక ప్రవరులనీ పదేపదే పరాయివారిచే ఎడాకితాబులు పొందినవారు సంస్కారపరులనీ సామరస్య దీక్షాపరతంత్రులనీ ఘనకీర్తిని గడించినవారు పక్కవాడి పొత్తు నచ్చితే ప్రాణమిస్తారు తిక్కరేగితే ప్రాణం తీస్తారు ఎత్తుకు పైయెత్తువేసి ఎదటివాడిని చిత్తు చేయగల సత్తా గలవారు అట్లని జిత్తుల మారి వారుకారు వీరికి ముక్కుమీద కోపం ఎత్తైనా విశ్వామిత్ర సంతతి కదా! అట్లని దీర్ఘకోపనులుకారు చులకనగాచూస్తే అలక పాన్పెక్కుతారు అట్లని వృథాకలహకారులు కారు

అధ్యయన అధ్యాపనాలలో యజన యాజనాలలో [illegible] సాటికి అందనివారు ఆంధ్రులు వేదపరక పాఠాలలో పు[illegible] [illegible] లలో విశ్వవిహాయసంలో వీరిని మించినవారు [illegible] వీరి సరిసటి అంచుకు రాగలిగినవారు మరొకరు లేరని జగాబి[illegible] లందినవారు [illegible]

ధాన విద్యాప్రదర్శనంలో ఆశుకవితా ప్రయోగంలో, యక్షగాన వాఙ్మయ పక్రికలలో సహస్రాబ్దుల శతకవాఙ్మయ సృష్టిలో, విశిష్ట జానపద కళాప్రచార నిరతిలో, ప్రకృష్ట పద్య నాటకప్రయోగభణితిలో అనన్యాయ మైన నైపుణ్యం వీరిసొత్తు

ఆరునూరైనా ఆడితప్పనివారు మిన్నువిరిగి మీదపడినా మేరమీరని వారు సంగరరంగంలో విజయమో, వీరశయనమో వినా, మడమతిప్పని మానధనులూ, తిరుగా మరుగా ఎరుగని అభిమానఘనులూ శరణన్న శత్రువును సైతం క్షమించగల ఉదారధీకలితులు ఎప్పుడెప్పుడూ పుట్టు లోభులుకారు, ఏనుగు పాడిగా ఇచ్చారు చేతికెముక లేదనిపించుకున్నారు అతిథిమర్యాదలలో అన్నపూర్ణకు అన్నదమ్ములు ఆత్మస్తుతీ, పరనిందా గిట్టనివారు ఆంధ్రావళిలో దయాధర్మవీరులకు కరవులేదు పరాక్రమ క్రమాలకు కొరవలేదు పాండితీ శౌండీర్యానికి కొదవలేదు పరోపకార పారీణతకు కొరతలేదు ప్రభు భక్తి పరాయణతకు తిరుగులేదు ప్రకృతి సంపదకూ ప్రజాసంపదకూ తరుగులేదు పైరుపచ్చలకూ పాడిపంటలకూ లోటులేదు

మరి, సరిసాటివాలేని ఇంతింత సుగుణసంపత్తి అమరిఉండి కూడా ప్రశంసను తెలిపే తెలుగుమాటల కొరత ఎందుకేర్పడినట్లు? అన్న ప్రశ్న ఎదురవుతుంది అచ్చాచ్ఛమైన ఇన్నిసుగుణాలు అనాదిగా అనుస్యూతంగా సమకూరి ఉన్నప్పటికీ మెచ్చికోలు గుణం - మెరమెచ్చుల ఇచ్చకాల మాట అటుంచండి - తెలుగువారిలో లేనే లేదనడం శ్రుతసంపన్నులు మెచ్చనిమాట ఒకనాడు ప్రశంసార్థకంగా ఉన్న పదావళి ఆ దరిమిలా వ్యవహార విదూ రమై ఉండకూడదా అన్న శంకకలగటంకూడ సహజం!

అసదృశ ప్రతిభావిభుత్వమూ అసాధారణ పాండితీ ప్రభుత్వమూ ఉంటేతప్ప అంతంతమాత్రపు అల్పవిద్యలూ, అల్పబుద్ధులూ, హీనప్రజ్ఞలూ

ఆంధ్రులను అలరించలేవనీ అంతగా ఆకట్టుకోలేవనీ తాత్పర్యమా? మనసున్న మనిషై పుట్టినందుకు మంచిపనులు చెయ్యడం మామూలే కాబట్టి దీనికై అంతలేసి పొగడ్తలు పనిలేని పనులు అన్న తాత్త్వికదృష్టియా? పొగడితే అహంకారం బలిసి, మిడిమేలపు తెలివిడితో ఎదగడం మరచి, మిడిసిపాటుతో ఎదటివాడు చెడిపోతాడన్న జాలితోకూడిన భయమా? ఆంధ్రులలో సహృదయత లోపించిందని సమన్వయిద్దామా? వీరు భద్రాభిలాషులూ, భద్రవాక్కులూకారని భావమా? పొగడికలలో పొదుపు పాటిస్తున్నారని సమర్థించుకుందామా? దూషణ భూషణలకు అతీతమైన అనాసక్త లక్షణాన్ని అలవర్చుకున్నారని అర్థం చెబుదామా? నందిస్తే పొంగిపోని నిందిస్తే కుంగిపోని నిర్లిప్తబుద్ధి వీరి నిసర్గలక్షణమని నిర్వచిద్దామా? ఊహూఁ ఇవేవీ దీనికి హేతువులు కానేకావు ఏది మంచి అనిపించినా ఎక్కడమించు కనిపించినా అనుశీలించి, ఆస్వాదించి, ఆమోదించి మంచువలె కరగిపోయే ఆర్ద్ర మనస్తత్త్వం సౌహార్దమార్దవాలు ఆంధ్రులకు పెట్టని సొమ్ములు

అంతామంచిదే! అంతా మనవాళ్ళే! అనుకునే బోళా శంకరులు కావచ్చుగాని వారూ వీరూ అనుకుంటున్నట్టుగా ఆంధ్రులు అల్పసంతోషులు కారు, అసంతోషులు అంతకంటే కారు స్వస్థాన వేషభాషా ప్రియత్వం ఎంతగాఢంగా ఉన్నా దురభిమాన దుర్యోధనులు కారు పరభాషా వేషాదుల పట్లగల వల్లమాలిన వ్యామోహం ఆంధ్రుల బలహీనతలలో బలిష్ఠమైనది నూతన ప్రియులు కాబట్టి కొత్తదేది కనిపించినా దానిని అనుకరించాలని ఉబలాటపడతారు అనుసరించాలని ఉర్రూతలూగుతారు ఈ విషయంలో తెలుగువారి మోజూ తోజూ సవతు లేనివి భరతఖండంలోని అన్ని మండలాలలోనే కాక విశ్వవీథులన్నింటా విరళంగానైనా విస్తరించి ఉన్నారు ఆంధ్రులు ఏ సీమకేగినా, ఏ భూమికేగినా, ఏ వృత్తిచేపట్టినా,

ఏ ప్రవృత్తి చూపటినా అక్కడి ఆహారవిహారాలనూ అప్పటి ఆచార విచారాలనూ వీరు అవలీలగా అవలంభిస్తారు, అంతేకాక వాటికి అలవాటు పడతారు

ఎంతటి సంకటస్థితిలోనైనా సర్దుకుపోగల సంయమమూ, పరిసరాలను వృద్ధిప్రదంగా మలచుకోగల సంస్కారమూ పరిస్థితులను సిద్ధిప్రదంగా మార్చుకోగల పురుషకారమూ వీరికి వెన్నతోపెట్టిన విద్యలు పరాయి భాషలపట్ల అతివేలమైన ఈ అనుకరణం ఆంధ్రుల విషయంలో మరింత కొట్టవచ్చినట్లుగా కనిపిస్తుంది అందుకే ప్రశంసావాచకాలుగా పరభాషాపదాలే తెలుగులో ప్రచుర వ్యాప్తిలో ఉన్నట్లు ఒప్పుకోక తప్పదు కేవల దోషాన్వేషకులైన పురోభాగులూ, మందప్రజ్ఞులైన గంభీరవేదులూ ఈ వాదాన్ని అంగీకరించకపోవచ్చుగాని ఎవ్వరేమన్నా ఎవ్వరు కాదన్నా ఇది నూటికి నూరుపాళ్ళు నిజం! నికరమైన సిద్ధాంతోక్తి!

మెచ్చికోలును ప్రకటించడం రెండు విధాలు మొదటిది చేష్టారూపం రెండోది వాగ్రూపం ఆనందభరంతో చప్పట్లు చరచడం అనురాగాతిశయంతో ఎదటివారి వీపు నిమరడం ఆమోద సూచకంగా తల ఊచడం, అద్భుతార్థ ప్రకటనగా కళ్ళు పెద్దవి చేయడం, ఆశ్చర్యార్థకంగా ముక్కు మీద వేలేసుకోవడం, లఘు విక్రమ క్రమ సంభ్రమ సంరంభంతో ఎడమచేతను కుడిమీస మెగదువ్వడం విస్మయావహ చిహ్నంగా బుజాలెగరేయడం సంతోషాధిక్యంతో చంకలు కొట్టుకోవడం, హర్షాతిరేకంతో చేతులెత్తి జేకొట్టడం-ఇవన్నీ శరీరావయవ విశేష విన్యాసపరమైన శ్లాఘా ప్రకటనలు వీటిలో మాటల ఊసులేదు ఇవన్నీ చేష్టా విధానంలో తమ మెప్పుదలను ప్రకటించే భాషేతర సాధనాలు తరచుగా వాగ్రూపభావ ప్రకటనం కూడ వీటికి-యౌగపద్యంగా-తోడు కావచ్చు

మాటలలోకాక చేతలలో విభిన్న కార్యరంగాల పరమైన పరుల శక్తియుక్తులకు ఆనందించి, అభినందించే కార్యకలాపాలెన్నో పరంపరీణంగా తెలుగునాట వాడుకపడినట్లు కింది అంశాలు ధ్రువీకరించగలవు అపారపాండితీ ప్రాభవాన్నీ, అపూర్వ కవితా వైభవాన్నీ మెచ్చి విద్వత్పోషకులు వచః పర్యాయపద్మాసనులకు సమర్పించే అక్షరలక్షలూ, వతనుగా పంపే వార్షికాలూ, వర్షాశనాలూ, బహూకరించే సువర్ణ ఘంటా కంకణ గండపెండేరాలూ, సాహితీతపః ప్రాగల్భ్య సూచకంగా కవిపండిత సమక్షంలో జరిపే కనకాభిషేకాలూ, గజారోహణోత్సవాలూ అగ్రహారాదిక సమ్మానాలూ ధన కనక వస్తు వాహన ప్రదానాలూ ప్రజ్ఞా ప్రతిభా పాండితీసూచక బిరుదావళీ పురస్కారాలూ విద్వత్ పరిషత్ ప్రమోదానుకారి జయపత్రికా సమర్పణలూ ప్రశస్తి సూచకాలైన పీఠాధిపతుల మఠాధిపతుల అర్హతాశీః పత్రికా ప్రదానాలు సత్యసంగరవ్రతుల సత్కృత్యంకాలైన వీరగల్లు ప్రతిష్ఠాపనలూ రాజసూయాదియాగ నిర్వహణ భాగంగా యాగాశ్వ ఫాలతలానకట్టే చారుతరశబ్ద గుంఫిత వీరాంక లేఖనాలూ, ఆహవోత్సాహ నిరతులైన పతులకు వారి సతులు మనసార సమర్పించే నీరాజనాలూ రక్షాశిక్షాదక్షుల సంస్మరణ చిహ్నాలూ, సాహితీ వల్లభుల అభ్యుదయ పరంపరాభివృద్ధిని అభిలషిస్తూ కవితల్లజులు కావించే కృతి ప్రదానాలూ సాహిత్య సత్యవ్రతుల - సకల కళారచనా ప్రయోగ చతురమతుల జయంత్యుత్సవాలూ, వర్ణనా నిపుణులైన కవి చూడామణులు కావించిన కృతినాయకు పరమైన కావ్యావతారిక భాగాలూ, శ్లాఘాపరమైన చేతలలోని ప్రధానభాగాలు ఇవేవీ తెలుగువారెరుగని పరికీర్తనా రీతులుకావు

క్షేత్ర తీర్థ మూర్తి మాహాత్మ్య ప్రతిపాదకాలైన రచనలూ ఒక రకంగా స్తోత్ర పాఠాలే గీర్వాణాంధ్ర భాషలలో దండిగా వెలసిన దండక వాఙ్మయమంతా ఒక రకంగా స్తుతి సంరంభ కదంబమే కదా! దేవతా

ప్రీణన సమర్థాలని సంభావితమవుతున్న అష్టోత్తర శతనామావళి, విష్ణు సహస్ర నామావళి, శివమహిమ్నస్తోత్రావళి ఇత్యాదులు కూడా స్తుతి వాఙ్మయ భాగాలే

సకృత్తుగా వాగ్వ్యవహార పరమైన ప్రశంసా ప్రకటన పద్ధతులు సైతం సాక్షాత్కరిస్తుంటాయి ప్రాబోధికజనుల వైతాళిక గీతికలూ, బరాబరులు చేస్తూ బయకారు లొనర్చే ప్రావేశిక మంగళ ధ్రువాగానాలూ, వంది మాగధ చారణాది స్తోత్రపాఠకుల బహుపరాకు వాక్కులూ, సల్లోపాల్లాస కుశలుల సంగరరంగ విజయవిహార ప్రసంగాలూ, ప్రతి వీర భయంకరుం - సకలలోక శుభంకరుం ఉత్సాహించిన విక్రమ రేఖా సాహస గాథాలాపనలూ తెలుగువారికి చిరపరిచితాలు ఆ యా వర్ణాల కులాల ఆనువంశిక గుణసంపత్తిని గోరంతలు కొండంతలు చేసి వర్ణించే విప్రవినోదులూ వీరవ ష్టుయా మొదలైన మంగళగాధిక జాతుల కైవారాలూ దసరా పద్యాల మెచ్చికోళ్ళూ తెలుగునాట పిల్ల పిల్లతరం కొట్టిన పిండి వివాహాది శుభ సందర్భాలలో ప్రవర్తితమయ్యే మెరవణి గద్యల హృద్య పద్ధతులు తెలుగునాట కొన్ని ప్రాంతాల ప్రచురం ఇదీ అసలు పరిస్థితి

అయితే ప్రశస్తి ప్రకటన సమర్థాలైన తెలుగు పదాలేవి యని కదా మన అన్వేషణ శాసన వాఙ్మయంతోపాటు కావ్యసాహిత్యాన్ని అటునుంచి ఇటు ఎంత జాగ్రత్తగా పరీక్షించినా ప్రశస్తి ప్రకటన పటువులైన తెలుగు మాటలు ఒక పట్టాన కనిపించవు ఏ ఘట్టం పట్టి చూచినా, ఏ పట్టుకు మిట్టిమాచినా పరభాషల పరసమాజాల సంసర్గంతో సంక్రమించిన పదజాలమే అడుగడుగునా ఎదురు పడుతుంది స్వీయవాణిలో కంటె పరాయి బాణిలో ప్రశంసను ప్రకటిస్తే ఉచితంగా, హుందాగా ఉంటుందని నాటికీ నేటికీ తెలుగువారు భావిస్తున్నట్లు ఊహించవచ్చు

తెలుగువారి అన్నిరకాల వాడుకలలోని ప్రశస్తి వాచకాలు పరుతెన్నులను అనుశీలించి క్రోడీకరిస్తే సంస్కృతం, ప్రాకృతం, మరాఠీ ఉర్దూ (దఖినీ) కన్నడం, ఇంగ్లీషు భాషలనుంచి అప్పుడప్పుడు ఎరవుతెచ్చిన మాటలే మెచ్చికోలుపట్ల ఎక్కువగా కనిపిస్తాయి

ఐన దానికీ, కాని దానికీ (ఆంగ్లంలో) **fine, good lovely, nice** అనీ, (స్పానిష్‌లో) వెల్లో (**lovely**), ఎక్సలెంతే (**excellent**) మారవిల్లోసొ (**marvallous**) అనీ, పడమటి సీమలలోని కొన్ని భాషా సమాజాలలో ప్రశంసను ప్రకటించే అలవాటు ప్రచురం ఇవన్నీ జవం జీవంలేని వట్టి పడికట్టు పలుకులు కేవలం లాంఛన ప్రాయాలైన సంప్రదాయాలు, ఆధునికనాగరికతా ప్రదర్శకాలై అర్థం పర్థంలేని పుష్కప్రియాలు

అహహ అహా, అహో ఆహా, ఆహాహా ఓహో, ఓహో, ఓహోహో, హో - మొదలైన ప్రశస్తి వాచకాలు ఏ ఒక నిర్దిష్ట భాషా వ్యవహారానికీ పరిమితమైనవి కావు ఇవన్నీ సర్వభాషా సామాన్యాలూ, సకల జన సమ్మాన్యాలూ ఏడ్పు, నవ్వు, మూలుగు వగైరాలు లాగా భాషాతీతమైన భావప్రకటన సాధనాలుగా వీటిని లెక్కించవలసి ఉంటుంది కొప్పు తీరహా (నీలా 2-19) 'ఓహోయను వారును తలలూచుచు ఆహా యనియెడు వారలు (వరాహ 9-140) 'పాంథులాహాహా అంద్రు నవ్వుచున్' (కవిరా 4-14) హోయని, హోయటంచు' అని కావ్యప్రయోగాలు

పైన పేర్కొన్న ప్రశంసావాచకాలపై నీచార్థకంగానూ, లేకి వాత్సల్యార్థకంగానూ - 'రేరే ఘూర్జర', 'మానససంచర రే' - వంటివి ప్రయుక్తమవుతున్న సంస్కృత సంబుద్ధి ప్రత్యయం 'రే' తో పాటు ర, రా, రె - లు చేరినప్పుడుకూడా కొన్ని ప్రశంసార్థకాలు రూపొందాయి

ఒయ్యారె ఓయ్యారె ఓయ్యారే - మొదలైన ప్రశంసావాచకాలు కావ్య ప్రయోగాలలో కనిపిస్తాయి 'ఉదార వాక్చతురత్వ మోయ్యారె నాగ' (సమీర 1-15)

సంస్కృత సమా లనేకం ప్రశంసార్థకాలుగా తెలుగున వాడుకలో ఉన్నాయి ఆ నృత్యం అద్భుతంగా ఉంది వాడి తెలివితేటలు అమోఘం వారి ప్రేమ బాఢం ఆ పెళ్ళి బ్రహ్మాండంగా జరిగింది అభినందించు, ఉపశ్లోకించు కీర్తించు నందించు ప్రకీర్తించు ప్రశంసించు, ప్రస్తుతించు శ్లాఘించు స్తుతించు మొదలైన క్రియా వాచకాలన్నీ సంస్కృత సమాలే 'సంతసం బయ్యె సురరాజ సాధు సాధు' (నై 3-16) సంస్కృతంలో ప్రశంసా వాచకమైన సాధు శబ్దానికి కిది ఆమ్రేడిత రూపం రాయలసీమ మాండలికంలో ప్రశంసాశ్చర్యాలను ప్రకటించే అజజజ (<అజ+అజ +అజ) సంస్కృత ఆర్య శబ్దం మూలంగా రూపొందిన ప్రాకృత పదం 'అజ్జ'కు వికృతి అజ దీని ఆమ్రేడిత రూపం పైన పేర్కొన్న ప్రశంసార్థకం తెలుగున సంస్కృత భవంగా ఉపయుక్తమవుతున్న అయ, అయ్య ల మీద సంస్కృత సంబుద్ధి ప్రత్యయం 'రే' దని రూపాంతరాలూ చేరడంవల్ల 'అయారె, అయ్యారె, అయ్యారే' అన్న ప్రశస్తి వచకాలు ఏర్పడ్డాయి 'ఒయార మయారె' (ఇందు 2-109) 'అయ్యారే చెలువు' (విజయ 1-38)

ఇవి తద్భవాలైన బాగు, బాగు బాగు, భలే బాగా, మహా బాగా మొదలైనవి సంస్కృత భాగ్యశబ్ద భవాలు 'దేశభాషలందు తెలుగులెస్స' అన్న ప్రయోగంలోని 'లెస్స' ప్రాకృతంలోని 'లేస్సా' శబ్ద భవం సంస్కృతంలోని 'శ్రేశ్యా' దీనికి మూలం సంస్కృతంలో సాధు వాదంగా వాడే సాధు' శబ్దం సంస్కృతభవంగా సాదు' గా కనిపిస్తుంది 'ముధుల్ సాదన శాత్రవులెల్ల హసాదన' (రామా 3-149)

తెలుగునకు ఇరుగు పొరుగు భాషలలో ఒకటి సహస్రాబ్దులుగా మత రాజకీయ సంబంధాల ముఖంగా ఒకటే ఐన మరాఠీ భాషనుంచికూడా ప్రశంసార్థకాలు తెలుగులో ప్రవేశించాయి చాంగుబళా! యను శబ్దముల్ ప్రోయ' (పండితా మహి 295), 'చాంగురె! జంగమ సముదుఃఖ చిత్త' (పైడి దీక్షా 83) 'క్షేమం, శుభం' అన్న అర్థాలు కల సంస్కృత 'భద్ర' - శబ్దభవంగా ప్రాకృతాలలో అదే అర్థాలలో 'భల్ల' శబ్దం మూర్తి నందింది దీని రూపాంతరాలు మరాఠీభాషా ముఖంగా తెలుగులో ప్రవేశించాయి బలా, బరే బలేబలే, భళా, భళాభళి, భళానోయ్ తమ్ముడా (బుర్రకథలో పల్లవించే పల్లవి పదం), భళాభళి భళారే, భళి, భళిభళి, భళిరా భళిరే, భళ్‌భళారే - మొదలైన అనేక రూపాలు తెలుగులో కావ్య వ్యవహారంలోనూ, లోక వ్యవహారంలోనూ కనిపిస్తున్నాయి భలే మంచి చౌకబేరము 'పంతమా నాతో నింత భళా తాను' (అన్నమాచార్య కీర్తన), బళిరె (ద్వి పరమ 340) లేములవాడ భీమ భళిరే, భళిరా సత్కవి వౌదు, భళిభళి మాతాత ఒల్లెంబు చేబూని పుల్లాకు తూటుగా బొడిచినాడు, భళి (భీమఖండ పీ 64) మరాఠీలో ప్రశంసార్థకాలైన బాపు బాపు బాపు (పైదాని ఆమ్రేడితం), బాపురె, (బాపు + పురే) బాపురె బాప్పురే మొదలైనవి తెలుగున కనిపిస్తాయి 'బాపురె యని సురలెన్నగ (ఘటికా 2-9) బాపురే కమలాక్షా శరణంచు (భాగ 8-203) 'బాపురే నీబంటు' (అన్నమాచార్య కీర్తనలు), 'బాపురే భూరి కటితటీ భారమహిమ' (పాండు 1-117) మజబాపు మజ్జరె, మజ్జారే హైసరే, హైసర బొజ్జ, హైసర మజ్జ మొదలైన ప్రశంసార్థకాలు సైతం మరాఠీ నుంచి తెలుగున ప్రవేశించినవే 'మందహాసంబుల యందంబు హైసరే' (వాల్మీకి 2-50), 'మైసిరి హైసరే (తారా 3-23)

కన్నడంలో ప్రశస్తి వాచకమూ, ఆమోద సూచకమూ ఐన 'హవుదు' (= ఔను) తెలుగు కావ్య ప్రయోగాలలో హౌదప్ప హవుదప్పా పాత్రరాయా, హౌదయ్య హౌదేనే చక్కదనాల యిక్క - మొదలైన ప్రయోగాలలో కనిపిస్తుంది

సై సైసై అన్నవీ, అచ్ఛా, బహుతచ్ఛా - ఉర్దూ భాష నుంచి వచ్చినవి అచ్ఛా, బహుతచ్ఛాలు రెండూ సంస్కృత మూలకాలు భేష భేషుగ్గా, భేషోభేషు - ఇవి ఉర్దూ ముఖంగా వచ్చిన పారసీ భాషా పదమైన 'బేష్'కు రూపాంతరాలూ, ఆమ్రేడితాలూ వహవా, వహవ్వా వహ్వారే, వహ్వారె, వహ్వారే, వా, వారెవా, వావా, వావావా, వాహ్-మొదలైన రూపాలన్నీ దక్షినీ భాషా మూలకాలు వహవా, వహవా ఆమ్రేడిత రూపం ఛబ్బాష్, ఛాబాష్, శెబాసు, షబ్బాసు, సాబాసు, సెబాసు, సెహబాసు, సేబాసు మొదలైనవి ఉర్దూ భాషనుంచీ వచ్చినవి శాబాశ్ అన్న పారసీ పదం దీనికి మూలం అమ్మకక్క శెబాసు మేలు హవుదంచు' (కువల 4-113), 'సాబాసే బాల వాని సరసకుదియకే' (ప్రపం 1-636)

ఇక ఇంగ్లీషునుంచి తెలుగున ప్రవేశించిన ప్రశస్తివాచకాల మాట **bravo, beautiful, brilliant excellent, exciting, fine, good lovely, marvallous miraculous, nice, splendid, stupendous, superb, well done** - మొదలైనవి ఇంగ్లీషునుంచి తెలుగు వాడుక కెక్కిన ప్రశస్తివాచకాలు

చిట్టచివరకు శుద్ధదేశ్యాలైన తెలుగు పలుకులు రెండంటే రెండు - మంచిది, మేలు-అన్నవి నికరంగా లెక్కకు తేలాయి మేలుకు అదనం, మిదిది, శుభం, శ్రేష్ఠం అని అర్థాలు మేలిమి, మేలిమి బంగారు, మేలిముసుగు, మేలిరకం, వ్రేతల మేలువాడు, అలమేలు మేలువాడు మొదలైన ప్రయో

గాలలో ఇది తెలుగున ప్రచురం అగు అవు, అది, అద్ది మొదలైన వాటిపై సంస్కృత సంబుద్ధి ప్రత్యయం 'రే'కు రూపాంతరాలైన ర, రాలు చేరి అగుర, అవుర, ఔర, అదిర, అదిరా, అద్దిర, అద్దిరా మొదలైనవి తెలుగున ప్రశంసార్థకాలుగాను వాడుకపడ్డాయి 'అద్దిరబన్న' అన్నది ఒక మాండలికం అబ్బ, అబ్బో అన్నవి కూడా ప్రశస్తిసూచకాలే అమ్మ, అక్క-ఈ రెండూ కూడిన పదబంధం అమ్మక్క కూడ తెలుగున ప్రశంసార్థకం 'నవపంచశరుంగని భోజకన్య అమ్మక్క యనంగ' (చంద్ర 1-88), అవును, ఔను కూడ దేశీయాలైన ప్రశస్తి సూచకాలే 'భట్ట హర్షుని కవితాను గుంఫములు ఔనని కొనియాడ నేరరు' (నై 1 7)

మనకు తెలిసింది ఇంత తక్కువ, తెలుసుకోవలసింది ఎంతో ఎక్కువ

# వేమన - వీరబ్రహ్మంల తాత్త్విక ధోరణులు

మానవుడు సుఖాభిలాషి, ఒక మానవుడేమిటి, ప్రతి జీవి సుఖాన్ని కోరుకుంటుంది చిరకాలం జీవించాలని, సుఖసంతోషాలతో మనుగడ సాగించాలనీ, ఇహంతోపాటు పరాన్ని కూడా సాధించాలనీ వాంఛిస్తాడు మనిషి ఆ వాంఛ అక్కడితో ఆగుతుందా? ఆగదు ఇంకా ఏదో తెలుసుకోవాలనీ, తెలిసింది పదిమందికీ చెప్పాలనీ కుతూహలం కలుగుతుంది జగత్తు దుఃఖమూలమంటారు వేదాంతులు మనం అనుభవించే సుఖమన్నది శాశ్వతంకాదనీ, మనం ఆర్జించింది మిథ్యాజ్ఞానమనీ, చివరికి మిగిలేది దుఃఖమె అని తెలిగ్గా తేల్చిపారేస్తారు అయితే సాధకుని చిత్తవృత్తి సదాజ్ఞేయాభిముఖంగానే ప్రవర్తితమవుతూ ఉంటుంది అందువల్లనే తత్త్వచింతన మానవుడి నిసర్గస్వభావం అంటారు నిస్స్వార్థపరులైన మహనీయులు దర్శించిన పరమార్థమె తత్త్వం జిజ్ఞాస అన్నది పురోభివృద్ధికి మూలకారణం అది లేకపోతె పురోగతి లేదు 'తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ' అన్నది పారమర్షకమైన సంకల్పం

అయితే, ఈ సమాజం స్వరూపస్వభావాల్ని అవగాహనచేసుకోవడంలోనే ఉంది పెద్దచిక్కు రమణీయ చరణులు ఎంతోమంది ప్రవక్తలు, సంస్కర్తలు, అవతారపురుషులు జన్మించారు, ఈ పాడులోకాన్ని మరామత్తు చెయ్యాలని మథనపడ్డారు మమతనూ మానవతనూ పెంచాలని తలంచిన మహామహులు అన్ని కాలాల్లోనూ అవతరించారు, చిత్తశుద్ధితో, స్థిర సంకల్పంతో కృషిచేశారు కానీ ఈ లోకముందే - ఇది పరిణామశీల

మైనప్పటికీ-మన్నుతిన్న పాము దీని బుద్ధి కుక్కతోం ఇదొక మహావిచిత్ర మైన స్వభావం కలది విషమాలోచనం వికటాచరణం దీనితత్త్వం వంచే వాడుంటే ఒదిగి ఒదిగి బతుకుతుంది వంగి వంగి దండాలు పెడుతుంది నంగి నంగి వినయాలు ప్రకటిస్తుంది వాడు కనుమరుగు కాగానే యథా పూర్వం ప్రవర్తిస్తుంది ఈ అవతార పురుషులందరికీ వారి బోధంతోపాటు గుళ్ళూ గోపురాలూ కట్టిస్తుంది దరగాలూ, ధర్మసత్రాలూ నిర్మిస్తుంది, పూజలూ పురస్కారాలూ కావిస్తుంది ఎక్కడికక్కడికే సర్దుకుంటుంది ఎలాగో సరిపెట్టుకుంటుంది అంతా నామ్‌కా వాస్తే! అంతటితో అవతార పురుషుల ప్రయత్నాలు సఫా! మళ్ళీ ఏమీ ఎరగనట్లు తన మానాన తాను నిమ్మకు నీరెత్తినట్లు నిశ్చింతగా సాగిపోతుంది వెర్రిపోకిళ్ళ సమాజం అసిమిలోదొకటీ, అమ్మేదొకటీ, మనసులో ఒకటీ మాటలో ఒకటీ, చెప్పేదొకటీ, చేసేదొకటీ ఒకదానికొకటి అంతనా పొంతనా అందికా పొందికా ఉండదు దేనికదే! నాటికీ నేటికీ ఏనాటి స్థితిగతులను చూసినా వారి కృషి ఫలించినట్లుగా కన్పించదు ఇదంతా గమనిస్తుంటే రోగమొకటి మందొకటి అనిపిస్తుంది రోగనిదానం సరిగా జరిగి అనువైన చికిత్స సవ్యంగా సకాలంలో సాగితే తప్ప అమృతం పోసినా రోగం కుదరదు, ఆరోగ్యం ఏర్పడదు శతకోటి దరిద్రాలకు అనంతకోటి ఉపాయాలు సంస్కరణలదారి సంస్కరణలదీ సమాజందారి సమాజందీ సంస్కర్తలు ఎవరిదారినవారు పోతారు కాని సమాజం మట్టుకు తన పాతదారిని వదలదు దానిది ఉలిపికట్టెబుద్ధి నష్టచిత్తులకు భ్రష్టచిత్తత సహజ ధర్మం

తెలుగుల చరిత్రలో స్వర్ణయుగమని చంకలు కొట్టుకునే విజయనగర చక్రవర్తుల తుది దశలో సామాన్యుల కడగండ్ల బతుకు చారిత్రసత్యాలు సైతం కాదనలేరు అలాంటి, పచ్చటి విజయనగర సామ్రాజ్యం భగ్గున మండి పోయింది సీమ సీమకూ చిటిపోటి సామంతులూ పల్లె పల్లెకూ పాళెగాళ్ళు పరిపాలకులుగా తయారయ్యారు మహా మండలేశ్వరులు అతి

వేలమైన భోగ లాలసత్వం, స్థానికాధికారుల అంతులేని అధికార దాహం, దౌర్జన్య శక్తుల విశృంఖల విహారం ప్రజల బతుకుల్ని దుర్భరం చేశాయి దొమ్మీలూ దోపిడీలూ సరేసరి! ఈ అరాజకానికి తోడు, జనులలో పేరుకు పోయిన అజ్ఞానం, అల్లుకు పోయిన అమాయికత్వం, వేషధారుల వంచనా శిల్పం పరిస్థితుల్ని మరింత పాడు చేశాయి పన్నులు చెల్లించలేక అన్ని వృత్తుల వారూ కటకట పడడంవల్ల ఊళ్ళకు ఊళ్ళే ఉజాడయ్యాయి సామాన్యుడి బతుకు పెనంమీది పెసరగింజగా, దినదినగండం దెయ్యాలతో పోరుగా తయారైంది

సదాచారం పేర, శాస్త్రాధికారం పేర స్వార్థపరులు పూనిన బూకరింపు వైఖరులూ, వాదబలం లేకపోయినా వాదిబలాన్ని చూపి ఎదటి వాడి నోరు మూయించే దబాయింపు ధోరణులూ పెచ్చరిల్లిన యుగమది అర్థం లేని ఆచారాలూ, అంతులేని దురాచారాలూ మితి మీరిన మిథ్యాచారాలూ మేరలు లేని మృషావాదాలూ వీర విహారం చేసిన దుర్దినాలవి అట్టడుగు జనంలో వర్తమానంపట్ల అసంతృప్తి, భవిష్యత్తుపట్ల ఆందోళనా చిట్టచివరి స్థాయికి చేరి సమాజం అట్టుడికి నట్టుడికిపోయిన రోజులవి అడుగుతడబడి, నడకజడిమపడి ముందడుగు పడని మదనష్టపు ఘడియలవి జాతిలో చాల భాగం చచ్చిన చావుగా బతికిన పీడ కలల పిదప కాలమది కళ్ళ యెదుట కన్న కసుమాళం జరుగుతూ ఉన్నా, అంతా ఎగాదిగా చూసి నీళ్ళు నమిలే వాళ్ళేగాని నిలదీసి ఇదేమని అడిగే తాహత్తుగానీ ఎందుకీ అత్యాచారాలని ఎదిరించే గాపుగుండె తనంగానీ ఎవరికీ లేకపోయాయి ఏది హేయమో ఏది ఉపాదేయమో తెలిసికూడ మనకెందుకులే అన్న ఉపేక్షా బుద్ధి వీటికి తోడు దీనికి హేతువులు భయం కావచ్చు భ్రాంతి కావచ్చు 'కాలో దురత్యయః', కాలోహి దురతిక్రమః' అన్న ఊతం ఒకటి ఉంది కదా! ఈ అసంతృప్తికి ఒక ఆకృతి నిచ్చి తరణోపాయం సూచించగల నాథుడు కరవయ్యాడు వినీతులకు అధికారం ప్రమోదకారకమేగాని, చాల మందికి

ప్రమాదకారకం. ఎదుటివాణ్ణి - అందులోనూ తిరుగులేని అధికారం కల వాణ్ణి, పశుబలంతో పదోన్మత్తతతో అహంకరించినవాణ్ణి - ఎదుర్కోవడం, చెదరుమదురుగా ఎదుర్కొన్నా చివరిదాకా నిబ్బరంగా నిలదొక్కుకోవడం తలకుమించిన పనులు. నూటికో కోటికో నవతనూ, మమతనూ, సమతనూ కోరేవారున్నా, మంచిని ప్రేమించేవారున్నా, చెడ్డను ఎదిరించే చేవ ఎవరికీ లేక పోయింది. ఎవడో పుట్టుకొచ్చి తమని ఆదుకుంటాడనీ, అమాంతం ఆపదలు నుంచి ఉద్ధరిస్తాడనీ ఆకాశంకేసి ఎదురు తెన్నులుచూచే అలవాటు ఈనాటికీ మనకు పోలేదు. సంస్కారబలం చాలక పురుషకారంపై నమ్మకం కుదరక నిశ్చిత జ్ఞానంపై నిలకడలేక దగాపడ్డ జాతికి స్వయం చోదక శక్తి శూన్యం. 'విక్లబో వీర్యహీనో యస్సదైవ మనువర్తతే' అనీ, 'మృదుర్హి పరి భూయతే' (మెత్తటి వాళ్ళకే మొత్తులు) అనీ ఊరకే అనలేదు వాల్మీకి. ఎంతైనా యుగయుగాలుగా కర్మ సిద్ధాంతానికి కట్టుపడ్డ జాతిగదా! ఆర్జవ సంపన్నత అన్నది ఆనాడూ-ఈనాడూ అరుదైన లక్షణం.

ఆదిగో, అనాటి దిక్కూదెసా తెలీక, చేవుడిగిళ్ళాడే జీవచ్ఛవదశలో చిమ్మచీకటి తెరలను ఛేదించుకుని వెలిగిన వేగుజుక్కలు వేమన-వీర బ్రహ్మేంద్రులు. ఇంచుమించుగా ఈ ఇద్దరున్నూ సమకాలికులే. ఒకరి మొగం ఒకరు ఎరక్కపోయినా, ఇద్దరూ కూడబలుక్కోక పోయినా ఒకే ఆశయంతో, రమారమి సమానమైన సాధనాలతో ఈ ఇద్దరూ తమ ఉద్యమాలను నిర్వహించడం యాదృచ్ఛికమైన సంఘటన. వీరబ్రహ్మం గృహస్థాశ్రమంలో ఉంటూ తరుణోపాయాన్ని సూచించాడు. వేమన్నను గూర్చిన కథలెన్ని ఉన్నా 'అతి వర్ణాశ్రమీ యోగీ అవధూతః న బధ్యతే' అన్న సూక్తికి నిదర్శనంగా నిలిచి, నిరంజనుడుగా ఉంటూ లోకరంజనం కోసం పాటుపడ్డ యోగి చూడామణి వేమన్న. ఇదే యుగంలో కన్నడ దేశంలో ప్రజ్ఞాపటిష్ఠమైన ఒక కొత్త గొంతు వీరితో శ్రుతి కలిపింది. అది సర్వజ్ఞుని వాణి. 'భాషలెన్నియైన భావమొకటె. వీరంతా నాస్తికులుకారు.

పరమాస్తికులే కాని, ఆస్తికులకూ, నాస్తికులకూ ఈ ఇద్దరూ దేహళీదీపాల వంటి వారు ఎందుకంటే వీరి బోధలలో ప్రశ్నించే తత్త్వమూ ఉంది, ప్రబోధించే ధోరణీ ఉంది

ప్రపంచంలోని మతప్రవక్తలూ, సంస్కర్తలూ చాలా మంది పశుపాలకవర్గంనించి వచ్చినట్లుగా కన్పిస్తారు గీతాచార్యుడు ఆలకాపరి ఏసుక్రీస్తు గొర్లకాపరి కొడుకు, గొడ్లచావడిలో పుట్టినవాడు జోరాస్టర్ మతస్థాపకుడైన జోరాస్టర్(జరదుష్ట్ర) కూడా ఒంటెలకాపరి వేమన వీరబ్రహ్మేంద్రులు కూడా ఒకనాడు గొడ్లకాపరులే ఈ పసులకాపరులు గొర్రెదాటు మూర్ఖజనుల కాపుదలకోసం, కప్పదాటు అర్థమూఢుల ఉద్ధరణకోసం మనసార ప్రయత్నించినట్లు కన్పిస్తుంది

ఈ చరాచర ప్రపంచానికి మూలమైన శక్తి ఏదో ఒకటి ఉందన్న మాటను వేమన వీరబ్రహ్మేంద్రులిద్దరూ అంగీకరించారు దారులు వేరు వేరైనా బాటసారులు చేరవలసిన ఊరు ఒక్కటే అని నిర్ద్వంద్వంగా వీరు నిరూపించారు అయితే, వీరు ప్రచారంచేసిన తత్త్వం సరికొత్తదనడానికి వీల్లేదు అతఃపూర్వం అసంఖ్యాకులైన మహనీయులు ప్రతిపాదించిన పరమార్థానికి వీరు కొత్త వ్యాఖ్యానాలు సంతరించారు అంతే! అంతేకాదు శుష్కవాదాలు మేధనలరించలేవనీ, శుష్కప్రియాలు హృదయాలను కరగించలేవనీ తెలుసుకుని జనసామాన్యానికి అందుబాటులో ఉండే అంతస్తునించి తమబోధనలను సాగించారు పారసీకాది పరసీమలనించి వచ్చిన ముస్లిం సాధువులూ దర్వేషులూ ప్రచారంచేసిన సూఫీతత్త్వం సైతం వీరిమీద కొంత ప్రభావాన్ని నెరపినట్లు గోచరిస్తుంది వీరు శాస్త్రీక చక్షువులు కానందువల్ల తర్కకర్కశమైన కఠిన ధోరణిలోకాక, అలతి అలతియైన తెలుగు పలుకులలో సూటిగా సులువుగా బోధపడే అతి సన్నిహితమైన ఉపమానాలతో తమ ప్రచారం కొనసాగించారు వీరి ప్రచారానికి వాహకమైన కవిత వట్టి పరికరంగా మాత్రమే ఉపయోగపడినట్లు తోస్తుంది

వేదప్రామాణ్యాన్ని నిరాకరించకపోయినా 'భ్రమలబెట్టి తేటపడగనీని' వేదశాస్త్రపురాణాది విద్యలపై వీరికంతగా విశ్వాసమున్నట్లు కన్పించదు అర్థం తెలీని చదువులవల్ల పరతత్త్వస్వరూపం స్పష్టంగా తెలియదనీ, గొర్రె దాటు చదువులందు పరమసౌఖ్యం కనిపించదనీ వీరు పదేపదే ఉద్ఘాటించారు గ్రంథధారణ తత్పరులు - అర్థంతెలీని వట్టి వల్లెవేత జనులు - గంధపు చెక్కల కంట్లాలుమోసే గాడిదల వంటివారని పురాణాలు పేర్కొనడం గమనించదగ్గవిషయం విశేషించి, శాస్త్రపురాణేతిహాసాదులు ముముక్షువులకే కాని ముక్తులకు కాదన్న వాదం ఉండనేఉంది 'అవిజ్ఞాతే పరే తత్త్వే శాస్త్రాధీతిస్తునిష్ఫలా। విజ్ఞాతేఽపిపరే తత్త్వే శాస్త్రాధీతిస్తునిష్ఫలా' పరతత్త్వం తెలుసుకోలేనివారు శాస్త్రాదులు చదివీప్రయోజనం లేదు, పరతత్త్వం తెలిసిన వారికి ఈ చదువులతో పనిలేదు అని శంకరాచార్యుల నిష్కర్ష ఇది శ్రుతిసిద్ధమూ, శాస్త్రప్రమాణబద్ధమూ మాత్రమేకాక అనుభవసిద్ధం కూడ 'పెక్కు చదువులేల చిక్కువాదము లేల' 'చదువులందు లేదు శాస్త్రంబులను లేదు, వేదములను లేదు వాదములను బయలనుండు ముక్తిపాటించి చూడరా' అని వ్యక్తం చేశాడు వేమన 'వేనవేలు చేరి వెర్రికుక్కలవలె అర్థహీన వేదమరచు చుందురి కంఠశోషకంటే గలిగెడి ఫలమేమి ?' అని వాచావేదాంతులను నిగ్గదీసి అడిగాడు 'స్వానుభూతి లేక శాస్త్రవాసనలచే సంశయంబు విడదు సాధకునకు' అని సాధకుని అనుభూతియే గొప్పదని వివరించాడు 'చావుదెలియలేని చదువేటి చదువురా' 'చదువు మర్మమెఱిగి చదివిన చదువురా అని చదువుపేర, శాస్త్రాలపేర గొప్పలు చెప్పుకునే పుస్తకాల పురుగులపై అక్షతలు చల్లాడు చదివినా సారముగనలేక ఉన్నారలీ పుస్తకాలు వల్లించినంతమాత్రాన పుణ్యం దొరకదనీ బ్రహ్మంగారు స్పష్టపరిచారు 'నానుధ్యాయేద్బహూన్ శబ్దాన్ వాచోవిగ్లాపనం హితత్' సారహీనమైన చదువు వృథాశ్రమ అని ఉపనిషద్వాక్యం

ఒక మతంమీదా ఒక శాఖమీదా, ఒక తెగమీదా వీరికి ప్రత్యేకాభిమానం అంటూలేదు తప్పెక్కడున్నా తప్పే, ఎవరిలో కన్పట్టినా అది తప్పే! ఆనాటికి ఎరుకలో ఉన్న శైవవైష్ణవాది షణ్మతా లలో కనిపించే తప్పులను ఎత్తి చూపించారు ఋతవర్ధనులైన ఈ ఇద్దరూ 'శైవవైష్ణవాది షణ్మతంబులకెల్ల దేవుడొక్కడనుచు దెలియలేరు తమకు భేదమైన తత్త్వంబు భేదమా! జాతి వర్ణ ఆశ్రమ కుల గోత్ర రూపాలన్నవి ఆరూ బ్రహ్మవిద్యావిదుల చూపులో వట్టి భ్రాంతులు కాని, లోకంలో వీటికున్న బలం అంతా ఇంతా కాదు కులముగోరువాడు గుణహీనుడగువాడు' అని బోధించి 'కులము హెచ్చు తగ్గు గొడవలు పనిలేదు' పొమ్మన్నాడు వేమన్న 'ఎరుక గలుగువాడె ఎచ్చైన కులజుడు' అని ఎలుగెత్తి చాటాడు 'కులముగలుగువారు గోత్రంబుగలవారు విద్యచేత విర్రవీగువారు పసిడిగలుగువాని బానిసకొడుకులు' అని కులగోత్రాల అప్రాధాన్యాన్ని స్పష్టంచేశాడు 'ఒన్రేకులమ్ ఒరువనేదైవమ్' (ఒకటే కులం ఒకటే దైవం) అన్న తమిళ నాయన్మారు కవుల ముద్ర ఇక్కడ స్పష్టంగా కన్పిస్తుంది కులంకంటే గుణమే గొప్పదని నమ్మడం వల్ల 'ఉర్వివారికెల్ల నొక్క కంచముబెట్టి పొత్తు గుడిపి కులము పొలియజేసి తలను చేయివెట్టి తగనమ్మజెప్పరా' అని చివరిమాటగా చెప్పాడు అంద రొకటగలియ అన్నదమ్ములై కదా' అని విశ్వమానవసమైక్య భావన ఆయనది 'అన్ని కులములు ఏకమయ్యానయా' అని బ్రహ్మంగారి వాక్యం 'ఏ కులమని నను వివరమడిగితే ఏమని దెలుపుదు లోకులకూ - లోకులకూ పలుగాకులకూ', 'కులమెంచగానేల గుణమె కారణము' అనే తత్త్వాలలో బ్రహ్మంగారి శిష్యుడు సిద్దయ్యకూడ కులాల గొడవ తగవ వద్దని హెచ్చరించాడు

'ప్రతిమానాం స్వల్పబుద్ధీనాం' అని ప్రామాణికోక్తి అధికారినిబట్టి అంతస్తునిబట్టి కదా సగుణ నిర్గుణోపాసనలు! సగుణోపాసన తొలిమెట్టు

అవతారాలపట్ల వేమన్నకు సదభిప్రాయం ఉన్నట్టు కన్పించదు ఐతే, బ్రహ్మంగారికి ఈ విషయంలో గట్టి గురి ఉందని చెప్పక తప్పదు

నిరర్థకమైన కర్మకాండను ఈ ఇద్దరూ నిరసించారు పై పై వన్నెలనూ, పూతపసిండి చిన్నెలనూ బట్టబయలు చేశారు పిడివాదాలనూ బూటకాలనూ రచ్చకీడ్చి రట్టుచేశారు ఆత్మజ్ఞానంలేని ఉపవాసాదులుచేసే నరులపాట్లు అగచాట్ల పాలని హేళన చేశారిద్దరూ 'నీళ్ళమునుగనేల నిధుల మెట్టగనేల కపట కిల్మషములు కడుపులో నుండగ', 'యాత్రవోయి నాతడెన్నాళ్ళు దిరిగియు పాదమైన ముక్తిపదము గనడు', 'తీర్థయాత్ర చేత దివ్యుండుగాడయా' అని తీర్థయాత్రలవల్ల మోక్షం కిలగదని నిరూపించాడు వేమన్న 'కూడు పెట్టుకున్న కుక్షిలో జఠరాగ్ని భక్షణంబు సేయు కుక్షిమలము, కూడు విడిచి మలము గడుచురా యుపవాసి' అని ఉపవాసవ్రతాన్ని ఆక్షేపించాడు ఒళ్ళుమండి ఒకచోట 'ఒక్క ప్రొద్దు లున్న ఊరబందై పుట్టు' అని కసిదీర తిట్టాడు 'ఒక్కప్రొద్దులని ఎండుచునుంటే ఒనరగ చెడుదువు వారే వారే' అని బ్రహ్మంగారు కూడా ఉపవాసవ్రతాలవల్ల లాభంలేదని స్పష్టం చేశారు నియమనిష్ఠలులేని తీర్థయాత్రలు, క్షేత్ర నివాసాలు కాయక్లేశాలు దండగమారి పనులని శ్రుతీశిరోవాక్యాల వివరణం ఆసన ముఖ విద్యలు అభ్యాసవిద్యలనీ మణిమంత్రౌషధాదిశక్తులు వైహికవాసనావాసితాలనీ అవి ముక్తి సాధనాలు కావనీ 'ఆసనాది విధుల నధమయోగంబురా' అని వేమన్న చాలాచోట్ల ప్రకటించాడు 'ఆకులెల్లదిన్న మేకపోతుల కేల కాకిపోయె నయ్య కాయసిద్ధి' అని పవన పర్ణాంబు పక్షులైన జడదారులను సవాలు చేశాడు 'ఆకులు తిన్నందుచేత నడవిని తిరిగే మేకలకెల్లను మోక్షము రాకేలను పోయెనయ్య' అని బ్రహ్మంగారి ప్రశ్న హృదయ శుద్ధి లేని కర్మకాండ వ్యర్థమని ఈ ఇద్దరి అభిప్రాయం

బారెడేసి జడలూ, బుజాల ముద్రలు, బూడిద పూతలూ, బోడి తలలూ వగైరా బాహిర చిహ్నాలు మోక్ష సాధనాలు కావని, ఆత్మశుద్ధిలేని వేషధారిని విశ్వసించగూడదనీ ఎచ్చరించారు 'పొడుగు గలుగు జడలు పులితోలు భూతియు కక్షపాలు పది లక్షలైన మోతచేటెకాని మోక్షంబు లేదయా' అని వంచకులైన వేషధారులను వెక్కిరించారు 'కొండగుహల నున్న కోవెలలందున్న మెండుగాను బూదిమెత్తి యున్న దుష్ట బుద్ధులకును దుర్బుద్ధి మానునా అని తాంత్రికులనూ, మాంత్రికులనూ తూర్పారబట్టారు కోటరాలలో, కొండ గుహలలో గుడ్లు మిటకరించే గుడ్లగూబల కంటే కుహనాయతుల గొప్పవేమిటని నిగ్గదీశారు 'గుహలలోన జొచ్చి గురువుల పెదుం గ క్రూరమృగమొకండు తారసిల్లిన ముక్తి మార్గమదియె ముందుగా జూపురా' అని మరొక చురక అంటించాడు వేమన్న

'జ్ఞాన మార్గమెరుగ గడతేరు జన్మంబు' అని ఒకటి రెండు చోట్ల ఒప్పుకున్నా, భక్తి కర్మజ్ఞానాలలో కర్మజ్ఞాన మార్గాలను కాదని అనక పోయినా భక్తికే ఈ ఇద్దరూ పట్టం గట్టారు ఇదే శ్రేయమనీ, నిశ్శ్రేయస మనీ బోధించారు 'మోక్షసాధన సామగ్ర్యాం భక్తి రేవ గరీయసీ' అన్న పూర్వాచార్యుల విశ్వాసానికిది అనుప్రాసం 'భక్తి గలుగ ముక్తి బడయుట సులభంబు, 'భక్తి గలుగువాడె పరమార్థపరుడయా' భక్తి గలుగుచోట పరమేశ్వరుండుండు' అని నిష్కళంక భక్తి ప్రాశస్త్యాన్ని అడుగడుగునా ప్రస్తుతించారు

'దుర్లభం తత్త్వదర్శనం సద్గురో కరుణాం వినా' అని ఉపనిషత్తుల కథనం 'గురుపంక్తి విహీనస్తు భవేత్పంక్తి వివర్జిత 'నాస్తితత్త్వం గురోః పరమ్' అని పూర్వులు భావించినట్లుగానే సద్గురుసేవ వల్లగాని సాధకునకు దీక్షకుదరదనీ, ముక్తి దొరకదనీ వీరు చాలాసార్లు స్పష్టంచేశారు 'గురవో బహవస్సంతి ' కాని శిష్య హృత్తాపహారకులైన వికసిత ప్రజ్ఞులే నిజమైన

గురువులు అట్టివారి నన్వేషించి, రాజయోగంపూని, పరమార్థాన్ని దర్శించ వచ్చు నంటారు 'గురువుదెలియనట్టి గురుతేమి గురుతయా', 'గురువులేక విద్య గురుతుగా దొరకదు' 'గొప్ప గురునివలన కోవిదుడగు 'గురుని గూర్చ ముక్తి కరతలామలకమౌ' అన్న పంక్తులు పై నిర్ణయానికి ఆధా రాలు సాధకుడు అస్థిరమైన శరీరాన్నే ఆధారంగా తీసుకుని కోతి చెట్టు కొమ్మలాధారంగా కొండకోనలలో తిరిగినట్లు, అంతర్జ్యోతిని చూడవలసిందని ఇద్దరూ ప్రకటించారు

ఒక నరుడేమి, నారాయణుడైనా సరే - కర్మబద్ధుడై ప్రవర్తించవల సిందేనని వీరు ప్రచారం చేశారు కర్మబద్ధులైన పురాణ పురుషులు పడ్డ పాట్లనూ చేసిన పొరపాట్లను వేలెత్తిచూపటానికి వీరు వెనుకాడలేదు 'మూలమంతటికిని ముఖ్యము కర్మంబు' అని కర్మప్రాధాన్యాన్ని వీరు అంగీకరించక తప్పలేదు

వీరబ్రహ్మేంద్రుల రచనలలోవలె వేమన రచనలలో సైతం అచల యోగతత్త్వం ప్రతిపాదిత మయిదంటున్నారు ఈ పద్యాలలో ఎన్ని వేమన చెప్పినవో ఎన్ని ఇతరులుచేర్చినవో నిష్కర్షించటానికి ఖచ్చితమైన ఆధారాలు లేవు దీనినే మర్మకవిత్వమని కొందరంటున్నారు ఆ పత్రికలూ,ఆ సంకేతాలూ అతిగహనమైనవి, ఉత్తమాధికారులైన సాధకులకు తప్ప సామాన్యుల అవ గాహనకు అందుబాటులో లేనివి సాధకుల అవ్యక్తమాధుర్యం మాట అలా ఉంచి, వీటిలో అనధికారులకు, అల్పాధికారులకు అస్పష్టత స్పష్టంగా గోచ రిస్తుంది 'అభివ్యక్తిలోని అస్పష్టతయే శిల్పసౌందర్యానికి పరసీమ' అని వాదించేవారు కూడా ఉన్నారు కాని 'నిక్కమైన మంచి నీలమొక్కటిచాలు', 'ఫక్కిదెలిసి పలుక నొక్కవాక్యమెచాలు' అన్న వేమన్న ఫక్కికి అస్పష్టత అనురూపమైనది కాదు సాహిత్య సత్యవ్రతులూ, సౌమనస్య దీక్షారతులూ లోతుగా యోజించి నిగ్గుదేల్చవలసిన జటిలసమస్య ఇది

# తెలుగులో స్మృతికావ్యాలు

"బంగారపుబొమ్మ నాదు
మంగళప్రదమ్మ యొంటి
రుద్రభూమి గటికనేల
నిద్రించెడు నొడలుమరచి
చూపబోకు మచట నీ ప్ర
తాపమెల్ల పిడుగా! నా
కన్నతల్లి యేడ్వగలదు
క్రూరపు నీ కాళరాత్రి
ఘోరమైన రుద్రభూమి
తల్లీ! నా మంగళప్రదా !
తడియుచు వడకుచునుంటె !
మినుకు మినుకు మినుకుమనుచు
మింటమెరయు చుక్కలార !
చెప్పరేల మీలో నా
చిన్నితల్లి యెవ్వరొక్కొ ?"— ముక్కుపచ్చలారక మునుపే మృత్యువుపాలైన తన మురిపాల ముద్దుబిడ్డ మంగళప్రద అకాల మరణాన్ని గూర్చి శోకవిహ్వలులైన బసవరాజు అప్పారావు గొంతులో గూడుకట్టిన ఈ తీవ్ర పరిదేవనం సహృదయుల హృదయాల్ని కళుక్కు మనిపించే మరణ గీతికాభాగం ఇలాగా అకాలమరణమో, హఠాన్మరణమో పొందిన ప్రియజనుల వియోగంతో ఆవేదనా, ఆవేశమూ, ఆక్రోశమూ

ముప్పిరిగొనే విధ గా రచించబడ్డ కావ్యభేదం స్మృతి కావ్యమని ప్రకృత ప్రసంగంలో పరిభాషించబడింది

మృతులమీది అనురాగాన్నీ, ఆత్మీయతనూ, ఆదరాభిమానాలనూ, గౌరవప్రపత్తులనూ, భక్తివిశ్వాసాలనూ పురస్కరించుకుని వారిని స్మరించు కోవడం లోకంలో రకరకాలుగా కనిపిస్తున్నది మృతుల స్మృతిచిహ్నాలుగా గుళ్ళూ గోపురాలూ కట్టి కొలుపులు సాగిస్తారు, బావళ్ళూ సమాధులు కట్టిస్తారు, సత్రాలో చలివేంద్రలో నిర్మిస్తారు చెరువులో, దొరువులో తవ్విస్తారు వారిజ్ఞప్తికి గుర్తులుగా నిధులూ బహుమతులూ ప్రత్యేక సంచికలూ, కవిపండిత సత్కారాలూ ధర్మనిధి ఉపన్యాసాలూ, మృతులకు ప్రియమైన ఆటపాటలలో పోటీలూ నిర్వహిస్తారు సంస్మరణ సూచక పతకాలు ఏర్పరుస్తారు ఏటేటా మృతుల మరణ దినాలలో వార్తాపత్రికల్లో వారి గుణగణాలను ఎప్పుడూ ఫోటోలతో, వారి గుణశీలాల ననుగుణమైన సూక్తుల ఉట్టంకింపులతో ప్రకటనలు చేయిస్తారు ఆరాధనలూ, అన్న దానాలూ జరిపిస్తారు భజనలూ, హరికథాగానాలూ, పురాణకాలక్షేపాలూ ఏర్పాటు చేస్తారు స్వాతంత్ర్య సంపాదనకో, సమతాధర్మ సంస్థాపనకో వీరమరణం పొందిన త్యాగధనుల స్మృత్యర్థం ప్రాచీన యుగాలలో పశ్చిమాంధ్రంలో ఊరూర ప్రవర్తిల్లిన వీరగల్లు' ప్రతిష్ఠలూ, ఊరుమ్మడి మేలుకోరి ఆత్మాహుతిచేసుకునిగాని నాడు నారీధర్మంగా ఎంచబడి సహ గమనం చేసిగాని, మహాసతులు' గా కీర్తించబడ్డ సతీమతల్లుల స్మృత్యర్థం నిలిపిన 'మాస్తిగల్లు' (మహాసతికల్లు)లూ ఈ వరుసలోనివే సుచరిత్రవతు లైన మృతులపేర స్మృత్యంకాలుగా కావ్యాదికాలను అంకితం చేయడం, చేయించడం కూడా కొత్తకాదు మన సంప్రదాయంలో అనూచానంగా వస్తున్న దినవారాలూ, మాసికాలూ, ఆబ్దికాలూ, పితృపక్షాలూ, పెద్దల పండుగలూ గయాపిండప్రదానాలు, వైతరణీగోదానాలూ, గరుడ పురాణ - గీతాపారాయణాలూ - మొదలైనవన్నీ కథావశేషులైన బంధుజనుల

సంస్మరణకోసం ఆ యా తెగలలో, కులాలలో, ప్రాంతాలలో వాడుకపడ్డ ఆచార విశేషాలు

కవితారూపంగా మృతులను సంస్మరించుకోవడం మనకు బొత్తిగా కొత్తదని చెప్పలేము పురాభారత పురాణ కావ్యేతిహాసాదులలోనూ, దేశ భాషా వాఙ్మయవిధులలోనూ మరణాలూ, తత్ స్మరణాలూ తరచుగా తటస్థపడుతూనే ఉన్నాయి రామాయణ రచనకు మూలబీజంగా సంభావిత మవుతున్న క్రౌంచ ద్వంద్వ వియోగ శోక కథనరూపమైన 'మా నిషాద ' శ్లోకాన్ని భారతీయ లౌకిక సాహిత్యంలో తొలిస్మృతిగీతికగా పరిగణించవచ్చు అందువల్లనే శాపవాక్కు గీర్వాణ వాణికి పెద్దదిక్కు అని సాహిత్య సత్యవ్రత సంపన్నులు చమత్కరిస్తూ ఉంటారు రామాయణంలోని దశరథుని మరణం జటాయు హననం వాలివధ రావణుని వావుపై మండోదరి విలాపం, భారతంలోని అభిమన్యువధ, ఊరుభంగం, స్త్రీపర్వాంతర్గత శోకఘట్టాలు, భాగవతంలోని శ్రీకృష్ణ నిర్యాణం, హరిశ్చంద్రోపాఖ్యానంలో సర్పదష్టుడైన లోహితాస్యుని మరణం - మొదలైన ప్రాసంగిక ఘట్టాలను కొన్ని ఉదాహరణలుగా ఉట్టంకించవచ్చు అయితే, ఇవన్నీ ఒకానొక ధారావాహికా కథనంలోని ఆనుషంగికాలైన సాధారణ సన్నివేశాలు

శ్రీనాథకృతంగా ఉదాహరించబడుతున్న 'కాశికా విశ్వేశు గలిసె వీరారెడ్డి ' అన్న చాటువునీ, అల్లసాని పెద్దన్న రచనగా ఉద్ధరించబడుతున్న 'ఎదురైనచో దన మదకరీంద్రము డిగ్గి ' అన్న చాటువునీ తెలుగులో స్మృతి కవితోదయానికి తొలివెలుగురేకలుగా కొందరు పేర్కొంటున్నారు తాళ్ళపాక అన్నమాచార్యులపై తద్వంశీయులు కూర్చిన సంకీర్తన వాఙ్మయం సైతం ఈ రాశికే చేరుతుంది

బొబ్బిలి వీరులమీదా సాహసకృత్యాలుచేసి హతులైన సర్వాయి పాపడు దాచేపల్లి గుర్రాల గోపిరెడ్డి గిడేంల్లు బొబ్బిళ్ళ నాగిరెడ్డి ఆదోని రాచోటి రామయసెట్టి ఈడిగ రామన్న, గాండ్లవారి కురుమన్న రేనాటి సీమ పానందిరెడ్డి ఉయ్యాలవాడ దొరవారి నరసింహారెడ్డి కోటప్పకొండ చిన్నపరెడ్డి - మున్నగు వ్యక్తులపైనా అల్లిన కరుణరస నిష్యంది మరణ గీతాలు జానపద సాహితీ మణిహారంలో పోహాళించబడ్డ జాతి రత్నాలు మొహరం పండగ పదోరోజు సాయ కాలం పీర్లు గుండాన డ్డాం జలాలీలు భక్తకోటి ఆలాపించే 'అల్విదా' వీడ్కోలు శోక గీతాలు కర్బలా రణ రంగాన దుర్మరణం పాలైన అమరవీరుల జ్ఞాపక సంకేతాలుగా ఉ పెత్తిన స్మృతి తరంగాలు

అయితే మొన్న మొన్నటిదాకా ఈ శాఖ తెలుగులో పరిగణించదగ్గ కళారూపంగా సాహిత్యసృష్టిం మనసును ఆకట్టుకోలేకపోయింది ప్రత్యేక వాఙ్మయశాఖగా సాహిత్య విమర్శకుల దృష్టిని ఆకర్షించలేకపోయింది దీనికి హేతువులు సుస్పష్టం శుభకామనలు పెచ్చుపెరగాలనీ, సురుచిర వాక్కులు ఉచ్చరించాలనీ మన పెద్దల ఆశ మంగళ గాథికలు ఆలకించాలనీ, మంగళదృశ్యాలు పరికించాలనీ మనపూర్వుల ఆశయం 'భద్రం కర్ణేభిః శృణుయామ దేవాః భద్రంపశ్యే మాక్షభిర్యజత్రా ' ఇత్యాది ఋఙ్మంత్ర సంతతి ఈ ఆశలకూ ఆశయాలకూ ఆధారభూమి అందుకనే మన కావ్యాలన్నీ ఆదిమధ్యాంతాలలో మంగళమయాలుగా కల్యాణకారకాలుగా నిర్వహించబడాలని లాక్షణికులు శాసించడం జరిగింది అంతేగాక, 'రస విచ్ఛేద హేతుత్వాత్ మరణం నైవవర్ణ్యతే'-రసవిచ్ఛేద హేతువవుతుంది కాబట్టి మరణం అనువర్ణనం కూడదని శాస్త్రకారుల అనుశాసనం అయితే, తప్పని సరియైన సన్నివేశాలలో పరిపోషకంగా తప్ప ప్రధానాంశంగా మరణకథనానికి ప్రవృత్తి కూడదని లాక్షణిక హృదయం అంచేత

ప్రమోదప్రధానాలైన కావ్యాలకు తక్క విషాదప్రచురాలైన కావ్యాలకు మనసాహిత్యంలో ప్రాయికంగా తగిన తావులేకపోయింది

ఆధునికాంధ్ర సాహిత్యంలోని గురజాడవారి 'పుత్తడిబొమ్మ పూర్ణమ్మ', 'కన్యక', కట్టమంచివారి 'ముసలమ్మమరణము' కోలాచలం వారి 'అళియరామరాయలు' దువ్వూరి రామిరెడ్డి 'నలజారమ్మ', ముదివర్తి కొండమాచార్యుల 'నారాయణమ్మ' వంటి విషాదాంత కావ్యాలు పైవ దానికి అపవాదంగా నిలిచిన ఉత్తమరచనలు

గ్రీక్ భాషలో 'ఎలగోస్' అంటే విలాపమనీ శోక గీతమనీ అర్థం ఆ భాషలో 'ఎలజీ అన్నది సంస్మరణార్థం రచించబడిన శోకపూరితమైన కావ్యం అయితే 'ఎలజీ అన్న కావ్యశాఖకు గ్రీక్ - రోమన్ సాహిత్యాలలోనూ, వాటి నీడలో పెరిగి పెద్దదైన ప్రాచీనాంగ్ల సాహిత్యంలోనూ కొంత విస్తృతార్థం ఉంది ఇతివృత్త స్వభావం ఎలాటిదైనా విషాదచ్ఛాయ కలిగిన 'ఎలిజియాక్' అనే విశిష్టచ్ఛందంలో రచితమైన కావ్యభేదాన్ని వారు 'ఎలజీ' అని విపులార్థంలో వాడుక చేశారు ఇంగ్లీషు సాహిత్యంలో పూర్వపూర్వ యుగాలలో ఇలాటి విస్తృత పరిధిలోనే ఈ కావ్యాలు రచించబడినప్పటికీ పదారో శతాబ్ది నుంచీ మరణ స్మరణ వైపే మొగ్గు చూపడం జరిగింది తెలుగుసీమలో కాల్పనికోద్యమాన్నీ, ఆత్మాశ్రయ కవితా రీతినీ బహుధా ప్రభావితం చేసిన ఆంగ్ల కవులు షెల్లీ, మాథ్యూ ఆర్నాల్డ్, అలెగ్జాండర్ పోప్ వంటివారు ఎలజీని మరణ స్మరణకే పరిమితం చేసిన కారణంగా తెలుగులో ఈ గెర గీతలలోనే స్మృతి కావ్యాలు మూసపోతగా రూపెత్తాయి

స్మృతికావ్యాలకు ఆలంబనాలుగా స్వీకరించబడ్డ మృతులు ఏ తత్కావ్యకర్తలకు సుపరిచితులైనా కావచ్చు అపరిచితులైనా కావచ్చు ఆత్మబంధువులూ, ఆప్తమిత్రులూ సుపరిచితులని చెప్పవచ్చు లోకం బాధ

తమబాధగా భావించిన సంఘసేవకులూ, దేశంకోసం నిండుప్రాణాలను బలి ఇచ్చిన అజ్ఞాత అమరవీరులూ అపరిచితులని అనవచ్చు ఆత్మబంధువులలో తల్లిదండ్రులు, భార్యాభర్తలు కిన్నబిడ్డలు అన్నదమ్ములు, అక్కాచెల్లెళ్ళు మామా అల్లుళ్ళు, ఇతర సమీప బంధువులూ వస్తారు కొన్ని సందర్భాలలో కలం, పుస్తకం వంటి అచేతన వస్తువులపైనా కుక్క, పిల్లి, గుర్రం వంటి పెంపుడు జంతువులపైనా స్మృతి కవిత చెప్పిన వారూ ఉన్నారు

తమ మొదటి భార్య మరణించిన సందర్భంలో వడ్డాది సుబ్బారాయ కవి 1881 లో 'ఆంధ్ర భాషా సంజీవని పత్రికలో ప్రకటించిన సతీ స్మృతి అన్న ఖండి యే ఆధునికాంధ్ర సాహిత్యంలో మొట్టమొదటి స్మృతి కవిత అని చెప్పవచ్చు గృహిణీధర్మమే స్త్రీ రూపంగా అవతరించిన ధర్మపత్ని చితాగ్నిలో భస్మమైపోగా బాధాపరిఖిన్నుడైన విశ్వనాథ సత్యనారాయణ విరచించిన వరలక్ష్మీ త్రిశతి గృహిణీ జనతా శిరోమణి యైన తన సతి లక్ష్మీనరసమ్మ మరణంపై పింగళి లక్ష్మీకాంతం రచించిన లక్ష్మీనిర్గమనం మెడపైకెత్తి యొకానొకప్పుడు శరన్మేఘంబులంగాంచి నీ పొడ నేమే నెఱిగించు నెమొ యని నే బుద్ధీంద్రియక్షోభతో ' అని అడుగుతూ పసిబిడ్డడిలాగా రోదించిన మాధవపెద్ది బుచ్చి సుందరరామ శాస్త్రి తీర్చిన 'సతీస్మృతి', ఇల్లాలి మరణంతో కుమిలిపోయిన బాలాంత్రపు వేంకటరావు కూర్చిన 'విరహ సంగీత కావ్యం, పట్టుమని పాతికేళ్ళు నిండకుండానే పరమపదించిన గృహలక్ష్మిపై కవికోకిల దువ్వూరి రామిరెడ్డి సంతరించిన 'భగ్నహృదయము', 'ముప్పది యెన్మిదేండ్లు వలపుల్ మమతల్ ' పచరించిన అర్ధాంగి లీలాకుమారి మరణంతో కుమారిల్లిన కొప్పరాపూరి సత్యనారాయణ కూర్చిన స్మృత్యంజలి' విద్యావినయ సంపన్నయైన సుశీలమ్మ అకాలమృతి ఆలంబనంగా ఆమె భర్త పిల్లలమర్రి వెంకటహనుమంతరావు రచించిన సుశీలా స్మృతికావ్యం కథాకాలక్షేప

ప్రవీణులు గుంటి యోహాన్ భాగవతార్ కూర్చిన 'సతీస్మృతి' ఈ కోవలో చెప్పుకోదగ్గ రచనలు

భర్తృమరణం కారణంగా రచించబడ్డ స్మృతికావ్యఖండికలు తెలుగున మా లెక్కకు రెండంటే రెండు లభ్యమయ్యాయి తన భర్త విమాన యానంలో దుర్మరణం చెందగా తిరుపాహ్చారు జమీందారిణి ఇనుగంటి సరస్వతీదేవి కావించిన సతీవిలాపమున్నూ బసవరాజు అప్పారావు భార్య రాజ్యలక్ష్మమ్మ భర్తృవియోగ దుఃఖభారంతో రచించిన స్మృతిగేయ మున్నూ పునస్సమాగమాభిలాషకు వీలులేని వియోగం కారణంగా రతి విలాపాన్ని మించిన రచనలు

మాతృమరణాన్ని పురస్కరించుకుని జాషువా, నాయని శ్రీ శ్రీలు నిర్మించిన స్మృతికావ్యాలు చిరస్మరణీయాలు

"ఇల్లున్ వాకిలి లేని దానివలె నే డీ శాకినీ ఢాకినుల్
పిల్లల్ సేయు శ్మశాన భూములను బ్రాపింపంగనేలా? జగం
బెల్లం జీకటి ముద్దయై పొడమె తల్లీ! నీ వియోగంబునం
జిల్లుల్ వడ్డది మానసంబు "

'ఒంటిగనుందు వా యిచట? నీ వింటను లేక'

'పుణ్యముం తల్లి! నీ పాలపుష్టి కతన

కవనబాలిక నా జిహ్వ నవతరించె 'నని పలవించిన జాషువా శోకవాక్కు రసజ్ఞుల గుండెలో బాకు తన పూజాసామగ్రిని సేకరించుకోక ముందే కన్నతల్లి కాలధర్మం చెందిందని తల్లిలేని బిడ్డడుగా విలపించిన నాయని సుబ్బారావు మాతృగీతాలతో మాతృమూర్తిపరమైన ఆవేదనా మృత్యుదేవిపరమైన ఆక్రోశమూ పదునుపేళ్లా కన్పిస్తాయి నష్టమాతృ చరిత్రనెరుగని తన్నులాలించి పెంచి పెద్దజేసిన సవతితల్లి సుభద్రమ్మ

గతించినపుడు తన ప్రథమ కావ్యసంతానం 'ప్రళవ'ని ఆమె కంకితం ఇస్తూ శ్రీశ్రీ రాసిన అంకితగీతికలు కేవలం శోకం ముద్దగట్టిన ముద్రలు

'కోపగించుకొన్నా కొట్టినా తిట్టినా
కొసరుకొన్నా మిక్కిలికేకలు వేసిన
బిడ్డల భవిష్యత్తుకు
పూలబాట వేయాలన్నదే అమ్మలక్ష్యం' అని వాళ్ళ అమ్మ కృష్ణమ్మ మరణంపై శ్రీరామప్పగారి గంగప్ప రచించిన 'అమ్మ' అన్న గేయం ఈ కుదురునకు చెందిందే

కానక కన్నబిడ్డల అకాలమరణంపై రాయప్రోలు సుబ్బారావు బసవరాజు అప్పారావు దంపతులు, నాయని సుబ్బారావు రచించిన స్మృతి గీతాలు కరుణ రసస్రావి సన్నివేశాలకు ఉత్తమోదాహరణాలు ముద్దు ముచ్చటలు తీరకుండానే పిన్నవయస్సుననే కొడుకు మరణించాడన్న సంతాపమా, తపోధనుడొండు యోగభ్రష్టుడై కారణజన్ముడుగా తమ కడుపున పుట్టి తమ వంశాన్ని తరింపజేశాడన్న సంతృప్తియా? ఏది పితరులకు మిగిలేది? అన్న విచికిత్స రాయప్రోలు చింతనలో కన్పిస్తుంది 'కడకు దేవి దయచేతను కంటిమి రత్నములు రెండు బతుకు కలంకారములే వాని దాచ చేతగాక ఎచటనో పోగొట్టుకొంటి మెంతటి దురదృష్టముననో - నిరలంకృతమూ నిరాడంబరము అయిన రాజ్యలక్ష్మమ్మగారి ఈ గేయ భాగంలో మాతృప్రేమలోని మహత్తర శక్తి, వెల్లడించడానికి మాటలుచాలని భావతీవ్రతా ఇమిడి ఉన్నాయి ఒక్కగానొక్క వంశాంకురం - మోహన రావు - అకాలంలో అంతరించిపోగా ఆ దుఃఖభారానికి ఆగలేక నాయని సుబ్బారావు తీర్చిన 'విషాదమోహన' మన్నకావ్యంలో మానసార్తి రోచనము , గాఢవిచారమూలకమైన తత్త్వార్థబోధము గోచరిస్తాయి

సోదర స్మృతిపరమైన జనమంచి వెంకటరామయ్యగారి 'భువినుండు నేను దమ్మ్కుడ దివినుందువు నీవు భువియు దివియును నను నియ్యవి రెండు నుండు బ్రేమను గవలంబలె నొక్క తల్లి కడుపున నోహో' అన్న అద్వైతభావనలోని ఆత్మనిర్వేదం మరపురానిది

ఒక్కగానొక్క చెల్లెలి అకాలమృతికి తల్లడిల్లిన 'హంపీగళ కావ్య నిర్మాత మోటూరి వెంకటరావుగారి 'ఓ చెల్లి' అన్న కావ్యఖండం సోదరీ స్మృతికి చక్కటి నిదర్శనం ప్రసిద్ధాలంకారికులు అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రిగారి మృతిపై వారి అల్లుడూ మేనల్లుడూఐన కొలచలమ సుబ్బావధాని రచించిన 'స్మృతిగీతము' సైతం ఈ సందర్భంలో స్మరించదగ్గది

పెంపుడు జంతువులపై అల్లిన స్మృతికవితలలో జాషువా 'జాకీ' అన్న కళాఖండం ప్రశస్తమైనది 'నా బంగారు జాకీ నమస్సులతో నీకు సమాధిచేసితిని అశ్రుస్నాన మాడించితిన్' అన్న మాటలలో జంతువులపై సైతం కవికిగల అమితమైన మమత పరిస్ఫుట మవుతున్నది

చిత్తరంజన్‌దాస్, గోఖలే, గాంధీ మున్నగు జాతినాయకుల నిర్యాణం సందర్భంగా విరచితాలైన స్మృతిగీతావళిలో రాయప్రోలు, జాషువా, తుమ్మల సీతారామమూర్తి, నాయని, పుట్టపర్తి దంపతులు, కొత్త సత్యనారాయణ చౌదరి, పళ్ళె పూర్ణ ప్రజ్ఞాచార్యులు దాశరథి, నారాయణరెడ్డి, బాలగంగాధరతిలక్, జ్ఞానానందకవి-వగైరాల రచనలను ఉత్తమ కళాఖండాలుగా ఉదాహరించవచ్చు గాంధీజీ నిర్యాణ సంస్మరణంగా యేలూరిపాటి అనంతరామయ్య నిర్మించిన ఉదాహరణ కావ్యం విశేషించి పేర్కొనదగ్గది వెనకటి చైనా పాకిస్తాన్లతోడి సమరాలలోనూ, ఇటీవలి నక్సలైట్ ఉద్యమంలోనూ అసువులు బాసి నామ్‌నిశానీకానని వారి స్మృత్యర్థం శ్రీశ్రీ ప్రభృతులు కూర్చిన అనేక స్మృతిగీతాలు తెలుగు జనతను ఊపివేసినవి

సహృత్రతుల కోసం, సాహిత్య సత్యవ్రతులకోసం ద్రవించిన హృదయాలనుంచి స్రవించిన స్మృతికవితా ధారలు అనేకం రసహృదయా లను పరిప్లావితం చేస్తున్నాయి అద్యతనాంధ్రకవి ప్రపంచ నిర్మాతలు తిరుపతి వేంకటకవులలో ఒకరైన తిరుపతిశాస్త్రి పరమపదించినప్పుడు 'మృతులం గూరిచి యేడ్పు పద్యములనే నేనాడు చెప్పన్ ' అనే నియమంగల చెళ్ళపిళ్ళ వేంకటకవి రచించిన 'మిత్రస్మృతి' పద్యాలూ, ప్రసిద్ధ సిద్ధ పురుషులుగా పేరుపొందిన బ్రహ్మానంద తీర్థయతీంద్రులు కాశీక్షేత్రంలో సిద్ధిని పొందినపుడు వారి అంతేవాసి అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రి 'అవతారమ్ము సమాప్తి జేసితివె బ్రహ్మానంద తీర్థప్రభూ' అని విలపిస్తూ రచించిన 'గురుస్మృతి' పద్యాలూ, గుంటూరు మండలంలో ఒకనాడు మకుటంలేని మహారాజుగా మన్ననలంది కీర్తిశేషులైన జాగర్ల మూడి కుప్పుస్వామి చౌదరిని 'జనన మరణ దుష్ప్రసక్తిలేని నెలవున నిలువు' మని ఆకాంక్షిస్తూ తెలుగులెంక తుమ్మల సీతారామమూర్తి నిర్మించిన 'నెఱదాత' అన్న కావ్యఖండికా ఆంధ్ర వాగ్దేవి గుడిగంటలు మోగించిన కాటూరి మృతిపై తుమ్మల కైసేసిన సంస్మృతి పద్యాలూ సుప్రసిద్ధ సంస్కర్తలున్నూ, బ్రాహ్మ మతానుయాయులున్నూ ఐన దేశిరాజు బాపయ్య పరమపదించినప్పుడు వారి ఆప్తమిత్రులు చిలకమర్తి లక్ష్మీనరసింహంపంతులు 'సుహృద్రత్నమా' అనే మకుటంతో కూర్చిన తొమ్మిది పద్యాలూ, బాల్య మిత్రుడైన పేలాల సుబ్బయ్య మరణంపై సురవరం ప్రతాపరెడ్డి రచించిన పద్యాలూ - మిత్ర స్మృతికి చక్కటి తార్కాణలు 'నడికడలి కడుపులో సుడుల అడుగున పడిన ఏ మంచి ముత్యాలు ఏరుటకు ఏగిరో - కవిగారు మరి రారు కంటి కిగపడబోరు అని 'ఆరుద్ర' మరేపల్లి రామచంద్ర శాస్త్రిపై చెప్పిన ఈ స్మృతిగీతికా, కవిబ్రహ్మ ఏటుకూరి వెంకటనరసయ్య మరణాన్ని పురస్కరించుకుని

జాషువా, కొండవీటి వెంకటకవి ప్రభృతులు కావించిన అశ్రుతర్పణాలు ఆంధ్ర నాటక రంగస్థల సముద్ధరణకూ, గుడివాడ - కళాశాలా నిర్వహణకూ జీవితాన్ని మీదుకట్టిన 'కళా పోషకుడు' కాజ వెంకటరామయ్య స్మృతిపై కోట సీతారామశర్మ ఘటించిన 'స్మృత్యంజలి' పద్య సంపుటీ, కవికోకిల జాషువాపై శనగవరపు నరసింహశాస్త్రి ఘటించిన స్మృత్యంజలీ షేక్ మీరాజాన్ మధురస్మృతీ - నేటికీ దివ్యస్మృతులుగా నిలిచిపోయాయి ప్రసిద్ధ నవలా రచయిత్రి శ్రీదేవి మరణంపై నాయని కృష్ణకుమారి తీర్చిన 'ఏం చెప్పను నేస్తం' అన్న రచన గుండె లోతులను తాకే స్మృతి గేయం దొమ్మేరు జమీందారు పెండ్యాల శ్రీరామచంద్ర వేంకటకృష్ణ రంగారావు మృతిపై 'దైవ దుర్విపాక భావితమైనట్టి దుఃఖమునకు శాంతి దొరకగలదె' అంటూ వేదుల సూర్యనారాయణశర్మ రచించిన 'రంగరాయ చరిత్ర' అన్న ఖండకావ్యము భాషా విజ్ఞానరంగంలో వర్ధమానుడుగా పెద్దల మనస్సునకెక్కి మానవత్వమే మూర్తికట్టిన కందప్పచెట్టి అనుకోని రీతిలో కనుమూసిన కథనం గుండెలను మండించగా ప్రాణానికి ప్రాణమైన అతని సహాధ్యాయి వి రామచంద్ర విరచించిన 'అశ్రుతర్పణ' మన్న లఘుకృతీ ఈ రాశికి చెందిన ప్రశస్త రచనలు

ఆధునికాంధ్ర కవితా రంగంపై గజ్జె కట్టికట్టకముందే నూరేళ్ళు నిండిన కొంపెల్ల జనార్దనరావు దేవరకొండ బాలగంగాధర తిలక్ వంటి చరితార్థుల మరణానికి పరితపిస్తూ మహాకవి శ్రీశ్రీ రచించిన స్మృతి గేయాలు ఈ కోటిలో పరాకోటి కెక్కినవి నిండుజీవితం ప్రారంభం కాకముందే 'ఉదయిని' పత్రికానిర్వహణంలో బలైపోయిన జనార్దనరావు మరణం మూలంగా నిరాశా నిస్పృహలు అలముకున్నా కవితా ప్రపంచంలో అసహాయ శూరుడైన శ్రీశ్రీ తన కర్తవ్యాన్ని విస్మరించలేదు అందుకే ఆయన అన్నాడిలా ఆశావాదిగా—

'లేదు నేస్తం! లేదు
నీ ప్రాభవం మమ్మల్ని వదలలేము
నిరుత్సాహాన్ని జయించడం
నీ వల్లనే నేర్చుకుంటున్నాం
ప్రతికూల శక్తుల బలం మాకు తెలుసు
భయంలేదులే అయినప్పటికీ
నీ సాహసం ఒక ఉదాహరణ!
నీ జీవితమే ఒరవడి!
నిన్న వదలిన పోరాటం
నేడు అందుకొనక తప్పదు
కావున ఈ నిరాశామయ లోకంలో
కదన శంఖం పూరిస్తున్నాను
ఇక్కడ నిలబడి నిన్ను
ఇవాళ ఆవాహనం చేస్తున్నాను
అందుకో ఈ చాచిన హస్తం

# కొండూరువారి మోహనాంగి

వాఙ్మయంలో ఒకపాలు బుద్ధిప్రధానం, ఒకపాలు హృదయప్రధానం బుద్ధి విమర్శనకు మూలం, హృదయం సృజనకు మార్గం ఆలోచన బుద్ధికి జీవగర్ర, అనుభూతి హృదయానికి ఆయువుపట్టు బుద్ధివికాసానికీ, హృదయ స్పందనకూ సమప్రాధాన్యమూ, సమానావకాశమూ కల్పించే సాహిత్యశాఖ నవల, కాగా, విమర్శన గుణాన్నీ, సృజనగుణాన్నీ సమ్మసగం పాళ్ళలో రాసిపోస్తే రూపెత్తిన రమణీయ సాహిత్యమూర్తి నవల

'నవాన్ విశేషాన్ లాతి గృహ్ణాతి ఇతి నవలా' అన్న నిర్వచనం దేశీయ పండితుల మేధాసంపత్తికిన్నీ, సమస్తమూ సంస్కృత మూలకమని భావించేవారి ప్రవృత్తికిన్నీ నిదర్శనమైన కృత్రిమవ్యుత్పత్తి 'నవల' అన్న పదంగానీ, తత్పదార్థంగానీ, సంస్కృతభాషా సంబంధులుగావు, అంచేత తెలుగునకుకూడా ఇవి పరంపరా సంబంధులుగావు ఇటీవలికాలంలో ఇంగ్లీషు భాషనుంచి తెలుగువాళ్ళు ఎరవు తెచ్చినవి నవనవోన్మేషమైన ఆఖ్యానం అనే అర్థంకల **Novel** అన్న ఇంగ్లీషుపదానికి 'నవల' తెనుగు అవతారం

నవల ఉత్తమ కళారూపమా, కాదా - అన్నది ప్రతీచీ విమర్శ లోకంలో వివాదగ్రస్తమైన విషయాలలో ఒకటి అది అసలు కళేకాదని అసలుకే ఎసరుపెట్టిన విమర్శకులూ ఉన్నారు, ఉత్తమ కళమాత్రం కాదని తునితగవుగా తీర్పుచెప్పిన తగుమనుషులూ ఉన్నారు పరసీమల నుంచి దిగుమతైన ఆధునిక సాహిత్యశాఖ కాబట్టి భారతీయ కావ్యమీమాంసలో దీని ప్రసంగం సంగతమవడాని కవకాశం లేదు ఏమైతేనేమి 'చతుర్వర్గ వ్యుత్పత్తే రపి చ ఆనందమేవ పార్యంతికం ఫలం'మ్మనే అభినవసూక్తిమేరకు

ఆనందమే దీనికి పరమ ప్రయోజనం తక్కినవేవైనా ఉంటే వాటిని గౌణ ధర్మాలుగా పేర్కొవలసి ఉంటుంది

వెయ్యేళ్ళుగా సాగుబడిలో ఉన్న తెలుగుల రాత కోతల పంటపొలంలో నవల నూరేళ్ళపంట నేడు దీనికిగల ప్రశస్తి ప్రచారాలు మరి యే ఇతర సాహిత్యవిభాగానికీ లేవనడం అతిశయోక్తిగదు కొంతలోకొంత 'చిన్నకథ' దీనితో సాటికి పోటీకి రాగలిగిన సాహిత్యశాఖ తక్కినవి ఈ రెండింటి ముందు బలాదూరు! కొత్తగా కలంపట్టిన సాహితీకిశోరాలేగాక, చెయ్యి తిరిగిన సాహిత్యసమ్రాట్టులు సైతం నవలలపై చెయ్యి వేసినవారే నేటి సాహితీయుగధర్మం ఇది

ఆంధ్రసృష్టిలోని నవలలు ముక్కాలుమువ్వీసం వ్యావహారిక భాషలో ఉండగా, తక్కినవి సరళగ్రాంధిక మనబడే రీతిలో ప్రపంచితా లయ్యాయి వస్తుతత్వాన్నిబట్టీ, నిర్వహణ విధానాన్నిబట్టీ వాటిని బహుధా విభజించవచ్చు చారిత్రికాలూ, సాంఘికాలూ పాత్రపరిశీలనాపరాలూ, మనోవిశ్లేషణ ధర్మప్రధానాలూ అపరాధపరిశోధనా సంబంధులూ అని వీటిని రకరకాలుగా వింగడించవచ్చు

ప్రకృత రచన 'మోహనాంగి' ఈ చూపుతో చూస్తే చారిత్రికం సాహితీ సమరాంగణ సార్వభౌముడుగా, చతురాంతఃపురవధూప్రసాదన రసికుడుగా పేరొందినశ్రీకృష్ణదేవరాయల కొమార్తె మోహనాంగి వృత్తాంత మిందలి ప్రధాన కథావస్తువు ఈమె ఆర్వీటి అళియరామరాయల అర్ధాంగి యనీ 'మారీచీ పరిణయ నామక శృంగార ప్రబంధ సంధాత్రి'యనీ పరంపరాయాత ప్రతీతి కథ నేపథ్యం చారిత్రకం తక్కిన సంఘటనలు కర్త్రు నిష్ఠమైన ఊహాపోహాలానికి నికషాయమానాలుగా నవలాశిల్ప దృష్టితో కల్పించబడ్డాయి

ఈ మోహనాంగిని సృష్టించిన కళాప్రపూర్ణ శ్రీ కొండూరు వీర రాఘవాచార్యులుగారు వట్టి కవులుగారు శతవృద్ధులే కాక జ్ఞానవృద్ధులు వారిది శుద్ధ విద్య సిద్ధవాక్కు విద్వత్కవులుగా విమర్శకులుగా, దార్శనికులుగా శాస్త్రవేత్తలుగా దేశంలో వీరికి పెద్ద పేరుంది విశేషించి 'శిల్ప సాహిత్యములు నాకు జీవగర్ర లౌపనిషదవనాళి విహారవిధులు - ఈ చరాచరాత్మక జగద్ధితము వ్రతము ' అని వీరి ప్రతిజ్ఞ అంతేగాక చారిత్రకాంశాలపై వీరి కభిమానమెక్కువ జారిన జాతి గౌరవాన్ని చక్కదిద్దుటకే పురాభారత పుణ్యగాథలెంతో ఉపకరిస్తాయని వీరి నమ్మకం కేవల కల్పనా కథలు కృత్రిమ రత్నాలని కొందరి తలంపు కొండూరు వారి భావనగూడ దాని కనుప్రాసం 'మహితాంధ్ర స స్కృతి కథా రమ్యాంకిముల్ చిత్తమందేవా యూహలమేలుకొల్ప సర్వ విద్యా రహస్యాలు కుప్పవోసి ప్రకృత రచనను తీర్చిదిద్దారు అయితే యశశ్శాలులైన చారిత్రకవ్యక్తుల ప్రవృత్తులనూ చిత్తవృత్తులనూ చిత్రించటం అసిధారావ్రతం ఈ పాత్ర లీ వరకే పాఠకుల మనోదర్పణాలపై చెరగని ముద్రవేసి ఉంటాయి ఆ ముద్రలు చెరగకుండా కళాదృష్టి సడలకుండా కథనూ, కథాగత పాత్రలనూ నిర్వహించడం కష్టసాధ్యమైన పని

కృష్ణదేవరాయలకు పట్టమహిషి తిరుమలదేవి వల్ల కలిగిన కొమార్తె మోహనాంగి ఈమె అసలుపేరు తిరుమలదేవి బసివి ఈమె చెలికత్తె ఈ బసివియే మారువేషంలో రుద్రప్ప అనే పేరుతో అళియ రామరాయల అంగరక్షకదళంలో నమ్మినబంటు అచ్యుతరాయల భార్య సోదరుడైన సలకం చినతిరుమలరాజు ఒకప్పుడు బసివిని బలాత్కరించి ఆశాభంగం చెంది ఉంటాడు మోహనాంగి మారీచీపరిణయమనే ప్రబంధాన్ని తండ్రి కంకితంగా రచిస్తుంటూంది తల్లీ పినతల్లీ పట్టుబట్టినా పినతండ్రి అచ్యుత రాయల కిష్టమని తెలిసినా, స్త్రీలోలుడనే కారణంవల్ల మోహనాంగి చిన తిరుమలరాజును తిరస్కరించి, అళియ రామరాయలను వివాహమాడుతుంది

పుత్రమరణ శోక భారంవల్ల కృష్ణరాయలు స్వర్గస్థులుకాగా రాయల సవతి తమ్ముడైన అచ్యుత దేవరాయలు కొంతకాలం రాజ్యంపాలించి మరణిస్తాడు ఇతని కుమారుడైన వెంకటాద్రిని నామమాత్రపాలకునిగా నిలిపి, మేనమామయైన చినతిరుమలరాజు తానే రాజ్యచక్రం తిప్పుతాడు రాజ్యాధికారం చవిచూసిన చినతిరుమలరాజు తానే రాజుకావాలనే దురాశతో, దుస్సాహంతో మేనల్లుడిని హత్యచేసి, తన పథకాని కడ్డురాగలడేమో నని తరువాతి వారసుడైన సదాశివరాయలను చెరలో పెట్టిస్తాడు అళియ రామరాయల వర్గం ఈ ఆగడాల్ని ఎదిరిస్తుంది దీనితో పోటాపోటీలు మొదలు! సింహాసనం కోసం జరిగిన ఈ ఇగ్గాముగ్గి పోరాటంలో ఆళియ రామరాయల అంగరక్షకులలో ఒకరైన రుద్రప్పచేతిలో చినతిరుమలరాజు నిహతుడవుతాడు సదాశివరాయలు పేరుకు రాజ్యాధికారి అవుతాడు అళియ రామరాయల పేరోలగంలో మోహనాంగి రచించిన మారీచి పరిణయ ప్రబంధాన్ని ఆవిష్కరించి, ఆస్థాన కవియైన ప్రబంధాంకం సూరపరాజు గారు దాని ప్రాశస్త్యాన్ని వివరిస్తాడు ఆ తరువాత జరిగిన తళ్ళికోట యుద్ధంలో అళియ రామరాయలు వీరస్వర్గమలంకరించాడన్న వార్తవిని మోహనాంగి కన్నుమూస్తుంది ఇష్టజన వియోగాన్ని భరించలేని బసివికూడ యోగమార్గాన తనువు చాలిస్తుంది అళియ రామరాయల తమ్ముడైన తిరుమల దేవరాయలు పెనుగొండ దుర్గానికి రాజధాని మార్చటంతో నవల పూర్తి అవుతుంది సంగ్రహంగా ఇదీ మోహనాంగి' నవలా కథాశరీరం

మోహనాంగీ, ఆమె చెలికత్తెగా కల్పించబడ్డ బసివీ లేక నాగినీ ఈ ఇద్దరే ఈ నవలలోని ప్రధాన స్త్రీ పాత్రలు కృష్ణరాయల పట్టపురాణులైన తిరుమలదేవి అన్నపూర్ణాదేవి, ఈమె తనయ కృష్ణాంబ, అచ్యుతరాయల దేవేరియైన వరదాదేవి, సలకం చినతిరుమలరాజు సతి నాగమాంబ, సంకుసాల నృసింహకవి భార్య అండాళమ్మ అప్రధానపాత్రలు పురుష

పాత్రలలో కృష్ణదేవరాయలు సలకం చిన తిరుమలరాజు అళియ రామరాయలు, పురుషోత్తమ స్థపతి ముఖ్యులు అచ్యుతరాయలు సదాశివ రాయలు, తిరుమల దేవరాయలు తిమ్మరసు, అల్లసాని పెద్దన ముక్కు తిమ్మన ధూర్జటి కందుకూరి రుద్రకవి సంకుసాల నృసింహకవి, ప్రబంధాంకం సూరపరాజు భట్టుమూర్తి తాతాచార్యులు ఇత్యాదులు గౌణ పాత్రలు రామరాయలు కథానాయకుడు చినతిరుమలరాజు ప్రతినాయకుడు పురుషవేషంలో కన్పించే బసవి, పురుషోత్తమస్థపతి నాయికానాయకులకు సాహాయ్యకులు దురాశాపరుడుగా, దుర్వినోదాంకు దాసుడుగా చిత్రించబడ్డ చినతిరుమలరాజు కథ తారాస్థాయికి చేరకముందే కథావశేషుడవుతాడు తిరుమలదేవరాయల పట్టాభిషేక సూచనతో కథ మోదాంతంగా ముగిసినట్లు కనిపించినప్పటికీ, నాయికానాయకులైన మోహనాంగీ, అళియ రామరాయలూ వీరిద్దరికీ కూర్చు నెచ్చెలీ ఐన బసివీ కథావసానంలో మరణించడంవల్ల దీన్ని విషాదాంతంగా పరిగణించక తప్పదు

పాత్రచిత్రణంలో మన రచయితల దృష్టి ఎంతసేపటికీ ప్రధాన పాత్రలమీదే కేంద్రీకృతమై ఉంటుంది 'భామవేషగాడికి మరింత నెయ్యి పొయ్యండిరా' అనే బాపతుగా తక్కినవాటిసంగతి అంతగా పట్టించుకోరు శరీరంలోని అన్ని అవయవాలు-సౌష్ఠవం దృష్ట్యా - సమానమైనవిగాబట్టి నిర్ణీత క్రమంలో, నిర్దిష్టపరిమాణంలో లేని అవయవ సాకల్యాన్ని అంగ వైకల్యంగా భావించడంలో తప్పులేదు ముఖ్య కథలోని ఏ ఘట్టానికే పాత్ర లెంతవరకు ఉపకరిస్తాయో ఉత్తమశిల్పులకి మాత్రమే తెలుస్తుంది పాత్ర చిత్రణ విషయంలో శిల్పరహస్యవేత్తలైన ఆచార్యులుగారి ప్రతిభాప్రాభ వాన్ని గురించి ప్రత్యేకంగా పేర్కొనక్కరలేదు ఐతే, ఒకటి రెండు ఘట్టాలలో పాత్రచిత్రణం నియతపరిధులను అతిక్రమించినట్లు మనకు గోచరిస్తుంది దినదినము ఒక నిర్ణీతవేళలో బసివి ఏదో ఒక సంకేత స్థలానికి వెళ్ళి రావడం, ఈ రాకపోకలను గూర్చి తన్నెవరూ ప్రశ్నించ

కూడదని మహారాజ్ఞి తిరుమలదేవి నుంచి అనుమతి పొందడం - అంతఃపుర మర్యాదలకీ, వర్ణోచ్ఛవర్ధనమైన ఆనాటి రాజనీతి ప్రయోగానికీ సుతరామూ అతకని అంశాలు ఇట్లా అనుమతిని ప్రసాదించడం బాలస్వభావంగా కనిపిస్తుంది అలాగే ముక్కూమొగం తెలీకపోయినా, పురుషవేషంలో ఉంటున్న బసివిని ప్రథమ పరిచయంతోటే తన అంగరక్షణకు నియమించడంగాని, ఆ వ్యక్తితో తన వ్యక్తిగత సమస్యలను చర్చించడంగానీ, షాడ్గుణ్యధీకలితుడుగా, సప్తాంగ శస్త్రవర్ధనుడుగా నిలువెల్లా కళ్ళుగా మసలుకోవలసిన అళియరామరాయల పాత్రప్రవృత్తికి అనువుగా కన్పించదు 'యుక్తదండాహిమృదవః ప్రశాంతా వసుధాధిపాః' అన్న రాజనీతికి అనుగుణం కాదు విశిష్య, సచివాయత్తబుద్ధులపట్ల ఈ అనవధానత, ఈ బలహీనత చెల్లితే వెల్లవచ్చునుగాని, అళియరామరాయలవంటి స్వాయత్తచిత్తులపట్ల ఎంతమాత్రము వర్తించవు

ఈ నవలలో ప్రతిపాదితాలైన ప్రధానాంశాలు రెండు ఒకటి మారీచీ పరిణయ ప్రబంధ రచన, రెండు బసివి వ్యవస్థను నిర్మూలించ యత్నించడం ఈ రెండూ మోహనాంగి పాత్ర చుట్టూ పరిభ్రమించే పాత్ర శీల పరిపోషకాలైన సంఘటనలు వీటిలో మొదటి దానికి బలీయమైన జన శ్రుతి ఆధారం రెండోది సంఘ సంస్కరణాభిషులగు కొండూరు వారి కల్పనకు ఫలం

మొదట మారీచీ పరిణయం సంగతి చూద్దాం కృష్ణదేవరాయలకు 'మోహనాంగి' అనే నామాంతరం గల తిరుమలదేవి అనే కూతురు ఉందో లేదో స్పష్టంగా నిర్ధారితం గాలేదు ఉండేదని వాదన కోసం ఒప్పుకున్నా, ఆమె మారీచీ పరిణయ ప్రబంధకర్త్రి అని నిరూపించడానికి బలీయమైన ఆధారాలు కన్పించడంలేదు మోహనాంగి కర్తృకంగా ఇటీవల ప్రకటించ బడ్డ 'మారీచీ పరిణయం' ఆ కాలంనాటి రచన కానేకాదు అది అర్వాచీనుల

సృష్టి కళా ప్రపూర్ణులు సర్వశ్రీ పురిపండా అప్పలస్వామి, పెన్మెత్స సత్యనారాయణరాజు ప్రభృతులు నిర్ధారించినట్లు ఇది సెట్టి లక్ష్మీనరసింహం గారి కూటసృష్టి ఈ విశ్వామిత్రసృష్టిని గురించి ఆనాటి విశాఖపట్టణంలోని పిన్నలూ, పెద్దలూ సర్వశ్రీ విక్రమదేవ వర్మ, మారెపల్లి రామచంద్ర శాస్త్రి, శ్రీరంగం శ్రీనివాసరావు ఆరుద్ర, బొడ్డు కామయ్య వగైరా వాగా ఎరుగుదురు ఇలాంటి సృష్టిలో సెట్టివా రందెవేసిన చెయ్యి అనీ అది వారి కొక ఆనందమనీ, శ్రీనాథకృతమని చెప్పి ఆయన ప్రచురించిన 'రసికాభి లాషము' అన్న గ్రంథం సెట్టివారి సేతలకు మరొక సాక్ష్యమనీ వీరంతా చెప్తారు

ఉపన్యమైన 'మారీచీ పరిణయ' ప్రబంధ భాగాల్లోని భాషా విశేషా లను, పదబంధాలనూ, ప్రయోగ ఫక్కీనీ పరిశీలిస్తే ఇది అర్వాకాలికి రచనమని నిర్ద్వంద్వంగా నిరూపితమవుతుంది అయితే ప్రకృత చర్చ 'మారీచీ పరిణయ' ప్రబంధ కర్తృత్వానికి సంబంధించినది కాదు ఈ ప్రబంధం మోహనాంగి కృతమైనా కాకపోయినా నవలకు కలిగే నష్టము లేదు, ఒరిగే లాభము లేదు అలాంటి సన్నివేశాల్ని కల్పించడానికీ, కళా దృష్టితో వాటిని శిల్పింవడానికీ సృజనాత్మకి రచయితలకు ఆ పాటి స్వాతంత్ర్యం లేకపోలేదు

ఇక బసివి సంప్రదాయాన్ని గురించి ఒకటి రెండు మాటలు దక్షిణ భారతదేశంలో ముఖ్యంగా కర్ణాట దేశంలోనూ, పశ్చిమాంధ్రంలోనూ కొన్ని తెగలలో తొలి కాన్పు ఆడపిల్లలకు పెళ్ళి చేయక, దేవుడి పేర వదిలిపెట్టే ఆచారం నాటికీ నేటికీ ఉంది అలాటి స్త్రీని 'బసివి' లేక బసివిరాలు' అని అంటారు ఇది తెలంగాణంలో జోగి / జోగిని / పార్వతి సంప్రదాయంగా ప్రచలితం కొన్ని దరగాలలో సేవలుచేసే సేవకురాళ్ళను జోగినీ లని

పిలుస్తారు  కళింగాంధ్రంలో ఇలాంటి వారినే దాసుడమ్మ, దాసురాలు అని పిలుస్తారు  వీరశైవ మతోద్ధారకుడైన బసవేశ్వరునికి పిమ్మటనే ఈఆచారం వాడుకపడినట్లు కొందరభిప్రాయపడుతున్నారు  బసివిరాలును చేయడం ఒక పెద్దతంతు  ఆ యా ప్రాంతాలలో ప్రసిద్ధి పొందిన ఏదో ఒక దేవుని కళ్యాణోత్సవం రోజు దేవుని తరపున అర్చకుడో, అతని ప్రతినిధిగా మరొకడో బసివి కాదలచుకున్న స్త్రీకి ఓలి రూకలతో సుగుమంచి కొలిచి, తలంబ్రాల చీర, రవిక ఇచ్చి తాళి కడతాడు  ఆనాటి నుంచి, ఆమె జీవించి ఉన్నంత వరకూ దేవుని భార్యగానే పరిగణించబడుతుంది  ఏటేటా స్వామివారి కళ్యాణోత్సవ వేళ  దేవాలయాధికారులు  రూక పోకలతో, చీర, రవిక గుడ్డలను బసివిరాలికి వతనుగా ముట్టజెప్పడం ఆనవాయితీ  మొదట శైవాచారంలో వేళ్ళూనిన ఈ బసివి సంప్రదాయం క్రమంగా వైష్ణవానికిగూడా పాకి ఉండ వచ్చని ఒక ఊహ!  వైష్ణవంలోని 'దేవ దాసి' సంప్రదాయం సైతం ప్రాచీనమైనదని ఒక అభిప్రాయం  అయితే వైష్ణవాలయాల్లో తప్తచక్రాంకనాల - గుడిముద్ర - లతో  బసివిరాలిని  చేయడం  అదనపుటాచారం  ఈ రూపంగా  బసివిరాలు  దేవుని భార్య కాబట్టే  ఆమె నిత్య ముత్తైదువ  ఇంచుమించుగా ఇది ఇతర సీమల్లో దేవదాసి సంప్రదాయం వంటిది  దేవాలయంలో అర్చా విగ్రహం ఎదుట నృత్యాదికం సల్పడం ఒకప్పటి దేవదాసి వృత్తి  దేవుని సన్నిధిని ఆయా ఉత్సవాల కనుగుణంగా పాటలు పాడడం బసవిరాలి పని  ఇవి రంగ భోగాలలోని ముఖ్యాంగాలు

క్రమక్రమంగా దేవాలయాల ప్రభ సన్నగిల్లి బసివికి దేవళం నుంచి వచ్చే వరుమానం తగ్గడంతో బ్రతుకు భారంకాక తప్పలేదు  కన్నెరికానికి ఉబలాటపడే ఘనులూ, సరదాపడి చేరదీసే సరసులూ సంఘంలో పెరిగిపోయారు 'కూడు పాసిపోయింది, కుక్క ఆకలిగొనింది' అనే సామెతగా ఒకనాడు పవిత్రంగా భావించబడ్డ వ్యవస్థ పడుపువృత్తి కింద పరిణ

మించింది ఒకనాటి గుడిచేటిక, (గుడిసెచేటు ఆధునికుల తీర్పు, లిట్టూ) సంతబసివిగా సావడిసానిగా సామాన్యవేశ్యగా మారవలసి వచ్చింది అయితే పశ్చిమాంధ్రంలో పెళ్ళి పేరంటాల వేడుకలలో బసివిరాలికి ఇప్పటికీ ప్రముఖస్థానం ఉంది ఈమెచేత దూదితో ఏకులు చేయించి, రాట్నంపై వడికించిన పోగునూలినే మంగళసూత్రాలకు వాడతారు నలుగు వేడుకలలో, పానుపు సంబరాలలో బసివిరాలు చేతులారా నలుగుపెట్టనిదే నోరారా పాటలు పాడనిదే ఆ వేడుక పూర్తిఅయినట్లు కాదు ఎంతచెడ్డా, 'బసివిరాలు' దేవుని భార్య కదా!

బసివిరాళ్ళంతా శీలభ్రష్టలూ అనాధలూకారు కులవధువులకంటే నియమనిష్ఠలుగల బసివిరాళ్ళు కొందరు లేకపోలేదు అన్నదమ్ములతోపాటు తల్లిదండ్రుల ఆస్తిపాస్తులలో బసివిరాలికి సమానమైన హక్కు ఉంది ఇది ఇంగ్లీషు కుంఫిణీవారుగూడా గుర్తించిన హక్కు బసివిరాలైతే తప్ప ఈ తెగలో పిత్రార్జితంపై స్త్రీకి హక్కు సంక్రమించదు బసివిరాలుగా మారినా పడుపువృత్తి చెయ్యడం ఇష్టంలేక పెళ్ళాడితే ఈ ఆస్తిహక్కు పోతుందనే భయంతో పెళ్ళితంతులేకుండా కన్నెరికం పేరుతో కులమింటి కుర్రవాణ్ణి ఇల్లరికం నిలుపుకోవడం పశ్చిమాంధ్రంలో నేటికీ నిలిచి ఉన్న ఆచారం బసివిరాలు తనకు నచ్చినవారికో తన్నుమెచ్చిన వారికో ఎవరికో ఒకరికి 'అస్మాకం' అంటే పాణిగ్రహీతగా స్థిరపడడాన్నే కోరుకుంటుంది అలా అనుకూలపడనిపక్షంలో కూలో నాలో చేసి, కలోగంజోతాగి కాలం వెళ్ళ బుచ్చే బసివిరాళ్ళే ఎక్కువగా కనిపిస్తారుగాని, బజారున పడి పడుపు వృత్తితో పొట్టపోసుకునే బసివిరాళ్ళు చాల తక్కువ కృష్ణరాయలకాలం నాటికే ఈ బసివివ్యవస్థ వెర్రితలలు వేస్తున్నట్లు ఆచార్యులుగారు చిత్రించారు ఆధారాలు లేనిదే ఆచార్యులుగారీపని చెయ్యరు గదా! బసివివ్యవస్థకు వ్యతిరేకంగా సాగించదలచిన నాగినీమోహనాంగుల ఈ ఉద్యమం ఈ

ఇర్వుర ఆలోచనలకే పరిమితమయింది ఆచరణలో అనూదితం కాలేదు వీరి హఠాన్మరణంతో ఈ ఉద్యమం ఆగిపోక తప్పదు కదా!

పద్యం నిర్మించినా, గద్యం నిర్మించినా ఆచార్యులుగారి అల్లికలో ఒకె ఊపూ, ఒకే ఒడుపూ ఉరవడిస్తాయి, అదే జగ్గూ, అదే నిగ్గూ అందగిస్తాయి ఎన్నో శాస్త్రసంప్రదాయాలూ, ఎన్నెన్నో శిల్పమర్యాదలు, మర్నెనో సాంఘికధర్మాలు, ఇంకెన్నో విద్యారహస్యాలూ పాత్రోచితంగా, ప్రకరణోచితంగా కథాగతిలో రమణీయ శిల్పమహితాలుగా వీరి రచనలో ఖచితాలవుతూ ఉంటాయి వీరి ఇతర నవలలు 'కళారాధన'ను పరీక్షించినా 'లేపాక్షి'ని సమీక్షించినా, ఈ సర్వలక్షణాలూ వీటిలో కొట్టవచ్చినట్లు కన్పిస్తాయి ఇదేవరుసలో కళాప్రపూర్ణుం కళాసృష్టిలో ఆవిర్భవించిన ఈ మోహనాంగి రసికజన సమ్మోహనంగా రాణించగలదని ఆశంస

# శ్రీ నారాయణ గురుదేవులు

మన భారతదేశపు నైరృతిదిశలో అరేబియా సముద్రతీరాన 'కేరళ' అనే రాష్ట్రం ఉందని మనందరికీ తెలుసు ఈ రాష్ట్రంలోని ప్రజలు మాట్లాడేభాష మలయాళభాష కాబట్టి దీనిని 'మలయాళదేశం' అనికూడా వ్యవహరిస్తారు 'ఆదమలయాళ' మన్న కథలు మనకు సుపరిచితాలే ! కొండకోనలతో, కొండవాగులతో, కొబ్బరి తోటలతో, కలకలలాడేకొలకు లతో రమణీయమైన ప్రకృతి దృశ్యాలుకల రాష్ట్రమిది సాహసచాకచక్య వ్యవహారదక్షతలు ముప్పిరిగొన్న లక్షణం కేరళీయుల విలక్షణత చదువుకున్నవారి శాతం భారతదేశంలోని తక్కిన రాష్ట్రాలకంటే చాలా ఎక్కువ ఈ రాష్ట్రపు నేటి జనసంఖ్య సుమారు రెండుకోట్ల పదిహేను లక్షలు ఇందులో నూటికి అరవై మంది హిందువులు, క్రైస్తవులు, ముస్లింలు నూటికి చెరి ఇరవై మంది ఉంటారు హిందువులలో ఎక్కువ మంది 'ఈఉవ' అనే కులానికి చెందిన జనులు వీరు హిందువులలో మూడో వంతు ఉంటారు కేరళ రాష్ట్రపు అస్పృశ్యులలో అంటే అంటరానివారిలో- ఈఉవలు కూడ చేరుతారు

రమారమి ఏడెనిమిది దశాబ్దుల కిందట ఈఉవల పరిస్థితి నేటితో పోల్చిచూస్తే చాల ఆశ్చర్యం వేస్తుంది ఆనాడు ఈఉవలు ఆర్థికంగా చాల వెనుకబడ్డవారు సాంఘికంగా అట్టడుగునకు అణచివేయబడ్డవారు వ్యవసాయం, కల్లుగీతపని వీరిముఖ్యవృత్తుఌ రెక్కాడినా డొక్కాడని నిరుపేదలు హిందువులలో సవర్ణులను వీరు ముట్టుకోరాదు అసలు సమీపించనే కూడదు సమీపిస్తే శిరశ్ఛేదమే శిక్ష వీరి నీడపడితే

మైలపడిపోతామని అగ్రవర్ణాలవారు కొందరు వీరి కులం పేరును ఉచ్చరించ డానికి కూడ ఇష్టపడే వారుకారు. వీరిని గురించి చెప్పకతప్పదంటే 'చెప్ప రాని కులం' అనేవారు. సవర్ణులు వాడే చెరువుల దొరువుల నుంచి వీరు నీరు తోడుకోరాదు. వీధిబళ్ళలోగానీ, సర్కారుబళ్ళలోగానీ వీరు అడుగు పెట్టాడానికి వీలుండేదికాదు. అంతగా అభిలాష ఉన్నవారు బడికి వెలుపల కూర్చుండి అక్షరం ముక్కలు నేర్చుకోవలసిందే. తప్పులుచేసినా, చేయక పోయినా యజమానులు విధించే కఠిన శిక్షలను కిక్కురుమనకుండా అనుభవించేవారు. నేరాలు విచారణచేసే సమయంలోకూడ వాది ప్రతివాదు లైన 'ఈటువ'లు న్యాయస్థానాలలో అడుగుమోపితే ధర్మావతారులైన పై కులాల న్యాయమూర్తులు మైలపడిపోతారని నమ్మేవారు. న్యాయస్థానంలోని ధర్మాసనానికి దూరంగా ఏ చెట్టుకిందనో, ఏ గట్టుపక్కనో నిలబడి బెరుకు బెరుకుగా తమగోడు వినిపించుకోవలసి వచ్చేది. ఇక, దేవాలయాలలో ప్రవేశం మాట ఎత్తడానికే అవకాశం ఉండేదికాదు. చివరకు ఈ అంటరాని కులాలవారు పూజించే దేవతలు, వీరి దేవాలయాలుకూడ అంటరానివిగానే పరిగణించబడేవి. ఇదీ ఆనాటి ఈటువ కులంవారి దయనీయస్థితి. మన రాష్ట్రంలో నిన్నామొన్నటి వరకూ హరిజనులస్థితి కూడా ఇంచుమించు ఇంతేకదా !

ఈ కడగండ్లబతుకు బహుకాలంగా సాగుతూవచ్చింది. ఇంచుమించు ఆరేడు పుష్కరాల క్రితం వీరి చీకటిబతుకుల్లో వేగుచుక్క పొడిచింది; వెలుతురు వచ్చింది. దట్టంగా ముసిరిన చీకటితెరలు విచ్చిపోయాయి. ఈటువలు తమ హక్కులేవో, తమ బాధ్యతలేవో అర్థం చేసుకోగలిగారు. ఇన్ని వేలయేళ్ళుగా తమ దుస్థితికి తాము కూడా కొంతలో కొంత కారణమని గ్రహించగలిగారు. తమకంటె తక్కువస్థాయిలోగల 'పులయ' మొదలైన తెగలజనులను ఈటువలు చాలహీనంగా చూచేవారు. ఈ ఘోర

పాటును ఈటవలు సరిదిద్దుకో గలిగారు జంతుబలులు ఇవ్వడం, కల్లు సారాయి తాగడం చీటికి మాటికి గిల్లికజ్జాలు పెట్టుకోవడం వంటి చెడ్డ అలవాట్లను మానివేశారు పరిశుభ్రత అంటే ఏమిటో తెలుసుకున్నారు మొత్తం మీద వీరి ఆలోచనా ధార కొత్తమలుపు తిరిగింది, వీరి దృక్పథంలో గొప్పమార్పు కలిగింది నేడు కేరళరాష్ట్రానికి చెందిన ముఖ్యమైన అన్ని రంగాలలోను ఈ కులంవారు ముందంజ వేస్తున్నారు చదువుసాములలో, ఉద్యోగ సద్యోగాలలో, రాజకీయరంగంలో అనేక కీలకస్థానాలను ఆక్రమించగలిగారు ఇతర మతాలవారితోనే కాక సవర్ణ హిందువులతో కూడ సరిసమానమైన హక్కులను అనుభవిస్తున్నారు ఊహించరాని ఈ మార్పు ఎట్లా సాధ్యమైంది ? ఏదైనా ఇంద్రజాలం జరిగిందా ? ఎవరైనా అవతారపురుషుడు అవతరించాడా ?

ఈటవతెగ జనులనేకాదు, ఆ రాష్ట్రంలోని బడుగువర్గాలన్నింటినీ ఒక్కుమ్మడిగా కదిలించిన శక్తి, కర్తవ్య నిర్వహణానికి ముకుమ్మడిగా కదంతొక్కించిన మహావ్యక్తి నారాయణగురుదేవులు కేరళ రాష్ట్రంలోని తిరువనంతపురం జిల్లా నెయ్యాట్టింకర తాలూకాకు చెంది తిరువనంతపురానికి మూడుకోసుల దూరంలోని 'చెంపఅంది' గ్రామం నారాయణగురుదేవుల జన్మస్థలం ఈటవకులానికి చెందిన కుట్టియమ్మ మాదన్ (<మాధవన్) ఆశాన్ దంపతులకు క్రీ శ 1854వ సంవత్సరం సెప్టెంబరు నెల 20వ తేదీన 'నాణు' (నారాయణ గురుదేవుల చిన్నానాటి ముద్దుపేరు) జన్మించారు మాదన్ ఆశాన్ ఒక సన్నకారురైతు జ్యోతిషం సంచికట్టు నాటువైద్యం అతని అదనపు అభిమాన వృత్తులు సంస్కృతంలోనూ, మలయాళంలోనూ కొంతలోకొంత దొక్కశుద్ధి కలవాడు ఇంటిల్లిపాదీ చేదోడు వాదోడుగా రెక్కలకష్టంచేస్తే తప్ప గడవని కుదిమట్టపు కుటుంబం వారిది చెంపఅంది ముత్తపిళ్ళెగారి పళ్ళికూటం (వీధిబడి)లో 'నాణు' ఓనమాలు నేర్చుకోవడం

మొదలుపెట్టాడు చురుకైన విద్యార్థిగా 'నాణు'కు మంచిపేరు వచ్చింది
గురువుగారు పాఠం చెప్పడం తరువాయి, గడగడా అంతా అప్పజెప్పే
వాడు తరుచుగా ఇంటిపనులలో తల్లికీ, పొలంపనులలో తండ్రికీ
చేదోడుగా ఉండవలసి వచ్చేది ఇవికాక అప్పుడప్పుడు గొడ్లుకాయడం,
పొలందున్నడం వంటి పనులుకూడ 'నాణు' చేయవలసి వచ్చేది ఇవేవీ
అతని చదువులకు అడ్డంకాలేదు

పట్టినపట్టు వదలకుండా తండ్రివద్దనూ, మేనమామ కృష్ణన్‌వైద్య
వద్దనూ, రామన్‌ఎళ్ళె వంటి గురువుల సన్నిధిలోనూ అరవం, మలయాళం
సంస్కృతం నేర్చుకున్నాడు ఆ భాషలోని పురాణాలు, కావ్యాలు,
నాటకాలు అలంకారశాస్త్ర గ్రంథాలు చదివాడు అంతటితో ఆగలేదు
ఉపనిషత్తులు, దర్శనాలు ఒకటేమిటి దొరికిన వేదాంత గ్రంథాలన్నింటినీ
పరిశీలించాడు చెట్టంబి స్వామిగళ్, తైకాడు అయ్యావు యోగివంటి
పెద్దల దగ్గర యోగశాస్త్రరహస్యాలు ఆకళించుకున్నాడు ఎంత చదివినా
అతనికి జ్ఞానతృష్ణ తీరలేదు పుస్తకాల చదువుతో అతనికి తృప్తికలుగలేదు
కోశంచూడు, దేశంచూడు అంటారు పెద్దలు తాను తెలుసుకోవలసింది
ఇంకా ఎంతో ఉందని భావించి ఇల్లువదలి దేశాటనకు బయలుదేరాడు చీమలు
దూరని చిట్టడవులలో, కాకులుదూరని కారడవులలో తిరిగాడు ఎందరో
తాత్త్వికులనూ, తాంత్రికులనూ, యోగులనూ, బైరాగులనూ, సాధుసంన్యా
సులనూ కలుసుకున్నాడు కొండగుహలలో బహుకాలం తపస్సుచేశాడు జ్ఞానో
దయం పొందాడు జటిలసమస్యలకు జడిసి ఈ జగత్తునుంచి పారిపోవడం
పరిష్కార పద్ధతికాదని ఆయన గుర్తించాడు ఆయన భావన విశ్వజనీన
మైనది, ఆచరణ యోగ్యమైనది లోకులకు దూరమైన ఏకాంతవాసం వల్ల
తనకగాని లోకానికిగాని లాభంలేదనుకుని కాబోలు తన ప్రజల మధ్యకు
తరలివచ్చాడు కానకకన్న కన్నవారినీ, చుట్టుపక్కాలనూ, కట్టకడకు

కట్టుకున్న ఇల్లాలినీ వదలి వీతరాగియై దీనజనోద్ధరణకు నడుం కట్టాడు సాధకుడు బోధకుడుగా మారాడు 'నారాయణ ఆశాన్' 'నారాయణగురు'గా ప్రజలచేత గుర్తించబడ్డాడు. కీర్తించబడ్డాడు

సమాజంలో అట్టడుగున పడిఉన్న బడుగుజాతుల దీనస్థితిని పరికించారు నారాయణ గురుదేవులు వారిపట్ల జరుగతున్న అక్రమాలు, అన్యాయాలు చూశారు వారు పొందుతున్న అవమానాలు, ఆవేదనలు గమనించారు అరగడుపులతో, పరగడుపులతో పశువుల కంటె హీనంగా బతుకుతున్న వారిస్థితి కలచివేసింది ఆయనను తానుతరించడం ముఖ్యంకాదు, ఇతరులను తరింపజేయడం ముఖ్యమని నిర్ణయించుకున్నారు ఆయన తిరువనంతపురానికి చేరువలో ఉత్తరదిక్కున నెయ్యార్ నది ఒడ్డున గల 'అఋవిప్పురం అన్నచోట నివాసమేర్పరుచుకుని తన యోగసాధననూ నిమ్నజాతులస్థితిని బాగుచేసే కార్యక్రమాలనూ కొనసాగించారు తనను చూడవచ్చే వేలాదిజనులకు ఆచరణయోగ్యమైన కర్తవ్యబోధ చేస్తూవచ్చారు లోకకల్యాణ సమాచరణలో వ్యక్తి నిమిత్తమాత్రుడన్న దృష్టి ఆయనది కర్తృత్వబుద్ధిగాని ఫలాసక్తిగాని లేని లోకసంగ్రహార్థమైన కర్మాచరణం ఆయనది

మొదట మనిషికి కావలసినవి ఇహలోక విషయాలు, ఆ పిమ్మటనే పరలోక విషయాలు అని ఆయన నిశ్చయించుకున్నట్లుంది కూడు, గూడు, గుడ్డ లేని ప్రజలకు నీతిబోధచేయడం వేదాంతవిషయాలు వివరించడం బూడిదలో పోసిన పన్నీరువంటిదని ఆయన అభిప్రాయం సమాజంలోని హెచ్చులొచ్చులు కులమతభేదాలు పోవాలని ఆయన భావించారు అయితే, అది అంత తేలికైన పనికాదు కరడుగట్టిన సంఘ వ్యవస్థను ఆయన ఎదుర్కొని నిలదొక్కుకోవలసి ఉండినది కాని ఎవరు ఎదిరించినా ఆయన బెదరలేదు, ఎవరు కాదన్నా ఆయన చెక్కుచెదరలేదు

తన శక్తియుక్తులపై తాను తలపెట్టిన మంచిపనిపై తాను రూపొందించిన విధానాలపై, ఆశ్రయించిన సాధనాలపై తనపై శిష్యకోటికిగల ప్రపత్తిపై, తన అభిమానుల సహకార సంపత్తులపై ఆయనకు గొప్పనమ్మకం ఉండేది

ఆదికాలంలో జనులంతా ఒకటే అనీ, కులభేదాలు, వర్ణభేదాలు తర్వాతి కాలంలో స్వార్థపరులు కొందరు సృష్టించిన వనీ ఆయన నిరూపించారు మానవులందరిదీ ఒకే కులం, ఒకే మతం అనీ, అందరిదేవుడు ఒకడే అనీ ఆయన ఎలుగెత్తి చాటారు 'ఏకో దేవస్సర్వ భూతేషు' అన్న శ్వేతాశ్వతరోప నిషద్వాక్యం ఆయనకు కంఠోపాఠం అందరూ కలిసిమెలసి సహజీవనం చేయాలని ఆయన ఉపదేశించారు తన ఇరుగుపొరుగువారితో మంచిగా ఉంటూ, తాను సుఖంగా జీవించడమే గొప్ప విజ్ఞానమని ఆయన తెలియ జెప్పారు స్వతంత్రం అన్నది ఒకరిని యాచిస్తే వచ్చేదికాదనీ, మంచిస్థితి అన్నది ఒకరి దయాధర్మాలవల్ల సిద్ధించేదికాదనీ ఆయన బోధించారు అడగనిదే అమ్మ అయినా అన్నం పెట్టదుకదా ! తమ బరువు బాధ్యతలు గుర్తించి న్యాయమైన హక్కులకోసం పోరాడి సాధించుకోవాలని ఆయన నిమ్నజాతి జనులను ఉద్బోధించారు చెడునడతలను మానుకోవాలనీ, చేసే తప్పులను సరిదిద్దుకోవాలనీ, చిల్లర మల్లర తగాదాలను సదవగాహనతో చక్కబెట్టుకోవాలనీ ఎచ్చరించారు సాంఘికంగా తమకంటె కింది స్థాయికి చెందిన కులాలవారిని తమతో సమానంగా చూడనిపక్షంలో అగ్ర వర్ణాల వారితో తమకు సమానస్థితి కావాలని కోరేహక్కు ఈటవ తెగ వారికిగానీ మరే కులంవారికిగాని లేదని ఆయన ఖరాఖండిగా స్పష్ట పరిచారు ఆయన బోధలు 1901 నాటికే లక్షలాది ప్రజలను ఆకర్షించాయి

ఆయన తన ఆశయాలు నెరవేరడానికి ఎన్నో మార్గాలు ఆలో చించారు ఊకిదంపుడు ఉపన్యాసాలవల్ల యత్న కార్యసిద్ధి కాదని నిశ్చ

యించారు ఆయన ఆదేశంపై 'శ్రీ నారాయణ ధర్మపరిపాలన యోగం' అన్న ఒక సంస్థ 1903 లో నెలకొల్పబడింది ఆచరణ యోగ్యములైన స్వామీజీ వారి ఆదర్శాలవల్ల ఉత్తేజం పొంది వేలాది మంది యువకులు, సంఘసేవకులు అన్ని మతాలకు చెందినవారు ఈ సంస్థలో కార్యకర్తలుగా చేరారు దేశమంతటా దీనికి అనేక శాఖ లేర్పడినవి అందులో 'అలువ' లోని 'అద్వైతాశ్రమం' నీలగిరిలోని 'నారాయణ గురుకులం' పేర్కొదగ్గ కొన్ని శాఖలు స్వామీజీ సందేశాన్ని దేశమంతటా ప్రచురపరచడం, వాటిని ఆచరణలో అనువదించడం, బడుగువర్గాల జనుల ఆర్థిక సామాజిక స్థితిని బాగుపరచడానికి పాటుపడడం ఈ సంస్థ ప్రధాన లక్ష్యాలు ఈ లక్ష్యాలను సాధించే నిమిత్తం ఆయన అనేక పథకాలను రూపొందించారు తిరువాన్కూర్, కొచ్చిన్ సంస్థానాలలోను, తమిళనాడులోను, శ్రీలంకలోను విస్తారంగా పర్యటించి తన నూతన సందేశాన్ని లక్షలాది ప్రజలకు అందించారు ఆయన మహాపండితుడేకాక, సంస్కృత మలయాళ భాషలలో మంచికవికూడ దర్శనమాల, ఆత్మోపదేశ శతకం మున్నగునవి ఆయన ముఖ్య రచనలు సామాన్య ప్రజలు రోజూ పాడుకుని ఆనందించడానికి అందలి విషయాలను ఆచరించడానికి అనువైన పద్ధతిలో అనేక భక్తి గితాలను, కీర్తనలను రచించారు గొప్ప గొప్ప పండితులతో వాదించి కులవర్ణభేదాలు మానవ కల్పితాలని నిరూపించారు వేర్వేరు కులమతాల వారి మధ్య పెళ్ళి పేరంటాలనూ, 'చాపకూడు' విందు వేడుకలనూ ఆయన ప్రోత్సహించారు స్వయంగా తన చేతులమీదుగా కొన్నింటిని జరిపించారు మహాకవి కుమారన్ ఆశాన్, సహోదరన్ అయ్యప్పన్ డాక్టర్ పి నటరాజన్ వంటి దిట్టలు నారాయణ గురుదేవుల ముఖ్య శిష్యులలో కొందరు గురుదేవులు చిన్ననాడే వీరిని చేరదీసి పెద్దపెద్ద చదువులు చెప్పించి పై దేశాలకు పంపి పరిశోధనలు చేయించి తమ ధర్మపరిపాలన సంస్థలో ముఖ్య కార్యకర్తలుగా నియ

మించారు స్వామీజీ సందేశానికి విశేషవ్యాప్తి కలగజేయడంలో ఈ శిష్యులు ఎంతగానో కృషి చేశారు విత్తొకటి, చెట్టొక్కటి కాదు కదా!

తిరువనంతపురానికి ఉత్తరంగా రెండామడల (ముప్పై రెండు కిలో మీటర్ల) దూరంలో గల 'వర్కళా'లో 'శివగిరి మఠం' స్థాపించి గురుదేవులు అందులో స్థిరనివాసం ఏర్పరచుకున్నారు స్వామీజీ చేపట్టిన అన్ని ఉద్యమాలకు శివగిరి మఠం కేంద్ర స్థానంగా తయారైంది కులమత భేదాలు లేకుండా దీనులకు, హీనులకు, దిక్కులేని పిల్లలకు ఈ మఠంలో ఆశ్రయం కల్పించబడింది అక్కడ నెలకొల్పిన సంస్కృత విద్యాలయంలో వారికి చదువుతోపాటు వృత్తి విద్యలు కూడ నేర్పుతున్నారు మహాత్మాగాంధీ, రవీంద్రనాథ ఠాకూరు, స్వామి శ్రద్ధానంద వంటి మహనీయులెందరో శివగిరి మఠాన్ని సందర్శించి నారాయణ గురుదేవుల బహుముఖ కృషిని వేనోళ్ళ కొనియాడారు

స్వామిజీ అభిరుచులూ, ఆశయాలూ చాల విచిత్రమైనవి ప్రజల నిజమైన ప్రగతికి గుడీ, బడీ, మడీ ఆయనదృష్టిలో ముఖ్యమైన మూల సంస్థలు గుడి ఆధ్యాత్మిక చింతనకూ, బడి అనంత విజ్ఞానానికీ మడి అంతులేని పాడిపంటలకూ గుర్తులు గడికంటె బడి గొప్పది బడికంటె మడి ఇంకా గొప్పది గుడి వ్యక్తిగతమైనది, బడీ, మడీ రెండూ సమష్టి పరమైనవి మొక్కుబడి చెల్లించే స్థానాలుగా మాత్రమేకాక ప్రజల అన్ని రకాల అభివృద్ధికి తోడ్పడే రీతిలో దేవాలయాలు రూపొంది పెంపొందాలని ఆయన కోరిక అంటే ఈ దేవళాలు ప్రజలకు విద్యాబుద్ధులు నేర్పించి, అనువైన వైద్యసహాయం అందించి, మంచి ఆలోచనలనూ మంచి ఆచరణలనూ అలవరిచే కేంద్రాలుగా ఉండాలని ఆయన అభిలాష ఆత్మ శుద్ధినీ, బాహ్య పరిశుభ్రతనూ తెలియజెప్పి ఒక మంచి లక్ష్యాన్ని చేరుకోవడానికి ఉపయోగపడే చక్కటి కూడలి స్థానాలుగా మాత్రమే దేవాలయాల

అవసరాన్ని ఆయన గుర్తించారు కులవిభేదాలకు, మతవిద్వేషాలకు అతీత మైన పుణ్యస్థలాలుగా, జనులంతా అన్నదమ్ములవలె మెలగే పవిత్ర క్షేత్రాలుగా దేవాలయాలు ప్రవర్తిల్లాలని ఆయన అభిమతం అయితే చేతిలో చిల్లిగవ్వ కూడలేని ఆయన కోరిక నెరవేరే దెట్లు?

స్వామీజీ శిష్యులు దక్షిణభారతదేశమంతటా లక్షల దిమంది ఉన్నట్లు మనం తెలుసుకున్నాం స్వామీజీ సంకల్పం తెలిసిన వెంటనే ఆయన అభిమానులూ, అంతేవాసులూ వారి ఆశయాలను నెరవేర్చడానికి పూనుకున్నారు పాడుబడిన దేవాలయాలను బాగుచేసి అక్కడ విద్యాల యాలను కూడ స్థాపించారు, వైద్యశాలలను నెలకొల్పారు ఒకవైపు సవర్ణుల దేవాలయాలలోనికి అంటరానివారికి ప్రవేశం కావాలన్న ఉద్య మమూ నడచింది ఇంకొకవైపు ఈ ఉద్యమకారకులచే కొత్త దేవాలయా లను నిర్మించే ప్రయత్నమూ జరిగింది ఇదే వైక్కం' సత్యాగ్రహంగా చరిత్రలో ప్రసిద్ధికెక్కింది ఈ ఊపులో ఒక దశాబ్దికాలంలో నూరారు కొత్త కోవెలలు వెలిశాయి వీటిలో ఈడవ తెగవారిని అర్చకులుగా నియ మించి, వారికంటె తక్కువ కులాలవారికి కూడ ఈ కోవెలలో పూజలు చేసుకునే హక్కు కల్పించబడింది ఆనాటి తిరువాన్కూరు సంస్థాన పాల కులు 'వైక్కం' ఉద్యమకారుల కోర్కెలనూ, ఉద్యమ మూలపురుషుల నైతికశక్తిని గుర్తించక తప్పింది కాదు అంటరాని తెగలవారికి దేవాల యాలలో ప్రవేశించే అర్హతను 1932 లో చట్టంద్వారా కల్పించి ఇతర రాష్ట్రాల పాలకులకు తిరువాన్కూరు ప్రభువులు మార్గదర్శకులయ్యారు

నారాయణ గురుదేవులు విగ్రహారాధనకు వ్యతిరేకులు కారు అది తప్పని ఆయన అనలేదు అట్లని విగ్రహారాధన తప్పనిసరి అని ఆయన చెప్పలేదు ఆయన కట్టించిన ఒకానొక దేవాలయంలో దేవతా విగ్రహమే లేదు ఒక పెద్ద నిలువుటద్దం మాత్రం దేవుడి బొమ్మస్థానంలో కనిపిస్తుంది అద్దంలో కనిపించే ఎవరి ప్రతిబింబాన్ని వారు అర్చించాలని ఆయన ఉద్దేశం కోవెలలో కొలువైన దేవతామూర్తిగా జనులు తనను ఆరాధించే

ఆదర్శస్థితికి ప్రతివ్యక్తి ఎదగాలని ఆయన ఉద్దేశంలోని రహస్యం అంటే మానవుడె ప్ర ్ ్ మానవసేవే మాధవసేవ అని ఆయన అంతరార్థంగా అంచనా వేయవచ్చు సామాన్యులకు గుడీ గుడిలోని విగ్రహమూ ఏకాగ్రతను సాధించడానికి ఒక కొండగుర్తుగా పనికి వస్తాయి అన్నీ తెలిసిన సాధకులకు గుడి గోపురాలతో, పూజా పురస్కారాలతో పనిలేదు అందుకనే తరువాత తరువాత కొత్తకోవెలల నిర్మాణాన్ని ఆయన ఆపు చేయించారు

నారాయణ గురుదేవులు స్థాపించిన సంస్థచేసిన కృషి కారణంగా 1905 లో అంటరానివారు సవర్ణులతో కలిసి చదువుకోవడానికి తిరువాన్కూరు సంస్థానం సర్కారువారి అనుమతి లభించింది ఆయన శిష్యులు సంఘంలోని అనాచారాలకూ దురాచారాలకూ, గుడ్డినమ్మకాలకూ, శకునాలకూ, బూజుపట్టిన ఊహలకూ మారొడ్డి నిలిచి పోరాటం సాగించి ప్రజలలో వివేకపరిపాకం గల ఆలోచనా దృష్టినీ హేతువాదబుద్ధినీ కలిగించారు చిలిపి కయ్యాలతో చిల్లరమల్లర కొట్లాటలతో చీటికీమాటికి కోర్టుల కెక్క కూడదని ప్రజలలో స్వామీజీ చేసిన ప్రచారం బాగా పనిచేసిందని ఆ నాటి కోర్టుల నివేదికలు పేర్కొంటున్నాయి పరస్పర జిగీష ప్రశంసనీయ గుణమైనా జిగీషకాదు జిజ్ఞాస ముఖ్యమని ఆయన సిద్ధాంతం అందుకే, 1924 లో 'ఆలువ' అద్వైతాశ్రమంలో సర్వమత సభలు స్వామీజీ ఆదేశం మేరకు నిర్వహించబడ్డాయి ప్రపంచంలోని మానవులంతా సోదరులని నిరూపించడానికీ, అన్ని మతాలలోని మంచిని స్వీకరించడానికీ ఈ సభలు ఉపకరించాయి

గాంధీమహాత్మునికంటె చాల పూర్వమే నిరుపేదల నిమ్నజాతుల జీవితాలను బాగుచేయడానికి తమ జీవితాన్ని అంకితం చేసిన నారాయణ గురుదేవులు 1928 వ సంవత్సరం సెప్టెంబరు 20 వ తేదీన పరమపదించారు సంఘసంస్కర్తగా, మహాయోగిగా, ఉత్తమ ఉపదేశకుడుగా నారాయణ గురుదేవుల పేరు చిరస్థాయిగా చరిత్రలో నిలిచిపోయింది వారు నెలకొల్పిన సంస్థ నేటికి కూడ లక్షలాది ప్రజలను ఆకర్షిస్తూ మూడుపువ్వులు ఆరు కాయలుగా విస్తరిల్లుతున్నది

# నైవేద్యము – స్మరణ

ఒక వంక భారతీయ విజ్ఞానం ౣా.ుపట్టి మూఢవిశ్వాసాల మురికి కూపంలో కుళ్ళిపోతూ, మరో వంక లోతులేని పాశ్చాత్య నాగరికతా రీతులు బలాత్కారంగా దేశంలో జొరబడుతూ ఉన్న సంధియుగంలో రవీంద్రనాథ టాగూర్ జన్మించారు

చిరకాలంగా స్థిరపడివున్న మూఢవిశ్వాసాల చీకటి తెరలను తొలగించే వెలుగు ప్రసరించకుండానే, పాశ్చాత్యులరాకతో భౌతికశాస్త్ర విజ్ఞానం ఈ దేశంలో హఠాత్తుగా తల ఎత్తింది గుమాస్తాల తయారీకి ఏర్పడ్డ పాశ్చాత్యవిద్యతోపాటు ప్రవేశించిన ఈ విజ్ఞానం జాతీయులకు విజాతీయంగా, విరుద్ధంగా కన్పించటంతో ఆత్మరక్షణకోసం దేశీయ పండితులు ఆ పాత విశ్వాసాలకే విలువలు కట్టటం ప్రారంభించగా, ఆంగ్ల విద్యాధికులు చాలమంది తమకు అస్తుపిస్తుగా అబ్బిన పాశ్చాత్య సంస్కృతికే పట్టంకట్టి ప్రాచ్యసంస్కృతిని విస్మరించారు విజ్ఞానం విశ్వజనీనమైనదనే జ్ఞానం మెరుగుపడింది ప్రాచ్య పాశ్చాత్య విజ్ఞానాలు పరస్పర విరుద్ధాలుగా గోచరించాయి దేశంలో వైజ్ఞానికంగా స్తబ్దత ఏర్పడింది 'పాతరోత, క్రొత్త వింత' కాగా, ఈ రెండిటి మధ్యా సరియైన దారికోసం దేశం తహ తహ లాడింది

ఈ యుగసంధిలో ప్రాతరరుణకాంతులతో భారత వియత్తలాన్ని వెలిగించిన మహాకవి రవీంద్రుడు ఆ నిస్తబ్దతను ప్రతిఘటించి, సర్వ సమన్వితమైన, సర్వ సమర్థమైన, సర్వస్వతంత్రమైన ఉత్తమ కళాసృష్టికి ఆయన ఉద్యమించారు ప్రాచ్య పాశ్చాత్య కవితా సాంస్కృతిక రీతుల

లోని మేలిమిని సంగ్రహించారు పాశ్చాత్య విజ్ఞానాన్ని సనిగా ఆకళింపు చేసుకుని, జాతీయ జానపద విజ్ఞాన పీచికల్లో ఓలలాడి తనదైన, తన జాతిదైన ఒక సరికొత్త కళామూర్తిని సృష్టించారు ఈ దృష్టితోచూస్తే - మనదేశంలో ఈనాడు రూపొందిన ఆధునిక దృక్పథానికి ఆయన ఆద్యులు మన జానపద సంస్కృతికి పాశ్చాత్య శిల్పం జతపరచటంలోనే ఆయన ప్రత్యేకత ఉంది ప్రకృతిని ఎలా అర్థం చేసుకోవాలో ఆయన ప్రజలకు నేర్పారు మానవుడు ప్రకృతిని జయించి, ప్రకృతి సంపదలను అనుభవించాలని ఉద్బోధించారు పొలందున్నే రైతుల మధ్యా, రాళ్లు కొట్టే కూలీల మధ్యా సర్వదా ఆయన జీవించారు జాతీయ ప్రతిభలోంచ ఆత్మీయ ప్రతిభను మూర్తీభవింపజేసుకుని జాతి పునరుజ్జీవనానికి తన కళాసంపత్తిని అంకితం చేసారు రష్యాలో పుష్కిన్, అమెరికాలో వాల్ట్ విట్‌మన్, ఇంగ్లాండులో వర్డ్స్ వర్త్-కోలెరిడ్జ్‌లు తమ తమ జాతి సంస్కృతుల్ని ఎలా మహోన్నత శిఖరాలకు లేవనెత్తారో అలాగే రవీంద్రుడు తన జాతి సంస్కృతిని హిమాలయోన్నత శిఖరాలకు లేవనెత్తారు అసభ్యతా హేతువులైన మధ్యతరగతి పైపై మెరుపులకు పోక, టాల్‌స్టాయిలాగా సగటు మనిషి నిరాడంబరతనూ, నిజాయితీని నిక్కచ్చితనాన్ని, ... ప్రైనై శిల్పాన్ని ఆయన స్వీకరించారు పతితుడూ, భ్రష్టుడూ అయి, అనేక లౌల్యాలకూ, దౌర్బల్యాలకూ లోనయి కూడా ఆ సగటు మనిషే ప్రేమాభిమానాలనూ, సేవా సమగ్రతలనూ యుగ యుగాలుగా కాపాడుకుంటూ, అన్ని ఆటుపోటులకూ తట్టుకుని, జాతిసంస్కృతికి రూపురేఖలు తీర్చాడని ఆయన గట్టిగా విశ్వసించారు ఆ సగటు మనిషినుంచే తాను ఉత్తేజం పొందారు, ఉత్తేజింపజేసారు ఆ సగటు మనిషికి హద్దులేదు, అదుపులేదు అతను విశ్వజగత్తుకు ప్రతినిధి, త్రివిక్రమ స్వరూపుడు విశ్వమానవత్వమే అతని మతం అతని సమ్యగారాధనే రవీంద్రుని కళాసాధన

మహాకవిగా రవీంద్రుడు తన నాటి వాస్తవజీవితాన్ని తన వివిధ కళారూపాలలో ప్రస్తరించారు పాతను పట్టుకు వేళ్ళాడుతూ, కొత్త కోసం అర్రులు జాపుతూ ఉన్న ఆనాటి సమాజంలోని వివిధ శక్తులనూ మూర్తిమంతాలుగా చిత్రించారు సమాజంలో సమున్మిషిత మవుతూ వచ్చిన పునరుజ్జీవన ప్రయత్నాన్ని కళ్ళకు గట్టిచూపారు అన్నింటినీ మించి బెంగాలీభాషకు ఆయన గిడుగు రామమూర్తిపంతులు వంటివారు బెంగాలీ వారి చలిత్ భాష సాధుభాషలు క్రమంగా మన వ్యావహారిక భాష, గ్రాంథిక భాష వంటివి జానపదభాషను సాహిత్యభాషతో సంగమింపజేసి, ఉత్తేజకరమైన ఒక కొత్త శైలిని రూపొందించారు భారతదేశంలో నవల అనేది ఆయన చేతిలోనే సమగ్రరూపంలో సాక్షాత్కరించింది

పాశ్చాత్యదేశాల్లో ప్రబలిన భౌతికశాస్త్ర విజ్ఞానంతో హేతువాదంతో సమాజం సంక్షుభితమైన ఆనాడు 'శాంతం శివం, అద్వైతం' అనేదే తారక మంత్రంగా ఆయన ఉపదేశించారు అయితే ఆయన ఎక్కడా ఏ ఆచారానికీ సంప్రదాయానికి తలఒగ్గలేదు రష్యన్ సోషలిజంలో ఆయనకు ఆధ్యాత్మికత గోచరించింది మానవుని సృజనాత్మక శక్తినుంచే ఒక నూతన భావన ఏర్పడగలదని అనే ప్రపంచాన్ని మరింత సంపన్నంగా, సర్వోన్నతంగా తీర్చిదిద్దగలదనీ ఆయన నమ్మకం భౌతిక శాస్త్ర విజ్ఞానం మానవతా మూల్యాల సాధనకు ఒక సాధనం మాత్రమే కాని, అదే పరమార్థం కాదని ఆయన ఉద్దేశం ఆయనకు కావలసింది చేతిలో దీపం కాదు, అంతర్దీపం

విశ్వమానవ దృష్టితో ఆయన జాతి మతావధుల్ని అతిగమించారు జాతి హక్కులకంటె వ్యక్తి హక్కులు ముఖ్యమనీ రాజకీయ స్వాతంత్ర్యం కంటే ఆర్థిక స్వాతంత్ర్యం అత్యంతం ఆవశ్యకమని ఆయన నొక్కి వక్కాణించారు

ప్రపంచ దేశాలన్నిటా పర్యటించి ప్రపంచ ప్రజలకు తన శాంతి శివాద్వైత సందేశాన్ని అందజేశారు

పాశ్చాత్య దేశాలవారు నీతి నియమాలు విడిచి, ఆర్థిక లాభంకోసం రాజకీయాధికారం కోసం ఇంకా ఇలాగే ప్రవర్తించినట్లయితే, ఈ మానవ నాగరికత సమస్తం సర్వ నాశనం కాగలదని ఆయన నిర్భయంగా నిర్ద్వంద్వంగా పదే పదే ఎచ్చరించారు

ఆయన ఎచ్చరించినట్లుగానే ద్వితీయ ప్రపంచయుద్ధం రానే వచ్చింది

'ఈ మహోత్పాతం నుంచి ప్రపంచాన్ని ఉద్ధరించగల మహాత్ముడు ఈ దరిద్ర భారతదేశంలోనే అవతరించాలి' అని ఆయన భారత జాతీయత లోని విశ్వజనీనను వెల్లడించారు ఆదే ఆయన ఆశ

మహర్షిగా మహామనిషిగా మహాప్రవక్తగా సంపూర్ణమానవుడిగా భారతజాతికి వెలుగుదివిటీలెత్తిన మహాకవి రవీంద్రుడు

ఆ రవీంద్రుని చరణసన్నిధిలో ప్రశాంత శాంతినికేతన వాతావరణంలో తాత్త్వికచింతననూ, తార్కిక పరిశీలననూ అలవరుచుకొని, కళా సంప్రదాయ లోతుపాతులను చక్కగా అవగాహన చేసుకున్నవారు డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారు

తెలుగు సంస్కృతికి దివ్యదీప్తులు చేకూర్చిన శ్రీమంతుల కుటుంబాలలో శ్రీ గోపాలరెడ్డిగారిది పేరెన్నికగన్నది శ్రీ గోపాలరెడ్డిగారి తండ్రి పట్టాభిరామరెడ్డిగారూ, మామగారు తిక్కవరపు రామిరెడ్డిగారూ నెల్లూరు సీమలో పేరుమోసిన కళాభిమానులు, కవిపండిత పోషకులు అటు రెడ్డి రాజుల కళాభిమానమూ, ఇటు నెల్లూరు నెరజాణల కావ్యనిర్మాణ కౌశలమూ శ్రీ గోపాలరెడ్డిగారిలో చక్కగా సగంపాళ్ళలో కనిపిస్తాయి

తెలుగునాట రాజకీయ నాయకులలో చాలమందికి సాహిత్యాదికి మంటే షష్ఠాష్టకం, అలాగే, సాహితీపరులకు రాజకీయాలంటే తగనిభయం అటు రాజకీయ రంగంలోనూ, ఇటు సాహితీరంగంలోనూ సవ్యసాచిలా దిగ్విజయం సాధించిన దొడ్డ కుటుంబంలో పుట్టిన ఈ రెడ్డిబిడ్డ ఈ రెండు రంగాలతోనూ దొరలేసి దొరతనం చేశారు రాజ్యపాలకులుగా, కవితారాజ్య పాలకులుగా ఈ రెండు రంగాలలోనూ వీరి పయుకుబడి విశిష్టమైనది శాంతినికేతన పట్టభద్రులైన శ్రీ రెడ్డిగారు దీక్షావిధినంది గురూదితం అనూదితం చేసి గురుఋణాన్ని తీర్చుకోవడం సంప్రదాయ దీక్షాపరులకు, సాహిత్య సత్యవ్రతులకు సంతోషదాయకమైన విషయం

అనువాదమన్నది అసిధారావ్రతం, మూలభాషాగతభావం చెడకుండా, అనూదిత భాషాసౌందర్యం సడలకుండా నిర్వహించటం చాల కష్టమైనపని అనువాదకులు రెండు భాషల్లోని మరుగులూ, మెరుగులూ, సొగసులూ, సొయగాలూ తెలిసిన దిట్టలై ఉండాలి అందులోనూ కవిత్వం అనువదించటం మరీ దుస్సాధమైన విషయం వస్తుతః కవిహృదయం కలిగి, మూలకవి హృదయం ఎరిగి, సహృదయ హృదయ గమంగా చెప్పగలగటం అసాధారణమైన సాధన

రవీంద్రుని మార్మిక తాత్త్విక కవితకు 'నైవేద్యం' ఒక మచ్చు తునక, ఇందులోని ప్రతి గీతం ఒక కావ్యం

ఆయన 'కన్నీళ్ళలో కాంతులు విరజిమ్మే నిర్లిప్త తాత్త్విక దృష్టి'కి, 'స్మరణ' ఒక ఉదాహరణ ఇది సతీస్మృతి కావ్యం

ఈ కావ్య ద్వయాన్ని బెంగాలీ భాషనుంచి తెనిగించి శ్రీ గోపాల రెడ్డిగారు రవీంద్ర కవీంద్రుని హృదయాన్ని తెనుగువారికి అందించటం ముదావహం

ఛందో బందోబస్తులు లేని స్వచ్ఛందరీతిలో శ్రీ గోపాలరెడ్డిగారు తమ అనువాదం సాగించారు జటిల సమాస భూయిష్ఠం కాని సరళశైలిలో సాగిన ఈ అనువాదం ఆంధ్రావళికి ఆదరణీయం కాగలదు

సర్వాంతర్యామిని గూర్చిన వారి అనువాదం చూడండి

మాఝె మాఝె కితబార్ భాబి కర్మహీన్
ఆజ్ ˇష్ట లోబేలా నష్ట ˇాలోదిన్
నష్ట శోయ్‌నాయ్ ప్రభు, సే సంల్ క్షణ్ -
ఆప్‌నీ తాదేర్ తూమి కరేఛే గ్రహణ్
ఓగో అంతర్యామీదేవ్, అంతరే అంతరే
గోపనే ప్రచ్ఛన్న రహి కొన్ అవసరే
బీజేరే అంకురరూపే తూలేఛా ఝోగాయే
ముకులే ప్రస్ఫుట వర్ణే దియేఛా రాంగాయె
ఫూలేరే కరేఛొ ఫల్ రసే సుమధుర్
బీజే పరిణత గర్భ - ఆమి నిద్రాతుర్
ఆలస్యశయ్యార్ - పరే శ్రాంతితే మరియా
భేబేఛిను సబ్‌కర్మ రహిలో పడియా
ప్రభాతే జాగియా ఉఠి మేలినూ నయన్
దేఖిను భరియా ఆఛె ఆమార్ కానన్'

ఓ అంతర్యామి దేవా లోపల
గోపానముగ దాగి యుండి
ఏదో ముహూర్తమున
బీజమును అంకుర రూపముగా లేవ నెత్తుదువు
ముకుళమును ప్రస్ఫుట వర్ణముంతో

చిత్రించుచున్నావు,
పుష్పమును రసమున మధురము
గర్భమున బీజము దాల్చిన
ఫలమున కొసర్చుచున్నావు" (నై వే 24)

( Hidden in the heart of things thou art norishing seeds into sprouts into blossomes, and ripening flowers into fruitfulness")

ప్రాణస్పందం స్పందించే ఆయన పంక్తులు 'ఆ యుగ యుగాంతరముల విరాట్ స్పందన నా నాడియందు నేడు నృత్యం చేయుచున్నది'

("And my pride is from the life throb of ages dancing in my blood this moment")

"Where the mind is without fear and the head is held high "

చిత్త జెథాభయశూన్య ఉచ్చ జెథాశిర్
జ్ఞాన్ జెథా ముక్తి జెథా గృహేర్ ప్రాచీర్
ఆపన్ ప్రాంగణ్ తలే దిబస్ శర్బరీ
ఒసుధారే రాఖేనాయ్ ఖండ క్షుద్రకరి
జెథా వాక్య హృదయేర్ ఉత్సముఖ్హతే
ఉచ్ఛ్వసియా ఉఠే జెథా నిర్వారిత స్రోతే
దేశేదేశే దిశేదిశే కర్మధారా ధాయ్
అజస్ర సహస్రవిధ్ చరితార్థతాయ్ —
జెథాతుచ్ఛ ఆచారేర్ మరుబాలురాశి
విచారేర్ స్రోతఃపథ ఫేలేనాయ్ గ్రాసి

పౌరుషేర్ కి రేని శతధా-నిత్యజేథా
తుమి సర్వకర్మ చింతా ఆనందేర్ నేతా —
నిజహస్తే నిర్దయ ఆఘాత్ కరి, పితః,
భారతేరే సెయీ స్వర్గే కరో జాగరిత

అన్న రవీంద్రుని సుప్రసిద్ధ ఖండానికి శ్రీ రెడ్డిగారి అనువాదం పరికించండి

"చిత్తం ఎచ్చో భయరహితమో
శిరము ఎచ్చో ఉన్నతమో
జ్ఞానం ఎచ్చో స్వచ్ఛందమో
గృహప్రాకారములు ఎచ్చో ప్రాంగణములలో రేయింబవళ్ళు
వసుధను చీల్చి ముక్కలు చేయవో
ఎచ్చో వాక్యములు హృదయంపు చెలమ ముఖమున
పొంగి పారునో
ఎచ్చో అడ్డులు లేని వెల్లువలో
ఎల్ల ఎడల, పలు దిక్కుల
నిరంతరముగ సహస్రచరితార్థములలో
కర్మధారలు పరుగిడునో
ఏచ్చో తుచ్ఛ ఆచారములచు ఏడారి ఇసుక తిన్నెలు
భావనా స్రవంతి గతుల గ్రసింపవో
ఎచ్చో పురుషార్థములు నిరర్థకములు కావో
ఎచ్చో నిత్యము నీవు
సర్వ కర్మముల చింతల ఆనందముల అధినేతవౌ
నిజహస్తములతో నిర్దయగ ప్రహార మొనర్చి తండ్రీ
భారతమును అట్టి స్వర్గమున మేల్కొలుపుము' (నైవే 72)

ఇక 'స్మరణ' నుంచి ఒక చిరస్మరణీయమైన గీతం ఉదాహరిస్తాను-

ఏ ఆమార్ శరీరేర్ శిరాయ్ శిరాయ్
జే ప్రాణ తరంగమాలా రాత్రిదిన్ ధాయ్
సెయీ ప్రాణ్ ఛూటియాఛే విశ్వదిగ్విజయె
సెయీ ప్రాశ్ అపరూప్ ఛందేతాలే లయే
నాచిఛే భువనే - సెయీ ప్రాణ్ చూపే చూపే
వసుధార్ మృత్తికార్ ప్రతిరోమకూపే
లక్ష లక్ష తృణే తృణే సంచారే హరషే
వికాశే, పల్లవే పుష్పే, బరషే బరషే
విశ్వవ్యాపీ జన్మమృత్యు - సముద్ర - దోలాయ్
దూలితేఛే అంతహీన్ జోవార్ - భాటాయ్
కరితేచి అనుభవ్ సే అనంతప్రాణ్
అంగే అంగే ఆమారే కరేఛే మహీయాన్

సెయీ యుగయుగాంతర్ బిరాట్ స్పందన్
ఆమార్ నాడీ తే ఆజికరిఛే నర్తన్

'నీవు నా జీవితమున
కలిపితివి మృత్యు మాధుర్యమును
చిర నిష్క్రమణ కాంతితో
చిత్రించి పోయితివి నా హృదయమును
అన్ని తలంపులలోను లిఖించి వెడలితివి
సూర్యాస్త వర్ణచాతుర్యముతో
జీవిత దిక్చక్ర సీమలు
పొందినవి అపూర్వ మహిమల

అశ్రుధౌత హృదయాకాశమున
　　కానిపించుచున్నది దూరపు స్వర్గం
నీవు నా జీవితమున
　　కలిపితివి మృత్యు మాధుర్యమును
నీవు కళ్యాణ రూపిణివి
　　మరణమునే మంగళ మొనర్చితివి' (స్మ 13)

కొన్నిచోట్ల మూలానుయాయిగా, కొన్ని చోట్ల మూలాతిశాయిగా శ్రీ రెడ్డిగారి అనువాదం ఆంధ్రపాఠకుల అనుభవానికీ,అభిరుచికీ అనుగుణంగా కొత్త వన్నెలు సంతరించుకున్నది ఈ నైవేద్య స్మరణలు జాతీయ కవియై విశ్వకవి అయిన రవీంద్రుని కవితా వైభవానికే తెలుగునాట వెలయించటానికై శ్రీ గోపాలరెడ్డిగారెత్తిన చిరుదర్పణాలని చెప్పవచ్చు.

# నాగార్జున విశ్వవిద్యాలయం తెలుగుశాఖలో పరిశోధన

మనిషి నిత్యాన్వేషి సత్యపదార్థాన్వేషి ఆదిలో అతను అచ్చంగా ఒక అర్భకుడు స్థూలదృష్టిలో పంచభూతాత్మకమైన ఈ విశాలవిశ్వం అతనికి అర్థంకానిదిగా, అద్భుతావహదిగా కనిపించేది మరి, అనంతమైన అతనికి ఆలోచనాలోచనాలు అంతటితో ఊరుకోవుగా! అంతా తెలుసుకుందామని అతని ఆరాటం, అంతా సొంతం చేసుకుందామని అనుక్షణం అతని పోరాటం అతనికి తెలిసిందొక బిందువు, తెలుసుకోవలసింది మహాసింధువు చుట్టూరా ఉన్నవాటినేకాదు, సుదూరంలో ఉన్న వాటినికూడా అవలోకిద్దామని అతని తహతహ! అంతవరకు అతని జిజ్ఞాస ఆరదు, అతని జిగీష మారదు ముందుకు, మున్ముందుకు సాగాలని ముచ్చటపడతాడు తెలిసిన కొన్ని విషయాలు ఆధారంగా తెలియని కోటి కోటి అంశాలను తెలుసుకోవాలని కుతూహలపడతాడు అందుకోసం ఒక లక్ష్యం నిర్ణయించుకుంటాడు దానికి వలసిన సాధనాలను సమకూర్చుకుంటాడు అనుసరించవలసిన విధానాలను నిర్ధారించుకుంటాడు ఆ దిశలో అన్వేషణా ప్రస్థానం సాగిస్తాడు

అయితే, అన్నివేళలా అంతా సాఫీగా, సజావుగా సాగుతుందన్న భరోసా లేదు సవ్యంగా, సకాలంలో లక్ష్యం చేరుకోగలడన్న నమ్మకమూ లేదు మధ్యలో ఎన్నెన్నో అడ్డంకులు ఎదురుపడవచ్చు ఏవేవో ఒడుదుడుకులు అతని ప్రయత్నాలను సడలింపజేయవచ్చు కానీ, అతనిది ఉడుంపట్టు చివరి లక్ష్యం చేరేదాకా అతనికి శాంతిలేదు, విశ్రాంతి లేదు

తనలో తాను విడమర్చుకుని, తనతోడి వారితో చర్చించి, తప్పులు సరి దిద్దుకుని, అవసరమనిపిస్తే అన్వేషణావిధానాలను కొద్దిగా మార్చుకునీ, ఆవశ్యకసాధనాలను కొత్తగా మలచుకునీ, మళ్ళీ తనకృషిని కొనసాగి స్తాడు. నందిస్తే పొంగిపోడు; నిందిస్తే కుంగిపోడు. దూషణభూషణల కతీతంగా వేలవేల యేళ్ళుగా వేలాది పరిశోధకులు కొనసాగించిన ఈ నిరంతరాన్వేషణల ఫలితంగా అనేక దార్శనిక మర్మాలూ, ప్రకృతి రహ స్యాలూ వెలుగులోకి వచ్చాయి. వీటిలో తరాల తరబడిగా నూరారుమంది [illegible] తరచితరచి పరిశోధించి సాధించిన ఫలితాలు కొన్ని; ఒకదాని కోసం అన్వేషిస్తుంటే అనుకోకుండా, అప్రయత్నంగా బయటపడ్డ ఫలితాలు మరికొన్ని. జనుల మేధాశక్తి పెంపొందడానికీ, సమాజజీవనం సుఖమయం కావడానికీ ఈ ఫలితాలు కారకాలుగా కొన్నీ, ప్రేరకాలుగా కొన్నీ ఉప కరిస్తూ వస్తున్నాయి.

నాగార్జున విశ్వవిద్యాలయం బోధనకూ, పరిశోధనకూ అంకితమైన ఉన్నతవిద్యాసంస్థ. నేడు గుంటూరు - విజయవాడ పట్టణాలకు నట్టనడుమ, జాతీయ రహదారికి పక్కన, కాజ - నంబూరు పంచాయతీ భూభాగంలోని నాగార్జుననగర్‌లో ప్రవర్ధిల్లుతున్న ఈ సంస్థకు తొలిరూపమైన గుంటూరు-స్నాతకోత్తర విద్యాకేంద్రం 1967 నుంచి ఇంచుమించు ఒక దశాబ్దం పాటు ఆంధ్ర విశ్వవిద్యాలయం అనుబంధ సంస్థగా గుంటూరు చేరువలో గల నల్లపాడులో నెలకొని పనిచేసింది. 1976 మే నెల 1 వ తేదీ నుంచి స్వాధికార స్నాతకోత్తర విద్యాకేంద్రంగా కొన్ని నెలలు కొనసాగింది 1976 ఆగష్టులో ప్రత్యేక ప్రతిపత్తి కలిగిన విశ్వకళాపరిషత్తుగా నాగార్జున విశ్వవిద్యాలయంగా అవతరించింది. స్నాతకోత్తర విద్యా కేంద్రంగా ఉన్నప్పుడూ, విశ్వవిద్యాలయంగా మారిన నాటినుంచి నేటి వరకూ వివిధ శాఖలలో అనేక వైజ్ఞానిక - సామాజిక రంగాలలో అత్యున్నత స్థాయికి చెందిన పరిశోధనలు కొనసాగుతూనే ఉన్నవి.

ఈ సంస్థకు నాటికీ నేటికీ అమరి ఉన్న ఆర్థికపరమైన వనరులు అతి పరిమితం భవనాలు అందామా అంతంత మాత్రం! ప్రయోగశాలల్లోని ప్రాయోగికపరికరాలూ, శాస్త్రీయ సాంకేతిక సాధనాలూ బొటాబొటి ఆధునిక పరిశోధనావశ్యకాలకు అంతగా చాలనట్టి గ్రంథాలయం విశ్వవిద్యాలయ పరిధిలోని గుంటూరు - తెనాలి - విజయవాడ పట్టణాలకూ ఈ సంస్థ నెలకొని ఉన్న ప్రాంతానికీ గల రాకపోకలలోని అసౌకర్యాలు చెప్పలేనన్ని కొత్తగా పుట్టి పురుడు తీర్చుకుంటున్న సంస్థ కాబట్టి పదే పదే పట్టి పారార్చే బాల్యారిష్టాలు బండ్ల కొలది ఇన్ని ఇబ్బందులూ, ఇన్ని ఇరకాటాలూ అడుగడుగునా ఎదురవుతున్నప్పటికీ ఈ సంస్థాపకులూ, ఇక్కడి అధ్యాపకులూ, పరిశోధక విద్యార్థులూ అతి పరిమితమైన ఈ పరిధులనూ, అనంతమైన ఆతంకాలనూ అతిగమించి చిత్తశుద్ధితో నిరంతర కృషితో, దీక్షాదక్షతలతో తమ విధులను నిర్వహించి అనేకానేక మౌలి కాంశాలను నిరూపించే పరిశోధనా పత్రాలను, సిద్ధాంత వ్యాసాలనూ సమర్పించగలిగారు నూటికిపైగా ఎం ఫిల్ పి ఎచ్ డి పట్టాలను సాధించగలిగారు వెయ్యికి పైగా పరిశోధనా పత్రాలూ సిద్ధాంత వ్యాస సారాంశాలూ జాతీయ, అంతర్జాతీయ ప్రశస్తిగల ప్రసిద్ధ పత్రికలో ప్రచురితమై దేశ విదేశీయ పరిశోధక ప్రముఖుల మెప్పులను పొంద గలిగాయి 'లెక్కకు రానీయరు కార్యసాధకులు దుఃఖంబున్ సుఖంబున్ మదిన్' - అన్న కవి వాక్కును విశ్వవిద్యాలయ అధ్యాపకులూ, పరిశోధక విద్యార్థులూ సహస్రముఖాల సార్థకం చేయగలిగారు

ప్రకృతచర్చ నాగార్జున విశ్వవిద్యాలయం - తెలుగుశాఖలో ఇంత వరకు జరిగిన ఇప్పుడు కొనసాగుతున్న పరిశోధనల వివరణకు మాత్రం పరిమితం,

ప్రస్తుతం తెలుగుశాఖలోని అధ్యాపకులు ఎనిమిది మందిలో అయిదు గురు మాత్రమే పరిశోధనా పర్యవేక్షకులుగా గుర్తింపును పొందినవారు వీరు భాషా సాహిత్య శాస్త్రాలకు సంబంధించిన వివిధ క్షేత్రాలలో విశిష్ట కృషిని సల్పి లబ్ధ ప్రతిష్ఠులైన వారు ఉపన్యాసాలను రచించి ఆంధ్ర విశ్వవిద్యాలయం ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ మున్నగు సంస్థల నుంచి అనేక బహూకృతులందినవారు ఆంధ్ర ఉస్మానియా కాకతీయ, కేరళ, బెంగుళూరు, బెనారస్ మద్రాసు మైసూరు, శ్రీకృష్ణదేవరాయ శ్రీ వేంకటేశ్వర ప్రభృతి వివిధ విశ్వవిద్యాలయాలకు ఎం ఫిల్ ఎం లిట్ పిఎచ్ డి , డి లిట్ పట్టాలకై సమర్పించబడ్డ అనేక సిద్ధాంత వ్యాసాలకు ఈ తెలుగు శాఖలోని అధ్యాపకులు పరీక్షకులుగా నియమితులవుతున్నారు కూడా ఆగ్రా, ఉడుపి కలకత్తా, కువాలాలం పూర్, డిల్లీ తిరుపతి, తిరువనంత పురం, ధార్వాడ పూనా బెంగుళూరు, భువనేశ్వర్, మదురై, మద్రాసు మైసూరు వారణాసి వార్ధా, వాల్తేరు శాంతినికేతనం హైదరాబాదు మున్నగుచోట్ల జరిగిన జాతీయ, అంతర్జాతీయ సదస్సులలో, చర్చాగోష్ఠులలో ఈ శాఖా ధ్యాపకులు అనేక పరిశోధనాపత్రాలు సమర్పించి గణనీయమైన పాత్రను నిర్వహించారు యు జి సి రాష్ట్ర కేంద్ర సాహిత్య అకాడమీలు తెలుగు అకాడమీ సంగీత నాటక అకాడమీ అంతర్జాతీయ తెలుగుసంస్థ వంటి విద్యా సాంస్కృతిక సంస్థలు, ఆంధ్రప్రదేశ్ జనసంబంధశాఖ వంటి ప్రభుత్వశాఖలు చేపట్టిన పరిశోధనా పథకాలతో ఈ శాఖాధ్యాపకులకు ఉపదేశకులుగా, నిర్దేశకులుగా సమీచీన సంబంధాలు ఉన్నవి

ఈ పదేళ్ళ వ్యవధిలో వీరి పర్యవేక్షణలో ఎనుబది మందికి పిఎచ్ డి పట్టాలు, నూరారు మందికి ఎం ఫిల్ పట్టాలు వచ్చాయి ప్రస్తుతం ఎనభై మందికి పైగా ఎం ఫిల్ , పిఎచ్ డి, పట్టాలకోసం

పరిశ్రమిస్తున్నారు ఇందులో ఆంధ్రదేశంలోని వివిధ కళాశాలల్లో తెలుగు అధ్యాపకులుగా ఉంటూ 'పార్ట్-టైమ్' పద్ధతిలో పరిశోధన సాగిస్తున్నవారు సగానికిపైగా ఉంటారు మొత్తం అభ్యర్థులలో ముప్పైమంది మహిళలు ఉండడం గమనించదగ్గ విషయం

ఎం ఫిల్, పిఎచ్ డి కోర్సులలో ప్రవేశం పొందిన పది నెలల తర్వాత అభ్యర్థి ప్రాథమిక పరీక్షకు హాజరుకావలసి ఉంటుంది పరిశోధనా విధానాలపై ఒకటి పరిశోధనా విషయంపై ఒకటి మొత్తం రెండు లిఖిత పరీక్షలలోనూ గోష్ఠీపత్ర సమర్పణకు సంబంధించిన మౌఖిక పరీక్షలోనూ అభ్యర్థి నెగ్గవలసి ఉంటుంది దీనిమీద సిద్ధాంతవ్యాసరచనకు ఉపక్రమించడానికి అభ్యర్థికి అర్హత లభిస్తుంది

తెలుగు పరిశోధనకు సంబంధించిన మూడిసామగ్రి ఏ ఒక్కచోటా దొరకదు ఇది అన్ని విశ్వవిద్యాలయాలకు సంబంధించిన సమస్య పరిశోధకుల అభ్యర్థనపై ఇతర గ్రంథాలయాలనుంచి అరుదైన గ్రంథాలను 'ఇంటర్ లైబ్రరీలోన్' పద్ధతిమీద తెప్పించి పరిశోధకులకు అందజేసే సౌకర్యం ఈ యూనివర్శిటీ గ్రంథాలయంలోనూ లేకపోలేదు ఐనా, తెలుగు దేశంలోని కాకినాడ, తిరుపతి, నెల్లూరు, ముక్త్యాల రాజమండ్రి, విజయనగరం, విశాఖపట్నం, వేటపాలెం, హైదరాబాదు - మున్నగు పట్టణాలలోనే కాక ఇతర రాష్ట్రాలకు చెందిన కలకత్తా, ఢిల్లీ, తంజావూరు, మద్రాసు, మైసూరు, సిరాంపూర్ మొదలైన చోట్ల నెలకొని ఉన్న ప్రసిద్ధ గ్రంథాలయాలను దర్శిస్తే తప్ప ఆధారసామగ్రిని సంతృప్తికరంగా సేకరించడం సాధ్యంకాదు ఒకొక్కసారి ఆయా పరిశోధనాంశాల తీరుతెన్నులనుబట్టి లిఖితప్రతులనుకూడా సంప్రతించవలసి ఉంటుంది ఒకొక్కసారి పురావస్తుశాలలను, ప్రాచీన శిథిలావశేషాలనుకూడా దర్శించవలసి ఉంటుంది

కొన్ని సమయాలలో క్షేత్ర సర్వేక్షణ తప్పనిసరి అవుతుంటుంది. అంతే కాదు. ఆ యా రంగాలలో ఆరితేరిన పెద్దలను సలహా చేయవలసి వస్తుంటుంది కూడా.

ఇలాగా ఆవశ్యకమైన ముడిసరకును రాసిగా పోసుకోవడానికీ, రాసిపోసిన దానిని జల్లెడపట్టి తాలూ, తలుకూ పోనూ గట్టిదానిని చేసి, ఒకోసారి కొండను తవ్వి ఎలుకను పట్టినట్లవుతుంటుంది. సేకరించిన సామగ్రిని పర్యవేక్షకుల సూచనలమేరకు నిర్ణీతక్రమంలో పేర్చుకుని, పూర్వపరిశోధకుల కృషిని అనుశీలించి, రెండింటినీ సమన్వయించి, విశ్లేషించి, శాస్త్రీయ పద్ధతిలో సిద్ధాంతవ్యాసాన్ని రూపొందించవలసి ఉంటుంది.

ఇక్కడి తెలుగుశాఖలో పరిశోధన బహుముఖంగా సాగుతున్నది. సాహిత్యం భాషావిజ్ఞానం - ఈ పరిశోధనలోని మూలభూమికలు. ప్రాచీనాంధ్రసాహితీ పరిశీలనంతోపాటు ఆధునికాంధ్ర సాహిత్యానుశీలనం సైతం జరుగుతున్నది. కొందరు శిష్టసాహిత్యంమీదా, కొందరు జానపద సాహిత్యం మీదా కృషి సాగిస్తున్నారు. సాహితీశాఖలను కొందరెన్నుకుంటే ప్రసిద్ధ కవులను కొంద రెంచుకుంటారు.

పూర్వకవులైన కవిత్రయం, భాస్కరుడు, నాచనసోమన, శ్రీనాథుడు, అనంతామాత్యుడు, పోతన, మొల్ల మున్నగువారి కవితా రీతులను కొత్త కోణాలనుంచి దర్శించే ప్రయత్నం కొందరు చేసి కృతకృత్యులయ్యారు. కృష్ణదేవరాయలు, ముక్కుతిమ్మన, అయ్యలరాజు రామభద్రుడు, మాదయగారి మల్లన, ధూర్జటి, రాధామాధవకవి, పింగళి సూరన, రామరాజభూషణుడు మొదలైన ప్రబంధకవుల సాహితీవైభవాన్ని

మరికొందరు పరిశోధకులు వివరించి పరిశోధనా రంగానికి పుష్టికూర్చారు అనంతర ప్రబంధయుగానికి చెందిన చేమకూర వేంకటకవి, శేషము వేంకటపతి, రంగాజమ్మ, కూచిమంచి తిమ్మకవి, సారంగు తమ్మయ ప్రభృతి కవుల రచనల తీరుతీయాలను మరికొందరు బేరీజు వేస్తున్నారు వేమన్న కాసుల పురుషోత్తమకవి రచనలపై సాగిన కృషి అనేక నూతనాంశాలను ప్రతిష్ఠించగలిగినవి

ఇక ఆధునిక యుగానికి వస్తే అనేక సాహితీ యుద్ధాలలోను, అధ్యతనాంధ్ర కవిప్రపంచ నిర్మాణంలోనూ ఆరితేరిన వృద్ధమూర్తులు సాహితీ జీవితవిశేషాలపై చాలమంది అభ్యర్థులు పరిశ్రమిస్తున్నారు తెలుగు వైతాళికులైన కందుకూరి తిరుపతి వేంకటకవులు, గోపీనాథం వెంకటకవి, గురజాడ రాయప్రోలు, త్రిపురనేని మున్నగువారి బహుముఖ ప్రజ్ఞా విశేషాలనూ, భావవిషయంగా, భాషావిషయంగా వారు కావించిన సంస్కరణల తీరుతెన్నులనూ, మరికొందరు పరిశీలించి పట్టాలు పొందారు విశ్వనాథ, కాటూరి పింగళి, వేదుల, అబ్బూరి, ఉన్నవ, జాషువ, మారేపల్లి రామచంద్రశాస్త్రి వెంకట పార్వతీశ్వరకవులు దువ్వూరి రామిరెడ్డి, ఏటుకూరి వెంకటనరసయ్య, ఉమర్ ఆలీషా, నండూరి సుబ్బారావు, గడియారం, మొక్కపాటి నరసింహశాస్త్రి, అడివి బాపిరాజు, గుడిపాటి వెంకటచలం, గోపీచంద్, చిరుమామిళ్ళ సుబ్బదాసు, జి వి కృష్ణారావు, శ్రీశ్రీ, నార్ల విద్వాన్ విశ్వం, దాశరధి మున్నగు కధావశేషుల మీదా తుమ్మల, పుట్టపర్తి, పరాభి, కరుణశ్రీ, ఆరుద్ర నారాయణరెడ్డి మున్నగు వర్తమాన రచయితల సాహితీకృషి మీదా మరికొందరు పరిశోధన సాగించి ఉన్నతోన్నత పట్టావిశిక్తులయ్యారు

కొందరు అభ్యర్థులు పరిశోధన చేస్తున్న కొన్ని విషయాలను ఇక్కడ పేర్కొనడం అవసరం. నన్నయ ప్రకృతి వర్ణనలు, భారతంలో కుంతి, ద్రౌపది, మాద్రి, శకుంతల ఉత్తర, ధర్మజ, శ్రీకృష్ణ, ధృతరాష్ట్ర పాత్రలు తెలుగు సాహిత్యంలో సత్యభామ, తెలుగులో అనేకార్థక కావ్యాలు, తెలుగులో సందేశ కావ్యాలు, తెలుగులో స్మృతి కావ్యాలు, తెలుగులో కవితా విప్లవాల స్వరూపం, తెలుగులో చాటువుల అందచందాలు, తెలుగులో స్వీయ చరిత్రలు తెలుగు సాహిత్యంలో ప్రతిబింబించే కృషీవలజీవనం తెలుగు సాహిత్యమూ - వివాహ వ్యవస్థ తెలుగు సాహిత్యంపై బౌద్ధమత ప్రభావం పెదిం తెగవారి సాంఘిక - సాంస్కృతిక జీవనం తెలుగు సాహిత్యాభ్యున్నతికి ముస్లిం రచయితల సేవ ఆంధ్ర సాహిత్యం - హరిజనాభ్యుదయం తెలుగు సాహితీ సృష్టిలో క్రైస్తవుల పాత్ర కల్ప వృక్షంలోని స్త్రీ పాత్రలు, ఆధునికాంధ్ర నాటక రంగం - రచనా శిల్పం ఆధునికాంధ్ర నాటక ప్రపంచంలో హేతువాద రీతులు తెలుగు జర్నలిజం- అవతరణ వికాసాలు ఆధునిక సాహిత్యంలో హ్యూమనిస్టు ధోరణులు, మార్క్సిస్టు దృక్పథంలో మహాప్రస్థానం గురజాడ ముత్యాల సరాలు తెలుగులో జంటకవులు, పల్నాటి సోదర కవుల కవితావైభవం, కాల్ప నికోద్యమంలో దేశభక్తి కవిత, దిగంబర కవులది ఒక సాహిత్యోద్యమమా, వచన కవిత - మొదలగునవి కొన్ని పరిశోధనా విషయక రచనలు పరిశోధనా పట్టాలు పొందాయి

జానపద విజ్ఞాన రంగంలో కూడ చాలమంది అభ్యర్థులు విశిష్టమైన కృషిని కొనసాగించి కృతార్థులయ్యారు తెలుగువారి క్రీడా వినోదాలు, జానపద వాఙ్మయంలో స్త్రీ మూర్తి చిత్రణం, పల్నాటి సీమలో కోలాటం, శ్రీకాకుళం జిల్లాలోని రామాయణ కథాపరమైన జానపద గేయాల సమీక్ష,

తెలుగువారి నమ్మకాలు - విధి నిషేధాలు మొదలైనవి తమ పరిశోధనకు పీరెన్నుకున్న విషయాలు.

భాషా విజ్ఞాన విభాగంలోనూ గణనీయమైన కృషి జరిగింది; జరుగుతున్నది. శ్రీనాథుని భాష - వర్ణనాత్మక సమీక్ష, చేమకూర వేంకట కవి భాష - వర్ణనాత్మక పరిశీలనం, శ్రీకాకుళం - విజయనగరం జిల్లాల లోని కాళింగ తెగ జనుల మాండలిక భాషా విశిష్టతలు. గుంటూరు చిత్తూరు జిల్లాల మాండలిక భాషా వైవిధ్యం, తెలుగులోని సజాతీయ భాషా పదాలు, మెకంజీ కైఫీయత్తులలోని అన్యదేశ్యాలు, గుంటూరు పట్టణం పేటల పదవ్యుత్పత్తి పరిశీలనం మొదలైనవి ఉదాహరించ దగ్గవి, భాషా విజ్ఞానంలో సంజ్ఞానామ పరిశీలన (Onomastics) సరికొత్త శాఖ. తెలుగు వారి వ్యక్తి నామాలు, గృహ నామాలు, స్థల వాచకాలు, పట్టపు పేర్లు మున్నగు విషయాలపై కొందరభ్యర్థులు పరిశీలన పూర్తిచేసి డిగ్రీలు సంపాదించారు. అనంతపురం, పశ్చిమ గోదావరి మండలాలలోని గ్రామ నామాల పరమైన కృషి ప్రత్యేకించి పేర్కొనదగ్గది. బైబిల్‌లోని వ్యక్తి నామాలను గురించి కూడ ఒక అభ్యర్థి పరిశోధన చేస్తున్నారు.

తెలుగు వ్యాకరణాలపై ప్రాకృత వ్యాకరణాల ప్రభావం, సంస్కృతం లోని ప్రసిద్ధాంధ్ర వ్యాకరణాలు, రంగనాథ రామాయణంలోని సమాస రచనారీతులు, తెలుగులో అలంకారశాస్త్ర వికాసం - ప్రబంధ కవుల అలంకార ప్రయోగం మొదలైనవి వ్యాకరణాలంకారాలకు సంబం ధించిన విషయాలు. ఆంధ్ర శబ్ద చింతామణికి వ్యాఖ్యానరూపమైన కవి జనాంజనంపై కూడ ఒక అభ్యర్థిని పరిశోధన పూర్తిచేశారు. అదే అభ్యర్థిని 'ఆంధ్ర శబ్ద చింతామణి' వ్యాఖ్యాన పరంపరపై విశిష్ట కృషి

సల్పి పిఎచ్ డి పట్టం అందుకోనున్నారు ప్రయోజనాత్మకమైన తెలుగు విషయంగా ప్రత్యేక శ్రద్ధాసక్తులు ప్రదర్శిస్తున్న తెలుగు అకాడమీ వారి ప్రోత్సాహంపై ఒక అభ్యర్థి ప్రాచీనాంధ్ర సాహిత్యంలోని న్యాయశాస్త్రం, న్యాయ పరిపాలనా పరిభాషా విషయంగా పరిశ్రమించి పిఎచ్ డి కి ఎన్నికయ్యాడు

మొదటనే చెప్పాను - నాగార్జున విశ్వవిద్యాలయం శైశవావస్థలో నున్న సంస్థ అవి యు జి స వారివి ఐదారింటిలో ఒకటీ, పరిమితమైన విశ్వవిద్యాలయ నిధులనుంచి ఏటేటా ఒకటి రెండు పరిశోధక భృతులు ఈ శాఖకు లభిస్తున్నాయి ఇవిగాక ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ సోషల్ సైన్స్ రిసెర్చి, ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ హిస్టారికల్ రిసెర్చి, ఆంధ్ర ప్రదేశ్ స్టేట్ ఆర్కైవ్స్ శాఖవారు, తెలుగు అకాడమీ, ఫాకల్టీ ఇంప్రూవ్ మెంట్ ప్రోగ్రాం కింద యూనివర్సిటీ గ్రాంట్సు కమీషన్ వారు, వెనుకబడ్డ తరగతుల సమాఖ్యవారు కొన్ని పరిశోధక భృతులను ఇచ్చి మా శాఖలోని కృషికి దోహదం చేస్తున్నారు ఆచార్య తూమాటి దొణప్ప పేర అభినందన సమితివారు సమర్పించిన ఏడున్నరవేల రూపాయల ఎండోమెంటు నిధిపై వచ్చే వడ్డీతో ఒక స్వర్ణపతకం ఉత్తమ సిద్ధాంతవ్యాస రచయితకు ఏటేటా ప్రసాదించడానికి విశ్వవిద్యాలయం సిండికేట్ ఆమోదించి అమలు పరుస్తున్నది విశ్వనాథ స్మారకోపన్యాస పరంపర ఈ శాఖ అధ్వర్యవాన నిర్వహించబడుతున్నది

తెలుగుశాఖ పక్షాన 'అన్వేషణ' అన్న పరిశోధన పత్రిక తొలి సంచికను వెలువరించడం జరిగింది మలిసంచికలు క్రమంగా వెలువరించడానికి సకల సన్నాహాలు పూర్తి అయినవి

మనిషి మనస్విగా, మహామనీషిగా మారాలంటేనూ, భువిని దివిగా తీర్చాలంటేనూ క్రమంగా శాస్త్రీయమైన అన్వేషణ, అన్వేషణ ఫలితాల సద్వినియోగం ఎంతో అవసరం ఐతే సామాజిక ప్రయోజనం లేని పరిశోధనలు వృథా అంటారు కొందరు కాదన్నవాడు కర్కోటకుడు మన ప్రతి ఆలోచనా, ప్రతి సంయోజనా సామాజిక ప్రయోజనానికి ఉన్ముఖంగా, ఉపబలకంగా సాగాలన్నది నిర్వివాద విషయం పరిశోధనల కింద సమాజ పరమైన ఇంత ధనవ్యయం, వ్యక్తిపరమైన ఇంత ప్రయాస వినియోగ మవుతున్నప్పుడు దాని ఫలితాలు కేవలం అత్యల్ప సంఖ్యాకులైన బుద్ధి జీవులకూ మేధావులకూ పరిమితం కాకూడదని అశేషజనావళికి ఆనంద వర్ధనంగా అవి ఉపయోగపడాలనీ అందరూ అభిలషిస్తారు ఐతే, సామాజిక ప్రయోజనాలు అపారమైనవి కొన్ని భౌతికమైనవి కొన్ని మానసికమైనవి ఆనందమయ జీవితానికి భౌతికావశ్యకాలతోపాటు మానసికోల్లాసం కూడ ముఖ్యం పరిశోధనా ఫలితాలు కొన్ని తత్క్షణ ప్రయోజనాలను తీర్చడంలో ఉపయోగపడతాయి, కొన్ని దీర్ఘకాలిక ప్రయోజనాలను సాధించడంలో ఉపకరిస్తాయి దేని విలువ దానిది దేని ప్రయోజనం దానిది అన్నింటినీ ఒక గాట కట్టాలని యత్నించడం ధర్మంకాదు పాక్షికంగా, పరస్పర వ్యావర్తకంగా ఈ రెంటిలో ఏదీ పరిపూర్ణతను సాధించలేదు, ఈ రెండూ పరస్పరం పరిపూరకాలుగా ప్రవర్తిల్లినపుడే సర్వాంగీణత సమకూరుతుంది

'సత్యే సర్వం ప్రతిష్ఠిత'' మన్నది సరస్వతి విద్యా సరస్వతియైన నాగార్జున విశ్వవిద్యాలయం మొహర్‌లోని ముఖ్యాశయసూక్తి ఇదె దీని లక్ష్యానికి భద్రముద్ర సత్యతత్త్వ నిరూపణమే దీని ప్రధానలక్ష్యం సత్యపదార్థ నిరూపణంవల్ల అపోహలు అంతరించిపోతాయి సంకుచితభావాలు, స్థానిక దురభిమానాలూ సన్నగిల్లిపోతాయి సదవగాహనకూ, సద్భావనకూ, సమన్వయదృష్టికీ, సముదారవర్తనకూ చక్కటి

భూమిక ఏర్పడుతుంది ఇవే చారుతర సంస్కార రేఖా రచనకు మూల బిందువులు ప్రసిద్ధ పరిశోధక చక్రవర్తి, మాధ్యమికవాదప్రవర్తక సిద్ధమూర్తి ఆచార్య నాగార్జునుని స[illegible]ంగా వెలసిన నాగార్జున విశ్వవిద్యాలయం ఈ విషయంగా గురుతరమైన తన కర్తవ్యాన్ని విస్మరించదు ఆత్మధర్మ నిరతులైన సంస్థా పరిపాలకులూ, విజ్ఞాన దీక్షాపరులైన పరిశోధనా పర్యవేక్షకులూ, గురుశిక్షావ్రతులైన అభ్యర్థులూ తమ తమవిధులను యథావిధిగా నిర్వహిస్తారు

“సత్యే సర్వం ప్రతిష్ఠితమ్”

# చెదరని లక్ష్యం – చెరగని ముద్ర

అనంతమైన అన్వేషణలో దర్శించిన ఫలితాలను లోక కల్యాణం కోసం వినియోగించి, ఆర్జించిన విజ్ఞానాన్ని అందరికీ పంచి, మంచిని పెంచే మార్గంలో తమ ఉనికినీ, మనికినీ సార్థకం చేసుకున్న మహనీయులు సంఘంలో ధన్యజీవులు అలాంటి మహనీయుల అవతరణ వికాసాలకు ఆధారభూమిక ఐన సాంఘికవ్యవస్థను ఉత్తమ సంస్కార తత్పరమైన జాతిగా పేర్కొనవచ్చు ఇలాటి మహోన్నత స్థాయికి చేరిన తెలుగుజాతి చరిత్ర బహు ప్రాచీనమైనది ఐతరేయ బ్రాహ్మణకాలం నాటికే తెలుగుజాతి విశిష్టమైనదిగా స్థిరపడినట్లు చరిత్రకారులు నిర్ధారిస్తున్నారు శాతవాహనులు, ఇక్ష్వాకులు, శాలంకాయనులు, విష్ణుకుండినులు - మొదలైన ప్రాచీన రాజ వంశాలవారు నిలిపిన సంస్కృతి తెలుగువారి 'వారసత్వం' చాళుక్యులు, కాకతీయులు, విజయనగర చక్రవర్తులు, మదుర - తంజావూరు నాయక రాజులు తెలుగు సాహితీ సంస్కృతుల పరంగా చేసినసేవ తెలుగుజాతికి ఉత్తమ స్థానాన్ని సంపాదించి పెట్టింది తెలుగును రాజభాషగా గుర్తించిన ఘనత పశ్చిమాంధ్ర పాలకులు రేనాటి చోడరాజులకు దక్కినట్లే, తెలుగునకు ప్రామాణిక సాహిత్యస్థాయిని సమకూర్చిన గౌరవం చాళుక్య వంశీయులైన ప్రభువులకు దక్కుతుంది

ప్రభువుల పోషణంలో, పరిషత్తుల ఆదరణంలో తెలుగు సాహితీ సంస్కృతులు వెయ్యేళ్ళకు పైగా వర్ధిల్లుతూ వచ్చాయి సంగీత నృత్య నాటక శిల్పకళారంగాలలో తెలుగు కళాకారులు కీర్తిశిఖరాల నధిరో హించారు కలంపట్టినా, హలంపట్టినా, గజ్జెకదలినా, కుంచెమెదిలినా

బంగారు తీగలు సాగాయి కలమెత్తినా, గళమెత్తినా కమనీయ రమణీయ దృశ్యాలు కనులముందు సాక్షాత్కరించాయి అయితే, కాలప్రవాహంలో కలిగిన మార్పులవల్ల అవన్నీ కలలుగా మిగిలిపోయాయి కథలుగా, కావ్యాలుగా నిలిచిపోయాయి భారతభూమిలో భాగమైన తెలుగు సీమ తక్కిన సీమలతోపాటు నిద్రావస్థలో ఉండిపోయింది

కాల మొకరీతి నెప్పుడు గడపబోదు తెలుగు వైతాళికులు ప్రబోధ గీతాలు పఠించారు పూర్వ వైభవాన్ని కవితారూపాన ఆలాపించారు ఉత్తిష్ఠ - ఉత్తిష్ఠ అని కర్తవ్యోపదేశం చేశారు భారతదేశంలోని అన్ని ప్రాంతాల జాతుల, ఉపజాతుల సంస్కృతుల ఆర్థిక, సామాజిక, రాజకీయ వైజ్ఞానిక వికాసమే మొత్తం భారతజాతి సర్వతోముఖ వికాసమని ప్రబోధించారు జాతి పునరుజ్జీవనంకోసం,సర్వసత్తాక ప్రతిపత్తిగల స్వాతంత్ర్యం కోసం ఎందరో మహానుభావుల సారథ్యంలో మరెందరో త్యాగధనుల బలిదానంతో సాగిన అనేక ఉద్యమాల ఫలితంగా భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చింది భాషా ప్రయుక్త రాష్ట్ర నిర్మాణ సూత్రం మేరకు ముక్కలు చెక్కలుగా చీలిపోయిన తెలుగునాడు ఒక్కటిగా సమకూడి ఒక్క గొడుగునీడ కిందికి వచ్చింది

స్వాతంత్ర్యానికి పూర్వం స్థాపితమైన విశ్వవిద్యాలయాలలోగాని, తదనంతరం వెలసిన విశ్వవిద్యాలయాలలోగాని, ఇతర విద్యా సాంస్కృతిక సంస్థలలోగాని దేశభాషలపట్ల, దేశీయ కళారూపాలపట్ల సాగినకృషి చెప్పుకోదగినస్థాయిలో జరుగలేదు జరిగిన ఒకపాటికృషికూడ ఏకాగ్రంగా, ఏకోన్ముఖంగా సాగలేదు శాస్త్రీయమైన సమన్వయంగానీ సరియైన వినియోగంగానీ సాధ్యంకాలేదు తెలుగునాట ఎన్నో స్వచ్ఛంద సేవా సంస్థలు, ఎన్నో అకాడమీలు అవతరించాయి మరెన్నో సంసలు రూపెత్తాయి

ఈ సంస్థలు సాగించిన కార్యక్రమాలు ఎంత ఉత్తమమైనవైననూ, సార్వత్రికమైననూ స్థాయిపరమైన ఆమోదముద్రను పొందనందువల్లనూ, యాజమాన్య నిర్వహణ వ్యయభారాలు పెరగడంచేతనూ, ఈ వివిధ సంస్థల మధ్య పరస్పర సహకారానికీ, సమన్వయానికీ అనుగుణమైన యంత్రాంగం లేకపోవడంచేతనూ ఆశించిన రీతిలో పనులు సాగలేదు, ఆశయాలు నెరవేరలేదు

పరిమిత పరిధులలో, అల్పమైన వనరులతో పరిశ్రమిస్తున్న అనేక సంస్థల కార్యకలాపాలను సుసంఘటితపరిచి సమన్వయించడానికీ, ఈ అన్నిరంగాలలో ఉన్నతస్థాయిలో వినూత్నంగా, విస్తృతంగా పరిశోధనాత్మకమైన కృషి కొనసాగించడానికీ, ఆధునిక ఆవశ్యకాలకు అనురూపంగా తెలుగుభాషను నవీకరణం చేయడానికీ, తెలుగువారి ప్రాభవదీప్తిని సముజ్జ్వలం గావించడానికి అనుగుణమైన లక్ష్యాలను పేర్కొంటూ తెలుగు విశ్వవిద్యాలయాన్ని నెలకొల్పాలని మాన్యశ్రీ ఎన్ టి రామారావు గారి నేతృత్వంలోని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1983 లో నిర్ణయించింది దీని స్వరూప స్వభావాలను నిర్దిష్టము, నిర్దుష్టమూ ఐన రూపకల్పన చేయడానికి జస్టిస్ శ్రీ ఆవుల సాంబశివరావుగారి అధ్యక్షతన ఒక నిపుణుల సంఘాన్ని నియమించింది

ప్రభుత్వం నిర్దేశించిన నిబంధనావళి దృష్టిలో ఈ నిపుణుల సంఘం విశ్వవిద్యాలయ స్థాపనలోగల సాధక బాధకాలను సాకల్యంగా చర్చించింది భాషా ప్రాతిపదికమీద ఇదివరకే ఏర్పడి పనిచేస్తున్న దర్భంగా, వారణాసి, తంజావూరులలోని విశ్వవిద్యాలయాల ఆశయాలను నిర్మాణరీతులను, నిర్వహణ పరిమితులను పనితీరులను సూక్ష్మంగా పరిశీలించింది ఆంధ్రప్రదేశ్‌లోని వివిధ విశ్వవిద్యాలయాలలో తెలుగుభాష, సాహిత్యం,

సంస్కృతి, చరిత్ర, మానవీయ విజ్ఞానం, లలితకళలు మొదలైన వాటి పరంగా జరుగుతున్న కృషిని అనుశీలించింది కళావికాసం కోసం ప్రభుత్వం రూపొందించిన ఆయా అకాడమీల, ఇతర విద్యా సాంస్కృతిక సంస్థల లక్ష్యాలను, వనరులను, నిర్మాణ నిర్వహణలను సమీక్షించింది ప్రశ్నావళి రూపంగాను, ముఖాముఖి చర్చల ముఖంగాను వివిధ రంగాలకు చెందిన విశేషజ్ఞులనుంచి సేకరించిన అభిప్రాయాలను క్రోడీకరించి వ్యాకరించింది ఈ అన్నింటినీ తులనాత్మకంగా అనుశీలించి, శాస్త్రీయంగా సమన్వయించి తెలుగు విశ్వవిద్యాలయ స్థాపనకు భూమికగా తన పరిశీలనా ఫలితాలను, సిఫార్సులను ఒక నివేదికారూపంలో 1984 మార్చి నెలలో ప్రభుత్వానికి అందజేసింది చదువులసారమూ, పారమూ తెలిసిన ఈ ధీరవిచారుల కృషికి హార్దికమైన ధన్యవాదాలర్పించింది ప్రభుత్వం

నిపుణుల ఈ నివేదికను మంత్రిమండలి అన్ని కోణాలనుంచి అవలోకించింది నిర్దేశించిన లక్ష్యాలను, నిరూపించిన నిర్మాణ రీతులను నియంత్రించిన నిర్వాహణ విధానాలను, నిష్కర్షించిన సాధనాలను జాగరూకతతో ఆకళింపు చేసుకుంది రాష్ట్రంలోని ఇతర విశ్వవిద్యాలయాలకంటే విశిష్టంగా ఒక ఉన్నతస్థాయి విజ్ఞానపీఠాన్ని స్థాపించాలని ప్రభుత్వం నిర్ణయించింది ఒకవైపు దేశీయమైన సకలకళలను సర్వ విద్యలను సమస్త శాస్త్రాలను, ఇతర సాంస్కృతిక రూపాలను ఇతోధికంగా ప్రోత్సహిస్తూ, మరోవైపు కళాసంస్కృతుల పరంగా నూతన రీతులను స్వాగతించే తీరులో ఈ విజ్ఞానపీఠం తన కృషిని కొనసాగించాలని ప్రభుత్వం భావించింది ఆధునిక మానవీయ సామాజిక వైజ్ఞానిక, సాంకేతికాది శాస్త్రాలలో మౌలికమైన అధ్యయన పరిశోధనలకు అవకాశాలు కల్పిస్తూ తెలుగును వివిధ రంగాలలో ఆధునిక భావవాహిక సాధనంగా ఈ పీఠం రూపొందించాలని ఆదేశించింది బోధనా, పరిశోధనా రంగాలకు పరిపూర

కంగా ప్రత్యేక శిక్షణా విభాగాలను నెలకొల్పడమేగాక వినియోగ ప్రచార కార్యక్రమాలకు అవసరమైన ప్రసార యంత్రాంగాన్ని ఈ పీఠం శిల్పించాలని సంకల్పించింది ఇతర విశ్వవిద్యాలయాలలో లేని కోర్సులను ప్రయోగాత్మకంగా తెలుగుబోధనా మాధ్యమంగా మరికొన్ని కోర్సులను పట్టభద్ర స్థాయిలోను, స్నాతకోత్తరస్థాయిలోనూ నిర్వహించాలన్న నిర్ణయం జరిగింది వివిధ రంగాలకు చెందిన శాస్త్రీయ - జానపద కళాకారుల నైపుణ్యాన్ని, నవీనరీతులను సమీకరించి సమన్వయించి వారిసేవలు సమాజావసరాలకు వినియోగపడే తీరులో వేర్వేరు ప్రణాళికలను, పథకాలను రూపొందించి పర్యవేక్షించాలని సైతం నిర్దేశించింది

రాజ్యాంగంలో పరిపాలనా సాధనంగాను, విద్యారంగంలో బోధనా మాధ్యమ గాను తెలుగును ఇదివరకే ప్రభుత్వం గుర్తించడంవల్ల దీని వ్యవహార పరిధి ఎక్కోరెట్లు విస్తరించింది కొత్తపరిసరాలను సరికొత్త అవసరాలను దృష్టిలో పెట్టుకుని ఈ సకలరంగాలలోను, సర్వవ్యాసంగాలలోను మహాశక్తిమంతమైన సాధనంగా తెలుగుభాషను సుసంపన్నం చేయవలసిన అవసరం ఇబ్బడిముబ్బడిగా పెరిగింది ఒకవైపు ఆధునిక మానవీయ, సామాజిక, వైజ్ఞానిక సాంకేతిక, శాస్త్రక్షేత్రాలకు సంబంధించిన మౌలిక పరిశోధనాంశాలను పటిష్ఠంగా ప్రకటించగల పరమోదాత్త శైలినీ, మరోవైపు విశ్వవిజ్ఞాన సారమంతటినీ సామాన్యజనులు అందుకోదగిన స్థాయిలో ప్రసారం చేయగలిగిన సరళసుందరమైన శైలినీ తనలో ఇముడ్చుకోగల భావవాహక సాధనంగా తెలుగును దిద్దితీర్చడం ఈ విజ్ఞాన పీఠం ముఖ్యలక్ష్యాలలో ఒకటి

పరిమిత పరిధిలో ఉత్తమబోధనం విశాలపరిధిలో ఉదాత్త పరిశోధనం, విశిష్టమైన వివిధ శిక్షణాకార్యక్రమాలు, సంస్కృతిప్రసారణ

క్షమాలైన ఇతర విస్తరణ కార్యకలాపాలు ప్రధాన లక్ష్యాలుగా రూపొందించిన ఈ సకల కళానిలయం తెలుగు వారి సర్వతోముఖ అభ్యుదయ సాధనకు ఆధారభూమికగా ప్రవర్ధిల్లాలని ఆసించబడింది సహస్రాబ్దులుగా, సహస్రసమ ఖాలుగా ప్రపంచితమైన తెలుగువారి సంస్కృతి సంపత్తిని సేకరించి, భద్రపరిచి పరిరక్షించడం, దాని తత్త్వాన్ని విశ్లేషించి విశ్వసంస్కృతిలో దాని విశిష్టతలను విగరించడం, ఆధునికయుగ ఆవశ్యకాల కనుగుణంగా విశాల ప్రాతిపదికపై తెలుగుజాతిని సుశిక్షితం చేయడం ఈ విజ్ఞానపీఠం విధిగా, పరమావధిగా నిర్దేశితమయింది

తెలుగువారి ఆశలకూ ఆశయాలకూ అనురూపంగా, రుచులకూ అభిరుచులకూ అనుగుణంగా ముస్తాబు దిద్దుకోవాలన్న పవిత్ర లక్ష్యంగల ఈ మహాసంస్థ తెలుగుల పర్వదినమైన రక్తాక్షి ఉగాదినాడు అవతరించింది తెలుగువారి చిరకాల తపస్సునకు వరప్రసాదంగా అవతరించిన ఈ విజ్ఞాన పీఠం ఆవిష్కరణోత్సవం మన మాజీ రాష్ట్రపతి మాన్యశ్రీ నీలం సంజీవ రెడ్డి మహోదయుల చల్లని చేతిమీదుగా సాగడం ఆంధ్రావళి అదృష్టం

తెలుగు విజ్ఞానపీఠం తెలుగు విశ్వవిద్యాలయంగా రూపుదాల్చడానికి అవసరమైన నేపథ్యం సిద్ధమైంది 1985 సెప్టెంబరు ఆఖరున తెలుగు విశ్వవిద్యాలయం బిల్లు ఆంధ్రప్రదేశ్ శాసనసభ ఆమోదాన్ని పొంది డిసెంబరులో స్వతంత్రమైన ఉన్నతవిద్యాసంస్థగా హైదరాబాదు ముఖ్య కేంద్రంగా, రాజమండ్రి, శ్రీశైలంలలో మరి రెండు ప్రాంగణాలుగా తెలుగు విశ్వవిద్యాలయం అవతరించింది ఈ ఆర్థిక సంవత్సరానికి దీని నిర్మాణ నిర్వహణలకు మూడు కోట్లు రూపాయలు కేటాయించడమేకాక, సాలీనా మూడు కోట్ల రూపాయలు ఈ పీఠానికి మంజూరు చేయడానికి ప్రభుత్వం సూత్రప్రాయంగా అంగీకరించింది కొన్ని అకాడమీ లిందులో విలీన

మయ్యాయి కొన్నింటి రూపుమారినా, వాటి లక్ష్యాలూ, కార్యకలాపాలూ, నిరాతంకంగా కొనసాగుతున్నాయి గతానుగతికంగా ఆలోచించేటప్పుడు ఈవరకే నెలకొని ఉన్న సంస్థలపట్ల విశేషాదరము అవతరించనున్న కొత్త సంస్థలపట్ల అతర్కితమైన అనుమానాలూ, ఆందోళనలూ ఉండడం ఏ సమాజంలోనైనా అసహజంకాదు మొదట్లో తెలుగు విజ్ఞానపీఠం అవతరణంపట్లనూ, అకాడమీల విలీనంపట్లనూ వివిధ వర్గాలలో, వివిధ ప్రాంతాలలో కొంత సంచలనం, కొంత నిస్పృహ, కొంత వైముఖ్యం ఏర్పడి ఎవరికి తోచినట్లు వారు ఊహించడం, ఎవరి ముక్కుకు సూటిగా వారు వ్యాఖ్యానించడం జరిగింది ఏదైనా ఒక ఉద్యమాన్ని ఒక సంస్థను సదవగాహనతో నిర్వహించడానికి అనేక విధానాలు, అనేక సాధనాలు ఉంటాయి ఒక సాధనాన్ని విడిచి మరొక సాధనం చేపట్టడం కార్య సాధనంలోని ఒక వ్యూహమే కాని, అసలు లక్ష్యాన్ని విడనాడినట్లు కాదని విజ్ఞులు గ్రహించకపోరు ఈ చూపుతో చూచినప్పుడు ఉన్న సంస్థలు 'రద్దులపద్దు'కు ఎక్కాయని నిరుత్సాహపడవలసిన అవసరం కలగదు

సాంస్కృతిక చైతన్యం సర్వతోముఖమైన సామాజికాభ్యుదయంలో ఒక అవశ్యమైన, కీలకమైన అంశం అన్న స్పృహతోనే రాష్ట్రప్రభుత్వం తెలుగు విశ్వవిద్యాలయాన్ని నెలకొల్పి భాషా సంస్కృతుల పరిపుష్టికి దోహదంచేసే ఈ మహాసంస్థకు ఉదారంగా వనరులు సమకూరుస్తున్నది వివిధ భాషా సాంస్కృతిక సంస్థలపై ఇంతదాకా రాష్ట్రప్రభుత్వం ఖర్చు చేస్తూ వచ్చిన మొత్తానికి సుమారు ఇరువైరెట్లు ఇప్పుడు నిధులు కేటాయించింది రాష్ట్రప్రభుత్వం వారి చిత్తశుద్ధినీ, స్థిరసంకల్పాన్నీ స్పష్టీకరించడానికి ఈ అంశం ఒక్కటే చాలు.

1987-88 వ విద్యా సంవత్సరంలో హైదరాబాదులో భాషాభివృద్ధి పీఠంలోని నిఘంటు నిర్మాణ శాఖ, భాషా ప్రణాళిక నవీకరణశాఖ, లలితకళా పీఠంలోని సంగీత శాఖ, నృత్య శాఖ, జానపద కళల శాఖ, శిల్పకళా శాఖ, జ్యోతిషశాస్త్రశాఖ రాజమండ్రిలో సాహిత్య పీఠంలోని భక్తిపదకవిత శాఖ, జానపద, గిరిజన విజ్ఞానశాఖ శ్రీశైలంలో శాసన లేఖనశాఖ, పురాతత్త్వశాస్త్ర వాస్తుశిల్పకళా శాఖలు ప్రారంభమయ్యాయి

1987-88 వ విద్యా సంవత్సరం నుంచి శ్రీశైలంలోని చరిత్ర, సంస్కృతి, పురావస్తుశాస్త్ర పీఠంలో ఎం ఫిల్ , పిఎచ్ డి , లలితకళా పీఠంలో సంగీతం నృత్యం, శిల్పం, జానపద కళలు, జ్యోతిషంలో బి ఎ , సంగీతం నృత్యం, జానపద కళలలో డిప్లొమా, జ్యోతిషంలో సర్టిఫికెట్ కోర్సులు మొదలయ్యాయి

ఇందుకు కావలసిన బోధన సిబ్బందిలో ప్రొఫెసర్లను, రీడర్లను లెక్చరర్లను నియమించడం జరిగింది

భాషాభివృద్ధి పీఠం తెలుగు భవనంలో పనిచేస్తుంది ఇంకా తెలుగు విశ్వవిద్యాలయ గ్రంథాలయం అంతర్జాతీయ తెలుగు కేంద్రం కూడా ఇక్కడే నెలకొని ఉన్నాయి పూర్వపు తెలుగు భాషా సమితి భవనంలో ఇప్పుడు తెలుగు విజ్ఞాన సర్వస్వ రచనా కేంద్రం పనిచేస్తుంది

గతంలో హైదరాబాదు పబ్లిక్‌గార్డెన్‌లోని సరూబాగ్‌లో నిర్మించ తలపెట్టిన తరతరాల తెలుగుజాతి సంగ్రహాలయం (**Telugu cultural museum**) నిర్మాణం సగంలో ఆగిపోయి ఉంది దీని నిర్మాణాన్ని మళ్ళ ఇప్పుడు చేపట్టి త్వరితగతిని పూర్తిచేసి 'తెలుగు కళాక్షేత్రం' పేరిట సంగ్రహాలయాన్ని, లలితకళా పీఠాన్ని నెలకొల్పాలని మాన్యశ్రీ

ముఖ్యమంత్రిగారి సమక్షంలో జరిగిన సమావేశంలో నిర్ణయించి దీనికి వలసిన రెండుకోట్ల అంచనాంలో 50 లక్షలు విడుదల చేయడమైనది

గతంలోని అకాడమీలు, సంస్థలు నిర్వహించే కార్యకలాపాలు ఏకోన్ముఖంగా పటిష్ఠంగా నెరవేర్చవలసిన గురుతర బాధ్యత తెలుగు విశ్వవిద్యాలయంపై ఉంది ఆ మేరకు విశ్వవిద్యాలయంలో విస్తృత సేవా విభాగం, ప్రచురణల విభాగం ద్వారా పూర్వపు అకాడమీలు, సంస్థల కార్యక్రమాలకు ఏ విధమైన విఘాతం కలగకుండా వాటిని మరింత ముమ్మరంగా నిర్వహించడం జరుగుతున్నది

విస్తృత సేవా విభాగంద్వారా జానపద కళారూపాలలో శిక్షణ శిబిరాలు, పౌరాణిక, సాంఘిక నాటక పోటీలు, సంగీతోత్సవాలు, వాద్యకళా ప్రక్రియలో గురుకులాలు వృద్ధ కళాకారులకు జీవనభృతి, పుస్తక ఛాయా చిత్ర ప్రదర్శనలు నాటక సంస్థలకు ఆర్థిక సహాయం, నాటకోత్సవాలకు గ్రాంట్లు, రాష్ట్రావతరణ దినోత్సవాలు, ఉగాది ఉత్స వాల నిర్వహణ, వివిధ సాహితీ ప్రక్రియలకు అవార్డులు, ఆ యా కళా రంగాలలో కృషిచేసిన మహనీయులకు సమ్మాన సత్కారాలు, కవిసమ్మేళ నాలు, సాంస్కృతిక కార్యక్రమాలు అనేకం చేపట్టి నిర్వహించడం జరుగు తున్నది

ప్రాచీన కావ్యాలు, ప్రబంధాలు, అపురూప గ్రంథాలు, నిఘంటు వులు, పదకోశాలు, విజ్ఞాన సర్వస్వ సంపుటాలు, లఘుపార్శ్యగ్రంథాలు, వాచకాలు వంటి సమస్త ఉత్తమ పుస్తక సంచయాన్ని ప్రచురణల విభాగం ద్వారా అచ్చు ఒత్తించి వెలుగులోకి తీసుకొని రావడం జరుగుతున్నది అంతేగాక రచయితలు, పరిశోధకులకు తమ గ్రంథాలను ముద్రించు

కోవడానికి తగుమొత్తంలో ఆర్థికసహాయం అందించే పథకం కూడా ఈ విభాగం ద్వారా నిర్వహించడం జరుగుతున్నది

భాషాభివృద్ధిపీఠానికి కావలసిన భాషాప్రయోగశాలను తెలుగుభవన సముదాయంలో నిర్మించుకోవడం, లలితకళాపీఠానికి కావలసిన వాద్య పరికరాలు కొనుగోలు చేయడం జరిగింది

ఈ సంస్థలో సమగ్రమైన ఆధునిక సౌకర్యాలుగల గ్రంథాలయం, తెలుగువారి తరతరాల ప్రాభవాన్నీ, సాంస్కృతిక వైభవాన్నీ చాటిచెప్పే పురావస్తు సంగ్రహాలయం, సర్వవిధాలా సుసంపన్నమై నవీనతకు తుది మెరుగు అనిపించుకోగల ఆడిటోరియం మొదలైనవి అంగాలుగా ఉంటాయి వీటిని సమకూర్చుకోవడానికి అన్ని సన్నాహాలూ చురుకుగా జరుగుతున్నాయి

ఈ విశ్వవిద్యాలయ రూపకల్పన రాష్ట్రప్రభుత్వానికి మాత్రమే ప్రతిష్ఠా సూచకమైనది కాదు ఇది తెలుగువారి అందరి పేరు ప్రతిష్ఠలకు చెదరని లక్ష్యం, చెరగని ముద్ర తెలుగు వెలుగుల కాంతిరేఖలు దశదిశలా ప్రసరించేటట్లు మనమంతా ఏకీభావంతో కృషిచేయాలి పూర్వస్థితి అభిప్రాయాలతో, అపోహలతో, వృథా సంశయాందోళనలతో ముందడుగు పడదు సదవగాహనతో, శాస్త్రీయ దృష్టితో, సర్వాంగీణమైన అభ్యుదయం కోసం ముందుకు, మున్ముందుకు అడుగువెయ్యాలి ఇది మనం ఉద్యమించ వలసిన తరుణం భారతీయ సంస్కృతి జ్యోతి ప్రజ్వలనంలో ఒక సమన్వయ స్నేహవర్తిగా తెలుగు విశ్వవిద్యాలయం విశ్వజనీనమైన వెలుగు జిలుగులు విరజల్లగలదని మా విశ్వాసం స్వస్త్యస్తు !



# రచయితవే మరికొన్ని
# ఇతర రచనలు

1 ఆంధ్ర సంస్థానములు - సాహిత్యపోషణము
సైజు 1/8 డెమ్మీ, పుటలు 624, ద్వి ము 1987,
వెల రూ 125/-
ఆం ప్ర ప్రభుత్వ గ్రంథాలయాలవారి సైటేషన్ నెం
2719/ని త 800/427 తేది 3-6-1988

2 భాషా చారిత్రక వ్యాసావళి
సైజు 1/8 డెమ్మీ, పుటలు 352, ద్వి ము 1987,
వెల రూ 60/-
ఆం ప్ర ప్రభుత్వ గ్రంథాలయాలవారి సైటేషన్ నెం
2687/ని త 400/14 తేది 3-6-1988

3 తెలుగులో కొత్త వెలుగులు
సైజు 1/8 క్రౌన్, పుటలు 212, ద్వి ము 1987,
వెల రూ 25/-
ఆం ప్ర ప్రభుత్వ గ్రంథాలయాలవారి సైటేషన్ నెం
2720/ని త 800/428 తేది 3-6-1988

4 జానపద కళాసంపద
సైజు 1/8 క్రౌన్, పుటలు 208, ద్వి ము 1987,
వెల రూ 25/-
ఆం ప్ర ప్రభుత్వ గ్రంథాలయాలవారి సైటేషన్ నెం
2675/ని త 300/146 తేది 3-6-1988